శ్రీరస్తు.



శ్రీమద్వీరశైవజనశ్రవణపఠనార్చనోపయుక్తంబగు

# చెన్నబసవపురాణము

అత్తనూరి. పాపకవిప్రణీతము.

శ్రీమదష్టావరణపంచాచారాన్వితుండును భృంగిగోత్రపవిత్రుండును
వీరమాహేశ్వరస్వరూపుం డగు
గంగపట్టణపు సుబ్రహ్మణ్యకవిచే
పరిష్కృతము.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1925.

సీ. కందర్పముఖదేవసందోహవినుతగోవిందాస్త్రపవమానాభినంది నంది
రంగద్భుజంగేశ్వరాంగదపదపద్మసంగతమానసషట్పదభృంగి భృంగి
రుద్రనిర్వాకృతిక్షుద్రదక్షవితానవిద్రావణక్రియాభద్ర భద్ర
గాండసంభవకాండఖండనదూషకకాండసంహారణప్రచండు చండు

తే. సర్వసర్వంసహాచక్రశైలగేహ
భక్తమానససంశయభారతిమిర
పటలబోధాంబురుహసుహృత్ప్రభుని బ్రభుని
బూని వినుతించెదఁ బ్రణామపూర్వకముగ. 6

మ. వరసర్వజ్ఞశిఖామణిన్ బ్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁ గళానీకాంచితావాసు భా
స్వరలింగాన్వితదేహు సర్వవిబుధవ్రాతామృతాధారు భా
సురపాదుం గళితారిఁ బాల్కురికివంశ్యున్ గొల్తు సోమాహ్వయున్.

మ. వరవల్మీకజ నన్నపార్య ముఖగీర్వాణాంధ్రభాషాకవి
త్వరమాంభోనిధులం జనాక్షియుగజీవంజీవతోషక్రియా
కరతేజోనిధులం నిజానుపమవాక్యవ్రాతసంపాదనా
స్ఫురదాశాంబుధులం దలంతు సతతంబున్ గార్యసంసిద్ధికిన్. 8

క. అని యిష్టదేవతాప్రా
ర్థనమును గురుస్తోత్రమున్ బురాతనగణప
ద్వనజాభివందనము కవి
జననుతిఁ గావించి యక్కజం బగువేడ్కన్.

సీ. కమనీయధర్మార్థకామమోక్షసుఫలానీకంబునకు సురానోకహంబు
బంధురవిజ్ఞానభక్తివైరాగ్యనిష్ఠామహాసక్తికములకు శంబరనిధి
సాంఖ్యయోగాదికచందనభూమిరుహావళులకు మలయాచలంబు
సలలితసాలోక్యసామీప్యసారూప్యసాయుజ్యముక్తివజ్రములకు గని

తే. యైన శ్రీచెన్నబసవప్రధానుభవ్య
చరిత మస్మద్గురూత్తమ సత్కటాక్ష
గరిమ నానేర్పుగతి జిహ్వ పరమపావ
నత వహింపఁగఁ జెప్పఁ బూనంగ నంత. 10

సీ. తనయశస్స్ఫూర్తి శీతనగాంబుజాతజా
త నభోవలగ్నలఘునతఁ దెగడుఁ
దనశౌర్యకలన శంతనుసూను కీచకే
తన జమదగ్నినందనుల నొంచుఁ
దనరూపగరిమ శ్రీతనయ నైషధ జయం
త నలకూబరుల వాదున జయించుఁ
దనయీగి రాత్రికాంత నరవాహన దైవ
తనగ కర్ణుల లెక్క గొనక నెగడుఁ
తే. దనవచోగరిమంబు ధాతనగఁ జాలుఁ
దనప్రతాపంబు సూర్యునిఁ దనఁగ నోపు
దనరు శ్రీకందుకూరిసంశాబ్ధిచంద్రుఁ
డరితిమిరహేళి యమృతలింగార్యమౌళి. 11

వ. మఱియు సమస్తసిద్ధవిద్యాధరపరివృతుండును ననంతామరసంస్తూయమానుండును బరభూభృత్పక్షచ్ఛేదనదక్షుండును గమనీయసుధర్మాధివాసుండును నిరంతరగురువాక్యానుసారప్రచారుండును హస్తగతశతకోటిసాధనుండును నందనవిహారసంజనితప్రమోదస్వాంతుండును శుచిసమవర్తిపుణ్యజనధనేశమహాబలధనాధ్యక్షసర్వజ్ఞాసమాకీర్ణుండునగునమ్మంత్రిపురందరుం డొక్కనాఁడు శ్రుతిరంజకవిప్రవరవిహారకోలాహలంబై నిరుపమామోదసుమనోవిలాసభాసురంబై యశ్రాంతకమలాంచితాలవాలంబై సులలితనిర్జరాభినయనవిహారమూలంబై యాశ్రితాళిమనోరథపూర్ణాకారంబై కల్పవృక్షంబన నొప్పునాస్థానసౌధరాజంబున జ్ఞాతి బంధు మిత్రామాత్య పురోహిత సామంత దండనాయక కవి పండిత పౌరాణికేతిహాసక పాఠక పరిహాసక తాంత్రిక భిషగ్వైణిక వాంశికనర్తక మురజికవైతాళిక వందిజనపరివేష్టితుండై మణిఖచితకార్తస్వరసింహాసనంబున నొడ్డోలగంబున్న సమయంబున నిజపితృపితామహాదులు మున్నొదవినసత్క్రతులు ప్రసంగవశంబున సభాసదులైనబుధజను లుపన్యసించిన విని సంతోషస్వాంతుండై సప్తసంతానంబులలోఁ గృతియ యుత్తమోత్తమంబుగావున నే నొక్కప్రబంధంబు గైకొనియెదఁ గాకయని తలంచి

తత్ప్రాజ్ఞులకు నిజాభిలాషం బెఱింగించిన వారలిట్లనిరి. 12

మ. అనఘా! మీరు దలంచినట్టితలఁ పార్యాభీష్ట మాప్తాళిరం
జన మంహోదళనం బమేయఫలకృత్సంతానముఖ్యంబు గా
వునఁ గీర్త్యాస్పద మైనయొక్కకృతి నీవు న్వేడ్కఁ జేకొమ్ము ముక్త
ఘనతాసింగయబాచయాదిసచివౌన్నత్యంబునం జెందెడిన్. 13

ఆ. సుగుణసత్కలీను శుభవాక్యసర్వల, క్షణధురీణుసరసకావ్యరచను
వీరశైవగ్రంథవేత్త తేజస్విగా, నెఱఁగియందుమాతఁడిచ్చుసుకృతి.

చ. అనవుడు మందహాసవదనాంబుజుఁ డై యపుడ త్తలూరిపా
వనకుల జక్కిరాజునకుఁ బౌత్త్రుఁడ శ్రీగిరిమంత్రిమౌళికిన్
ఘనమతి సుందరాంబికకు నందనుఁ డబ్బసవేశుఁడే యనం
జను బసవేశుమంత్రి కనుజన్ముని బాపయసత్కవీంద్రునిన్. 15

క. నను బిల్వ బంచి తగు తెఱఁ
గునఁ బూజ లొనర్చి యిష్టగోష్ఠి వినోదం
బునఁ గొంతప్రొద్దు గడపిన
వినయవచోగరిమ ననియె వేడుక నాతోన్. 16

చ. శివకరుణాకటాక్షమునఁ జేకుఱెఁ దక్కినయట్టిసంతతుల్
కవిజనహృద్యముల్ భువనగణ్యము భక్తిరసోల్బణక్రియా
భవనము కిల్బిషప్రకరపాటన మై తగునొక్కసత్కృతిన్
దవిలె మదీప్సితం బిపుడు దాన మనోరథపూర్తిఁ జెందెడిన్. 17

క. సంతానభూజములలో, సంతానం బైనయట్టిసత్కృతి నీచేఁ
గాంతుననికోర్కిఁ జెందితి, సంతసమున నొసఁగవలయుసరసకవీంద్రా!

మ. అని జాంబూనదసిర్మితాంబర మణీహారాగ్రహారాశ్వచం
దనవీటీ చతురంతయాన సుమనోధామాదివస్తువ్రజం
బున న న్వేడ్క బహూకరించుటయు నేఁ బూర్ణానుమోదంబుతో
ననఘం బైన తదీయవంశకథనం బాసక్తి వర్ణించెదన్. 19

## కృతిపతివంశవర్ణనము.

క. హృతకాముఁడు యుతవారిజ
హితధాముఁడు విష్టపత్రయీభరిత యశో

జితసోముఁడు ధారుణిలో
హితనాముఁడు వెలయు సన్మునీశాగ్రణి యై. 20

క. అబ్బాసహాలుకులమున, బిబ్బోకవతీస్మరుండు పృథివిశరుణిహా
నిబ్బరుఁడరిమృగతతికిం, బెబ్బులియన నప్పమంత్రి పెంపొందుధరన్.

క. ధీరుఁడగునప్పమంత్రికి, వీరేశ్వరుఁ డనఁగ నుద్భవించెను సుజనో
ద్ధారుం డాతని కాత్మజుఁ డై రంజిలె నప్పసచివుఁ డతిధార్మికుఁ డై.

ఆ. అప్పమంత్రి భార్యలై నపార్వతియందు, గంగపలనసుతులఁగనియెజగ్గ
మాభిధానుమతియునమృతకవీంద్రుని, శ్రీగిరీశ్వరునివిశేషమతుల.

ఉ. అందులఁ బార్వతీతనయుఁ డై చెలువొందిన జగ్గనాహ్వయుం
డిందుధరాంఘ్రిభక్తి ధరణీశవశీకృతమంత్రశక్తి మె
చ్చందగు సూనృతోక్తిఁ గరసాహసభోగకళాధురంధరుఁ
నందను రామకృష్ణ ఘననాముని గాంచె జగత్ప్రసిద్ధిగన్. 24

చ. ఘనుఁ డగు రామకృష్ణుని వికాసమనీషకు మెచ్చి సంతసం
బునఁ ద్రిజగత్ప్రతాపకులభూషణరాయుఁ డనంగ మేటిపే
రును మణిభూషణంబులు హరుల్ గజదంతపుఁబల్లకీలఁ గో
మ్మని దయ గోలకొండవసుధాధిపుఁ డాతని కిచ్చె హెచ్చుగన్.

సీ. భూనుతకీర్తియాభూషణరాయండు హేలానగరరాజ్యమేలుచుండి
నిడుదవోల్సీమలో నిరుపమవాసిష్ఠ తటినీతలంబున ధరణిసురుల
కగ్రహారములు కల్పాంతరస్థాయిగా నొసఁగి వనీపకవిసరములకు
వాంఛితార్థంబు లవార్యరిగా నొసఁగుచు బంధుల నరయుచు బహుళ
[పుత్ర

తే. పౌత్రకల్యాణవృద్ధిచేఁ బరిఢవిల్లెఁ
గాంతిజితహేళి శివపాదకమలజాళి
దళితదురితాళి నిరుపమదానకేళి
రమ్యగుణపాళి భూషణరాయమౌళి. 26

తే. అప్పనకుఁ బిన్నయాలైనయట్టి గంగ
కుద్భవించిన యాత్మజయుగ్మకమున
నమృతకవిచంద్రుఁ డలరు ప్రఖ్యాతి మీఱి
యురివిభేదియు ఘనతమోహరణుఁ డగుచు. 27

క. ఆతఁడుకొండాంబికయం, దాతతశైవవ్రతుని సదాచారగుణో

పేతుని జేరయలింగా, ఖ్యాతామాత్యాగ్రగణ్యుఁ గనిసిరులొందెన్.

క. పేరయలింగామాత్యుఁడు, భూరియశోలలిత మల్లెపూఁడి కులజుఁడౌ
వీరనసుత యగుకొండక్క, భారతిఁ బరమేష్ఠి పగిదిఁ బరిణయమయ్యెన్.

క. ఆతన్వియందుఁ గనియెక్, బాతకసంహారణచణులఁ బార్థివఘణులక్
ఖ్యాతికళామృతలింగ, జ్యోతిర్లింగాభిధానసూనృతగుణులన్. 30

మ. అమృతామాత్యుఁడు బుద్ధిరాజునులపద్మాపత్యుఁడై పర్వతుం
డమితామోదముతోడఁ గన్న గురువాంబాసాధ్వికే ల్పట్టి త
త్ప్రియదారత్నమునందుఁ గాంచె తనయుక్ భావాంతరస్థాద్రిజా
రమణుం బేరయలింగమంత్రి శశభృద్రామేయసౌందర్యునిన్. 31

ఉ. పేర్కొన నొప్పు కందుకురి పేరయ సత్ప్రభుచక్రవర్తి క
బ్జార్కసమానకీర్తి మఘవాత్మజతుల్యవిలాసపూర్తి దు
ష్కర్కశవైరిసంఘభయకారణమూర్తి పరాంగనాళిసం
పర్కవిచారకల్మషవిభంజనసత్ప్రథవర్తి ధారుణిన్. 32

తే. భవ్యగుణధుర్యమదిగొండ పర్వతార్య
వరవిశాలాక్షులకుఁ గల్గు వనజగంధి
వీరమాంబను వరియించె విభవ మెసఁగ
నంగజాకారి పేరయలింగసూరి. 33

ఉ. పేరయలింగమంత్రి తనప్రేయసియై తగు వీరమాంబికా
సారసగంధియందు శుభచర్యుల మేరుసమానధైర్యులక్
వారిధితూణభక్తుల దివాకరకాంతినియుక్తులక్ సిరుల్
చేరఁగఁ గాంచె శ్రీయమృతలింగశుభాహ్వయు మల్లికార్జునిన్. 34

క. ఆయిరువురయం దగ్రజుఁడై యలరిన యమృతలింగమహితావనిభృ
న్నాయకభయదాయకవా, క్నాయకుఁడై యేలెనునరసాపురమెల్లన్.

సీ. అతిధార్మికుం డైన యమ్మంత్రిపర్యుఁ డశేష దిగంతప్రసిద్ధి గాఁగ
మేటియౌ తనపేర పేట మాదేపల్లె కాట్రేనిపల్లెయక్ గ్రామములను
రహి గుడుల్ కట్టించి రామలింగేశ మల్లేశ్వర శరభ మల్లేశ్వరాఖ్య
శర్వలింగప్రతిష్ఠలు సేసి శర్వపురాద్యగ్రహారము లపనిదివిజ

తే. వారముల కిచ్చి సర్వాధికారదత్త
దంతపల్యంకికావాహధవళచామ

రాతపత్త్రాదిబిరుదచిహ్నములు మెఱయఁ
బూజ్యసామ్రాజ్యభోగవిస్ఫూర్తిఁ దనరె. 36

ఉ. శ్రీముదిగొండవంశసరసీరుహభాస్కర వీరనార్య పు
త్రీమణి సంతతాశ్రిత సుధీజన యాచకబంధులోకచిం
తామణి నాఁగ సర్వవసుధాస్థలి నెన్నికఁ గన్న సోమమాం
బామహిళ న్వరించె మును పద్మ వరించిన కృష్ణు కైవడిన్. 37

క. సత్యవ్రతు లగువారికిఁ, గాత్యాయనివరునికరుణఁ గలిగిరి కాంత్యా
దిత్యులు పేరయలింగా, మాత్యుఁడు వీరేశలింగమంత్రియు ననఁగన్.

ఆ. పృథివి నెన్నఁదగిన పేరయలింగంబు, బొమ్మకంటివంశ బుచ్చిరాజు
తనయ యైనయట్టిననఁబోణి శ్రీవిశాలాక్షిఁ బెండ్లియాడియల రెసిరుల.

సీ. అతనికి నవరజుఁ డైనవీరేశ్వరుం
డవనిఁ బ్రఖ్యాతిచే నలరి సత్క
ళాశాలి కవ్వాలి లక్ష్మీపతికి సుతా
రత్నమా వీరమ్మ రమణిఁ బెండ్లి
యాడి యబ్బింబోష్ఠియం దమృతాఖ్యకు
మారు శూరు నుదారు మేరుధీరుఁ
గనియె నాతఁడు మానఘనుఁడైన ముదిగొండ
గౌరన్నపుత్త్రియై గణుతి కెక్క

తే. పర్వతమఁ బెండ్లియాడి తత్పర్వహిమక
రాస్యయందునఁ గనె మల్లికార్జునాఖ్య
లేఖకాగ్రణి పేరయ లింగసచివ
సార్వభౌమునిఁ బార్వతీశ్వరునికరుణ. 40

తే. అనఘతరదాని యగుమల్లికార్జునుండు
కూర్మి ముదిగొండ శరభన్నకూఁతు సుంద
రీసతీమణిఁ బెండ్లియై భాసురత్రి
మూర్తులను బోలు తనయుల మువురఁ గనియె. 41

తే. అగ్రజుం డొప్పు నమృతలింగాహ్వయుండు
నేపునను రెండవసుతుండు పాపరాజు

పరగ మూఁడవతనయుండు శరభమంత్రి
దానమానయశోభాగ్యధైర్యయుతులు. 42

సీ. వరమల్లికార్జునావరజుఁడై తగు పేర
యాఖ్యుండు బుద్ధిరాజామృతారు
వరసుతవియ్యంబ వరియించి యమృతలిం
గాహ్వాయదన్వయము మల్లన్నబసవ
రాజు పాపయ్యను రసికుల సేవుర
సూనృతవాక్యుల సుగుణయుతులఁ
గరుణాసముద్రుల గాంభీర్యవంతులఁ
గని మహదైశ్వర్యగరిమ గాంచె
తే. వీరికూటస్థుఁ డగునట్టి పేరయాఖ్య
మంత్రి వల్లభుతనయుండు మల్లికార్జు
నాహ్వయుం డొప్పు నమృతలింగాహ్వయుండు
వంశభూషణమణి జనావళి నుతింప. 43

సీ. నేర్చినాఁ డేజాణ నిషధకాశ్మీరాదిబహుళదేశామేయభాషణములు
చేర్చినాఁ డేమేటి శీతాచలాత్మజావరపాదయుగళిహృత్సరసిజమున
దీర్చినాఁ డేమంత్రి ద్విజవరాధీశాది సకలవర్ణాశ్రమాచారసరణి
కూర్చినాఁ డేదాని కుంభిసీవ్యోమాష్టహరిదంతరాళసంభరితకీర్తి
తే. యతఁడు పొగడొందుఁ గందుకూర్యన్వవాయ
కలశవారాశిపూర్ణిమాకైరవాప్త
పేరయామాత్యతల్లజ వీరమాంబి
కాబ్జవదనాత్మజుఁడు మల్లికార్జునుండు. 44

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్రకృతిం గ్రహించి ప్ర
స్ఫీతము లైనకొత్తపలియే లెటిపాఁ డను నగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు గ్రాససమృద్ధుల సంగి శాంభవ
వ్రాతముకోర్కు లిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్. 45

సీ. అతఁడు శాంత్యాదిగుణాఢ్యుఁడై యేలూరు
రాజమహేంద్రవరంబు కొంక

పల్లియఱ దుర్గముల్ పాలింపుచుండి కొ
    మరవోలుమూర్తికొమూర్తె సద్గు
ణాలంబ దుష్కలుపావనీధరశంబ
    యగుగురువాంబఁ బెండ్లాడి శోభ
నాంగులఁ బేరయలింగంబు నమృతలిం
    గంబు వీరేశలింగంబు సాళ్వ
ఆ. పతియు మూర్తిరాజు బసవరాజన నొప్పు
సుతుల సుజనహితుల సుఖసహితుల
నతులవిభవయుతుల నాల్వురఁ గనియె నం
దగ్రజుండు పేరయాహ్వయుండు. 46

ఉ. బాలశశాంకమౌళిపదపద్మసమర్చనశీలి సత్కళా
శాలి మదాంధశత్రుపరిషద్గహనోద్భటకీలి యాత్మభా
షాలి నిరంతరాశ్రితమహీసురపాళి సుసద్గభీరతా
వేలి యనంగఁ దేజరిలు పేరయలింగము మంత్రిమాత్రుఁడే?. 47

తే. అతఁడు శ్రీబుద్ధిరాజవంశాబ్ధిరాజ
పుత్రి సోమాంబికానామఁ బుణ్యసీమ
విశ్వపాపవిరామ సాధ్వీలలామ
వరగుణస్తోమఁ బ్రేమ నుద్వాహమయ్యె. 48

ఉ. ఆతనితమ్ముఁ డైనయమృతాహ్వయుఁ డీశ్వరతత్త్వవేది భూ
నేతృసభాంతరాళినుతనిర్మలసూనృతవాది లోకవి
ఖ్యాతకళావినోది సమదాంధవిరోధివిభేది సంతతో
పేతశుభప్రమోది కడుఁ బెంపు వహించె ధరాతలంబునన్. 49

ఉ. పుణ్యచరిత్రుఁ డాత్మకులభూషణుఁ డానయగారిభద్రస
ద్గణ్య సుతావరేణ్య సతతాశ్రితదీనశరణ్య భవ్యలా
వణ్య సమస్తబంధుజనవర్ణితనాయకహర్షదాయిసా
ద్గుణ్య వరించె వియ్య మని కూర్మినుకోరిక సమ్మదాత్ముఁ డై.

క. తత్సోదరుఁ డాకృత్యవి, భిత్సూనుఁడు కీర్తివిజితభిదురాబ్జకళా
భృత్సింహుఁడు వీరేశుఁడు,వత్సరసవినమితారి ప్రబలె సిరులచేన్.

సీ. మహితపంచాక్షరీమాహాత్మ్య మనుకృతి
యందు త్రైలోక్యవిఖ్యాతిఁ గాంచె
సతిభక్తి, శ్రీశైలమందు మౌనులు మెచ్చ
సంవత్సరము నివాసంబు చేసె
నిష్ఠాగరిష్ఠుఁ డై నేఁడు నాఁ డనక సాం
ఖ్యమహేశ్వరార్చనఁ దా నొనర్చె
హితుల రక్షించి యహితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁ జేసి చతురుఁ డయ్యె
తే. నితని కెన యైనమంత్రు లీక్షితితలమునఁ
గలరె? యని సర్వజనములుఁ బలుక నెగడెఁ
గందుకురి మల్లికార్జునసంభవుండు
సంగరగుహుండు వీరేశలింగవిభుఁడు. 52

మ. అనఘుం డాతఁడు విన్నకోటవరవంశాంభోధిశీతాంశుఁ డౌ
ననఁ బెంపొందిన భీమరాజసుతయౌ నక్కాంబికాకాంత స
జ్జనసంస్తుత్య యశోనిరాకృతసుధాసత్కాంత నుద్వాహ మై
కనియెన్ మల్లయపేరయాహ్వయులఁ దత్కంజాక్షియం దిద్దరన్.

ఉ. అగ్రజు మల్లికార్జునుఁ డహార్యవిఖండనతుల్యవైభవుం
డుగ్రసమర్చనానిరతుఁ డూర్జితసత్యవచోవిశాలుఁ డ
త్యుగ్రహవైరిసంహరణుఁ డంగజసన్నిభరూపవంతుఁ డా
శాగ్రణితాచ్ఛకీర్తి గుణశాలి తలంప నమాత్యమాత్రుఁడే?. 54

సీ. వీరశైవుల కెల్ల వెండిబంగరులింగ
మేటిసూత్రంబు లేమేటి యొసఁగె
శతములసంఖ్య దంపతిపూజ లొనరించి
శాటికాంబరము లేసచివుఁ డిచ్చెఁ
గమనీయమౌరత్నకాంచనసైచిక
ప్రముఖదానంబు లేప్రభువు చేసె
సతతంబు షడ్రససహితాన్నములు భక్త
గణతృప్తి యేమంత్రిమణి యొనర్చె

సతఁడుఁ గొనియాడఁ దగుమల్లికార్జునుండు
కోరి ముదికొండయన్నయ్యకూఁతు రైన
వియ్యమాచంద్రవదన వివేకసదనఁ
బెండ్లియాడి ధరాస్థలిఁ బెంపుఁ గనియె. 55

ఆరసికుని యనరజుఁ డగు, పేరయలింగప్రధాని పేర్కొన నొప్పున్
శారదఘననారదఘన, సారదళనదక్షకీర్తిసహితుఁడు సభలన్. 56

శాంతుఁడు దుష్టభావరిపుసంఘమదాంధతమిస్రపద్మినీ
కాంతుఁడు భవ్యరూపజితకంధరవాహనసంభవైణభృ
త్కాంతుఁడు సంతతాశ్రితబుధప్రకరావనతారణేందిరా
వంతుఁడు సారధైర్యహిమవంతుఁడు పేరయ మంత్రియే సుమీ. 57

అతఁడు శ్రీబుద్ధిరాజాన్వయశ్రీశైలపతిసుత కామాక్షివలన సుతులఁ
బేరయలింగంబు వీరేశలింగంబు బసవరాజన నొప్పు భవ్యగుణులఁ
గనియెమువ్వురనగ్రగణ్యుఁడౌ పేరన్న బుద్ధిరాజయ్యన్న పుత్త్రిఁ దాయ
మాంబిక వరియించి యవనియేలుచునుండె వీరన్న గంధ్రపువీరరాజు

తనయ వియ్యాంబకేల్పట్టి ఘనతఁ బ్రబలి
బహుళవిఖ్యాతిఁ గనుచుండె బసవరాజు
బుద్ధిరాజవీరేశ్వరు పుత్త్రియైన
వియ్యమాంబను వరియించె విదశమతిని. 58

మఱియుఁ బేరయలింగాఖ్యమంత్రి పిన్న
యతివ యెద్దనపూఁడి నారప్పపుత్త్రి
యైన కామాక్షివలన మల్లయ్య మొదలు
గాఁగలుగునందనులఁ గాంచి ఘనత నెగడె. 59

సుగుణులగు మల్లికార్జునసుతులలోన
నాలుగవ నందనుండగు సాళువపతి
సంతతాత్మీయహృదయపద్మాంతరాళ
సంచరత్సాళువపతి ప్రశస్తిఁ గాంచె. 60

ఢిల్లీనాయకుచేత దంతిహయధాటీముఖ్యవస్తువ్రజం
బెల్లం గైకొని కాశికాప్రముఖగౌరీశావనుల్ గాంచి ని
త్యోల్లాసంబున శంకరార్చనలు దివ్యుల్ మెచ్చఁ గావించి సం

ఫుల్లాంభోరుహాలోచనావదనుఁ డై పూషప్రభుఁ డ వర్ధిలెన్. 67

ఆ. అయ్యమాత్యవర్యుఁ డతిమోదమునభావ
రాజకులవతంస రామచంద్ర
పుత్త్రియైన లక్ష్మిఁ బురుషోత్తముఁడు లక్ష్మిఁ
బెండ్లియాడుచరితిఁ బెండ్లియాడె. 62

తే. భువనవిఖ్యాతిగలవారి పుత్త్రి యగుట
సత్కళాఢ్యయై వాత్మకసహజ యగుట
భవ్యగుణపురుషోత్తము భార్య యగుట
లక్ష్మియే యన వచ్చు నీలక్ష్మి నవని. 63

క. సరసుఁడు సాళువపతికి న, పరజుం డగుమూర్తిరాజు వర్ధిల్లె రహిం
బురహరకులధరచలహర, ధరధరనలశరసమాన ధవళయశుండై.

సీ. బిరుదముల్ నృపతిచేఁ బెదతండ్రివలెఁ గాంచి
నత్యున్నతమగు స్వాస్త్యము ధరించి
గురువరులకు సింగవర మనుపుర మిచ్చి
వరనియోగుల కెల్ల వన్నె దెచ్చి
నగణితభక్తగణార్చనములఁ జేసి
యవనిభారము భుజమందు మోఁపి
లింగాంగసమరససంగతి నుతి కెక్కి
ప్రమథకథాశ్రవణమునఁ జొక్కి

తే. సప్తసంతతు లొనరించి శాంతి మించి
యరులఁ బరిమార్చి పౌరులసిరుల కోర్చి
కుజనసంగతి మాని సద్గుణము పూని
కీర్తి గనె వాక్యగోఁగోజు మూర్తిరాజు. 65

క. అన్నమునకు జరుగక తా నున్నపురిని లింగధారి యొకఁ డుపవాసం
బున్న నుగుడుననివ్రతమున, నెన్నికపల్లోసఁగె వారికెల్లముదమునన్.

ఉ. అమ్మనుజేంద్రమాన్యుఁ డమృతాంశుమదాస్యుఁడు సమ్మదాత్ముఁడై
తుమ్మలపల్లిసంశప్రథితుం డగువీరనముద్దుపట్టి దే
రమ్మ యనంగ నొప్పుసుగుణాకర నువ్వాహమయ్యె భారతిం
దమ్మి వసించువేల్పు ప్రమదంబునఁ బెండిలి యైనచాడ్పునన్. 67

సీ. పలుకువేళల సత్యభాషణంబులె కాని యనృతవాక్యము జిహ్వ నంట నీదు
భక్తపూజలు సేయుపట్ల నోపిక కాని మేన రాజసవృత్తి పూననీదు
దీనులకన్నంబు పూని పెట్టెడు వేళఁ జేత సంకోచంబు చెందనీదు
పెనిమిటికినుక చేసిన సంతసమె కాని చిడిముడి మనసునఁ జెందనీదు
తే. సర్వసర్వంసహాపుణ్యసతులలోన
నిమ్మహాసాధ్వియే గణియింప మేటి
యనఁగ నుతి కెక్కె మూర్తిరాజ్యనుగుఁబోటి
మహితగుణకోటి శ్రీపేరమావధూటి. 68

క. అమ్మూర్తిరాజమంత్రికిఁ, దమ్ముఁ డగుచు బసవరాజు ధర వర్ధిల్లెన్
దమ్ములదొర కెంపుల మొ, త్తమ్ములదొర యైనసత్ప్రతాపోన్నత్యైన్.
సీ. నారదప్రభ మించి నారదప్రభ నెంచి యమరిన కీర్తిదానముల వాఁడు
చిత్రభానుని మీఱి చిత్రభానుని గేరి పరగుసుచిత్ప్రతాపముల వాఁడు
భీము పెంపును గెల్చి భీము పోఁడిమి మెచ్చి వఱలినభూతిసత్త్వముల వాఁడు
ధర్మగర్వము ద్రోచి ధర్మగర్వముఁ బాఁచి తగు శివభక్తిసత్త్వముల వాఁడు
తే. జగతిఁ జెలువొందె నుదయాస్తశైలసేతు
శీతనగమధ్యరాజత్సభాంతరాళ
వినుత సుగుణుండు మల్లికార్జునసుతుండు
మహితధృతిశాలి బసవరాణ్మంత్రిమౌళి. [సం

క. ఘనముగ నైతమపూఁడియు, మినుమించిలిపాఁడుసిరులు మించంగనో
గెను గురుచరవరులగు బస, వనితో నెనయైనమంత్రి వసుధం గలఁడే.
క. తనమేనయల్లుఁ డాపృత, వినయుం డగుబుద్ధిరాజు వీరనచేతన్
గొనె సత్యవతీపరిణయ, మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.
సీ. శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె నైతమపూఁడియం దధికభక్తి
నారామనిధితటాకాదులైతగుసప్తసంతతులొనరించె శాశ్వతముఁగ
రెండవబసవేశ్వరుం డన లక్షలసంఖ్య గణార్చనల్ సలిపె నిష్ఠ
సాళువేశ్వరకృపాసంలబ్ధఘనతరభోగభాగ్యముల విస్ఫూర్తి నలరె
తే. నీతఁ డని యెన్నఁ దగియె ధరాతలమున
నల్లెఫల్లద సోమవాసరవ్రతయుతుండు

మల్లికార్జునగురువమాంబాత్మజుండు
శరణసమధాని బసవరాజప్రధాని. 73

ఆ. రసికుఁ డతఁడు బుద్ధిరాజకులాగ్రణి
వీరభద్రతనయ వియ్యమాంబ
సకలబంధువినుత సద్గుణనికురుంబ
ప్రేమ మదిఁ దలర్పఁ బెండ్లి యయ్యె. 74

ఉ. ఇంతులు సాటివత్తురె మహీస్థలి వియ్యమతోడ సత్కృపా
శాంతగభీరశీలపురసంహారభక్తసమర్చనక్షమా
శాంతవికీర్ణపూర్ణసతతాశ్రితపోషణసత్యభాషణా
శాంతనిజేశభక్తబుధసంఘముదావహాసువ్రతంబులన్. 75

తే. అనఘుఁ డైనట్టిబసవరాజునకు వియ్య
మాంబికకు నుద్భవించిరి యబ్జభూష
ణాంఘ్రిసేవాభిమతులు మల్లయ్యమూర్తి
రాజు వీరేశలింగ మన రసికవరులు. 76

క. ఆమువ్వురిలో నగ్రజుఁ, డై మెఱసినమల్లికార్జునామాత్యుఁడు స
త్త్వాముఁడు తేజోధాముఁడు, ధాముఁడుకీర్త్యాకృతిప్రతాపగుణములన్.

తే. అతఁడు శ్రీబుద్ధిరాజు వీరార్యతనయ
విప్రతనయ వీరాంబను బెండ్లియాడి
సద్గుణనిధాని బసవరాజప్రధానిఁ
గనియెఁ గలశాబ్ధి చంద్రునిఁ గన్నపగిది. 78

ఆ. భూతిసాతిసత్త్వవీతులఖ్యాతిచే, వారిజారిధారిసారిశౌరిఁ
గేరి మీఱుకందుకూరిబసవరాజు,తోడ సీడు సేయుపోఁడి గలఁడె.

క. అక్కలుపహారుఁడువాగ్జిత,వాక్కాంతుఁడుబుద్ధిరాజు బసవన్నసుతుఁడ
మక్కువ నెక్కొనిచక్కని, యక్కమహాదేవిఁ బెండ్లియైసిరులొందెన్.

తే. అతనిపినతండ్రి మూర్తిరాజాహ్వయుండు
విశ్వరాజసభాంతర వినుతి గాంచెఁ
దామరసజాండభరితప్రతాపచండ
కిరణవికసితనిజకీర్తికిరణుఁ డగుచు. 81

సీ. దానఘనంబున మానధనంబున రాజరాజప్రభఁ బ్రబలువాఁడు

సత్ప్రతాపంబున సాధురూపంబున నలరాజకలచేత నలరువాఁడు
భరితకళాపూర్తిబాహుస్థలస్ఫూర్తి రేవతీరమణుని తేవవాఁడు
తతమంజుతరభూతి ధైర్యసమాఖ్యాతి చంద్రధరాభప్రశస్తివాఁడు
తే. ధాత్రినితఁడనవెగఁడెసుత్రామముఖ్య,దేవకోటీరమణిసుప్రదీప్తపాద
భైరవేశ్వరదత్తసంపత్ప్రమోద, సౌఖ్యశుభశాలిమూర్తిరాట్సచివ [మౌళి.
తే. రసికుఁ డాతండు శ్రీబుద్ధిరాజు బసవ
రాజపుత్రిక్షమాధాత్రి రమ్యగాత్రి
నచ్చమను బెండ్లియాడి యయ్యతివయందు
బసవరాజాదులను గని ప్రబలె సిరుల. 83

శా. ఆమంత్రీశ్వరు తమ్ముఁ డొప్పు మిహికాహార్యాత్మజాధీశ్వరా
ర్చామోదాత్ముఁడు కందుకూరికులదుగ్ధాంభోధిరాకాసుధా
ధాముం డుగ్రవిరోధిసంతమసమార్తాండుండు వీరేశలిం
గామాత్యుండు బిలేశయేశసమవాగ్వ్యాపారుఁ డిద్ధారుణిన్. 84

సీ. కాండసంభవదండిఖండనాఖండల తుండిపాండురమెల్ల బెండొనర్చి
సారసీరదవారిసౌరుమీఱఁగఁదేరి రాజరాజఖ్యాతి మ్రందఁజూచి
కంతుజయంతవసంతనలావనీకాంత తేజము లిసుమంత సేసి
గంగాతనూజవిహంగతురంగస భాంగారజప్రౌఢి భంగపఱచి
తే. యేపుగనుకీర్తి వితరణ రూప శౌర్య
ములు ప్రసిద్ధి వహించె భూతలమునందు
బసవమంత్రీంద్రవియ్యమాంబాసుతుండు
సంగతావారి వీరేశలింగసూరి. 85

తే. అతఁడు భాషాజబుద్ధిరాజాక్కిరాజు
కన్య గుణధన్య లోకైకమాన్య యైన
వీరలక్ష్మిని బెండ్లియై విశదకీర్తి
నలరు శ్రీమల్లికార్జునాదులను గనియె. 86

క. స్మరసుందరుఁ డీవీరేశ్వరసచివుని పెద్దతండ్రి సత్యవచోభా
సురమూర్తిరాజు సుగుణాకర యగుశ్రీపేరమాంబికామణివలనన్.

క. చతురంభోనిధి వనజజ,చతురాస్యము లనఁగ జగతి సతతగభీరాం
చితభాషోన్నతినొప్పెడు,సుతులఁగనియెనలువురనువిశుద్ధచరితులన్.

క. అం దగ్రనందనుండు పు, రందరసమవైభవుండు రాజకలాపా
మందకృపాకరుఁ డీభువి, యందుఁ బ్రబలెమల్లి కార్జునామాత్యుఁడనన్.
క. రెండవతనయుఁడు శాస్త్రవ,ఖండనుఁ డవనీశకార్యఘటనాధుర్యుఁడుభూ
మండలమునఁ గీర్తి దిశల్,సండించిన కాళహస్తిలింగము వెలయున్.
తే. అయ్యమాత్యుఁడు ముడిగొండ యయ్యనార్య
పుత్రియైనట్టి సుందరీపూర్ణచంద్ర
వదన సద్గుణసదన నుద్వాహమయ్యె
సకలబంధుజనంబులు సమ్మతింప.
తే. మూఁడవసుతుండుమల్లయమురవిరోధి, బాణసుతసమశౌర్యసంపద్ధ [నుండు
బహుళయాచకసురలోకపాదపంబు,ధారుణీస్థలినొప్పెనుదానమహి [మ.
తే. అతని యనుజన్ముఁ డమృతలింగాహ్వయుండు
హరపదధ్యాని బంధులోకాభిమాని
యబ్జసమధాని సకలవిద్యానిధాని
సతతసన్నుతభూజాని జగతి వెలయు. 93
సీ. అతులితరాజకళాభియుక్తుం డౌట ఘనవిబుధాధారగరిమ గనుట
ద్విరసనాభిప్రాయవిముఖత నొందుట సహజలక్ష్మీవిలాసంబు గనుట
సమధికద్విజరాజసమ్మదాకరు డౌట వర్ధితస్వచ్ఛభావంబు గనుట
బటుచిత్రభానుప్రభాసంగతుం డౌట నాశ్రితజీవనాధార మగుట
తే. నమృత మనుపేరు రూఢిగా నతిశయిల్లి
వన్నెగాంచె వసుంధరావలయమందుఁ
గందుకూరి కులాంబుధి కైరవాప్తుఁ
డరితమోహేళి యమృతలింగార్యమౌళి. 94
సీ. శివభక్తిచేఁ గ్రేణిసేయుటింతియెకాదువీఁడుధర్మసూనుకీర్తిపృషభమూర్తి
దానగుణంబున తగ్గొనర్చుటెకాదు ధనవృద్ధినిరసించు ధనదుమించు
విక్రమాధికతను వెత్తిసేయుటెకాదు వాక్ప్రౌఢిగేరు బార్వతికుమారు
వైభవారూఢిచేవంచించుటయెకాదు పృథుభోగములనొప్పు నింద్రు [వెంపు
తే. సుందరాకృతి నపహసించుటయె గాదు
సరసతరనీతి వెన్ను నైషధునిచెన్ను

భళిర! యితఁ డని కవివరుల్ ప్రస్తుతింప
నలరె రిపుజేత యమృతలింగార్యనేత.  95

ఆ. శుక్రకాంతిఁ జుల్కఁ జూచి చంద్రప్రభఁ
గేరి యర్కదీప్తిఁ గ్రేణి సేసి
కొమరు మిగిలెఁ గందుకూరి యమృతాఖ్యకీ
ర్తిప్రతాపరుచులు దిశలయందు.  96

చ ఎనిమిదిజాము లేవరున నీశ్వరుఁ బూన్చు సహస్రబాహువుల్
తనకుఁ గలంగి చాల వఁట తన్మహిమం బది యెంత యంచు బా
ణుని నగి శర్వుఁ బూన్చెఁ బదినూఱు॥నూఱులు నైదుజాలయ
న్ననినమృతాఖ్య నించుక మనంబునఁ గొంకక యొక్కకేలునన్. 97

సీ. యేఁటేఁట శివరాత్రి నీశ్వరప్రీతిగా దీపాయుతంబులె త్తెడిగుణంబు
కాలమ్ములం దప్పక త్రిసంధ్యలందు నుమాధీశుఁ బూజించునట్టి నెళవు
శతసహస్రాయుతసంఖ్యలు శివభక్తసంతర్పణంబులు సలుపుమహిమ
సమశీలతీర్థప్రసాదపాకంబులు నిరతంబు గొనియెడి నియమవృత్తి

తే. వనిశ మాపథసేవ సేయనివ్రతంబు
ననుదినము లింగములకు రుద్రాభిషేచ
నంబు గావించునిష్ఠ జనంబు లెన్న
ఘనతఁ జెన్నొందె నమృతలింగప్రభుండు.  98

సీ. సర్వముఖోదితషట్స్థలాచారమార్గప్రతిష్ఠాపనప్రాజ్ఞుఁ డితఁడె
యనుపమవేదవేదాంతశాస్త్రపురాణసంగీతముఖకళాశాలియితఁడె
వననిధికూపశేవధిశివాగారాదిసంతానకరణప్రశస్తుఁ డితఁడె
సర్వంసహానాథసర్వకార్యక్రియావిసుటనాఘటనప్రవీణుఁ డితఁడె

తే. తీర్థయాత్రపరాయణాతిథిసమర్చ
నాన్నపానీయదానగుణాఢ్యుఁ డితఁడె
యనుచు సకలజనంబులు వినుతి సేయ
నవని వర్ధిల్లె నమృతలింగాహ్వయుండు.  99

తే. బంధుపోషణుఁ డాతండు భాసరాజు
వేంకటేశ్వర వెంకమాంబికల కుద్భ

వించి జననుతిఁ గాంచిన వెంకమాంబ
కాహారిణనేత్రఁ బ్రేమ నుద్వాహమయ్యె. 100

సీ. విమలపతివ్రతత్వమునఁ బోలఁగ లేక సగమయ్యెఁ బ్రాలేయశైలతనయ
వినుతక్షమాగుణంబున సాటిరాలేక నడుగంటి దానయ్యె నబ్ధిరశన
సరసవాక్ఛాతురీసమము గానేరక వెల్లఁదనము నొందె విధిలతాంగి
శ్రితభాగ్యదానప్రసిద్ధికి సరిరాక చంచలమతి యయ్యె జలధికన్య

తే. ఖ్యాతిగలయట్టివార లీరీతి గాఁగఁ
బుడమిఁ దక్కినసాధ్వు లీపోలఁతి కెనయె?
యనఁగ నుతి కెక్కె నమృతలింగార్యభార్య
శంకరపదాబ్జరోలంబ వెంకమాంబ. 101

క. బొంకుకలనైనఁ బలుకద, హంకారం బెప్పుడెఱుఁగదతిథులఁ బ్రోచుం
శంకరుగనెంచు శరణుల, వెంకాంబకు సాటియైన వెలఁదులు గలరే?

తే. అమ్మహాసాధ్వియం దమృతాభిధానుఁ
డతులసౌందర్యయుతుల దానాభిరతుల
వితతశుభకరమతుల సద్వ్రతవిహితులఁ
గాశహస్తిలింగాదులఁ గనియెఁ బ్రీతి. 108

ఆ. మఱియు నయ్యమాత్యమణికొమ్మరాజయ్య
పార్వ్యనకును లక్ష్మి యాత్మజాత
యైనవియ్యమాంబ నతివేడ్క వరియించె
నఖిలబంధుసమ్మదావహముగ. [దుపఱచి

సీ. గోపాలబాలయై గోత్రమణఁచునాఁడిఁ జెందులోపాముద్రఁ గ్రిం
శివవిముఖునకు సంభవమునైన కళంకుఁ గూడినరోహిణిఁ గొంచఁ జేసి
భంగసంగతునకుఁ బట్టియై పుణ్యజనాళిఁ బొందినలక్ష్మి నవహసించి
చట్టుపుట్టువయు స్థాణునివలచిన కాత్యాయినీదేవి గాకొనక్కి

తే. బ్రహ్మతేజంబు శుభము నభంగ మార్ద్ర
హృదయపద్మంబు గలవాని నుదయ మంది
వంశరత్నామలార్యసంభరణ సరస
గుణగణుని నొందె వియ్యమ్మ కోర్కెతోడ. 105

ఆ. బంధుపోషణంబు పతిభ_క్తి శాంతంబు
సుకృతవ_ర్తనంబు సూనృతంబు
తనకు సహజములుగ ధారుణి వర్ధిల్లె
వినుతగుణకదంబ వియ్యమాంబ. 106

క. ఆసాధ్వియందు వినుతద, యాసాగరుఁ డమృతలింగమాకృతివిజిత
శ్రీసుతుల నీశపదపూ,జాసక్తుల మల్లికార్జునాదులఁ గనియెన్.107

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణధీరున, కాతతకవిబంధుసముపయాధారునకున్
నేతమణిజాతఫణిరు, ట్ఛ్యుతఘృణిత్యాగకీ_ర్తిశృంగారునకున్. 108

క. అరిభయదామర్షునకున్, ధరణీసురవినుతవాక్సుధావర్షునకున్
శరణాగతశరణాంచిత, చరణానతశీర్షునకు సుజనహర్షునకున్. 109

క. భూలలనాపాలసభా, జాలనుతాగణ్యపుణ్యసంసక్తునకున్
శైలాధిపబాలానుప, మాలాపపరాంతరంగహరభక్తునకున్. 110

క. హృ్తరిపుధరణీపతికిన్, సతతావితదీనమ_ర్త్యసమితికిఁ జతు
శ్చ్యుతిభూషణగతిదూషణ,మతిశోషణధృతికిదానమహిమోన్నతికిన్.

క. భూవిదితాత్మీయయశో, జైవాతృకముకుళితద్విషట్కమలునకున్
శైవాగమభావాగమ, ధీవాగములునకు సాహితీకుశలునకున్. 112

క. శ్రీకందుకూరికులర,త్నాకరశశిమూ_ర్తి రాజహర్షదపేరాం
బాకమలాక్షభవునకుం, బ్రాకటగుణ్యామృతలింగవరసచివునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన చెన్నబసవ
పురాణం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 114



# ప్రథమాశ్వాసము.



## కథాప్రారంభము.



మచ్ఛైలసుతాధినాథపదరాజీవాళిసద్ధుణ్యాలో, హాము
ద్రాహ్యాదయానుకూల్యయుత భాస్వత్కేళియాదిత్య భూ
స్వామి బ్రహ్మముఖామరాభినుత సిద్ధాంశాలి పాపాటవీ
స్తోమానర్గళకేలి యైనఘటజాతుం డొక్కనాఁ డిమ్ములన్. 1

సీ. అతులితవేదవేదాంతచర్చల బ్రహ్మనైనఁ గోడిగమాడుహంసతతులు
వాదించి పాంచరాత్రాదికంబుల దినకరునైనఁ దెగడుశుకప్రతాన
మాగమమంత్రరహస్యార్థములఁ జంద్రధారినైనహసించుశారికాళి
మహితపురాణవిమర్శ సాత్యవతేయునైన నెంచెడిభుజంగాళినికర

తే. మలరఁ జెలువొందుచుండు నిజాశ్రమమున
శిష్యసంఘంబు సేవింపఁ జెలువుతోడఁ
గూర్మి కుశపీఠమున నిష్టగోష్ఠిఁ బ్రొద్దు
గడుపుచున్నెడ నాకస్మికంబు గాఁగ. 2

శా. శ్రీరుద్రాపరమూర్తి మౌనిముఖరాజీవార్యమస్ఫూర్తి స
ద్వార్ధోదారమనోనువర్తి హృతభక్తవ్రాతజన్మార్తి యో
గారూఢ్యాగతకీర్తి రేణుకగణాధ్యక్షుండు భూలోకసం
చారేచ్ఛం జనుదెంచి యత్తటి మహాసంతోషసంయుక్తుఁడై. 3

క. తనయాశ్రమంబునకు రాఁ
గని యెదురుగ నేగి మ్రొక్కి ఘటజన్ముఁడు దో
డ్కొని వచ్చి యర్ఘ్యపాద్యా
ద్యనుపమపూజన లొనర్చి యతిభక్తిమెయిన్. 4

శా. స్వామీ! యెచ్చటనుండి వచ్చితిరొ భవ్యంబైన మీరాక మ
ద్ధామం బేము శుభంబు నొందితిమి చింత ల్వీడె సాక్షాచ్ఛివా

రామాధీశ్వరమూర్తిఁ గాంచినటులన్ రంజిల్లె మత్స్వాంత మ
య్యా! మీపాదసమర్చనల్ సలుపుభాగ్యం బబ్బె నేఁడియ్యెడన్.

క. అనవుడు దరహసితాననమున నాతం డిట్లు పల్కు మునిపుంగవ నీ
వనఘతపోనిధి వని సి, ద్ధనువాంఛ న్వచ్చినాఁడఁ గౌతుక మొదవన్.

వ. అని మఱియును. 7

ఉ. కంతువిరోధియాజ్ఞ ననుకంప వలిన్వఁగ వీరశైవసి
ద్ధాంతము నీకుఁ జెల్పి విదితంబుగఁ దత్క్రియ మెల్ల సర్వరా
ద్ధాంతము నీముఖోదితపథంబునఁ జేయఁగఁ బూని భూమిభృ
త్కాంతతనూభవాధిపునిధామము వెల్వడి సత్వరంబునన్. 8

క. వచ్చియిటనిన్నుఁగాంచితిఁ, దచ్చరితమువినుమటంచుఁదవ్వకయాతం
డచ్చొత్తినగతిఁ జెప్పిన,సచ్చరితుఁడుకుంభజుండు సంభ్రమపరుఁడై.

చ. అనఘ దయారతిన్ ఘనరహస్యము దెల్పితి బుద్ధమయ్యెఁ బా
వనమతి వైతి నిం కొకటి వాంఛిత మెట్లన విన్నవించెదన్
మనసిజవైరియాజ్ఞ మెయి నాగభుగర్వుఁడు భూస్థలిం గరా
శనమహిమంబుఁ బెంచె నని సంయమిసత్తముఁ డొక్కనాఁ డిలన్.

వ. స్కాందపురాణంబునకు నాయకరత్నంబైన శంకరసంహితయందలి
శివరహస్యఖండంబునందు వక్కాణింప వింటి నక్కుమారుం డెవ్వి
ధంబున మహీతలంబు పావనంబుగా భక్తివర్ధనం బొనరించెఁ
దద్వృత్తాంతం బంతయుం దెలిపి కృతార్థుం జేయవలయు ననిన
నప్పారిషదగ్రామణి యత్యంతసంతోషితస్వాంతుం డై యొక్కింత
సేపునకుఁ బూర్వంబున శర్వుం డార్యాసమేతుం డై పేరోలగం
బున్న సమయంబునఁ దద్దర్శనకుతూహలంబునం జనుదెంచి విరించి
క్రమ్మఱి పోవుచుఁ దన్నుఁ బ్రణవార్థం బడిగిన కుమారునితోడఁ
దత్ప్రణవార్థంబు లేదనియని యథార్థంబుగా నెదు రెఱుంగక పలికి
యతనిచేతఁ గారాగృహబద్ధుం డగుట సురలవలనఁ బరమేశ్వరుండు
విని యతని విడిపించి తదోంకారార్థంబు సవిస్తరంబుగాఁ దేటపడం
బలికిన నిజతనయు ప్రజ్ఞావిశేషంబునకుఁ బరితోషంబు నొంది మేదినీ
తలంబున మన్మహిమంబు ప్రకటింపు మని యనుచుటయుఁ దదనం
తరవృత్తాంతంబును దక్షిణంబ హృదయంగోచరం బగుటయు నానంద

బాష్పధారాపరిషిక్తాంగుండును గంచుకీభూతరోమాంచుండును
గద్గదకంఠుండు నై యతనితో ని ట్లనియె. 11

మ. అనఘా! నీవు వినంగఁ గోరిన మహాపాఖ్యాన మత్యంతపా
వన మంహోదళనం బహీనఫలదప్రాగల్భ్య మార్యేశభ
క్తనికాయప్రమదాస్పదం బతులమోక్షప్రాప్తిసంసూచకం
బని మేషప్రకరాభిగణ్య మయి పెంపొ ధారుణీమండలిన్. 12

తే. కుంభసంభవ నీమదికోర్కి దీర
వినుము శర్వానికరుణ నేఁ గనినభంగిఁ
దెలుపుదు నటంచు రేణుక దేశికుండు
చెన్నబసవేశుచరితంబు చెప్పఁదొడఁగె. 13

సీ. శ్రీకరాంబరచుంబిశిఖరాభిరామంబు బహురత్నసానువిభ్రాజితంబు
శరభమృగేంద్రాదిసత్త్వసంకీర్ణంబు దేవవృక్షోద్యానదీపితంబు
కనకాంబుజోజ్జ్వలకాసారకలితంబు బహుళనిర్ఝరిచయభ్రాజితంబు
కిన్నరబృందసంగీతనాదయుతంబు పటుతాపసావాసభాసితంబు [బు

తే. దళితపాపంబుముక్తిప్రదాయకంబు, ప్రమథనిలయజ్ఞసర్వజ్ఞపాలితం
వేదవేద్యంబు తారకవిలసితంబు,భవ్యవిభవంబు కైలాసపర్వతంబు.

ఉ. ఆయతతద్ధరాధరశిఖాగ్రసమంచితహీరదేవతా
నాయకరత్నకాంచనఘనద్యుతిసంచయ మెల్ల నేకమై
తోయదమార్గదేశమునఁ దోరముగాఁ గనుపట్టు టొప్ప గం
గాయమునాసరస్వతు లుపకంఠి నభిన్నతఁ జేరుకైవడిన్. 16

సీ. పున్నాగవిస్ఫూర్తిఁ బొల్చు టింతియె కాదు
పున్నాగవిస్ఫూర్తిఁ బొల్పు మీఱెఁ
జమరికాకీర్ణమై చెన్నొందుటయె కాదు
చమరికాంచత్ప్రభ ల్చాల మిగిలెఁ
గుంజరాశనదీప్తి గొరలు టింతియె కాదు
కుంజరాశనదీప్తి గొమరు మిగిలెఁ
బ్రియకబృందంబునఁ బెంపొందుటయె కాదు
ప్రియకబృందంబునఁ బేర్మిఁ గనియె

తే. నన:గ వృక్షమృగాకీర్ణ మగుచు సకల
భువనసన్నుతిఁ గాంచె నద్భుతము గాఁగ
శతసహస్రసుధాభానుసన్నిభప్ర
కాశమహిమాస్పదంబు తత్క్ష్మాధరంబు. 16

వ. మఱియు నద్ధరాధరరాజంబు విరాజమానం బై స్వర్గలోకంబునుం
బోలె రంభాదేవసల్లభసురుచిరవిలాసం బై యర్చిష్మతీపురంబునుం
బోలె నిరుపమశుచిప్రదేశం బై సంయమనీనగరంబునుం బోలె విల
సితధర్మావాసం బై నిర్ఋతిభువనంబునుం బోలె సంతతపుణ్యజనస్థానం
బై వరుణపట్టణంబునుం బోలె భాసురభువనోన్నతం బై గంధవతీ
పుటభేదనంబునుం బోలె శంకరప్రవాహావిలసితం బై యలకాపురం
బునుం బోలె శంఖమకరపద్మాకరం బై యీశానలోకంబునుం బోలె
నీలకంఠసంచారం బై పాతాళంబునుం బోలె నాగలోకకలితం బై
యొప్పుపర్వతశిఖాగ్రంబున. 17

చ. పగడపుఁగంబముల్ తళుకుబంగరుబోదెలు తమ్మికెంపురా
నిగనిగ లీనువాకిలులు నిద్దపువెన్నెల జేసిరాలఁ జె
న్నగుజిగిగోడలున్ సొగసులై తగుపచ్చలతోరణంబులుం
దగఁ జెలువొందు నొక్కమణిధామము శర్వనివాసయోగ్యమై. 18

క. ఆమహనీయ సభాభవ
నామలమధ్యప్రదీపితార్క్యాయుత తే
జోమయనవరత్నాంచిత
హైమసుఖాసనమునందు నతిముద మొదవన్. [లువ

సీ. కమలభవాండముల్ కందుకంబులరీతిఁ బట్టియాడెడుగణప్రభులుగొ
సహజైకలింగనిష్ఠావ్రతస్ఫూర్తిచేఁ జరియించు భృంగిలాస్యంబొనర్ప
నాంకిని వృషభేశ్వరాచతారం బయి తగుఁ నందిసంగడి తలఁగజడియ
తే. సతులితాష్టాంగయోగానందపరవశులై సనకాదిమునీశ్వరు లభినుతింప
నమరగజగాములు చామరములు వీవ
గరుడగంధర్వముఖు లిరుగడల నిలువ
శైలతనుజాతయును దాను జంద్రమౌళి
నిండుకొలు వుండెఁ గన్నులపండువుగను. 20

వ. ఆసమయంబున. 21

ఉ. పాలును నీరు నేర్పరుచుపక్కిపయి న్వడి నెక్కి స్వప్రభా
జాలము మేరువుం దెగడ సంచితపణ్యనదీనదాచ్ఛతో
యాలయమౌ కమండలువు హస్తమునన్ వెలుఁగొంద శారదా
లోలుఁడు వచ్చె సర్వసురలోచనపద్మము లుల్లసిల్లఁగన్. 22

చ. అటు చనుదెంచుచున్ గిరిసుతాత్మజుఁ డొక్కఁడె బాలకేలిఁ బ
ర్యటన మొనర్పుచున్న తఱి నాతనిలెక్క యొనర్ప కేగ ది
క్పటు గని తత్పదాబ్జములపై నుదు రంటఁగ సాఁగి మ్రొక్కి వి
స్ఫుటసిగమాంతసూక్తములఁ బొంగుచు సన్నుతిఁ జేసె నీగతిన్.

సీ. బాలేందుకోటీర పన్నగకేయూర పాథోధితూణీర భవవిదూర
పద్మాక్షసుతశిక్ష పావనమునిరక్ష భక్తసంచయపక్ష పావకాక్ష
కలితకృపావాల కార్ముకాయితశైల కందరకాకోల ఖలవిఫాల
నీరజాంబకమిత్ర నిర్జితాసురగోత్ర నిరుపమశుభగాత్ర నిగమసత్ర

తే. పార్వతీసంగ రవినిశాపతిరథాంగ, గగనధునిజూటహస్తపంకజకరోట
కోటిరవితేజ తారకకుధరరాజ, నిరుపమోల్లాస దారుకనీవిలాస

చ. అని యిటు సన్నుతించి ప్రమథాధిపు లోచనసంజ్ఞ నొక్కఁడన్
వినయము మీఱ నిల్చి యతివిస్మయ మందుచు నాతఁ డాత్మహ
వ్యనజ మెలర్పఁ గొంతవడి తద్గిరిజేశసభావినోదముల్
గనుఁగొని శర్వు వీడుకొని క్రమ్మఱి పోవుచుఁ దొంటికై నడిన్.

ఉ. శంకరతుల్యుఁ డైన శిఖిజన్మునిఁ జూడక నేగుచుండఁ ద
త్పంకజగర్భుపైఁ గినుక పర్వఁ గుమారకుఁ డార వీఁడు ని
శ్శంకతఁ బోవుచుండె నను సడ్డ యొనర్పక యంచు నుగ్రుఁ డై
కింకరుచేత రాఁ బనిచి గీష్పతితో నిటు పల్కె నత్తఱిన్. 26

తే. ఎవ్వఁడవు నీవు? నీనెల వెచట నుండు?
నామ మెయ్యది? యుద్యోగ మేమి? యిప్పు
డిటకు రాఁ గత మెద్ది? మా కెఱుఁగఁ దెలుపు
మని యడుగ నట్టు లడిగిన నబ్జభవుఁడు. 27

మ. అమరజ్యేష్ఠుఁడ సత్యలోకము మదీయం బైన ధామంబు నా
మము నన్ బ్రహ్మ యటం డ్రు నెల్లెడల నస్మత్కృత్య మెన్నంగ స్వ

ర్గము భర్గుం గొనియాడఁగా నిటకు వేడ్క న్వచ్చితి న్నావుడుం
బిమము నిం కొక్కటి వేతఱ నే నడిగెదఁ నిక్కంబుగాఁ దెల్పుమా.
క. ఏమేమి చదువుకొంటివి, తామరసభవా! యటన్నఁ ధనమది వాణీ
కాముని ననుఁ జదువడుగఁగ, నేమిటికని తలఁచినగుచు నిట్లనిపలికెన్.
క. వేదములు నాముఖంబునఁ, బాదుకొన న్విద్యలడుగఁ బనియున్నదియే
నేఁదెలియని యదియెయ్యది, లేదు తలఁపనాకు సాటిలేరుజగములన్.
వ. అనిన దరహాసితాననుం డై కుమారుండు. 31
తే. సకలవిద్యలలోపలసారమైన, విద్యయొక్కటివినుటకు వేడ్కయయ్యెఁ
గాన నను జిన్న వాఁడనిగడుపకిపుడు, పన్యసింపుమటన్న నప్పద్మభవుఁడు.
క. వేదముల కాదియగుచు, గ్వేదముఁబఠియింపు మొదలవిస్పష్టముగా
నాదానుస్వారసువర్ణోదారం బైనప్రణవ మొప్పఁ బలుకనన్. 33
చ. విని తలయూఁచి చాలు నరవిందజ! యీప్రణవార్థ మెట్టిదో
కినియక తెల్పి నాహృదయకీలితసంశయ మెల్లఁ బాపుమా
యనిన నజుండు లేఁతనగ వాననసీమఁ దలిర్ప నంబికా
తనయునితోడ గర్వ మెదఁ దార్కొన నిట్లని పల్కె నత్తఱిన్. 34
ఆ. మాటలేల ప్రణవమంత్రంబు నేనత, దర్థ మేన యనిన నగ్నిభవుఁడు
గనులఁ గెంపుగదురగండచపేటికా, పూర్వకముగ నతనిగర్వమణఁచి.
సీ. అంతటఁ గినుక చల్లారక కారాగృ
హాధ్యక్షుఁ దతిరోషితాక్షుఁ డైన
వీరబాహుని బిల్చి విమలప్రణవమంత్ర
మంత్రార్థములు చంద్రమౌళి యగుట
యెఱిఁగి యుండియు జ్ఞానహీనుఁడై నే నని
పలికెఁ గావున వీనిఁ బట్టి కట్టి
స్కందశైలంబున బంది నుంచు మటన్న
నాతఁడు పరమేష్ఠి నట్ల చేసె
ఆ. లోకసృష్టి పిదప లోపంబు గానీక
స్కందుఁ డెప్ప టట్ల జరుపుచుండె
నంత సురలు మునులు నంబుజాసనుకై
చింత నొంది సాంబశివు గుఱించి. 36

చ. ఘనతర మౌననిష్ఠఁ జిరకాలతపం బొనరించి పార్వతీ
వనజముఖీసమేతుఁడయి వత్సలతం బొడసూపినట్టి భ
ర్గుని విమలాంఘ్రియుగ్మమునకుం బ్రణమిల్లి యనేకభంగులం
వినుతి యొనర్చి వాంఛితము వేఁడుఁడటన్న మహేశుతోడుతన్.

క. శరజన్మునికోపంబున
సరసీజాసనున కైన సంకట మెల్లం
గరుణ జనింపఁగఁ బలికి ఖ
చరమునిసంఘంబు మఱియు సవినయ మొప్పన్. 38

క. దేవాదిదేవ! విను మీ
సేవకుఁ డగు బ్రహ్మకైనచిక్కెడలుట రే
మావాంఛిత మని పలికిన
భావజసంహారుఁడు మిగులఁ బ్రముదితుఁ డగుచున్. 39

క. పరమేష్ఠి న్విడిపించెద, నరుగుఁడు మీమందిరంబులకు నని నందీ
శ్వరుఁ గనుఁగొని నీవిప్పుడు, సరగున మత్సుతునికడకుఁ జని యాతనితోన్.

శా. స్వాతంత్ర్యంబు వహించి గర్వ మెసఁ బర్వం బల్కు నీరేజసం
జాతుం బందిని బెట్టె శీతలకుభృజ్జాసూనుఁ డంచుం సురల్
నాతోఁ గూయిడి రట్లు గావున దయాలంబుండవై యాతనిం
వీతాజ్ఞాలయుఁ జేసి పుచ్చు మిపుడే విశ్వంబు సిద్ధింపఁగన్. 41

మ. అని నావాక్యము గాఁగఁ బల్కు విగతాహంకారుఁ గావించి యీ
వనజాతోద్భవుఁ డాఁక వీడి సుఖియై వార్తల్ల వాడిం దెమ్ము పొ
మ్మని పంపం జని నందికేశ్వరుఁడు స్కందాద్రికిం సఖుల్ దాను దా
ర్కొని క్రీడించుచునున్న షణ్ముఖు మహాత్మున్ గాంచి మోదంబునన్.

క. నిటలతటఘటితకరసం, పుటుఁడై యిటు పల్కె నతఁడు స్ఫుటవాక్యములం
జటివినతుఁడైన దిక్పటుఁ, డిట కనిచిన వచ్చినాఁడ నినసంఖ్యాక్షా.

క. వనజాసను చెఱ మాన్పు
మని యనిమిషమునులు వేఁడ ననలాక్షుఁడు దా
విని యిటు లొనరింపుదుఁ గా
కని యెంగావునఁ దదాజ్ఞ యొనరఁగ నిడుమా. 44

చ. అన విని యీశ్వరాజ్ఞ దలయందు ధరించితిఁ గాని దుర్గసం

బునఁ దను దా నెఱుంగక ప్రపూర్ణమహత్త్వ మనుస్వరూప మే
నని వచియించినట్టి నలినాసను ముక్కు చెఱఁ బెట్టి యూరకే
చనుమని యుత్తఱి న్విడచి చక్కఁగఁ బంపఁగ నంత వెళ్ళినే. 45

తే. నలినసంభవు విడు మంచు నందికేశ
నీవు వచ్చితి గావున నే సహించ
నయ్య నిఁక నొండుపలుకకు మరుగు మనిన
నాతఁ డరుదెంచి శివుని కారీతి దెలుప. 46

చ. విని వరహాసవక్త్రుఁ డయి విశ్వగురుండు గిరీంద్రనందనం
గనుఁగొని వింటి నీతనయు గాళకు మచ్చుటి కింక వేగ నేఁ
జనక విధాతృమోక్షణము సల్పఁడు వాఁ డని తెల్పి యప్పుఁ డా
య్యనఁ గడుప్రేమ మీఱ సతి నంతిపురంబున కన్చి చెచ్చెరన్. 47

క. పారిషదామరముని వరి, వారుండును దివ్యవృషభవాహుం డై సీ
హారకిరణార్ధధారి కుమారగిరీంద్రమున కరిగె మదిముదమొదవన్.

చ. అటు చని కాంచె శంకరుఁ డహార్యసుతావరపుత్త్రు సన్మణీ
కటకకిరీటకుండలవికాసితశోభనగాత్రు సృష్టిసం
ఘటనవిలాససమ్ముదితకాంచనశైలనివాసగోత్రుని
స్ఫుటనుతిపాత్రు దీప్తిపరిభూతసహస్రపయోజమిత్రునిన్ 49

మ. కని డాయం జనునంతలోపలన తత్కాంచోర్వీభృద్భేదివి
గ్గన సర్గం బటు నిల్పి లేచి వృషరాట్కాండావతీర్ణుండు సం
జనితామోదియు నైన తండ్రికి నమస్కారంబు గావించి ని
ల్చిన పట్టిం గని కౌఁగిలించి యెదలోఁ జెన్నొందుమోదంబునన్. 50

తే. అంత గిరిధన్వి పరిచారికాళి సత్వ
రముగ నుంచిన సింహాసనమునఁ గూరు
చుండి సుతు నంకతలమున నుంచుకొని శి
రంబు మూర్కొని బుజ్జిమొగంబు దువ్వి. 51

మ. తనయా యాటలు మాని వేఱె పనిమీఁద న్నిల్చుచందంబు దోఁ
చె న దేకార్యము? దెల్పుమా! యనిన నే సృష్టిక్రియారాధవ
క్షనచే నుంటి నటన్నఁ బద్మజునిఁ గాదా మున్ను తత్సృష్టి నే
మ నియోగించినవార మివ్వ డిటు సేయం గారణం బేమొకో! 52

వ. అనిన నతం డిట్లనియె. 53

క. తను నెదిరి నెఱుఁగ కాడిన, వనజాసనుఁ బట్టి బంధవైచితి నన నా
తనిమాటలే మొపిదప, న్వని యెదఁగా శిపుఁడువాని విడువుము పుత్త్రా!

చ. అనవుడు నేమియుం బలుక కాతఁడు మోమ మగ వాంచియున్నఁ గ
న్గొని శివుఁ డబ్జజన్ముపయి నూల్కొనుకోపము నాదువాక్యముల్
మనమున లగ్నమౌకతన మా ఱనఁ జాలక యున్నవాఁడె నీ
తని నవలించి చెప్పక విధాతఁ జెఱ న్విడఁడంచు నత్తఱిన్. 55

ఉ. నేరుపు నేరముల్ పిదప నిర్ణయ మయ్యెడుఁ గాని యిప్పు డా
నీరజసంభవుల్ విడుము నీమదిఁ గోపము గూడ దంచు నే
గౌరవ మొప్ప జెప్ప వినఁ గానవు తండ్రి యనుజ్ఞ మీఱి సం
చార మొనర్చు కుచ్చితుల సాటికి రా మది సెంచినాఁడవో? 56

తే. అనిన గిరిజేశుభావంబుఁ గనుల కెంపు
బొమముడియుఁ గాంచి పార్వతీపుత్త్రుఁ డాత్మ
జంకి వినయంబుతో లేచి చాఁగి మ్రొక్కి
వీరబాహుని గను నంత వేగ యతఁడు. 57

క. జంభారిముఖులు చూడఁగ, నంభోరుహభవునిఁ దెచ్చి హరుమ్రోలనిడం
గుంభినిజాఁగిలఁబడి వా, గ్జృంభణ మొప్పంగ నతఁడు గిల్కొను భక్తిన్.

దకారగుణితము.—

చ. దరసమ దేవదానవవిదారణ దక్షవట దీనపోషకా
దురితతమస్సహస్రకర దూషకసంహార దేవదేవ దై
న్యరహిత దోర్బలాంతకవినాశన దౌత్యభృదాది దేయ దం
భరసవిశోషణప్రథితపావక దర్పకదర్పభంజనా. 59

చ. అని వినుతించు నాతని ప్రియంబునఁ గన్గొని శూలపాణి యి
ట్లను శిఖివాది నీ వనుచు నాటతమిం దెలియంగలేక పం
చన మొనరించె నందుకు విచారముఁ జెందకు మెప్పటట్టుల
జని సుఖసృష్టి నొందు మని సారసగర్భుని వీడుకొల్పినన్. 60

క. మదిముదమందుచు వాతఁడు, మదనారికిఁ దత్కుమారమఖికి వినతుఁడై
కదలిచని తొంటిగతి నిజ, సదనంబున భువనసృష్టి జరువుచు నుండెన్.

క. తదనంతరమున నిచ్చటఁ
బొదలెడు మోహమున మగుడఁ బుత్త్రుని దనచే
రెవఁ జేర్చి యంకతలమునఁ
గదియించి లతాంతకాండఘస్మరుఁ డనియెన్. 62

శా. ఏరా చిన్నకుమార నీరజభవుం డేనేరముల్ సేసెరా?
సారోదారుఁడు వజ్రిముఖ్యసుమనస్సంసేవ్యుఁ డౌ నాతనిం
ఘోరంబౌ చెఱ నుంచ నీకుఁ దగునా? కోపించి నీ వట్లనన్
ధీరత్వంబున బాహులేయుఁడును దండ్రిం గాంచి కేల్మోడ్చుచున్.

సీ. అన్న విధాత మి మ్మర్చింప వచ్చెడువేళఁ గ్రమ్మఱిపోవు వేళనైన
నన్ను లక్ష్యము సేయ కున్న నాతనిఁ బిల్చి యెవ్వఁడ? వీవిట కేల వచ్చి?
తనఁ దన పేరును దలమునుద్యోగంబు ఘనతయు వచ్చిన పనియు విద్యఁ
బెంపునఁ జెప్పినపిదప నే బ్రణవార్థ మెఱుఁగ వే-డఁగ నాతఁ డెదురుదన్ను

తే. నరయక యపార్థముగఁ బ్రణవాఖ్యమంత్ర
మును దదర్థంబు నే నని పెనుమదంబు
తొలుకఁ బలికిన తులవయౌ నలువ బంది
నిడితి వదలితి మీ రిప్డు విడువు మనిన. 64

చ. అనవుడు పిన్ననవ్వు నగి యబ్జధరుండు కుమార ధాత వం
చన మొనరించినాఁడ వది సమ్మతమే? యిఁక నీవు చెప్పుమా
యసితరసాధ్యమైన ప్రణవార్థము తేట పడంగ నావుడున్
జనకునితోడ ని ట్లనియె శైలసుతాతనయుండు నమ్రుఁడై. 65

క. సర్వజ్ఞుల రగు మీకున్, సర్వేశ్వర యొకటిఁ దెలుపఁ జాలుదు నే? త
ద్గర్వాధిపకథితమంత్రం, బుర్విని శిష్యుండు దెలుప నోపునె యెందున్.

తే. అయిన నాయందుఁ గలుగు దయాసమృద్ధి
కతన మస్ముఖమున వినఁ గాంక్ష చేసి
నారు గావున మీపాదనలినబలము
చేత విన్నప మొనరింతుఁ జిత్తగింపు. 67

ఉ. నావుడు శంకరుండు నిజనందను వాక్యము లాలకించి తా
భావమునందు సంతసము పర్వ రహస్యముగాఁగ విందు సౌ
ఖ్యావహమంత్రరాజ మని యాతనికై చెవి యొగ్గి సంశయా

భావముగాఁగఁ జెప్పెఁ బ్రణవప్రకటార్థ మతండు ధీరుఁడై. 68

ఉ. ఆగతిఁ జెప్పిన స్మరరహస్యము వీనులవిందు గాఁగ వి
వ్యాగళర్గాసనుండు విని యద్భుతమోహదయానుమోదసం
యోగమనస్కుఁడై నిజసుతోత్తము నెంతయు గారవించి యా
రా గుణధుర్య చెప్పితి పరాత్పరమంత్రము తేటతెల్లఁగన్. 69

ఉ. నీకును మాకు భేదము గణింపఁగ లే దణుమాత్రమైన భూ
లోకమునందు భక్తి కడు లోపముఁ జెందిన పట్లు గాన మ
ర్త్యాకృతిఁ బుట్టి నా దగు మహత్త్వము బోధ మొనర్చి మానవా
నీకములన్ భవాబ్ధి దరిఁ జేర్పుము నీ దగు నేర్పెలర్పఁగన్. 70

తే. ఏతదర్థంబు మును నందికేశ్వరుని ధ,రాతలంబున కనిచితి నాతనికిని
హెూదరిరత్నమై భక్తినొప్పు నాగ,మాంబికాదేవితనయుఁడవై జనించి.

చ. అసదృశనందికేశ్వరుని యంశమునం జనియించి మించు త
ద్బసవనితోడ సంతతశుభప్రద భక్తి శుభానుభూతిఁ బెం
పెసఁగుచు మర్త్యమానశరణేశ్వరపద్మజనం బొనర్చుచున్
వసుమతిఁ గొన్నివర్షములు వర్తిలు మత్సమదాజ్ఞ వెంబడిన్. 72

వ. అని యిట్లానతిచ్చిన జనకునివాక్యములు విని కుమారుం డవనీత
లోద్భవంబున కసమ్మతంబును జనకాజ్ఞోల్లంఘనానర్హవిచారంబును
మనంబునం బెనఁగొనుటయు నేమియుం బలుకక యశ్రువదనుండై
యూరకున్న నతనిభావంబు శంకరుండు దివ్యచిత్తంబున నెఱింగి ధరా
తలంబున భక్తివర్ధనం బొనరింపఁడయు ననుతలంపు ప్రేరేప నీడంబి
కాసంబోధనంగాని చక్కంబడఁడని యూహించి పార్వతిం బంచిన
సమస్తజగద్వృత్తాంతవేదినియగు తత్సతీవతంసం బనర్ఘ్యమణిభూష
ణాలంకృతయు నిరుపమవాసనాసమాగతచంచరీకనాదమేదురాది
తేయమేదినీజలతాంతదామాభిరామయు మందస్మితసుందరవదనా
రవిందయు రాజకీరలీలాసరోజాతహస్తయు దేదీప్యమానకాంచనాం
బరసహితయు నై యనేకనాకలోకైకకోకస్తనీలోకంబుల ధరసమా
నమణిమయంబు లగునాలవట్టంబులు గొందఱు వజ్రమయదండచా
మరంబులుం గొంద ఱతులితశాతకుంభశుంభద్దండపుండరీకంబులుం
గొందఱు చిత్రవిచిత్రపట్టాంబరకేతనంబులుం గైకొని యరుదేర

విద్యాధరకిన్నరకింపురుషగంధర్వకామినులు సంగీతసాహిత్యవేణువీ
ణాదివినోదంబుల నింపు సంపాదింప యక్షగరుడోరగసిద్ధసాధ్యవి
ద్యామధ్యలు ఖడ్గవేత్రపాదుకాజలకలశవీటికాపేటికాధారులై
నడువ దివ్యవిమానం బధిరోహించి స్కందమహీధరంబునకు వచ్చి
విభావరీశభూషణసభాసికటప్రదేశంబునఁ దద్వాహనావతరణంబు
గావించి తనుంగనుంగొని లేచి నమఃపూర్వకంబుగా నిటలతటఘటిత
కరులగు సురలసిరుపమకరుణాకటాక్షేక్షణంబున వీక్షింపుచుఁ బ్రాణే
శ్వరు డాయం జనుదెంచి ప్రణమిల్లి తదనుమతి నర్ధాసనాసీనయై
యుండి చింతానను డైనసుతుం గని వీఁ డిట్లు చింతాక్రాంతుండై
యున్న కతం బేమని పతి నడిగిన నతండు మందస్మితవదనుండై సతి
తోడ గతవృత్తాంతంబంతయుం దెలిపి యేతదర్థంబుగా నిన్నుఁ దలం
చితిం గావున నీతని క్షితితలంబున కరుగునట్లు సమ్మతిపఱుపు మన
విని నగతనయ మనంబున నొక్కింత విచారించి తొల్లి భూతలం
బున సంభవంబు నొందునిజవయస్యయగు నాగేంద్రగమనకుఁ గుమా
రుని గుమారునిఁగా నిచ్చెద నన్న వచనంబున కనురూపంబుగా నీశ్వ
రుం డాన తిచ్చుట కానందంబు నొంది తనయుం డాయఁ దిగిచి
తొడలపై నిడుకొని కూఁకటులు పుడుకుచు ని ట్లనియె. 73

సీ. అన్న కుమార! మీయయ్య చెప్పినమాట కీఁబియ్యకొనఁదగు నిలజనించు
కతన నీకుఁ గొఱంత గలుగదు తనకు నీకొక్కింత వేఱులేకునికి నిన్నుఁ
బంచెదా జనునట్టిపని కడంగాక నే మున్నె పంపఁదలంచి యున్న దానఁ
గావున మా యాజ్ఞ గైకొని భూతలంబున కేగి యచ్చట బొనుగుపడిన

ఆ. భక్తి నుద్ధరించి పరవాదుల నడంచి
యఘము ద్రుంచి దెసల యశము నించి
ప్రోదిఁ బెంచి శర్వభక్తుల రక్షించి
మరలిరమ్ము చింత మాను మనిన. 74

ఆ. సమ్మతించి గుహుండు జననీజనకపాద
సరసిజాతములకు సాఁగి మ్రొక్కి
మీయనుజ్ఞ నేను మీఱంగ నేర్తునే?
యట్ల సేయువాఁడ ననుచుఁ బలికె. 75

వ. అట్లు పలికిన కుమారుని వాక్యంబులకుఁ బార్వతీపరమేశ్వరు లానందం
బు నొంది యతనిం గౌఁగిలించుకొని దీవనలొసంగి పొమ్ము వేగమ్మున
మరలి రమ్మని యనేకవిధంబుల గారవించి పారిషదబర్హిర్ముఖ బ్రహ్మ
దేవర్షి పరివారంబులతో నిజనివాసంబున కరిగి యిష్టవినోదంబులం
దేలుచుండి రక్కుమారుం డవనీతలంబునఁ జెన్నబసవేశ్వరుం డన
బసవేశ్వరభాగినేయుం డై జనియించి యసదృశమహిమావిశేషం
బున భక్తివర్ధనం బొనరించెఁ గుంభసంభవా! తద్విధంబు విస్తరంబు
గా వినుమని రేణుకుండు చెప్పం దొడంగె. 76

## కళ్యాణపురవర్ణనము.

సీ. శ్రీసమంచితరాజశేఖరాగారంబు వరసర్వమంగళావాసభూమి
ప్రాకటవీరభద్రాకరవిభవంబు పటుదంతిముఖబలభాసురంబు
నతులరంభాదికోద్యానవిలాసంబు రమ్యవిద్యాధరభ్రాజితంబు
నగణితపురుషరత్నావళీకలనంబు ప్రబలగంధర్వవిరాజితంబు
తే. నగుచు మారట కైలాస మనుచు సకల
జనము లద్భుతపూరితస్వాంతు లగుచు
వినుతిఁ గావింపఁ దనరెఁ బృథ్వీతలమున
భాగ్యజనకంబు కళ్యాణపట్టణంబు. 77

మ. జ్వలదత్యున్నతసౌధసంఘటితభాస్వద్వజ్రనీలోపలో
జ్జ్వలకాంతిప్రకరంబు నల్దెసలఁ బర్వం బౌరలోకంబు ని
చ్చలు శ్వేతాసితపక్షమానిశల లేశం బైన స్వాంతంబునం
దెలియంజాలక సంశయించు పురివర్ణింపన్ వశంబె? ధరన్. 78

తే. ఆకసం బంటుకొమ్మల నమరి సద్వి
జాధిపాగార మగుచు జంభారివినుతి
పాత్రమై మూలబలముచేఁ బరిఢవిల్లి
సాలము దనర్చుఁ బురిఁ గల్పసాల మనఁగ. 79

తే. రాజమండలసంశక్తిఁ దేజరిల్లి
పుష్కరఖ్యాతిఁ జెలువొంది భువనవినుత
మేఘపదసంగతిఁ దనర్చి మెప్పు గులుకు
కరినికర మొప్పు దివిఁబోలు పురమునందు. 80

ాశ్వముల్ గతులు పాటికి రాఁ గని తన్మనోద్ధతిం
ఁ జేయ నింగి కయి దూఁగగ నైజఖురోత్థితావనీ
సంబరాంబరము దార్కొని క్రమ్మిన దానిచాటునం
భీతిఁ బాఱఁ గని వాని హసించుఁ బురీతురాశ్వముల్. 81

తత్పురిపథమహాధ్వజసంఘటితాచ్ఛఘంటికా
ంభిరావములు విశ్వము నిండినఁ దద్భయార్తి న
లజాతబాణ పురుహూతరథంబులు గానలందుఁ బ
ాలం దదీయశిఖరంబులుఁ జేర రయంబు మీఱఁగన్. 82

బోవుచు దమనీ,డలకులుకుచబిలములోన డాఁగెడుసింహం
ృకలనమానరి, వెలయునెయనినగుదుగ చటివీరనృసింహుల్.

ల్ల సించుకఁ బ్రసిద్ధి వహించెను గాని నిల్చి మా
ాల్లు డెల్ల ధర నాతనిపౌరిథిమ లెక్కవెట్టఁగాఁ
యుంచుఁ బద్మజునిఁ గొద్దిగ నెంచి వసింతు రప్పురిఁ
లు త్తమోర్జితులు భవ్యసిరూఢవచోధురంధరుల్. 84

పద్మినీహితులు నిర్మలమూర్తులు సత్పరితానభా
మోదదాయకులు సుస్థిరమిత్రసమేతు లప్పురీ
ంభిరాములయి వర్ధిలు రాజులు రాజు లెక్కసే
మవిక్రమస్ఫురణ నాతఁడు వర్తిలలేక యుండుటన్. 85

మృదుసత్య, వ్యాపారులు కీర్తివిజితహరశైలసమీ
లు కవిదంతిమ,ణీహారులు గలరు పురి నసింహ్యవిహారుల్. 86

హాలనిర్జితబల, భద్రులు సద్గుణగణాధిభద్రులు సుఖని
వితతగభీరస,ముద్రులు గల రచట బుధసమూహసురద్రుల్.

ఖాంచిన నిభదానవాంతకసదనసముత్కరసంభ్రమంబు
నరసిన నేణాంకకోటీరపాదపంకేజాతభక్తమహిమ
నాలింప హిమగిరిజాధిపలలితకథాసుధాలాపచయము
గణియింప హేమధరాధరబాణానుసేవానుభావనంబు
దలఁపోయఁ బద్మినీహితమృగాంక
దాంబకాంభంగశాస్త్రచర్చ

లప్పురీవరమాహాత్మ్య మభినుతింప
నలవియే శేషఫణికైన నజునికయిన. 88

క. ఆపుటభేదన మేలెడు
భూపాలకుఁ డర్థినికరపోషణుఁడు సని
ద్వ్యాపారచణుఁడు శుభముల
నేపుఁ డనర్ బిజ్జలాఖ్యుఁ డివ్వసుమతిలోన్. 89

ఉ. జైనకులప్రవర్ధనుఁడు శాశ్వతకీర్తియుతుండు నిర్మలా
నూనగుణాభిరాముఁడు ధనుర్గుణటాంకరణారిమండలి
మానససాధ్వసప్రదుఁడు మన్మథమాధవరూపశాలి నా
నానరనాథసన్నుతసనాథుఁడు తత్క్షితినేత వర్ధిలెన్. 90

క. ఆరాజమంత్రివర్యుం, డై రాజిలు సకలదిగధిపాంబుజసదనా
భూరిస్తనహారాయిత, చారుసమాఖ్యుండు బసవసచివుం డెలమిన్.

సీ. యేధన్యమానసం బిందుశేఖరపాద
తోయసంభూతభృంగాయమాన
మేకృతార్థుకృపావలోకనం బర్థిదై
న్యాశుశుక్షణివార్షికాంబువృష్టి
యేపుణ్యచారిత్ర కోపయుక్సాభ్రిభంగ
మఖిలాన్యమతజాతహరణమూల
మేమంత్రమాహాత్మ్య మింద్రాబ్జభవముఖ
బృందారకానీకవినుతిపాత్ర

తే. మతఁడు గొనియాడఁ దగు నిహిమాచలేంద్ర
సంభవావల్లభనియోగసకలమర్త్య
పావనార్థమాదాఖ్యసత్పత్ని మాద
మాంబికాగర్భజుఁడు బసవార్యవరుఁడు. 92

సీ. సతతంబుగురులింగచరసమర్చనలె కాని యితరార్చనంబుల నేవగించు
జంగమతీర్థప్రసాదసేవయె కాని యితరంబు రుచిగొన నేవగించు
మాహేశ్వరవ్రాతమాహాత్మ్యమే కానియితరంబువినుటకు నేవగించు
సతతగణాధీశసద్విలాసమె కాని యితరంబు గనుఁగొన నేవగించు

తే. నెంతసజ్జనుఁ డీధన్యుఁ డెంతధీరుఁ
డెంతమహిమాఢ్యుఁ డని జను లెన్నుకొనఁగ
రాజ్యభారంబు శివభక్తి రాజ్యభార
మెలమిఁ బాలించె శ్రీబసవేశ్వరుండు. 93

తే. అనుదినము లక్షతొంబదియాఱువేల
జంగమంబుల కిష్టాన్నసమితి యొసఁగి
మిండజంగమములకుఁ బన్రెండువేల
కనుచు వేశ్యాగృహంబున కట్టిపగిది. 94

క. అచలితతత్కైంకర్య, ప్రచురశ్రవణానుమోదభరసకలదిశా
నిచయసమాగతశరణుల, ఖచరజ్యేష్ఠునకు వశమె గణుతింపంగన్.

సీ. సుజ్ఞానశీలురు సూనృతవాక్యులు త్రిభువనపూజ్యులు ధీరమతులు
వేదాంతవేదులు వీరశైవాచారసంగ్రహాకర్తలు శాంతిసహితు
లష్టవిధాంగయోగానందపరవశు లసదృశలింగలీనాక్షివర్గు
లంతకదూరు లత్యంతకరుణాసముద్రులు నిరుపమభద్రగుణులు

తే. సత్ప్రసాదాంగు లకుటిలస్వాంతరంగు
లతులభవదూరు లన్యదుర్మతవిదారు
లచలదాసోహమతులు భక్తాధిపతులు
శర్వపదపద్మభృంగముల్ జంగమములు. 96

క. పరవికచాబ్జేక్షణ సో
దరి ముక్తి సతీలలామ దారకశుకు బం
గరుపెంచు రుణము గరళము
కరుణయ పూన్కిగ నటంచు గణసింహంబుల్. 97

తే. నిండి కళ్యాణపురము పన్రెండుయోజ
నముల నెల్లెడ నెడలేక నమితు లగుచుఁ
గాలకంధరుపరభద్రగజము లనఁగ
నతిముదంబున వసియించి రంచితముగ. 98

చ. వినయవివేకభక్తిగుణవిశ్రుతుఁ డాబసవేశ్వరుండు దా
ననయము తద్గణాధిపుల కంతటి కీప్సితవస్తుజాత మిం

పొనరఁగ నిచ్చుచున్ బ్రమదమొంది సుధామయతత్ప్రసాదమున్
వననిధిఁ దేలుచున్ మహిమ వర్ధిలఁజేయుచు నున్నయత్తఱిన్. 99

## కక్కయ్యగారి కథ.

శా. దృక్కర్ణేశకలాపమూర్తి సురధాత్రీజప్రభాకీర్తియు
గ్దిక్కాలప్రకరుండు కామముఖవిద్విట్సంహారుం డాశ్రిత
ప్రాక్కర్మాంబుధిబాడబానలుఁడు భాస్వత్తేజుఁ డాపోలిలోఁ
గక్కాఖ్యుం డొకభక్తసత్తముఁడు శ్లాఘ్యఖ్యాతి వర్తిల్లఁగన్. 100

తే. బసవదండాధినాథుండు భక్తితోడఁ
దద్గణాధిపవరు ప్రసాదంబుఁ గొనఁగఁ
దలఁచి పండ్రెండువత్సరంబులు మహాప్ర
యత్న మొనరించి యంతట నబ్బకున్న. 101

మ. కమనీయామలతత్త్వయుక్తుఁ డగునాకక్కయ్యదివ్యప్రసా
దము నేఁ గాంచఁగ నేరనైతి నకటా! తద్భాగ్య మేతీరునన్
సమకూరున్ ననుఁబోలువాని కనుచున్ స్వాంతంబులో నెంచి యు
త్తమమై యొప్పు తదీయమందిరముచెంతం జేరి యచ్చోటునన్.

ఉ. అంగణసీమ నల్గడల నంతట నింతట నిల్చి కాంచుచున్
ముంగల నొక్కచీమ కొనముక్కున నొక్కకణంబు పట్టి యే
గం గని జ్ఞాని గాన నిది కక్కయగారిమహాప్రసాద మె
బ్బంగి ననంశయం బనుచు భావమునందుఁ దలంచి వేడుకన్. 103

చ. భవములఁ బాసితి న్నిగుల భాగ్యముఁ జెందితిఁ గోరుకోర్కి చేఁ
దవిలె సమస్తసద్గుణవితానములోపల వన్నె గాంచితిన్
భువననుతాభిరామగుణపూజ్యుఁడు కక్కయసత్ప్రసాద మిా
భువిఁ గనుఁగొంటి నంటి నతిపుణ్యచరిత్రుఁడ నైతి రూఢిగన్. 104

క. అనయముగురుసంగయదేవునిగొలిచినయట్టిఫలము పొందుగ గణప
ద్వనజములుపూజగావించిన ఫలమునుదోడుతోడఁ జేకూరెబళే.

తే. అనుచు ముద మంది యప్పు డయ్యనఘమూర్తి
చీమనోటిప్రసాదంబు చేకొనంగ
నొకయుపాయంబుఁ గని యట నున్న యిసుక
జగతిపై ముష్టిమాత్రంబుఁ జల్లుటయును. 106

అక్కజముగ నవ్వాలుక, చక్కెరపొడియైనఁ దత్ప్రసాదకణంబుఁ
లెక్కగొన కప్పిపీలిక, యక్కడ నిడి పంచదారకై యరుగుటయున్.
ఆనంద మంది బసవఁడు, దా నాకణ మాత్మహస్తతలమ్మున నిడి బల్
దీనునకు నిధియు వాడిన, చేనికి వర్షంబుపగిదిఁ జేకురె నాకున్. 108

ఈమహాప్రసాద మిష్టలింగార్చన
చేసికాని కొనఁగఁ జెల్ల దనుచుఁ
బొలుపుమీఱ తనదుతలపాఁగకొంగున
విడకయుండ ముడియవేసి యంత, 109

భక్తాగ్రగణ్యుం డైనకక్కయ్యగారి యంతర్గృహంబునకుం జని ప్రసాదోపభోగానంతరంబున సుఖగోష్ఠి నున్న యతనిం గాంచి వినయభక్తిప్రమోదంబులు ముప్పిరిగొనఁగ సాష్టాంగవందనం బాచరించి కరంబులు మొగిచి దేవా! బహుకాలంబుననుండి కాంక్షించుచున్న నాకు మద్భాగ్యంబు పిపీలికారూపం బై భగవత్ప్రసాదంబు గొనితెచ్చి యిచ్చె నేటికిఁ గృతార్థుండ నైతి ననిన నప్పరమపురుషుండు విస్మయం బంది గురుకటాక్షలబ్ధు లగువారి కెయ్యది యసాధ్యం బని తలంచి యతనితో ని ట్లనియె. 110

క. అనవరతాఖిలాంచితనిశాధిపభూషణసుప్రసాదభా
జనరసనాంచలుం డనఁగఁ జాలిన నీకు మదీయకర్త యై
జనునతి గాంచు చెన్న యప్రసాదము సంభవమౌట! చోద్యమే
నను నొకపెద్దసేయుటకు న్యాయమె నీకు వివేకభూషణా! 111

క. అని సరసంబుగాఁ బలికి యంపిన బండరితత్ప్రసాదముం
గొనుతమి నాత్మగేహమునకుం జనుచో నెదు రేగుదెంచి పా
వనసుగుణాభిరామ శివభక్తిలలామ దయాబ్ధిసీమ యా
ననఁ దగు నక్కనాగమ సమంచితసంభ్రమ మొప్ప ని ట్లనున్. 112

ఎచట కేగి తయ్య యిష్టలింగార్చన
సమయ మయ్యె వేగ స్నానవిధులు
సలుపు మనినఁ దనదు తలపాఁగ యొక్కచో
నునిచి తడుపు గట్టుకొని రయమున. 113

జలకం బాడఁగ నేగిన, నలినీదళనేత్ర యక్క నాగాంబిక యా

తలపాగకొంగుముడిఁగని, దలమగుసంశయముతన యెదం జనియింపన్.

క. నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియుఁ దామూటగట్టి నెఱుఁగఁ డిదేమో
యీముడ్పుఁ జూడవలెనని, ప్రామినకుతుకమున ముల్లెవదలిచి కాంచెన్.

ఉ. కాంచి గణప్రసాద మగుఁ గా యని సంతస మంది ఫుల్లనే
త్రాంచలమోదబాష్పయుత యై బసవండు గణాలయంబులం
సంచితభక్తి వారల ప్రసాదము గోరికదీఱ మెక్కి యొ
క్కించుక దెచ్చె నా కొసఁగ నెంతయుఁ గూరిమి గల్గుఁ గావునన్.

ఆ. ఈప్రసాదమహిమ యెంచి వర్ణింపఁగ
నలవి యగునె తమ్మిమొలక కైనఁ
గలువవిరులతేనెఁ దలమానికము గాఁగఁ
దాల్చినట్టి దొరకుఁ దప్ప జగతి. 117

సీ. ప్రబలారివర్గద్విపప్రతాపంబున కంకుశం బగు నిమ్మహాప్రసాద
మతులితదుర్విషయావనీధరముల కశనిరూపం బిమ్మహాప్రసాద
మత్యుగ్రతాపత్రయాంభోదములకుఁ జంఝానిలంబగు నిమ్మహాప్రసాద
మచలితమాయాబలాటవీస్థలమున కనలతేజం బిమ్మహాప్రసాద

తే. మఖిలవేదాంతవేద్యమహా హరునిభక్తి
కాస్పదం బయి తగు నిమ్మహాప్రసాద
మలఘుతరనాదబిందుకళాత్మకంబు
తలఁపఁగా నిమ్మహాప్రసాదంబు జగతి. 118

క. అని కొనియాడుచు మోదం, బునఁ దద్దివ్యప్రసాదమున కతులితవం
దనము లొనరించి వేగం, బున లింగార్పితముఁ జేసి భుజియించె నటన్.

తే. బసవదండేశుఁ డామోదకుసుమవారి
స్నాన మొనరించి ధౌతవస్త్రములు దాల్చి
లీలఁ జెన్నొందు లింగార్చనాలయంబుఁ
జేరి చిత్రాసనమున నాసీనుఁ డగుచు. 120

తే. భూతి రుద్రాక్షమాలికల్ పొసఁగఁ దాల్చి
కరతలంబున నిష్టలింగంబుఁ బూని
సద్గురుఁ దలంచి తనయగ్రజాతఁ బిలిచి
నిరుపమానందభరితహృత్సరసుఁ డగుచు. 121

క. అక్కా! పాఁగాకొంగున
కక్కయ్యమహాప్రసాదకణ మున్నది నే
మక్కున మెక్కఁగవలయును
జక్కఁగ గొని తెమ్మటన్న సతి యిట్టు పలికెన్. 122

క. పాఁగాకొంగునఁ బ్రసాద, మేఁ గని నా కొఱకు తెచ్చి తినని కడకం
బేగ భుజించితి నన విని, తా గుండెగుభిల్లు మనఁగఁ దలపోసె నిటన్.

ఉ. అకటా! నా కిపు డేల గల్గు? నిజచిత్తాంభోజపీఠస్థితాం
తకసంహారసదావిలీనకరణోద్యత్కృత్యకక్కాఖ్యభ
క్తకలాపప్రథితప్రసాదకసుధాకల్లోలినీసౌఖ్య మీఁ
గను సౌభాగ్యము చేకుఱం గలదె లోకంబందు వీక్షింపఁగన్. 124

సీ. కారణజన్ముఁడౌ కక్కయ్యసత్ప్రసాదము గొన నెమ్మదిఁ దలఁప నేల?
తలఁచి పండ్రెండువత్సరములుపొంచ నాతొంటిపుణ్యంబున దొరక నేల?
దొరికిన నచట సంతోషినై మెక్కక తలపాగకొంగున దాఁచ నేల?
దాఁచిన నాగాంబ తత్ప్రసాదముఁ గని తోఁపరి నన్నడుగక కుడువ
తే. కుడువ నేర్పది మాయక్క కుమతి నేను [నేలఁ
జేల నైనట్టి నాకోటి కేల గల్గు!
సంగమేశ్వరుకరుణ యింతాయ నుండె
నెంత చింత యొనర్చిన నేమి గలదు!. 125

క. నేమరు నిటు దలపోసిన, పాపమునకు ముక్తిగలదె పాపుఁడినచో
కామిత భోగులు చేకొనె, నీమహిలోన నెడుమాట యేనిజమయ్యెన్.

క. అని యిట్లు నాగమాంబా, వనజాతాస్యప్రకృష్టభాగ్యంబునకుం
దన యెఱుక లేమికెంతయు, మనమునఁ దర్కించుచుం డె మాటికినంతన్.

ఉ. భోగివిభూషణాజ్ఞ మెయి భూమికి వచ్చి మయూరవాహనుం
డాగమవేద్యసర్వమహిమాకరకక్కయసత్ప్రసాదసే
వామహిమంబున న్మిగులఁ బావనమై కనుపట్టె నిప్పు డీ
నాగమగర్భసీమ యిఁక నాదుమనోరథసిద్ధి గాంచితిన్. 128

క. ఈసుదతీమణికడుపున, భాసురముగఁ బుట్టి కీర్తిఁ బ్రబలెద నని యు
ల్లాసమునఁ గార్తికేయుం, డాసతి గర్భప్రవేశమై చెలువొందెన్,

క. జలజాయతాక్షిగర్భ
స్థలమందుఁ గుమారమూ_ర్తి తగ నిల్చినచోఁ
దలమగుచు గర్భచిహ్నం
బులు గానఁగ నయ్యె జనులు ముక్కునఁ దుడువఁగన్. 13(

మ. ఇది యేమో విపరీత మంచుఁ దనుఁ దా నేసంబునుం జెందుచున్
మదిలో సిగ్గున నెవ్వరిం గనక యానాగాంబ యున్నంత నా
సుదతీరత్నముచొ ప్పు గాంచి బసవేశుం డెంతయుం జింతచేఁ
జెదరం బాఱెఁడు చి_త్తమందుఁ దలపోసెన్ బెక్కుచందంబులన్.

క. అవివాహ పుణ్యచారిణి, ప్రవిమలసద్భ_క్తియు_క్తభావంబుజ యీ
ధవళాక్షి యిట్టినిందం, దవులన్ వలసెన్ విధాతతల పేమందున్.

క. కలలోన నైనపురుషుని, దెలియం జూడనికళావతీతిలకము తె
క్కలిగర్భము దాల్చె నె యని,నలుగురువినినింద చేసి నవ్వఁగవలసెన్.

క. ఏమని యూఱడియుండుదు,నీమహిజనులాడుకొనెడుహీనోక్తులు నే
నేమని చెవులం జొనుపుదు, నామది నరిలేనిచింత నాటఁగవలసెన్.

ఆ. లోకనిందఁ బాపి మాకు సద్గతిఁ జూపి
యరయు మిట్టితఱి మహానుభావ !
నీవె దిక్కుసుమ్ము దేవ ! సంగయదేవ !
యనుచు గురునిఁ దలఁచునవసరమున. 135

సీ. బాగైనతగటంచు పాగలోఁ జెక్కిన
కమ్మపువ్వులబంతి యెమ్మె గులుక
వగమీఱఁ బైపై నల్లైవాటుగా వైచిన
జిలుగురెంటెపుడాలు చెలువు మెఱయ
డాకాలఁ దవిలించు డంబైనరతనాల
కడియంబు రవలచే ఘల్లు రనఁగ
మెయినిండ నలఁదిన మెఱుఁగు గంధపుఁదావి
మించి నల్దిక్కులు ముంచికొనఁగఁ

తే. గేల నందంబు గలబొంగెకోల దనర
నుదుట యెఱుపైనబూది సంపదలు నింప

వెడఁదయురమున లింగంపు వేటు దనర
సంగమేశ్వరుఁ డొకమిండజంగ మగుచు. 136

తే. నెదుట నిల్చినఁ గని బసవేశ్వరుండు
జంగమాంఘ్రిద్వయమునకుఁ జాఁగి మ్రొక్కి
వేదసూక్తుల నెంతయు వినుతిఁ జేసి
సముచితాసనమున నుంచి సంభ్రమమున. 137

తే. అర్ఘ్యపాద్యాదు లిచ్చి యయ్యనఘమూర్తి
పార్శ్వతలమున నంజలిఁ బట్టి భయము
భక్తియును నాత్మలోపలఁ బాదుకొనఁగ
వినయమున నున్న శిష్యునిఁ గని గురుండు. 138

తే. బసవ! నీమోము వెలవెలఁబాఱి యున్న
దేమి కత మని యడుగ నోస్వామి! యొకటి
విన్నవించెదఁ దోఁబుట్టు వెలఁదికతన
యొక్కబలునింద సంభవ మొందె ననిన. 139

క. చింతలకు నిందకై యా, వంతయు నీమనసుతోన యంగన యితర
భ్రాంతివహించు నెగర్భో, దంతమునకు వేఱె యొకకతముగలదనఘా.

తే. అంబ పులిననితంబ దయావలంబ
వృజినగిరిశంబ ముఖవిజితేందుబింబ
చికురపరిభూతరోలంబ శ్రీవిడంబ
డంబుగా నొకనాఁడు ముదంబుతోడ. 141

ఉ. రాజతశైలకూటనవరత్నమయాంచితసౌధమధ్యవి
భ్రాజితరత్నపీఠమున వాణిశచీప్రముఖాదితేయనీ
రేజవిలోచనల్ గొలువ శ్రీ దళుకొత్తఁగ నున్న వేళఁ దే
జోజితకోటిసూర్యుఁ డగుచుక్ శరజన్ముఁడు వచ్చెఁ జెచ్చెరన్. 142

ఆ. వచ్చి సుతునిఁ జూచి వాంచి కేల్దవ సాఁచి
నాథనంబుకుప్ప నాదుహంస
నన్నుఁ గన్నతండ్రి నాపట్టి నాచిల్క
రార యన్న యనుచు గారవమున. 143

శా. తా ముద్దాడుచుఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రాణము
ల్బ్రేమోహంబున నంకమం దిడి తదీయాలాపముల్
నేమేమీ యని మాటిమాటి కరుదై యింపొంద నగ్గిఁ
గామారిప్రియభామ తోష మొసవంగా నన్నచో న

క. నాగేంద్రగమన యన మిహి
కాగతనూభవకుఁ బ్రియవయస్య యపుడు త
ద్రాగంబుఁ గాంచి యొకసఖి
తోఁ గీల్కొను మందబుద్ధి దోఁపఁగఁ బలికెన్.

చ. అరయఁగ నాత్మగర్భజుని యట్టుల నీవరజన్ము వేడ్క నీ
దరయక గాంచువారు తను నాలము సేయుదు రంచు
గిరికరజాతముద్దు దిలకింపఁగ లాలన మాచరించె నో
కరివరయాన! యీమెయెడఁ గాంచితి మెందున లేనిచొ

క. అని సెలవిఁ బాఱనవ్విన, వనితం దిలకించి కోపనహ్నా క
కనుగొనలఁ జాఱఁగా ని, ట్లని యొక్క మిహికాధరాధరాత్మ

ఉ. దైవతసంచయాధిప సుధాకరశేఖర వీర్యజన్ముఁ డౌ
నావరపుత్త్రుఁ గన్గొని మనంబున నోరువఁజాల కిట్లు పా
పావహవాక్యముల్ సుదతి యాడఁగఁ గూడునె మేలు
భావము గాన నవ్వె నీకఁ బల్కులు వేయును నేల

క. ప్రేలరితనమున నిటు నిం, దాలాపము లాడి నవ్వి తిటు
బ్బాలోకంబున నిందల, కాలయమై జననమందు మంచు

మ. అని యీతీరున శాప మిచ్చిన నవశ్యాయాద్రిజానవ్యా
ద్వనజాతంబులపై నొరంగి మదిలో దైన్యంబు గెట్టింపఁ
ననియె న్వారణయాన తల్లి యిటు నాయం దొక్కయీ
జను నే? నవ్వుచు నాడినట్టి పలుకుల్ సత్యంబుగాఁ గొండ

ఉ. దాపుననుండనీక వసుధాస్థలి సంభవమందు మంచు బ
శాప మొసంగ నీ కగునె? జన్మము నొందఁగఁ జాలఁ
బాపఁగదే యటంచు బహుభంగుల వేఁడిన గౌరి నమ్మ
గోప మొకింత డిందుపడఁ గోమలి కిట్లని యొక్క బ్రియ

శాపంబు దప్పదు గావున
కణ్వీతలమున నుద్భవము నొంది
హింత వై భక్తభక్త్యవశేష
గాపహత్య్యమున గర్భ మమరఁ దాల్చి
నిందింపఁ బండ్రెండువర్షముల్
రియించి పుట్టెడుపట్టినఁన
గాదంబుఁ బోకార్చి సద్భక్తి
ర్య చేఁ గొన్నివత్సరము లుండి
ంటు దమ్ము నావుడు మగువ మ్రొక్కి
హాజ్ఞ జనన మొందెదను గాని
గారుఁ గుమారుఁగా ని మ్మటన్న
గాక యని గౌరి యానతిచ్చె. 152

మనయానతి, నాగాంతకవాహుఁడ య్యెనందనుఁడనుచుఁ
గవమున ముదమున, నాగమయై జగతిపావనంబుగఁబుట్టెన్.
తోఁబుట్టువు, పావనగుణశీల దీనిభావము దెలియం
ఁ యేరికైనను, నీ విం కిటఁజింతలుడుగు నిరుపమచరితా.

ర్యుఁడౌ కక్కయ్యసత్ప్రసా
ంబు వైకొనుమహత్త్వంబువలనఁ
గర్భంబుఁ దాల్చి తద్గర్భస్థుఁ
యున్న వాఁడు షడాననాఖ్యుఁ
నఁ బదియు రెండేండ్లకు బిడ్డలు
భ సర్వజనులు నాశ్చర్య మొంద
ఁకర్ణమునఁ బుత్త్రుఁ డుదయించు
ద్వాదశవత్సరబాలుఁ డగుచు
జెన్నబసవరా జనెడునామ
నావింపు మని వృత్త మెల్లఁ దెలిపి
పేఁ డంతర్ధానసరణిఁ దాల్చె
ంతటు లింగదర్పణమునందు. 155

సీ. పద్మాసనస్థుఁ డై పరమేశ్వరునకు హృ
త్పద్మంబు నెలవుగాఁ బరగువానిఁ
బశ్చిమనాళసంభవఘంటికారవ
పరవశభావుఁ డై వఱలువానిఁ
గడు నధోముఖము లౌ కమలంబు లాఱును
నూర్ధ్వముఖములుగా నొనరువాని
శశిరథస్యందనశర్మనిర్మలసుధా
స్వీకారవృత్తిచేఁ జెలఁగువాని
తే. నమలబిందుకళాతీతుఁ డైనవాని
నయుతసూర్యప్రభాభాసుఁ డైనవాని
నాత్మసోదరిగర్భమునందుఁ గాంచి
యాపె కెఱిఁగించి సంతోష మంది యుండె.
తే. ద్వాదశాబ్దంబు లంతట దఱియరాఁగ
నెలమితో నొకనాఁడు మహీశుఁ జేరి
గూఢచారుఁ డొకండు డాఁ గొంకి కొంకి
పలికె జోహా రొనర్చుచు భయము మిగుల. 1
క. జననాథ! నేఁడు ప్రోలం, జనియించిన వార్త లిపుడు సర్వముఁ దెలి
య్వనివచ్చినాఁడఁ దెలుప, న్మనమున శంకింతు ననిన మను జేశుఁడను
చ. మనమున భీతి దక్కి మనుమానముఁ జెందకు మెట్టివార్త లై
నను వినుపింపుమా యనిన నాథునితోఁడుత గూఢచారుఁ డి
ట్లనుఁ బురిలో వధూజనము లంతట నింతట గుంపు గుంపులై
మనబసవన్నఁ జేరుకొని మాటికి ని ట్లనసాగి రెంతయున్. 1
క. బండారితోడఁబుట్టువు, నిండిన యశ మెల్ల వరదనీటఁ గలిపి తా
వెండిలిగాకటము న్నై, యుండె న్గర్భమున లజ్జ నొం దెడుమదితో
మ. బసవామాత్యుఁడు శైలజారమణసద్భక్తాగ్రగణ్యుండ సి
వ్వసుధ న్నా కెదు రెందు నెవ్వరను గర్వస్ఫూర్తినో తోడఁబు
ట్టు సరోజానన వీడఁజాలకయొ మూఢుండై మనోవీథి సా
ధ్వసముం జెందక రంకు గల్పుకొనె నెంత ల్పుట్టెనివ్వేటిలోన్. 1
ఉ. ఏమనవచ్చు నింక నని యింతులు కొందఱు వక్కి నంతలో

తామరసాయతాక్షులు విదగ్ధులు వారి నదల్చి తాళరే
యేమిటి కీకఠోరపరిహేళనవాక్యము లయ్యమాత్యుఁడే
భూమివరుండు గాన మనబోఁటికి నేటికి? మాటి కిట్లనన్. 162

తే. అనుచుఁ బెక్కువిధంబుల నాడుకొనఁగ
విని తెలుపవచ్చినాఁడ నుర్వీకళత్ర!
యనిన నౌఁ గాక యని వాని ననిచి నృపతి
తనమనంబున ని ట్లని తలఁచె నపుడు. 163

ఆ. బసవఁ డిట్టికలుషబద్ధుఁడై యుండుట
తెలిసి యూరకునికి వలనుగాదు
వసుధలోన సకలవర్ణాశ్రమాచార
సరణు లెల్లఁ జనవు పరుసతోడ. 164

క. సకలమెఱుఁగు 'రాజా రాష్ట్రకృతం పాపం' బటంచుఁ జదువులు భువిలోఁ
బ్రకటింపఁ దెలసి నేనూరక యుండుట చనునె యనుచు రభసముతోడన్.

ఉ. కంచుకి నొక్కనిం బిలిచి గ్రక్కున నేగి ప్రధానుఁ దోడి తె
మ్మంచు ననుజ్ఞ యిచ్చినఁ దదాజ్ఞ శిరంబునఁ దాల్చి వేగ యే
తెంచి వినమ్రుఁడై బసవధీమణి! సద్వినయం బెలర్ప రా
జంచితలీల ని న్బిలువ నంపిన వచ్చితి నంచుఁ దెల్పినన్. 166

క. ఘనుఁడగు నబ్బసవాగ్రణి, తనపరివారంబు గొలువఁ దగుఠీవి మెయిన్
జనిధరణీనాథుఁ గనుం, గొని యుచితాసనమునందుఁ గూర్చున్న యెడన్.

చ. కనుగవ కెంపు నింప నలుకన్ బసవేశునిఁ జూచి బిజ్జలుం
డనియెఁ బ్రధానశేఖరుఁడవై నుతిగాంచుట వన్నె కెక్కె యి
ట్లనుచితవృత్తిఁ గిం దగిలి యగ్రజచీఁకటితప్పు నైనఁ గూ
డునె కులశీలమానములు డొంకి చనన్ ధరణీతలంబునన్. 168

క. బలయుతులము మాకేమని, నలుగురిలో నిందఁ జెంద న్యాయమె మిమ్ముం
గలసి వసించుట మాకుం, జలకనయగుఁ గన్నె కెట్లు చూలయ్యె? ననన్.

మ. ధరణీకాంతునిఁ జూచి యి ట్లనియెఁ శాంతస్వాంతుఁడై కల్మషా
కరవాక్యంబుల లాభమే మిటకు నాకం జాతి దప్పింతు దు
ర్భరగర్భస్థితి దానినే యడుగుఁ డేర్పాటయ్యెడు న్నీకు నం
చు రయం బొప్పఁగ బిజ్జలానుమతిచేఁ జోద్యంబుగా నత్తఱిన్. 170

చ. తన కగు నాప్తు నొక్కరుని దా దరి జేరగ బిల్చి నీవు వే
చని యిట కక్కనాగమను జయ్యన దోడ్కొని ర మ్మటన్న న
య్యనఘచరిత్రు డేగి సతియంఘ్రులకుం ధర జాగి మ్రొక్కి మీ
యనుజుడు ధారుణీపతి సభాంతరమందున నుండి చెచ్చెరన్. 171

చ. అచటికి నిన్ను దోడ్కొని రయమ్మున ర మ్మని పంప వచ్చితిన్
విచికిలగంధి! యంచు సభవృత్తము లెల్ల నెఱుంగ జెప్పగా
నచలితచిత్తయై గురుపదాబ్జము లాత్మ ఘటించి మ్రొక్కి భ
క్తచయదయాకటాక్షమున దార్కొను వేగ శుభంబులం చొగిన్.

క. మేలగు సన్మణిఖచితాం, దోలికలో నెక్కి సఖులు తో నడువగ న
బ్బాలామణి బిజ్జలుని స, భాలయ మటుచేరి యంతికావని నుండెన్.

క. అప్పుడు గోత్రాకాంతుం, డప్పావనిజూచి యజ్ఞుడై యాహా!య్యా
యొప్పులకుప్పకు జెప్పగ,జొప్పడని గుణంబు పుట్టె క్షోణీస్థలిపై.

ఉ. పాపుబ్రహ్మవ్రాత నగుపద్ధతి దప్ప దటంచు నెంచి యా
భూపపురందరుం డనియె బోల్తుక! పెండిలి లేనియట్టి నీ
వేపగిదిన్ సగర్భ వయి తేర్పడ జెప్పు మటన్న భూమిభృ
చ్చాపపటంబు లాత్మ నిడి సాధ్వివధ రాధిపుతోడ ని ట్లనున్. 175

క. ఏకర్మం బెఱుగని నే, నేకైవడి దెలుప నేర్తు? నీగర్భస్థుం
డా కొమరుమిగులు శిశువుం,బ్రాకటముగనడుగనాత్మపద్ధతి దెలుపున్.

చ. అన విని విస్మయాన్వితహృదంబుజు డై ధరణీశు డెన్నడున్
విననియపూర్వవాక్యములు వింటిమి యీసతిపల్కు లెట్టు లై
నను గనుగొంద మంచు జెఱున వ్వాలయన్ సభవార లబ్బురం
బని వినుచుండ ని ట్లనియె నప్పుడు పెద్దయెలుంగున న్వడిన్. 177

వ. తద్గర్భాంతరార్భకు నుద్దేశించి. 178

ఉ. ఓహో! యీసతిగర్భదేశమున నేయోజం బ్రవేశించి తీ
వ్యాహారంబు వినంగ నీసభజనుల్ వాంఛించియున్నా రనన్
నీహారాచలకన్యకారమణపన్నీ రేజభక్తుండు కో
ధాహంకారమదాదిదూరుడగు కక్కయ్యాఖ్యభాస్వత్కృపన్. 179

క. ఈనాగాంబ గ్రహించిన, మానితదివ్యప్రసాదమహిమమువలనన్
నేనంగకలన జెందితి, భూనాథ! యటంచు శిశువుపాలుపుగ దెలుపన్.

చ. విని సభవార లెల్ల నతివిస్మయ మందఁగ రాజు నెమ్మనం
బున నభవాంశుజాతుఁ డని బుద్ధి నెఱింగియు డింభకావలో
కనకుతుకంబుచే నమరి క్రమ్మఱ సిట్లని యెంతె ద్వాదియద
ర్శన మొనరింప మా కిపుడు చాలఁగఁ వేడుక యయ్యెఁ గావునన్.

చెన్నబసవేశ్వరావతారఘట్టము.

ఉ. తాపకదర్శనం బొసఁగి ధన్యులఁజేయు మటంచు వేఁడ న
ర్భావరవాక్యముల్ విని యపూర్వమహానుహిమంబుఁ జూపఁగం
భావమునం దలంచి హరుపాదము లాత్మ ఘటించి నాగమాం
బావరగర్భసంగతకుమారుఁడు భూరిగుణాఢ్యుఁ డయ్యెడన్. 182

ఆ. తల్లికంటె నితరదైవంబు లేదని, సకలవేదసమితి చాటుఁ గాన
నట్టితల్లిబ్రాసనాయాస మొందింప, దలవదనుచునొకయుపాయమెంచి.

చ. సురుచిరలీలదేహ మతిసూక్ష్మముగా నొనరించి దూపకో
త్కరముల వాక్ప్రబంధములు గాఁగ మెఱుంగువిధంబునం దిగం
తరగతతేజుఁ డై జననిదక్షిణకర్ణము నిర్గమించి సుం
దరతను వొప్పఁగా నిలిచె ధారుణినాథునియంతికంబునన్. 184

క. అలరుల సోనలు గురిసెఁ, దెలివిం జెలువొంది సకలదిక్కులు దలమై
నెలకొనుచు దేవదుందుభు, లొలసెఁ నాగాంబికాత్మజోదయవేళన్.

ఆ. అపుడు తత్కుమారుఁ డంబికాంఘ్రులకు న
మస్కరించి తదనుమతిని బసవ
దండనాయకునిపదంబుల కెఱఁగిన
లేవనెత్తి కౌఁగిలించుకొన్న. 186

తే. ఫాలమున భూతి ధరియించి ప్రణవసహిత
శైవపంచాక్షరము కర్ణశష్కులికను
జొనిపి వరదివ్యలింగయుక్తునిగఁ జేసి
శిష్యునిగఁ జేయుకతన రోచిష్ణుఁ డగుచు. 187

తే. పదియు రెం డేండ్లబాలుఁ డై యెదుర నిలిచి
వెలయు డింభకుఁ గాంచి యుర్వీవిభుండు
నిరుపమాద్భుతమందాక్షుభరితుఁ డగుచు
నాత్మలోపల నవ్వు డిట్టు లనుచుఁ దలఁచె. 188

చ. కులుచఁదనంబు వచ్చు నని కొంకు వహింపక నిర్మలాత్ముఁ డై
వఱలినయట్టి శ్రీబసవవల్లభుసన్మహిమంబు ముందుగా
నెఱిఁగి యెఱింగి యుండి యిపు డేటికిఁ గానిపరీక్ష చేసితిన్?
గొఱవిని నెత్తి గోకికొనుకూళలభంగి వివేకహీనతన్. 189

క. ఇప్పరమపవిత్రులకుఁ, జొప్పడునే యొక్క యఘము క్షోణీస్థలిపై
నెప్పాట నైనఁ జూడఁగ, నిప్పునఁ జెదలంటు నేర్చునే వివరింపన్.

చ. అనుకొని దండనాథుఁ గని యాదొర యిట్లను నీవు సత్కృపం
గనినఁ దృణంబు మేరు వగుఁ గాదనినం దృణమౌను మేరు వో
యనఘ! నుతింప శక్య మగునయ్య? భవన్మహిమంబు లంచు నొ
చ్చిన మృదుభాషల న్వినుతిచేసె జనావళి చోద్య మందఁగన్. 191

మ. కమనీయామలరత్నభూషణములుం గార్తస్వరాంభోఙిళ
త్సుమహాచ్చేలము లిచ్చె గాఢతరసంతోషాత్ముఁ డై యక్కనా
గమకుఁ శ్రీబసవాదినాథునకు లోకవ్యాప్తి సత్కీర్తిసం
గమత న్మించిన యర్భకోత్తమునకుఁ గల్యోత్సవం బొప్పఁగన్. 192

క. అంతట నాగాంబామణి, కాంతాసంఘంబు గొలువ ఘనసంతోషా
క్రాంతస్వాంతాంబుజయై, వింతగ నిజభవనమునకును విజయము చేసెన్.

సీ. బసవేశుఁ డానందభరితాంతరంగుఁ డై
రాజానుమతి చే విరాజమాన
దంతావళంబుపైఁ దనయల్లు నెక్కించి
తానును దో నెక్కి ధవళచామ
రాతపత్రంబు లనల్పంబు లై యొప్ప
భేరీమృదంగముల్ బోరుకొనఁగ
గణికాంగనానృత్యగానముల్ చెలఁగంగ
వందిమాగధులు కైవార మొసఁగఁ

తే. దఱచు చతురంగబలము క్రిక్కిఱిసి నడువ
వేత్రహస్తసాహోరవవితతి దనర
నమితమంగళాలంకృతం బైనపురము
రాజవీథుల నరిగె విభ్రాజితముగ. 194

చ. ఘనబసవేశు నర్భకుని గన్గొనెఁ బౌరనికాయ మష్ట శో
భనసహజాకృతిస్ఫురణపాటితశక్రతనూజకాములన్
వనరుహసంభవాదిసురవర్ణితదివ్యగుణాభిరాములన్
ధనదసఖాంఘ్రిసేవకహితప్రదనాములఁ గీర్తిధాములన్. 195

చ. ఎడనెడఁ గామినీమణులు హేమమయోన్నతసౌధవీథులన్
గడు ముద మొప్పఁగా నిలిచి సవ్యసుమాక్షతభవ్యలాజలిం
పడరఁగఁ జల్లి రంతట వృషాధిపుపై మఱి నాగమాంబికా
జడజముఖీతనూజుపయి సర్వజనావళి చోద్య మందఁగన్. 196

తే. జన్నిగట్టుము త్తైదువల్ జతల జతల
నిలిచి యాడాడఁ బుత్తడితళుకుఁబళ్లె
రములతో మంగళారతుల్ ప్రమద మెసఁగఁ
బట్టి యిచ్చిరి యమ్మహాభాగులకును. 197

క. విలసితమణిమయసౌధ, స్థలములపై నుండిచూచు తామరసాక్షుల్
తెలియఁగ నొండొరుతోడన్, బలికిరి పికకలనినాదపద్ధతి నిటులన్.

సీ. నలినాక్షి! యీతఁడే నాగాంబికాకర్ణసంభవుం డైనట్టి డింభకుండు
ఘనవేణి! యీతఁడే గర్భంబులో పలఁబదియు రెండేండ్లున్న బాలకుండు
మానిని! యీతఁడే మారరుద్రుఁ డై యవతార మెత్తినయర్భకుండు
చంద్రాస్య! యీతఁడే జననినిందలఁ బాపి, పతి చేతమన్ననవడయుకట్టి
తే. కంటిమిగదమ్మ కన్నులకలుపుదీఱఁ, బుట్టువులు నేఁడు సఫలతఁ బొందెఁగా దె
యనుచు నీరీతిఁ బురజనులందు నిందు, వినుతి సేయుచు నుండిరి విపి
[ధగతుఁ.

వ. మఱియును.

సీ. ద్వాదశాబ్దంబులు తల్లిగర్భములోన నుండు టేయాశ్చర్యము వినలార
యుండెఁబో తనుఁ బిల్వ మండలేశుని సభఁ బలుకు టెంతకువింత భామలార
పలికెఁబో యంతలోఁ బడఁతి కర్ణమునందుఁ బుట్టుట చిత్రంబు పాలతులార
పుట్టెఁబో తనతల్లి పొట్టనుండేండ్లతో నిలుచుట చోద్యంబు నెలఁతలార
ఆ. యీజనానుమోదుఁ డీభానుసిభతేజుఁ, డీదయాసముద్రుఁ డీశుభాంగుఁ
డీప్రసాదజనితుఁ డెంతపుణ్యాత్ముఁడో, యెన్న నేరి కశక్య మింతులార!

మ. కలికీ! శంకరభక్తులెల్లఁ బ్రమథు ల్గాకున్న నీ వింత ము
న్నలనైనన్ గనుఁగొంటిమే! యిపుడు కక్కాక్ష్యప్రసాదంబుచే

మొలచెన్ గర్భము నాగమాంబరమణి కాముగ్ధ స్వీచారింప నే
తలపుం జెంద నెఱుంగనట్టి యబలం దప్పించుటే తప్పగున్. 202

చ. పరమపవిత్రమైనసతిభావ మెఱుంగక కానిచేష్టలం
బరగెను నాగమాంబ యని పల్కితి మయ్యయొ! మున్ను నిందగా
దురితము వచ్చె నీయఘము ద్రోల్గఁ జేసెడుమార్గ మెయ్యదో
హరహర! తెల్పుమాలిన జనావళి కెక్కడిసత్యవాక్యముల్!. 203

చ. అసమశిలీముఖాంతకముదావహమూర్త్యపరావతారమౌ
బసవనితోడఁబుట్టువఁట భక్తపరేణ్యపదావలగ్న మా
నస యఁట సర్వపావనగుణంబులఁ బొల్చినఁట యట్టిసాధ్వికిన్
వసుమతిలోనవేఱ యొకవాంఛ జనించునె? యెంచిచూచినన్. 204

క. తెలియక యాడిన క్రింపటి, పలుకులవలనన్ ఘటించుపాతకమిప్పుడీ
యలఘుమహాత్ములఁ గనుటన్, దొలఁగెన్ సమసూరు ముక్తితుది మన
[కరయన్.

చ. ఇటు వినుతింపుచున్ గరము భక్తి నమస్క్రియ లొప్పఁజేయుచున్
బటుహర్మ్యమామికాముకజబంధురనాకము లాలకింపుచున్
స్ఫుటనటనాదిచోద్యములు చూచుచు నచ్చెరువొందుచుండి గ
క్కటకనివాసు లయ్యెడ వికాసమనోనలినాభిరాము లై. 206

క. ఈచందంబునఁ బురజన, లోచనపర్వంబుగాఁ జెలుగుచుం బ్రభులై
యాచకవాంఛితమొసఁగుచు, ఖేచరులు ద్భుతమునొందికీర్తింపంగన్.

ఆ. రాజ్యలక్ష్మీనివాసమై ప్రణుతికెక్కు
నిజగృహమునకుఁ జనుదెంచి నిరుపమాన
భద్రదంతావళము డిగ్గి భాగినేయు
కరము చేఁబట్టి బసవఁ డక్కజము మిగుల. 208

క. కంచుకులుపాయఁదొలఁగుము, టంచుఁబురిలోపీథినడువహర్షముతోడం
గాంచనసింహద్వారం,బంచితగతిఁజొచ్చి యరిగి యచ్చటరహిఁ జేన్.

ఉ. భర్మమణీసమంచితసభాభవనాంతరరత్నపీఠిపై
నిర్మలభావుఁడై న భగినీసుతు నుండగఁజేసి భూమిభృ
ద్ధర్మసమానమూర్తియగు తానును నందె వసించి కొంతసే
పర్మిలి సర్వచోద్యనివహమ్ములుఁ జూచుచు నుండి యంతటన్. 210

చ. నిరుపమకాంచనాంబరమణీమయభూషణసంతతిం గవీ
శ్వర బుధవర్య మౌరజిక వాంశిక వైణిక నర్తకాదులన్
సిరి దొలుకాడఁ దృప్తులుగఁ జేసి ముదంబున వారి నెల్ల మం
దిరముల కన్పి యబ్బసవధీమణి లోపలి కేగి వేడుకన్. 211

ఆ. గంగమాంబికాదికామినీమణులకు, భాగినేయుచేతఁ బ్రణుతిసల్పఁ
బనిచి యప్పుడుచితపరివారయుక్తుఁడై, యొనరి యిష్టగోష్ఠినున్న వేళ.

సీ. చీరలంటినభవిఁ జీరి క్రమ్మఱవాని నసుయుక్తుఁ జేయుమాచయ్యగారు
పవడు చేపట్టి మేల్పసిఁడిగాఁ జేసి ప్రఖ్యాతి కెక్కిన కలకేతవరుఁడు
శరణపదాంబువుల్ చల్లి కట్టెలు పైఁడిఁ జేయు మోళిగమార శేఖరుండు
మృడుని చేఁ బల్కించి మిత్తిపాలగు గొల్లప్రాణ మిచ్చిన కిన్నరయ్యగారు
తే. వసుధలోపల నేడునూర్వత్సరములు
వేదమితి మీఱి వర్తించు మాదిరాజు
మొదలుగాఁగల జంగమంబులు మనోజ్ఞ
భరితసంతోషులై వచ్చి రురుతరముగ. 213

ఉ. వచ్చినఁ గాంచి యబ్బసవవల్లభుఁ డందఱ కర్ఘ్య మొక్కి తో
డ్తెచ్చి సుఖాసనంబుల నతిప్రమదంబున నుంచి యల్లునిన్
మచ్చిక మీఱ వారికి నమస్కరణంబులు సల్పఁబంచి దా
హెచ్చినభక్తి నున్నెడ గణేశ్వరు లిట్లని రయ్యమాత్యుతోన్. 214

సీ. బసవ! నీమహిమంబు బ్రహ్మాదులకు నైన వర్ణింపనలవియే? వసుధలోనఁ
దఱివచ్చినపుడు ప్రత్యయములు గాన్పింపనీకె చెల్లెను గాదె నిత్యసత్య!
నీతోడఁ బుట్టువై ఖ్యాతి కెక్కిన నాగమాంబికమహిమ యేమనఁగవచ్చు
తత్కర్ణమున నద్భుతంబుగఁ బుట్టిన యిక్కుమారుని నుతియింపఁ దరమె
తే. యొరపురత్నము లన్నియు నొక్కచోటఁ
దెచ్చి కూర్చినయీశ్వరు మెచ్చవలదె
యనుచు నుతియించి మఱియు నయ్యర్భకేంద్రు
నెలమి నుద్దేశ మొనరించి యిట్టు లనిరి. 215

ఉ. ఈసుచరిత్ర మీవినయ మీయుచితజ్ఞత యీమనోజ్ఞభా
షాసముదాయ మీయచలజంగమపాదపయోజభక్తి యీ
భాసురశాంతియుం బసవభావమునందుఁ దలంచి చూచినన్

ద్రాసునఁ బెట్టి తూఁచినవిధంబున నీసరి వచ్చు మెచ్చఁగాన్. 216

సీ. శ్రీకరశివభక్తలోకపికంబుల కేధన్యచరితుండు మాధవుండు
జంగమసమున్నయచాతకాండజముల కేయనఘాత్ముండు తోయదుండు
శరణసముచ్చయచక్రవాకంబుల కేకృతార్థుండు ప్రభాకరుండు
కలితమాహేశ్వరగణచకోరంబుల కేసత్యసంధుండు హిమమయూ

తే. డట్టి యాదివ్యపురుషుని నభినుతింపఁ [ఖుఁ
గన్నులఁ గనంగ భాగ్యంబు గలిగెఁ గాదె!
యితని దర్శించుమాత్ర ముక్తిభయాన
వలచి పైకొనదే యెట్టివారినైన. 217

క. ఈవిధమున సకలావనిఁ, బావనముగఁ జేయ దుష్టపరమతశిక్షణ
గావించి భక్తిఁ బ్రోవఁగ, నావిర్భవమొందు నీమహాత్ముఁడు బసవా.

సీ. ప్రబలభక్తిజ్ఞానవైరాగ్యనిష్ఠల నీసరి గాననినిర్మలాత్ము
లీపేరఁ బిలుచుట నిఖిలభక్తాభీష్ట మైయున్న దనుచు మాచయ్యముఖ్యు
లనవుడు నాతఁ డట్లగుఁగాక మద్దేశికాజ్ఞయు నీగతి యయ్యెఁ గానఁ
గరుణమీఱలునామకరణంబు సేయుఁడు నావుడు వారలందఱును సమ్మ

తే. దాత్ములై చెన్నబసవరా జనుచు నుడువ
బసవఁ డత్యంతసంతోషభరితుఁ డగుచుఁ
జెలువు మీఱంగ జంగమంబులకు భూతి
వీడ్యములు వస్త్రభూషణవితతు లొసఁగి. 219

ఆ. దళితపాపులైన యలభక్తవర్యులుఁ
దాను నెలమితోడఁ దత్త్వగోష్ఠి
సలుపుచున్నయట్టి సమయంబునం దొక్క
ద్వారపాలకుండు వచ్చి మ్రొక్కి. 220

శా. దేవా! యొక్కవిచిత్ర మిప్పు డతిదేదీప్యప్రభారమ్యము
క్తావైడూర్యపుగంధరాశ్మముఖరత్నస్వర్ణసంయుక్తభూ
షావిద్యోతితహస్తయుగ్మమున భాస్వత్సత్వరాయాతమై
భావాశ్చర్యముగాఁ బడెన్ బడి బహిర్ద్వారప్రదేశంబునన్. 221

క. ఆకలితభూషణావళు, లాకరములు గనినశ్రీకరాకృతి దోఁచెన్
మా కెల్ల ననుఁడు బసవం, డాకాంక్షఁ బదియువీక్షణారంభుండై.

ఉ. అచ్చట నున్న భక్తనివహంబును దానును సత్వరంబుగా
వచ్చి యపూర్వశోభలఁ గనంబడు హస్తియుగంబు గాంచి లో
నచ్చెరు వంది యవ్వతిశయంబులు నెచ్చటనుండి వచ్చెనో
యిచ్చటికన్నఁ జూడఁ డొకఁ డిట్లని పల్కె నమస్కరింపుచున్. 223

చిత్రకన్యకథ.

తే. అధిప! బిజ్జలుతోఁబుట్టు వైనచిత్ర
కన్య యనునది మదనవికార మొదవ
గుజ్జముల కాఁపరిని గూడెఁ గులము నీతి
శీలమును మాన మెంచక సిగ్గుమాలి. 224

క. పెఱవాని ననుజ గూడిన, తెఱఁ గాప్తుడు పిళ్లవరదు దెలిసినచో న
క్కొఱగానిమాట చెవులకు, గొఱవింజొన్పినట్లైనఁగుం దెడునదితోన్.

క. ఏమియుఁ బలుకఁగఁ దోచక, భూమిఁగనుంగొనుచుఁ గొంతప్రొద్దుండి విభుం
డా ధన్యునితో ననునా, హా! మానిని యెంతసాహసాత్మక యయ్యెన్.

చ. సకలుషవైయె విధుల్ విడిచి సాధ్వసమర్మము లుజ్జగించి బం
ధుకులము విన్నఁ దన్ను వెలిదోయియు నటన్న భయంబు మాని యీ
సఖి యొకయన్యమానవునిసఖ్య మొనర్చెఁ గదే పయోజజా
తక్రుతముఁ బాయఁగాఁ దరమె ధారుణిలోపల నెట్టివారికిన్. 227

చ. అని మఱి యిట్లు పల్కు బసవాధిపుసోదరి నేనునింద చే
సినఫల మూరకే చనక చేకుఱు నా కిఁకఁ దోడుతోడునన్
మ్మనసిజవైరికాంత కైన నాఁ జనుతత్ప్రశి నట్లు పల్కఁ గాఁ
జనునె యెఱుంగనైతిఁ గడచన్నపనుల్ నుడువంగ నేటికిన్. 228

చ. నలుగురు నింద చేసినను నవ్వఁగ నేకరణిన్ సహింతు న
క్కలుషమనస్కు మో మెటులఁ గన్గొనఁజాలుదు నంచుఁ గోప ము
గ్గలముగఁ బూని గుజ్జములకాఁపరిఁ గొట్టున నేయఁ జంపి లో
పలికి నయంబు మీఱఁ జని భావము గొల్వ వసింపుచెల్లెలిన్. 229

చ. కనుఁగొని మోమునన్ వెనుక గానఁగనీయక నాతి యిందు ర
మ్మని సఖి నేకతంబ భవనాంతరసీమను మెల్ల మెల్లఁ దో
డ్కొని చని దాను మున్నట నికాధత నిల్చిన నిల్చినారెకుల్
గనుకని మ్రొక్కి భూధవుఁడు కామిని వారికిఁ జూపి యిట్లనున్.

క. ఈవనితం గొనిచని విపినావనితలమందు నొక్కయసియంత్రముపై
వైవ్రఁడుతుత్తునియలుగా, నావుడు నేఁగాకయనుచు నతులైనంతన్.

చ. చెలియలిదిక్కు గన్గొనక చెచ్చెర నవ్వలి కాతఁ డేగినన్ .
దలవరు లంతటం దరుణి నవ్వలకుం గొనిపోయి చంపఁగాఁ
దలఁచి తదీయరూపమును దైన్యమునుం గని సంహరింపఁ జే
తులు వెస రాక యిట్లనిరి దుఃఖితమానసు లౌచు నొండొరుల్. 232

సీ. అక్కటా! శుద్ధాంతమందు నుండెడుతన్వికశ్వపాలకసఖ్య మబ్బె నెట్లు
కట్టనుఁ జెల్లెలిఁ బట్టిచంపు మనంగ నాలుక యెట్లాడె నరవరునకు
మిగులసౌఖ్యాన్విత యగురాజసుందరికీగతిపరమేష్ఠి యొచటవ్రాసె
నబలఁ జంపఁగఁ గూడ దసిరాజుతోఁ దెల్పిమతిమంతు లెవ్వరు మాన్పరైరి

తే. దైవ మిటు తప్పఁ జూచినతఱి మఱెవ్వ
రెంత చింత యొనర్చిన నేమిగలదు
కఠినుఁడగు రాజుఁ గొలిచినకతన నిట్లు
గోరి వధియింపఁగా నియ్యకొనఁగవలసె. 233

క. అని వగచి వగచి విభుపం, పొనరింపక తీరదనుచు నొకయసియంత్రం
బునవైచి చనిరి చెలితు, త్తునియలగుచునవని మీఁదవోరుఁగఁగనంతన్.

క. మారుతరయమునదత్కర, వారిజములువచ్చియిచటవ్రాలెనటంచున్
జాముఁడు దెల్పిన బసవఁడ, వారితవిస్మయనియుక్తభావుం డయ్యెన్.

ఉ. అప్పుడు మిండజంగమను లచ్చెరు వందు చయారె చేతులే
యిప్పగిదిం వసించె మఱి యీకరముల్ గలయింతిరూప మే
చొప్పున నుండునో యిపుడు చూడఁగనొఁగద యంచుఁ గోరికల్
విప్పు దలిర్పఁగా బసవవీరునిఁ గన్గొని పల్కి రంతయున్. 236

మ. బసవాధీశ్వర! యీకరద్వయమునన్ భాసిల్లుపద్మాక్షినిం
బెనఁగంజూడఁగ వాంఛ చెందినది మాయిష్టంబు చేకూర్చి త
ద్బిసజాతానన నెవ్విధిన్ సనిచి ప్రీతిం జూపవే యిప్పుడో
యసమాస్త్రామితగర్వనిర్దళనపాదాబ్జాతపుష్పంధయా ! 237

చ. వలచినవాంఛితం బొసఁగి వారవధూజనతామనోజ్ఞలీ
లలఁ జరియింపఁబంచి మము లాలనసేయుట కెల్ల మూలమై
ఘులరుగదయ్య మామనవి యాత్మఘటింపుచు నీప్రయోజనం

బెలమి నొనర్చితేని యని హెచ్చగువేడ్కల వేఁడునంతటన్. 233

సీ. భక్తు లెయ్యది వేఁడఁ బ్రత్యుత్తరంబీక
  యొసఁగు నేమము గాన బసవమంత్రి
తనతోడ మున్నుఁ దెల్పినచారుఁ బిల్చి నీ
  వరిగి వేగంబ తదంగనాంగ
శకలంబు లన్నియు సమకూర్చి కొనిరమ్ము
  నావుడుఁ జని విపినంబులోన
నాడాడఁ బడియున్న యత్తున్క లన్నియు
  జతఁ జేసికొని వచ్చి సచివమౌళి
తే. యెదుట నుంచిన చారుని యిష్ట మొసఁగి
శరణసందోహమున కెల్లఁ జాఁగి మ్రొక్కి
సంగమేశ్వరు మదిలోన సంస్మరించి
యతులలింగవసాయతహస్తుఁ డగుచు. 239

తే. వెలఁదితనుఖండచయములు వేఱువేఱ
నేర్చి యంగాంగములు జతఁగూర్చి యచటి
భక్తపాదాంబువులు దానిపైని జల్లి
యించుక విభూతిఁ గొని చిలికించుటయును. 240

తే. తత్పదాంభోజజలము సంధానకరణి
పావనంబగు తద్భూతి జీవకరణి
యైన నిద్దుర మేల్కొను నట్లుగాఁగఁ
జిత్రకన్యక యపుడ సజీవ యయ్యె. 241

ఉ. మానిని మేల్కటారి వెలమావినిగుర్కొనుకొమ్మ మేలిబం
గారుమెఱుంగుతీవ రతికామినికేల వసించుచిల్క సిం
గారపుఁగ్రొవ్విరత్నపుజోకాటపుబొమ్మ యనంగ నప్పడా
వారిజగంధి నిల్చె బసవప్రభుమౌళి విలాసధుర్యయై. 242

వ. ఆసమయంబున. 243

ఉ. అక్కడ నున్నమర్త్యనివహం బతివిస్మయసంగతాత్మయై
యెక్కడ నైనఁ జూచితిమె యిట్టివిచిత్రము ఛేదితంబులై
యక్కడ నక్కడం బడినయట్టి కళేబరఖండముల్ భళీ

యొక్కటఁ గూర్చి యీబసవఁ డొప్పుగఁ జేసె సతిన్ సజీవఁగాన్.
చ. ఇతనిప్రభావముల్ గసిన నీశ్వరుఁడే యగుఁగాక మర్త్యుఁ డన్
మతి గనఁ బోలునే యనుచు మాటికి సన్నుతి సేయుచుండఁ ద
త్సతి బసవేశ్వరాంఘ్రిజలజంబులపైఁ బడి మ్రొక్కి పల్కె న
న్నతులభవత్కృపామృతరసాంబుధిఁ దేల్చి పునీతఁ జేయవే. 245
ఉ. నీకరజాత నేఁటి నతినిష్ఠురపాపభయం బణంచితిన్
బ్రాకటసౌఖ్యసంపదకుఁ బాల్పడి యుంటిఁ గాన నేక్రియం
జేకొని నన్నుఁ బ్రోచెదవొ నిర్మలచిత్త నొనర్చి ప్రోవవే
లోకనుతప్రభావ! యని లోలవిలోచన వేఁడు నంతటన్. 246
తే. బసవనామాత్యచంద్రుండు ప్రమద మెసఁగఁ
గ్రమముగా నూర్ధ్వరేతయ్యగారిచేత
లింగధారణ మపు డొనర్పంగఁ జేసి
విమలసుజ్ఞానఁ గావించు వీని పిదప. 247
సీ. అక్కలక్కక్రమ్మఱ మ్రొక్కుచు నిట్లను బసవేశ నావిన్నపంబు వినుఁడు
ధరణిపై నైవ్వనకామతముఖ్యదైవాభిధానంబుల నమరియుంట
జనవేద్యమే కాదె! సకలవిధంబుల నావేల్పు వరయంగ నీవె కాన
భవదీయనామసంప్రాప్తగా నను జేసి యవనిఁ గీర్తిఁ జేయు మనిన బసవఁ
ఆ. డఖిలశోణవరలమానసంబులు గాంచి, నవ్వ చూరకన్న నగశరాస
భక్తులతనిభావపద్ధతి బసవయ్యటంచు నామమిడిరి యబల కపుడు.
మ. అతిలీలాఁతిమై ధరం బరగునయ్యంభోజపత్రేక్షణాం
చితశోభాకలనాభిరూప్యవిలసచ్ఛృంగారముల్ గాంచి య
ద్భుత మొప్పన్ వడి వింకజంగమవరుల్ పుష్పాంబకోద్యచ్ఛరా
తతవైశ్వానరహేతికానిచయసంతప్తాత్మచేతస్కులై. 249
ఉ. అంగజకేళిఁ దేల హృదయంబులఁ గోరినవారి వాంఛితం
బంగద కూర్పఁబూని బసవాధిపుఁ డాజలజాక్షిఁ బిల్చి యీ
జంగమమూర్తులన్ గుసుమసాయకుక్రీడలోన నేలుపొ
మ్మంగన! యన్న మ్రొక్కి జలజాసితవేణి వరించె నీగతిన్. 250
క. క్షితితలమున నాఁటనతి కొక పతియుండిన యోగ్యమగుచు భాసిలుగాకే
గతిఁ దలఁప నొక్కయువతికిఁ బతిబాహుళ్యంబు యుక్తపద్ధతి యగునే.

క. మితిలేనిజంగమావళి, మతివాంఛలు తీర్పఁగా సమర్థనె నా కీ
గతి కల్పింపక కరుణో, న్నతిచే మీదాసిచేసి నను బ్రోవఁగదే.

చ. అన బసవేశుఁ డిట్లనియె నంబుజపత్త్రవిశాలనేత్ర! యి
ట్లనఁ బనిలేదు భక్తనివహమ్ములఁ గామసుఖాభిలాష లిం
పెనయఁగఁ దీర్ప నిన్ను సృజియించె శివుం డటుగానఁ జింతలం
జనకు మదీయసత్కరుణసత్త్వసమర్థత గల్గు నీ కికన్. 253

తే. పొమ్ము వారియధీనవు గమ్ము నిన్నుఁ
గ్రమ్ముకలుషమ్ములను విడఁజిమ్ము మదిని
నమ్ము నామాట మేలు చేకొమ్ము సుస్థి
రమ్ముగను ముక్తి దొరకు నిజమ్ము సుమ్ము. 254

చ. అని నవలా నొడంబఱిచి యాత్మల నువ్విళులూరుమిండభ
క్తనిచయముం గనుంగొని ముదం బలరఁ గన్గొని మీరలు వేడ్క నీశుభా
ననవలనన్ మనోబ్జముల నాటినకోరిక లెల్లఁ దీర్చికొం
డని యనుపన్ వడిం జనిరి యంగనఁ దోడ్కొని వార లందఱున్.

క. ఈకరణి వారలేగఁ గృ, పాకరుఁడగు బసవమంత్రి యద్భుతమహిమం
బాకాంక్షం గొనియాడుచుఁ, బ్రాకటమహిమాఢ్యమాదిరాజప్రముఖుల్.

తే. నాగమావలోకనమునకు హృష్టులై
యంతిపురికి వేగ నరుగువారి
నమ్మృగాక్షి చూచి హర్షంబు సద్భక్తి
దొలుకఁ వందనములు సలుపునంత. 257

క. వనజాక్షిభక్తివైరా, గ్యనియమమహాత్మ్యనిష్ఠ లాత్మలకు ముదం
బొనరింపఁ బెక్కువిధుల, న్వినుతింపుచు నొక్కహర్మ్యవిమలతలమునన్.

చ. బసవనితో సమస్తశివభక్తనికాయము మతిప్రమోదహృ
ద్బిసరుహయుక్తమై మహిమ నెంతె ప్రసంగన్ సభ దీర్చియుండె నిం
పెసఁగ హిమాపనీధనసుతేశ్వరసంగతమై నిరంతరో
ల్లసనము నొందునా ప్రమథులం బురుణించి విలాససంపదన్. 259

న. అని చెప్పినఁ గుంభసంభవుం డవ్వలికథ యెఱింగింపు మనుటయు.

మ. మిహికాపార్యసమానధైర్య! మధురామేయాబ్జసౌందర్య! పూ
ర్వహరిద్రాజితధైర్య! శౌర్యఘనపారావారగాంభీర్య! దు

స్పృహ తేజోజితసూర్య! భాసురమనీషాదేవతాచార్య! వే
దహాయాంఘ్రిద్వయసంతతార్చనకళాతాత్పర్య! వీర్యోన్నతా!. 261

క. లబ్ధనికాయవిదూరా!, యబ్ధిసమగభీర వైరిహరణవిచారా!
లబ్ధశివాచారా! ప్రా, రబ్ధసుకృతభవశరీర! రమ్యాకారా! 262

తోటకవృత్తము. శ్రీకరబంధువశీకరచర్యా!, ప్రాకటభూపరిపాలనధుర్యా!
లోకనుతేశశిలోచ్చయధైర్యా!, భీకరశత్రువిభేదనశౌర్యా!. 263

గద్య. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్ష లబ్ధకవితామాధురీ
ధురీణ కౌశికగోత్రపవిత్రకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన
చెన్నబసవపురాణంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము



# ద్వితీయాశ్వాసము.





మద్భ్రమరాంబాహృ
త్తామరసవిహారషట్పదమల్లేశ
స్వామికృపాలబ్ధశుభ
స్తోమా శ్రీయమృతలింగశోభననామా. 1

వ. అవధరింపు మయ్యగస్త్యమునీంద్రునకు రేణుకగణాధీశ్వరుండు తరు
వాతివృత్తాంతం బిట్లని చెప్పందొడంగె. 2

చ. అటు వసియించు భక్తనిచయంబులు జంగమసత్ప్రసాదవి
స్ఫుటమహిమల్ వినం దివిరి ఘోరతమూర్తి దిగంతపూరితో
త్కటనిజకీర్తియై వెలసి ధన్యతం జెందిన మాదిరాజు హృ
జ్జటిలముదంబునం గని రసస్ఫురితోక్తులం బల్కె నీగతిన్. 3

మ. అనఘా! శైవరహస్యముల్ భవదభివ్యక్తంబులై యుండుం గా
వున శ్రీజంగమసత్ప్రసాదమహిమంబుల్ దెల్పి రక్షింపవే!
యన నాథన్యుండు మున్ను మీకరుణ నాద్యంబైన భక్తాళిచే
వినినట్లే వచియింతు నంచుం బలికెన్ విస్పష్ట మౌనట్లుగాన్. 4

తే. అమృతసంధాయకంబయి యప్సరశ్ప్ర, పూర్ణమై మత్తసారంగకీర్ణమై చ
రన్మరుద్వారగంధర్వరాజమగుచు, నతిశయిల్లె శ్రీజీమూతమవనియందు.

వ. తద్గిరీంద్రంబున. 6

మ. అకలంకోజ్జ్వలమల్లికార్జుననుతివ్యాహారయుక్శారికా
శుకముఖ్యాండజనాథసంశ్రుతిముదస్తోకప్రరోమాంచకం
చుకదేవర్షినివాసదేశవిలసచ్ఛోభావహచ్ఛాయద
ప్రకటామ్లాదిమహీజమౌ కదళికారణ్యంబునం దొక్కచోన్. 7

## గంధర్వునికథ.

క. కమలాధివాసవిలస, త్కమలాసవపాయిభసలకమనీయంబుల్
గమలీకకిరణశీతల, కమలంబగు నొక్కకొలనుగడువెలుఁగొందున్.

క. తత్తీరంబునఁ గంధ,ర్వోత్తముఁ డచలుండునై మహోక్షతురంగుం
జిత్తమునం దిడిసురముని, సత్తములగ్గింపఁ దపముసల్పుచునుండెన్. 9

ఉ. అంతట నొక్కనాఁడు నిటలాక్షపదార్చకు లాంజపంజప
భ్రాంతివిదూరు లంతరచరద్రిపుదూరులు యోగమార్గవి
శ్రాంతులు పంచవర్ణమనుజాధిపమూర్తులు నైనశాంతుఁ డే
కాంతుఁ డనంగ నిద్దఱుమహాత్ములు శ్రీగిరి సంచరించుచున్. 10

తే. అచటి జంగమదివ్యగేహంబులందు
మాధుకరభిక్షఁగొని శివారాధనంబుఁ
జేసి భుజియింత మనుచు విలాస మలరఁ
దత్సరోవరతీరంబు దఱియ నేగి. 11

సీ. విమలమానొకచోఁ బ్రవేశించి తద్భక్తమంబులఁగడిగిపాత్రంబులందు
నించియోంకారయుక్పంచాక్షరీమంత్రపూజితలో పేతభూతిఁ జల్లి
యిష్టలింగార్చన నెలమితో నొనరించి యర్పితంబగు తన్మహాప్రసాద
మొదటికడికడికగపఱచుచుభుజింపుచు లింగయోగవిస్ఫూర్తినున్న

తే. వారలను దత్సమీపనివాసమందుఁ
దపము సల్పుచునున్న గంధర్వవిభుఁడు
వీక్షణము చేసి తచ్చర్య వెగటు దోఁప
నిట్టు లని పల్కె నజ్ఞానహృదయుఁ డగుచు. 12

చ. శివు ధరియించి సంతతము శ్రీపరబాణునిఁ బూన్చి యాత్మసం
భవహరుఁ జిత్తమందు నిడి ఫాలవిలోచనలాంఛనంబు లే
యవిరళభక్తిఁ దాల్చి ఘను లౌ నన వర్తిలు మీర లీగతిన్
సవనవిరోధి కెంగిలిప్రసాదము కొంకక యిచ్చు టొప్పునే. 13

క. నరు లెవ్వరైన మీగతి, హరునకు నిటుభుక్తశేష మర్పించుట యీ
ధరణీతలమునఁ గలదే, దురితాత్మకులార యనుచు దూషించుటయున్.

మ. విని కోపజ్వాలనావృతాత్ముఁ డగుచున్ వేగంబ గంధర్వునిం
గని యోమూఢ! మహాప్రసాద మెఱుఁగంగా లేక యుచ్ఛిష్టభా

వన దూషించితి గాన నీయఘము పోవం జాలఁ దేవెంట నీ
ఘనతేజం బఱ గ్రామసూకరపుమేన్ గైకొమ్ము పొమ్మిం కిటన్. 15

చ. అనవుడు భీతి నొంది వినయంబున నిట్లనుఁ గేలు మోడ్చి యో
యనఘతరాత్ములార ! తెలియం గనకే నిము నాడినట్టి దు
ర్వినయవచఃఫలం బనుభవింపక తీఱునె యింక శాపమో
చన మెటు లయ్యెడున్ దెలిపి సంతస మందఁగఁ జేయరే! యనన్. 16

ఉ. కోపము మాని యిట్లనిరి కొన్ని దినంబులు ధారుణీస్థలిం
బ్రాపితపోత్రిరూపమునఁ బర్యటనం బొనరింపుచుండి రు
ద్రాపరమూర్తియైన శరణాగ్రణి దించుప్రసాదసేవఁ ద
చ్ఛాపము వీడి హేమగిరిచాపునిప్రాపునఁ జేరె దెట్లనన్. 17

తే. అమృతసంపాదకంబుఘోరాఘమోచ, నాదికారణమైనదివ్యప్రసాద
మేవగింపఁగవచ్చినయేనఁతర, గతిఁ జెడదుతత్ప్రసాదభోగమునఁగాని.

క. అని జంగమవరులానఁగిన, ఘనశాపాక్రాంతుఁడగుచుగంధర్వుఁడుశో
భనసిజరూపముగోల్పడి, కొనియంతక్షణమ గ్రామకోలమురూపున్.

చ. కొఱకొఱ లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్వడిలోడ నోరగాఁ
బిఱిఁదికిఁ జూచుచున్ గడుపు వేగున సంకరగాఁగఁ బోవుచున్
గఱకఱ పండ్లు గీటుచు నగంబడి ముట్టెను దుంగము స్రైలం
దెఱలిచి మేయుచున్ బొదలతీఁగల దాఁగుచు నేగె జాగునన్. 20

క. ఈకరణిం జనిచని యూ, సూకర మూరూపఁదిరుగుచుంజనుచును శో
భాకలన ధరిత్రి లస, న్నాకంబగు విజయవాటినగరము చేరెన్. 21

తే. ఆపురంబున నెపుడు దంపుఁ గాపురంబు
నెఱుకకులమున జనియించుఁ బెరుకుపుండ్ర
పామరుం డనఁ గలఁ డొకపామరుండు
సకలకర్మసుగుణరాశి సత్యరాశి. 22

వ. వానియాలు బండంగి యనునది. 23

బండంగి కథ.

సీ. సం దెఱింగినదొంగ సాటెనగొట్టు పిసాసి దిమ్మరి బెరజముబటాని
తచ్చనగొండి పోతరకత్తె కల్లరి వల్లింత మాయలబెల్లి కటికి

నక్కచిక్కులమారి పెక్కురరూపిదూబరదిండిబోంకులచాన మొండి
బొజుఁగులాఁడిలడారి బిల్లిపల్లాకిజూదరియబ్బెరాసిగాతలకోటూరు

ఆ. మగనికంటినెఱసు వగలాఁడి శివసత్తి
బలుగయాళి ఘోరగుపాలిజాలి
మందులాఁడి చెడుగుమానిసి బూతంబు
పిసిఁడి బిచ్చగాండ్ల వెన్నుగుడియ. 24

ఆ. అట్టివారి యింట నలుతగా నున్నట్టి
పెరటిపంచలోన గుఱుకు లిడుచు
నచట నచటఁ దిరిగి యల పంపి యలపంది
పందియున్నఁ బుండ్రపామరుండు. 25

చ. కని సతిఁ బిల్చి యిక్కటిని గాంచిసి చూచితె యన్న! డిప్పరిక్
గనుఁగొను పందిగా దిది దినంబును గంజియుఁ గాటఁ బోసి పెం
చిననిటనుండు నంచుఁ బతి చెప్పిన సంతసమందిదాని నో
య్యనఁ దరిఁ జేరఁ బిల్చి పులియంబలి యించుక వోసె మూఁకుటన్.

ఆ. అంబకళము ద్రావి యది మొద లాపంది
యెచటి కరుగఁబోక యెఱుకునింట
గంజికడుగుచేతఁ గడుపు నింపుచుఁ గొంత
కాలముండె జాతిగతుల నంత. 27

సీ. శివరాత్రికతిభక్తి శ్రీశైల వల్లభుఁ గనువేడ్కవృద్ధజంగమ మొకండు
చనిచని బెజవాడ సాయంతనమునకుఁ జేరి పేరాఁకటిచిచ్చు పేతఁ
బడలేక భిక్షుకై భవభక్తభవనంబు లెచ్చోటఁ గల వని వచ్చివచ్చి
యెఱుఁగఁజాలక యిది కఱకంఠుభక్తమందిర మని పుండ్రపామరుని [యింటి

తే. కరిగి తద్ద్వారదేశమునందు నిల్చి
ఘంటవాయించి తోడ శంఖంబు నొత్తి
భిక్ష యనవుడు బండంగి విని యడంప
రానికోపంబునను మందిరంబు వెడలి. 28

సీ. కనుఁగొనె వళులఁ గ్రమ్మినమేను వాలిన
కనుబొమల్ లోఁతులౌ కనులదోయి

వణఁకెడుశిరమును బెణఁకెడు గమనంబు
    భగ్నదంతావళి పక్కకంతి
జొల్లుగారెడు నోరు తెల్లనిగడ్డంబు
    తెగనిశ్లేష్మంబుచేఁ దగులుమాట
వెన్నంటు డొక్కయు సన్నపుఁజేగోల
    పొడిపగ్గు కాకిచూపులును మఱియు

తే. జడలు కఱపాల గొడుగు జీర్ణపుగంప
చెవులఁ దగులుబడఁగ చింపిగోఁచి
యెదను శివనిసెజ్జ రుదురాకలును బూది
యమరు ముసలిజంగమయ్య నపుడు. 29

చ. కనుఁగొని డాయ వచ్చి శునకంబువిధంబునఁ గక్కరించి యి
ట్లను నను నొంటి నుంటఁ గని యద్దమరాతిరికాడ బిచ్చముం
గొనుసెప మూని వేఱొకటి గోరిటు వచ్చినజాడ దోఁచె నా
పెనిమిటిఁ గన్న నిన్నిడుమ పెట్టక యూరక పోవనిచ్చునే?. 30

ఉ. కల్లరులైన యాపొరుగుకాంత లెఱింగిన గేలి సేయుచుం
దొల్లిటివైర మెంచి పతితో వినుపింపక పోవ రంతతోఁ
జెల్లును నాదుకాఁపురము చిక్కిన నీకును భంగపాటగుం
దెల్లముగాఁగ నింక నిట ద్రిమ్మరఁ గూడదు పొమ్ము క్రమ్మఱన్. 31

క. అనియది యాడినమాటలు, విని జంగమమూర్తి మదికి వెగటుగఁ దోఁపం
గనలి శివాయని కర్ణము, లనుగరములఁ జేర్చి చదికిలంబడి యనియెన్.

ఉ. అక్కట! యిట్టు లాడఁ దగునమ్మ? నర్హతఁ గామచారియౌ
తెక్కలికాని నాడుపగిదిన్; సిరిగట్టునివాసుఁ గొల్వఁ బె
న్మక్కువ నేగుచో జనసమాజము చూడఁగ లేక యాఁకటన్
జిక్కటచేత భిక్షుకయి చేరితి నీగృహసీమ కోమలీ!. 33

ఉ. కాలము సర్వముం గడచి కార్శ్యము మేనునఁ జెంది వృద్ధుఁనై
కాలు కదల్పలేని ననుఁ గామవికారి యటన్న నవ్వారే ?
యేల ప్రథానులాపముల నేచఁగ బిచ్చము తెచ్చిపెట్టినం
జాలు మఱేమియున్ వలదు నావుడుఁ గోపముతోడ నిట్లనున్. 34

క. ముని మని దప్పెనొ పైత్యము
గదిరెనొ యటుగాక యుమెతకాయ నమలితొ
మదనారిభక్తవర్యుల
సదనములనుఁ గాక యిటకుఁ జనుదే నగునే?. 35

వ. అనిన నతం డిట్లనియె. 36

తే. నెలఁత! నీ వనుమాటయే నిజముగాని
మాకుఁ గల దొక్కవ్రత మేరిమందిరమున
మునుపు వేఁడితి నచటన గొనఁగవలయుఁ
గాన దగుభిక్ష పెట్టుము గడప వలదు. 37

క. నాపుడుఁగామినియిట్లను, మావంగడమందు జంగమములకు బిచ్చం
బానంతపెట్టనొప్పదు, నీవెఱ్ఱితనంబు మాని నిలువక చనుమా. 38

ఆ. అనినజంగమయ్యయని మొదొల్లిటివారి, చర్యలెల్లసూరసాని మొదలు
శైవవరులు పూజసేయుటచేఁ గాదె?, యిహపరార్థసిద్ధు లెల్లఁగనిరి.

క. కావున జంగమవర్యుల, సేవించుటవలనఁ గీడు చెందుట గలదే?
కేవలపాపపువాక్యము, లీపిధి జను లెవ్వరైన నిల నన గలరే? 40

చ. అన విని క్రోధఘూర్ణితనిజాననయై శివసత్తికై వడిన్
విన వెగటైన పల్కు లివియే యన నేటికి? వారిచాడ్పునన్
ఘనమగు కొల్చుగాదియలు గల్గినవారము గాము విన్నకే
చను మిఁక నిల్చితేని వెలుచన్ నినుఁ గొట్టక మాన గట్టిగన్. 41

ఆ. ఆఁకటను బోవఁజాలవే నంగడింట, గంటతొకట్టుగానుంచికడుపునింపఁ
గుడుపుమిచ్చుటనీడ్డిలఁబడి తెలారు, దాఁకనొరలినఁగలుగదుతథ్యము

చ. అడిగినచోట భిక్షఁ గొనునట్టివ్రతంబున నొంసుచోట నే [సిన.
నడుగఁగఁబోదునే! తగినయట్టు లొసంగకపోవరా నవన్
జెడుఁగుపిసాసి బల్లుదియ చేకొని జంగమునా ప్మంచుఁ బొ
న్వాడిఁ గదియంగఁ బోవృతజినాతిమగం డరుదెంచి చెప్పఁరన్. 43

ఉ. కోమలి! యేల భిక్షుకుని గొట్టఁగఁ బోయెద నన్న నాథుతోఁ
గామిని పల్కునట్టి తెరి గాఁ డనిన న్వాని పోక భిక్షుకై
గాము తెఱంగునన్ దగిలెఁ గావునఁ గొట్టక మాన నన్న న
ప్పామరుఁ డాలితో నిటులఁ బల్కె దయారసముపేతచిత్తుఁడై. 44

ఆ. వృద్ధు వేళగానివేళ నాఁకట డస్సి, వచ్చినాఁడు గాన వలదు గడుపఁ
గలుగుకొలఁది పెట్టుమలుక యేమిటికిటు,లనినవిభుసిపల్కు లరుచిదోఁప.

ఉ. ఈనడుపీనుఁ గెక్కడఁడ మఱెవ్వరిఁ గానక వచ్చె నంచుఁ గో
పానన యాచు నెక్కడివ్యయం బరుదెంచె నటంచు సాధు లో
లోన గొణంగి తిట్టుచు విలోలతఁ దోఁచక సంచరించుచుఁ
దా నిటు కొంతపొద్దుఁ గడుతల్లడ మంది యొకింత కిన్కతోఁ

ఆ. తనదుప్రాఁతమగఁడు మనిన నాఁ శోకమూల
దొంతిసందలోన దొంగతనము
దనర డాఁచినట్టి తమిదెపిండి యొకింత
పెట్టి పొమ్మటన్న భిక్షుకుండు. 47

సీ. అఖిలంబు నెఱుఁగ 'క్షుధాతురాణాం న రు
చి ర్న పక్వం' బనఁ జెల్లుఁ గాన
నాఁకటిపెల్లున నప్పిండియంతయు
నతివేగమునఁ గొని యాత్మలింగ
మునకు నివేదనం బొనరించి యించుక
యారగింపం బోడియగుటఁ గుతుక
కడ్డమై యవ్వలి కరుగక యున్న నా
ర్పెడలమిఁ గేల నె త్తడఁచి కొనుచు

తే. డిల్లపడి యిలపై బొరగిల్లి కొంత
తడవునకు లేచి కూర్చుండి దరిన నిల్చు
నెఱుకుజవరాలిఁ గనుఁగొని యెలుఁగు రాక
సన్నముగ నిట్టు లనియెఁ దజ్జంగముండు 48

క. కనుఁగొనిన మఱికసహ్యత, వని పెడియాపాఁతసున్ని తగ నాకై డాఁ
చినదానవెచాలుసుమా,యనిముగిలిన వచటనుసిచియతఁ దేగ వెసన్.

చ. అనఘుతరాత్ముఁ డి ట్లరుగ నంతట నక్కలుపాత్మ యా ప్త లై
తనరెడికాంతలం బిలిచి తామరసాయతనేత్రులార! నా
పెనిమిటి సేయుడండుగము వింటిరె! తా నొక పెద్దదాత నం
చును గృహ మెల్లపాడడి చెసఁ దలపోసె వివేకహీనుఁడై. 50

ఉ. ఎక్కడనుండి వచ్చెనొకో యీముదిజంగము వానిమాయలో

జిక్కి తరాలనుండి యొకచీమకుఁ బోవఁగ నీక డాఁచునా
చిక్కనిపిండి నస్థదిమి సర్వముఁ బెట్టఁగఁ బంచె నింక నే
నెక్కరణిన్ వసింతు మరు లెత్తి భ్యయాం బొనరించువీనితోన్. 51

క. అప్పిండియుఁ బులగముపైఁ, బప్పుగతిన్ నైఁపకతఁడు పాఱఁగఁజల్లెం
దప్పొనరించితి నెచటనొ, తప్పఁజనినవానిమీఁద దయదలఁచుదురే.

ఆ. ఏననేకపతుల నెనసి కాఁపురముంటిఁ, గానిఁయింత బెరుకువాని నెఱుఁగ
జంగమయ్యతోడ జరుపుఁగాఁపురము దా, నింకననుచునువిదయిల్లువెడ

ఉ. తోడన యేగి పామరుఁడు తొయ్యలిఁ జక్కఁగఁ బట్టి నాతి! నిన్ [లె.
వీడి నిమేషమేనియును నే వసియింపఁగ నేర యిట్టులం
గూడు నె నాపయిం బెలుచఁ గోపము సేయక తప్పు సైఁచి ర
మ్మేడకుఁ బోయె దంచుఁ దనయింటికిఁ దోడ్కొనివచ్చె క్రమ్మఱన్.

చ. అటు చనుదెంచుముక్ తపసి యచ్చట డించుప్రసాద మప్పు డ
క్కుటిటి భుజియింపఁ గాంచి కడుఁ గేరుచు సొమ్మున సొమ్ముఁ జెందె మే
లిటు వసియింపఁగా వలువదే! మదభాగ్యములంచు నత్తటిన్
దటుకున నిల్లుఁ జొచ్చి ప్రమదంబున సిద్ధురఁ జెంది రిద్దఱున్. 55

తే. అంత నప్పొత్రిభక్తిసిశాంతజంగ, మప్రసాదోపభోగసన్మహిమఁగలన
విమలసుజ్ఞానమాత్మఁబర్వినగిరీశ, భక్తులిచ్చినశాపంబువాసె ననుచు.

వ. ప్రమోదంబు నొంది యప్పుడద్దేహంబు విడనాడి గంధర్వరూపంబు వహించి ఈశ్వరపదంబు నొందం దలంచియు నంతలోన తన మనంబున. 57

ఆ. ఇక్కిరాతవర్యు నింట నుండుట సుఖ, మైతి సత్ప్రసాదమబ్బె శాప
ముజ్జగింప గంటి నొక్కమేలైన నీ, తనికిఁ గూర్పకున్నఁ దప్పు గండె.

క. కావునఁ బ్రత్యుపకారము, గావించినపిదప ముక్తిఁ గైకొన వగు నే
నేనిధి నంతటిదాఁకన్, భూవలయమునందు సిల్తుఁగా త్ర్యాకృతి చేన్.

వ. అని తలంచి యచ్చటు వాసిచని యొక్కశివాలయప్రాంతంబున నిజజన్మవర్తనంబులు మాసి యీశ్వరపదధ్యానం బొనరింపుచు నుండె నిచట. 60

క. తెలవాఱుటయుఁగిరాతుం, డలసతి మేల్కాంచియాలయప్రాంగణభూ
తలమునఁ గిటిఁగానకమనెఁ, గలవలమందుచును దుర్వికారాకృతులై.

ఆ. పెఱడు నిరుగు పొరుగు మఱి వాడవాడలు
పురము బయలు వెదకి సరవిఁ బందిఁ
గనక ముసలి జంగమయ్య గైకొనిపోవ
వలయు నింత నిక్కువంబు దలఁప. 62

తే. ఒత్తుఁడని వచ్చి యెంతటి కెత్తుకొనియె
బడుగుజంగము కూళోఁడు కుడుచునింటి
కెగ్గు చేసిన దుష్కర్మి కేటిగతియొ
యనుచుఁ జలించి యటఁ గొన్ని దినము లరుగ. 63

క. శరవికసనంబు నిర్మల, శరసరసీభాస్వదబ్జసముదయమగు నా
శరదాగమమున మాధవ, శరదేవ్యర్చాదినములు చనుదే నంతన్.

క. నిండినవేడుక ధరణీ, మండలపతి చండికకు సమర్పణ సేయన్
బండుగ వేటలు వే గొని, తెండని తలవరులఁబంప దృఢగతివారల్.

చ. పురిఁ గలచోటులన్ వెదకి పూర్వ మొసంగెడిచోట్ల మేష కా
సర కిటి తామ్రచూడములఁ జయ్యనఁ గైకొని యంత ఫంద్రపా
మరుఁ గని యోరి పామర! యుమాసతి పండువు గాన నీదుమం
దిరమున నిచ్చువచ్చు కిటిఁ దెమ్ము రయమ్మున నాతఁ డయ్యెడన్. 66

క. మందిరమున వసియించెడి, పంది యెటకొ తప్పిచనియెఁబందువనికి నే
చందమునఁ దెత్తునని డోలాందోళనచిత్తుఁడగు చునతఁడుండుతఱిన్.

చ. వనజశిలీముఖాంతకనివాసమునన్ వసియించె సూకరం
బని యొకరుండు దెల్పిన రయంబున నచ్చటి కేగి దాని బం
ధన మొనరించి తెచ్చి నరనాథుని సన్నిధి నుంచి చెంచుఁ డాఁ
జనినతదీయపోత్రిఁ గని సమ్మద మొందెఁ మహీశుఁ డంతటన్. 68

క. ఎవ్వరు గొట్టఁగఁ జనఁ డీ, క్రొవ్వినకిటిఁ బట్టి నేన కొట్టెద నని చే
రివ్వన నసిగొని వ్రేసిన, యవ్వరఖడ్గంబు భర్మమై కనుపట్టెన్. 69

మ. నరనాథుం డతివిస్మయాన్వితమనోనాళీకుఁ డై మంత్రి శే
ఖరు భావించి విచిత్ర మయ్యెడుఁ గిటిం గన్గొమ్ముఖడ్గంబు బం
గరువై కన్పడె దీని సోఁకి యిటు లోకంబందునం గంటిమే
కిరిమాత్రం బని చూడరా దనుచు లెక్కింపఁగ నమ్మంత్రియున్. 70

క. అరువంది దేశమున నిజ, పురమునఁ గలయినుము దెచ్చిపోత్రివరకళే

బరముదగిల్చినఁ జామీ, కరమై యొకపర్వతంబుకైవడి నుండెన్.

వ. అంతటఁ దద్గ్రామవరాహం బాత్మశరీరంబు వీడుకొని గంధర్వుండై తత్సమయాగతభర్మరత్నాంచితదివ్యవిమానం బధిరోహించి జంగమ ప్రసాదోపభోగంబునంజేసి శాపమోచనం బందితి సుఖినైతి నని సంతసింపుచు శివపురి కరిగెఁ దత్కోలాంగం బతివిమలశాతకుంభంబై వెలుంగుచుండె నంతయుం గని రాజపురందరుండు విస్మయం బంది యయ్యాటవికు రావించి నీ కీ వరాహం బెట్లు దొరికె నని యడిగిన వాఁ డి ట్లనియె. 72

సీ. నరనాథ! విను మొకనాఁడు మాగృహమున
కెచ్చోటనుండియో యేగుదెంచి
గంజికడుగు ద్రావి కదలక యున్నంతఁ
గొంత కాలమునకుఁ గుధరభక్తి
భజియింపఁ బోవుచు బడుగుజంగముఁ డొకఁ
డద్దమరేయి మాయాలయమున
కశనార్థియై చేర నతని కించుక చోడె
నున్ని పెట్టిన నది చొరక కొంత
తే. డించి చన నది యిక్కిటి గాంచి నమలె
నదియ మొద లిల్లు వెడలి శివాంగణమున
నున్నయాజాడఁ దెలిసి నేఁ డుత్సవమున
కీశ్వరికిఁ బ్రీతిగాఁ దెచ్చి తిటకు ననుడు. 73

పంచచామరము. రసాతలాధినాథుఁ డబ్బురంబు నొంది జంగమ
ప్రసాదసన్మహత్త్వ మెంచఁ బంకజాతసూతికిన్
వసంబె యంచు సన్నుతించి వస్త్రభూషణాదివ
స్తుసంతతిన్ ముదం బొనర్చి తోలెఁ జెంచు నంతటన్. 74

వ. ఇట్లయ్యానీశ్వరుచేత బహుమానాన్వితుం డై శబరాన్వయభూషణుం డాత్మగతంబున నిష్పందివలనం గాదె రాజుమెప్పంది లెక్కలేనిధనంపుఁగుప్పం దిలకింపఁగంటి మత్పూర్వజన్మసుకృతఫలం బిట్టి వరాహరూపంబై వచ్చి నాయింటఁ గష్టంబున కోర్చియుండి యంతరంబునన్నన్ని లతభాగ్యవంతునిఁ జేసి యియ్యనంతకాంతునకు నంత

సం భోనగూర్చి తనువు వీడ్కొని చనియెం గాని కేవలనూకరంబు
గాదని ప్రమోదంబు నొందుచు నిజగృహంబున కరుగునవసరంబున.

చ. సిరిమలతేనిఁ గాంచి నిజసీమకుఁ గ్రమ్మఱఁ బోవునట్టియా
శరణునిరథ్యుఁ గన్గొని ససంభ్రముఁడై శబరుండు వచ్చి భూ
వరునకు మ్రొక్కి నాఁటిగణవర్యుఁ డిదే చనుదెంచె నన్న సు
స్థిరతరసమ్మదాంబునిధిఁ దేలి మహీతలనాథుఁ డయ్యెడన్. 76

శా. ధీరామాత్యులఁ బంచి జంగమునిఁ దోడ్తెప్పించి మాణిక్యపీ
ఠారూఢుం దగఁ జేసి యర్ఘ్యమును బాద్యం బిచ్చి శశ్వన్నమ
స్కారవ్రాతము సన్నుతుల్ సలిపి లోకస్తుత్య! ప్రాంచత్కృపన్
మీ రిచ్చోటికి వచ్చుటన్ మిగుల నెమ్మిం జెందె మాభాగ్యముల్.

శా. స్వామీ! తావకభుక్తశేషము భుజింపం గల్గి కోలం బయ
స్సామగ్రిం గనకం బొనర్చి పిదపన్ సద్రూపగంధర్వుఁడై
హేమస్ఫారవిమాన మెక్కి సురమానీశాదు లగ్గింపఁగా
సోమార్ధాంకితజూటుపీటి కరిగెన్ జోద్యంబు రెట్టింపఁగన్. 78

ఉ. కావున నీమహామహిమ గన్గొన శక్యమె యంచు నెంచున
బ్భావరువాక్యము ల్వినయపూర్వదయారస ముప్పతిల్లఁగా
భావజవైరితుల్యుఁ డగుభక్తవరేణ్యుఁడు పల్కె నోర నీ
భావము గానవయ్యెఁ గులపావనమూర్తివి రాజశేఖరా! 79

క. భువి జంగమప్రసాదము, భవరోగౌషధము గానఁ బార్థివ! నీ కే
వివరింతుఁ దన్మహత్త్వము, ప్రవిమలమతివినుమటంచుఁ బలుకఁదొడం [గన్.

చ. కలఁ డొకభక్తుఁ డబ్జశరఘస్మరపాదపయోజషట్పదుం
డలఘుతరప్రభావుఁ డతఁ డక్కడ నక్కడ శైవమందిరం
బులఁ దగుభిక్ష మెత్తి జలపూర్ణతటాకసమీపధారుణీ
తలమునఁ జేరి యచ్చట సుధాకరశేఖరుపూజ సల్పుచున్. 81

తే. తత్ప్రసాదంబు భోజనాంతరమునందు
నుంచి లింగార్పితంబు గావించి యార
గించి యాభాజనం బప్డు కెడతటాక
జలములో వైచి చరమూర్తి చనినయంత. 82

వ. అట్లు నీటన్ వైచినతరియం దొక్కకణం బుండి రాలిన. 83

చ. అతులితపూర్వజన్మసుకృతాతిశయంబునఁ దజ్జలాంతర
స్థితశరణప్రసాద మతితీవ్రత నొక్కఝషంబు మ్రింగి వ
ర్ధితసుమహాంగమై యట చరించుచు నుండినఁ గొన్నినాళ్ల క
ద్భుతముగఁ జెంచొకం డడవి దూరపువేఁటల కేగి వచ్చుచోన్. 84

క. చెలువుననీరముఁ గనుఁగొని, తలుచుగఁ గే విచట మీలు తథ్యమనుచు న
య్యెలుకపుడు సంతసంబున, మెఱయుచు వలవైచి తిగిచె మక్కువతోఁ [డన్.

తే. జాలమునఁ జిక్కి వచ్చిన మీలతోడ
సత్ప్రసాదోపభోగి ఝషంబు దగులఁ
గాంచి సంతసమున మెయి వెంచి చెంచు
చిక్కమున వైచికొని గృహసీమ కరిగి. 86

చ. తనసతిఁ జేరఁ బిల్చి వనితా! యిది చూచితె మంచిచాయమీ
న్గొని చనుదెంచినాఁడ యిది గొబ్బునఁ గూరఁగ వండి తెమ్ము నీ
వనవృశు నట్ల చేసి యది యన్నము పెట్టిగఁ నట్టఁ బెట్టినం
దిని శబరాస్వయోద్భవుఁడు తేపకుఁ దన్రుచు లుగ్గడింపుచున్. 87

చ. అది మొద లాకిరాతపతి యంచలు మేలన హింస సేయుటల్
వదలి గిరీశ్వరాంఘ్రులు దలంచుచు నెమ్మది నుండినంతఁ గొ
న్ని దినము లేగ శీకరవనీకిటి యొక్కటి పక్కణంబులో
మనమునఁ జొచ్చి యందుఁ గల మానవులం గలగుండు సేయుచున్.

క. చనుదెంచి యాశబరుఁ గ, న్గొని వడి దంష్ట్రావిటంకకోటినఁ బడఁ జి
మ్మినవిగతజీవుఁడై య, య్యనఘుఁడు భువినొరఁగె వజ్రహతగిరివోలెన్.

ఉ. వానిఁ బరేతరాజభటవర్గము నారకబాధఁ జేయఁగాఁ
బూని కఠోరచర్యఁ గొనిపోవఁగ వచ్చిన నీశుదూత లో
హో నిలువుం డితండు మహిమోన్నతజంగమసత్ప్రసాదభు
ఙ్మీనచరప్రభావమున మేలగుపుణ్యశరీరి గావునన్. 90

చ. యమనిలయంబుఁ జేరఁగ ననర్హుఁడు పొండని కల్పభూజసూ
నమయవిమాన మాతని మనఃప్రమదంబున నెక్కఁబంచి ది
వ్యమునులు సన్నుతింపఁ బ్రమథాధిపలోకముఁ జేర్ప నాతఁ డం
దమితసుఖానుభూతిఁ గని యంచితలీల వసించెఁ గావునన్. 91

క. శరణప్రసాదమహిమము
ధరణీశ్వర! యిట్టిదని ముదం బిగురొత్తన్
జరమూర్తి తన్మహత్త్వము
దిరముగఁ దెలుపుటయు వసుమతీపతి యంతన్. 92

ఉ. క్రమ్మఱమ్రొక్కి యోశరణరత్నమ! జంగమసత్ప్రసాదసౌ
ఖ్యమ్మొనగూర్చి నన్ విమలకాయునిఁ జేయు మటన్న మంచిహా
సమ్మిగురొత్త నిట్లనియె శాంకరవంశసుధాబ్ధిరాజ! నీ
కెమ్మెయిఁ దద్విభూతి ధరణీశ్వర! కల్గఁగ నేర్చు? చెప్పుమా!. 93

తే. భస్మరుద్రాక్షధారియై పంచవర్ణ
మంత్రపఠనం బొనర్చుచు మహితనిష్ఠ
లింగమును దాల్చి గురుభక్తిసంగుఁడైనఁ
గాక దివ్యప్రసాదంబు గలుగు టెట్లు?. 94

చ. అనుడు మహీశుఁ డిట్లనియె నయ్య! తదీయమహత్త్వముల్ క్రమం
బున నెఱిఁగింపు నావుడు విభూతిమహామహిమంబు దెల్పెదన్
వినుము వసుంధరారమణ! నిశ్చలచిత్తముతోడ నంచు న
య్యనఘుఁడు చెప్పఁగాఁ దొడఁగె నాత్మ దయారస ముప్పతిల్లఁగన్.

విభూతిమహిమ.

సీ. ఉడురాజధరుపశ్చిమోత్తరదక్షిణ
పూర్వాభిముఖములఁ బుట్టెఁ బింగ
ళాసితధవళధూమ్రారుణవర్ణంబు
లను నందభద్రసురభిసుశీల
సుమనయన్నామభేదముల గోవులు వాని
వలన విభూతియు భసితభస్మ
మును క్షారరక్షలు జనియించె నబ్భూతి
గావించు నట్టిమార్గములు నాల్గు

తే. గలవు కల్పానుకల్పోపకల్పములను
గల్పమును నన నందులోఁ గల్పభూతి
యుత్తమం బది దొరకక యుండెనేని
తక్కినవి మూఁడుఁ జేయంగఁ దగు మహీశ!. 96

సీ. క్షితి విభూతి యొనర్చుగతి విను ము త్తమం
బగు గోమయము భూమిఁ బడనీక
యంభోజపత్రంబునందు సద్యోజాత
వరమంత్రమునబట్టి వామదేవ
మునఁ బిండములు సేయుచును దత్పురుషమున
నారంగ నిడుచు నఘోరమున శి
వాగ్నిలోఁ దఱికొల్పు నది; కల్ప మడవి నెం
డినగోమయపుఁబొడి మునుపు చెప్పు

తే. కరణిఁ గాల్చిన నది యనుకల్ప మయ్యెఁ;
దానె కాలినభూతి వస్త్రమున ధూళి
తంబుగాఁ జేసి గోవుమూత్రమునఁ జేయు
కరుడు గాల్చిన నదియు సంకల్ప మయ్యె. 97

వ. ఇట్లుగాక తక్కినయది యకల్పంబని యెఱింగి యేతద్విభూతి కాలాగ్ని రుద్రోపనిషదాదిశ్రుత్యంతోక్తమార్గంబున సతతంబు నుత్తమాంగప్రముఖాంగంబులఁ ద్రిపుండ్రధారణం బొనర్చునది. 98

క. ఇట్టివిభూతి ధరించిన, యట్టిమహామహుఁడుజగతినవయవయుతుఁడై
గట్టువిలుతుండె యగు నె, ప్పట్టున సంశయము లేదు పార్థివతిలకా!.

సీ. శ్రీకరమోక్షలక్ష్మీవశీకరణకృత్యాంకితతిలకవిఖ్యాతి భూతి
యత్యంతఘోరమహాపాతకౌఘమహీధరామరవరహేతి భూతి
కాకోదరాధీశకంకణసర్వశరీరవిలేపనప్రీతి భూతి
ఫాలతలాంభోజభవపూర్వవిలిఖితపాతకాక్షరతమోజ్యోతిభూతి

తే. సంతతాత్మీయమానసాసన్నశభక్తి,భావనాధరిమానసనాతినిరుప
మైహికాముష్మికోరుదివ్యప్రభావ, పూర్ణనాథకారుణ్యభూతి భూతి.

వ. ఇవ్విభూతిమాహాత్మ్యంబున నొక్కయితిహాసంబు గల దెట్లనిన
నొక్కసాపాత్ముం డత్యంతరోగబాధితుం డై యొండేనిం జనిచని
ప్రాణాంతసమయంబున నొక్కపట్టణబాహ్యాంతరదేశశ్మశానవాటికా
సమీపంబునఁ గసలంజాలక పడియున్న నొక్కసారమేయం బచ్చు
టిశ్మశానభస్మసంగతపాదయై వచ్చి యప్పాపాత్మునిసకలంబు ద్రొక్కి చనినకొంతవడి కతండు మృతిఁ జెందిన కింకరు లతనిం గొనిచని

వైవస్వతాంతికంబున నిల్పినకృతాంతుం డతనిప్రాణాంతసమయంబునం దైనభస్మధారణమహత్త్వంబువలనం గల్మషంబులుఁదొలంగి పుణ్యాత్ముం డయ్యె నితండు మదీయదండనంబున కనర్హుం డనిన, బహుమానంబుగా నతని శివలోకంబున కనిచెం గావున భస్మధారణమాహాత్మ్యం బిట్టిదని మఱియు నిట్లనియె. 101

మ. ఒకచోదేవుఁడు ఘోరపాపకరుఁడై యుండంగఁ దద్బాంధవ
ప్రకరం బాతనిదుష్కృతంబులు సహింపఁగ లేక వెళ్ళొట్టినఁ
సకలంబుఁ విడిపోయి ఘోరవిపినస్థానంబునఁ బల్కిరా
తకదేశంబునఁ జేరి యందు నతిఖేదం బంది వర్తింపఁగన్. 102

తే. అతఁడు ఘోరాఘమహిమ మంద యనుభవింప
వలయు ననుమాట జనులకుఁ దెలియునట్లు
లమ్మహీసరుదేహంబునందుఁ గుష్ఠ
రోగము జనించె నొరులకు రోఁత దనర. 103

తే. ఒడలు చూచిన జను లెల్ల నోకిలింప
గాలిచే దూరమునకు దుర్గంధ మొదవ
నడు గిడఁగ శక్తి యించు కంతైన లేక
పట్టుదెగిపడు మేనుచేఁ బాలుఁ డుండి. 104

క. ఒకనాఁ డాకటఁ బడ నో, పక తత్పక్కణసమీపవనిఁ దిరుగుచు నం
తకమున్ను దవానలద, గ్ధకుజామితభస్మ మచట గనుఁగొనియందున్.

తే. మండి చల్లాఱినట్టిగోమయపుఁగరడు
గాంచి యాఁకట డస్సినకతన వేగఁ
బుచ్చుకొని తిని యబ్బాదిప్రోవునందుఁ
బడియె నడువంగ లేక యాబ్రాహ్మణుండు. 106

చ. అటు పడియున్న తీవ్రగహనానలదగ్ధమహీజలోష్మతఁ
బటపట మేను ప్రక్కలయి పాఱునిదేహము వీడ నత్తఱిఁ
గుటిలభయంకరాకృతులు ఘోరగదాయుధపాణులై సము
ద్భటగతి వచ్చి కింకరులు దట్టుచు వే గొనిపోయి యాతనిన్. 107

ఉ. కాలునిమ్రోల నిల్ప నతికంపితదేహముతోడ దూతలఁ
దూలఁగఁ బల్కి యీతఁ డతిదుష్టవిచేష్టితుఁ డైననేనియుం

గాలము సేయువేళ భవనాశకభస్మము మెక్కి పూయుటన్
దాలిచె శైవతేజ మిటఁ దా వసియింప ననర్హుఁ డెమ్మెయిన్. 108

క. అని వైవస్వతుఁ డాతని, ఘనతరపుష్పకవిమానగతుఁ జేసి ముదం
బున సుర లచ్చెరువందఁగ, ధనదప్రియనగరి కతిహితంబుగ ననిచెన్.

క. కావున నిట్టిది త్రిజగ, త్పావనభసితప్రసిద్ధి పార్థివ! యింక స
ద్భావమున వినుము దెల్పెదఁ, గేవలరుద్రాక్షఫలముకృతభవహరమున్.

ఉ. రాక్షసవంశనాయకపురంబులు గూల్పఁ దలంచి సూటిగా
వీక్షణ మొప్పఁ జేయుపృథివీరథులోచనకంకణోత్కరం
బీక్షితి రాలి భూజనుల నెల్లఁ బవిత్రులఁ జేయఁబూని రు
ద్రాక్షనగంబులై జనన మందె మహామహిమంబు మీఱఁగన్. 111

## రుద్రాక్షమహిమ.

చ. అకలుషసోమవహ్నిమిహిరాంశసమిద్ధశివాక్షసన్మణుల్
శికితలచుట్టి కర్ణయుగళిన్ గళవక్షములందుఁ గక్షబా
హుకరతలాంతికంబుల సమున్నతిచే ముఖసంఖ్య లేర్పడన్
బ్రకటితభక్తి దాల్చిన నృపాలక! చంద్రధరుం డతం డగున్. 112

సీ. ఒకకిరాతకుఁడు మహోగ్రాటవికి వేఁటలాడంగఁ జనిచనియందు నొకస
రోవరతటమున రుద్రాక్షఁ గని దాని సారమేయముకంధరమున వేడ్క
గీలించి యాఖేటకృత్యతనుండంగ ఘనవనక్రోడంబు గాంచి శునక
సహితంబుగా వానిఁ జంపిన నంతట నీశ్వరకింకరు లేగుదెంచి

తే. హస్తవారిరుహమున రుద్రాక్షముట్టి
నట్టిఫల మబ్బె నీకని యతనివాని
జాగిలంబును జేర్చిరి శర్వపురికిఁ
గాన రుద్రాక్షఫలమిది మానవేంద్ర! 113

వ. అని మఱియుఁ బంచాక్షరీమాహాత్మ్యం బిట్లని చెప్పందొడంగె. 114

## పంచాక్షరీమహిమ.

ఉ. శ్రీతుహినాద్రిజాత్మసరసీజశిలీముఖుఁ డర్కపావకా
బ్జాతవిలోచనుండు సురసంయమిపూజితపాదపద్ముఁడు
ద్యోతితదేహుఁ డంగజసముద్ధతగర్వవిదారియై లస
త్ఖ్యాతి వహించి మించె మనుజాధిప పంచముఖుండు లీలచేన్. 115

తే. అట్టి శ్రీమన్మహేశుపంచాననముల
వలనఁ బంచాక్షరము లుద్భవంబు నొంది
వరుసఁ బంచాక్షరి యనంగ వన్నె గాంచె
నదియు వేర్వేఱవివరింతు నాలకింపు. 116

సీ. వరుస సద్యోజాత వామదేవాఘోరతత్పురుషేశానతతముఖములఁ
గలిత నకార మకార శికార వాకార యకారముల్ కడు జనించె
నవిప్రోవుగూడిపంచాక్షరంబననొప్పనకిమంత్రరాజమైయలరెజగతి
తన్మంత్రమాతసత్ప్రణవయుక్తంబుగాజపియించినను షడక్షరియునయ్యె

తే. సతతపంచాక్షరీమంత్రజపవిధాన
వేది యరయ సాక్షాత్ప్రమథవీరథుండు
గాని కేవలుఁ డగుజనుఁ డనఁగవలదు
శంక యించుక లేక రసాతలేంద్ర! 117

క. పంచాక్షరి సురధేనువు, పంచాక్షరి కల్పకంబు పరికింపంగాఁ
బంచాక్షరి చింతామణి, పంచాక్షరిఁ బోలజగతి ఫలదము గలదే.

తే. మఱచియును నొకమాఱు నమశ్శివాయ
యనినమాత్రాన బ్రహ్మహత్యాదిపాత
కావళులు ద్రుంగు ననిన నిత్యంబు సలుపు
జపఫలం బెన్న నలువకు శక్య మగునె? 119

వ. ఇప్పంచాక్షరీమాహాత్మ్యంబున నొకయితిహాసంబు గల దెట్లనిన దొల్లి
దాశార్హమహీవల్లభాఖండలుండు కాశికారాజతనయయగు కళా
వతిం బెండిలియాడి ప్రథమసమాగమదినంబున నఖిలమంగళాభర
ణాలంకృతసౌందర్యగాత్ర యగుచు విచిత్రం బయినకేళికామంది
రంబునఁ దనపజ్జ వసియించుదాసిం గని మదనప్రదరవిదళితహృద
యుం డై యుపగూహనం బొనరింపంబోయిన నచ్చపలాక్షి మున్ను
కన్నియ యై పిన్నతనంబునఁ గన్నవారింట నున్నసమయంబునఁ దన
చేసినయుపచారంబునకు మెచ్చి భర్గసమానుం డగుగర్గుఁ డొసంగు
పంచాక్షరీమంత్రోపదేశప్రభావంబున బవిత్రం బైనగాత్రంబు గల
యదికావున నపరిగృహీతమంత్రుం డగునిజనాథుం గదియనొల్లక శివ
మంత్రోపదేశంబు గనినప్పుడ మదీయ సంభోగం బనుభవింపు

మని పెక్కుభంగుల వారించిన వినక పుడమిఱేఁడు కామాతు రుండై పయిం బడఁబోయిన నమ్ముద్దియమేను కాలినయినుపము ద్దకన్నఁ దద్దయు వేఁడిమిగ్రాయె పాడచూప వెఱచి దూరంబున నిలిచి హరమంత్రప్రభావం బిట్టిద యని తలంచి యప్పు డప్పతి యనుమ తంబున గర్గాశ్రమంబునకుఁ జని యతనిచే శైవపంచాక్షరీమంత్రో పదేశంబుఁ గైకొనునంతలోనన పక్ష్యజ్జనులు విస్మయంబు నొంపఁ బూర్వజన్మఫలంబులు కాకంబులై పక్షంబులుగ మఱి నిజదేహంబు వలన వెడలి పడుటయు నారాజశేఖరుం డానందకందళితహృదయా రవిందుం డై యాచార్యున కిష్టవస్తువు లొసంగి వీడ్కొని తనకు సద్గతి చూపుటకు భార్యఁ బెక్కుభంగుల నుపలాలించి తజ్జలదాలక వలన నిష్టోపభోగంబు లనుభవింపుచు నుండెఁ గావునఁ బంచాక్షరీ మాహాత్మ్యం బిట్టి దని తెల్పి యోగిపుంగవుం డద్ధరావరునితో మఱి యు నిట్లనియె. 120

మ. అతిథీ! మద్గురుభావసంభవము వేదాతీత మత్యుత్తమం
బతులం బవ్యయ మప్రమేయ మగమం బానందకందంబు న
క్షత మాద్యంతవిహీన మై పరగు లింగంబుల్ మహాభక్తిసం
గతుఁ డై దాల్చినవాఁడు ముక్తివనితాకాముండు గాకుండునే! 121

ఉ. ఇట్టిపరాత్పరుల్ శివు మహేశ్వరు నవ్యయు భావమందునన్
బుట్టఁగఁ జేసి సంతతముఁ బూజ లొనర్పఁగ శిష్యుచేతిలోఁ
బెట్టి షడక్షరం బనఁగఁ బెంపు వహించెడిమంత్రముం జెవిం
దొట్టఁగఁ జేయుసద్గురునితో నొరులన్ సరిసేయవచ్చునే? 122

క. గురుఁడే తల్లియుఁ దండ్రియు
గురుఁడే దైవంబు దాత గురుఁడ సకలమున్
గురుఁ డనఁగ హరుఁ డనంగాఁ
బరికింపఁగ వేఱె కలదె? పార్థివతిలకా. 123

సీ. ఆచార్యసత్కరుణాలోకనము సేవ
కాజ్ఞానతిమిరం బడంచుజ్యోత్స్న
గురుహస్తదత్తభాసురభసితాదాన
భక్తి మహారాజ్యపట్టకలన

యుపదేష్టృభవ్యపాదోదకంబులు శిష్య
కల్మషదావాగ్నికమలవృష్టి
వరదేశికేంద్రుదివ్యప్రసాదామృతం
బాశ్రితజన్మరోగౌషధంబు
తే. ధ్యానమూలంబు గురుపురంధరునిమూర్తి
మూల మగుఁ బూజలకు గురుముఖ్యపదము
మంత్రమూలంబు గురుపర్యమాట మఱియు
మూల మగు సద్గురునికృప ముక్తి కనఘ! 124

క. గురుపాదభక్తిపరులకుఁ, బరికింపఁగ నంతరాయపదవులు గలవే!
నరవర తత్ప్రతిబింబిత, శరణమహత్త్వంబు నుడువ శక్యం బగునే.

చ. శరణుల కర్థి మ్రొక్కి నుపచారము సేయఁ దదీయసద్గుణో
త్కరము నుతింపఁ దత్పదముఁ గన్గొన వారలసచ్చరిత్రముల్
వరుస వినంగఁ బాల్పడినవానివశీర్షకరాబ్జజిహ్వకా
వరనయనశ్రుతుల్ మనుజవల్లభ యిట్టుల గాని వేటికిన్? 126

క. జంగమవర్య దయారస, సంగతమగు నేని యట్టిజంతువును దినల్
గంగాధరుకృపగనునృప,పుంగవయితిహాస మొకటిపొలుపుగవినుమా.

ఉ. ఆగమవేదియైన శరణాగ్రణి యొక్కఁడు భక్తియుక్తుఁడై
శ్రీగిరిమల్లికార్జును భజింపఁగఁ బోవుచు నెండకాఁకచే
డాఁగఁ దలంగలేక యొకతావున నిల్చి జనాళి మించె నే
నేగతి నేగువాఁడఁ బరమేశ్వర యంచుఁ దలంచుచుండఁగన్. 128

మ. ఒకభేరుండము శాల్మలీస్తబక మయ్యుర్వీస్థలిన్ గాలిచే
శకలంబై పడియున్నఁ గాంచి యది మాంస మ్మంచు నెందేని బో
వక మింట న్నిల దానిచాయ మెయిఁ బర్వన్ వేగ నత్తొత్తి కాం
చి కడుం దెప్పిరి మస్త మూచి యతఁ డక్షీణప్రమోదంబునన్.

మ. అహహా! యీపతగాధినాథుఁడు మదీయంబైన తాపంబు పెం
పు హరించెన్ ఘటియించె నాకుఁ ద్రిజగత్పూతాపగాదివ్యవా
ర్గహారీసంతతఖేలనోత్సుకరమారాజేషురత్నోల్లస
ద్గృహాశృంగాగ్రవినూతనాంకపటదేదీప్యప్రభాలోకమున్. 130

చ. ఇతఁడు మదీయమిత్త్రుఁ డని యెంచి కులాయముఁ గన్గొనంగ నో

పతగవరేణ్య! మాదయకుఁ బాత్రుఁడ వైతివి గాన మీఁదటన్
క్షితితలమందు నీమహిమ చేరమరాయుఁ డనంగ రాజసం
తతి వయి పుట్టి భూభరణదక్షుఁడ వై తుదిఁ జెందు మీశ్వరున్.
చ. అని యిటు లానతిచ్చి శరణాగ్రణి శ్రీగిరి కేగి మల్లికా
ర్జునపదముల్ భజింపుచు మరుల్లలనాకరచామరౌఘవీ
జనభవవాతలోలవిలసద్భ్రమరన్భ్రమరన్ సదా మనం
బున నిడి కొల్చుచున్ భవనపూజితుఁ డచ్చట నుండె సంతటన్. 132
శా. ఖేరుం డాండజ మంతఁ గొన్నిసమముల్ పృథ్వీతలంబందు సం
చారం బొప్పఁగఁ జేసి యంతరమునన్ సత్పాలయాధీశపూ
జారాజిం గని క్రమ్మఱం భువిని భాస్వద్రాజవంశంబునన్
వీరాగ్రేసరి చేరమాధిపతి నా విఖ్యాతి సంజాతుఁ డై. 133
ఉ. వైరుల సంహరించి పరవాదులయే పణఁగించి యిష్టలిం
గారవ మొప్పఁ బెంచి శితికంఠునిదేహమునన్ ధరించి ప్ర
జ్ఞారతి మించి లింగగురుజంగమభక్తి వహించి దిక్కులం
దోరపు గీర్తి నించి పరితోషమతిన్ ధర యేలె నెంచఁగన్. 134
శా. ఈరీతిన్ వివిధేష్టభోగములచే నేకాతపత్త్రావనీ
భారం బొప్పఁగ దాల్చి దేవతలు సంభావింప నంతంబునన్
శ్రీరాజార్ధకిరీటపీఠి కరిగెన్ జెన్నొందుభక్తప్రభా
వారాధిన్ వినుతింప శక్య మగునే జ్యాలోకరత్నామణీ. 135
క. అని తెల్పినజంగమపద్మవనజములకు జాగి మ్రొక్కి వసుధావరుఁ డి
ట్లని యెన్న టులంగాదే, నను ముక్తునిజేయు దనుచు నమ్మితినన్నున్.
క. కావునదీక్ష యొసంగుము, దేవా యనుటయు దదీయధృతిమతులకుఁ దా
భావమున నలరినీ కిష్టావాప్తి ఘటింతుననుచు హర్షము తోడన్.137
సీ. స్నానసంధ్యాదులు సల్పఁగా నియమించి
తతభూతిరుద్రాక్షధారిఁ జేసి
శ్రుతిహితంబుగ బరంజ్యోతిరాకారలిం
గము ధరియించి మోదమునఁ బ్రణవ
సహితపంచాక్షరీసన్మంత్ర ముపదేశ
మొనరించి భక్తిచిత్తునిగఁ జేసి

ణాబ్జతీర్థప్రసాదముల్ కృపచేసి
నిజశిష్యుఁగాఁగ మన్నించి యంత
శైవరహస్యముల్ వెలయఁదెలిపి
క్షీవరుచేత సత్కార మంది
జనులు తన్నుఁ గొనియాడి నైజదేశ
నకు నేఁచేసె జంగమముఖ్యుఁ డంత. 138

ముగ నచ్చున నొత్తిన
నువున నాశరణుబోధ మాత్మ వహింపన్
పతి సతతము త్రివిధా
రములు సల్పుచును దనదుస్వాంతమునందున్. 139

మేలు భూమిలోపలఁ, గాయజహరభక్తుఁడొకఁడు గానఁగఁబడఁడ
య్యో! యెటులనైఁ పనగుజను, లాయతదుష్పాపభాజులయ్యెదరుగదే!
రోనరించుపాతక మవశ్యము నాకు ఘటించుఁ గాన నే
రక చూచుచుండు టది యుక్తము గా దని యెంచి యప్పుడే
రుల నంపి యందఱ వెసం దనయొద్దికిఁ బిల్వఁబంచి యా
రమణుండు భక్తిరతి పుట్టఁగ శైవమతాధికత్వమున్. 141

రవ మొప్పఁ దెల్పి తిరుగంబడువారి కమేయవస్తుసం
రము లిచ్చి దృష్టములు భావము రంజిలఁ జూపి లింగసం
రులఁ జేసి పూర్ణముగ స్వాస్థ్యము లచ్చెరువందఁ జేసినన్
రలు సంతతప్రమదవారిధిఁ దేలి వచించి రీగతిన్. 142

రా! యెంతటిభాగ్య మబ్బెఁ గడు మేలౌ నిత్యముక్తిక్రియా
రీణత్వము సంభవించెఁ బటుదుష్పాపౌఘ మెల్లన్ మహా
రంబై చనె నిమ్మహీశువలనన్ దోషంబుగా బిడ్డలం
స ల్వెట్టెద మింత రాజునరి రూపింపంగ లే రెచ్చటన్. 143

లవలె నని చెంపలు గొట్టి తల్లి
లురకుఁ బాలు ద్రావించుపగిది మనలఁ
క్షభంగుల శిక్షించి యక్కజముగఁ
మ్యమార్గంబుఁ జూపె నిప్పుడమిఱేఁడు. 144

యొండొరులాడుచున, జ్జనపతియనుమతిని నాత్మసదనంబులకున్

జని సంతతభర్గారా, ధనరతి వసియించి రతిముదం బిగురొత్తన్.

వ. కావునఁ బ్రసాదమాహాత్మ్యం బిట్టి దని తెలిపి చూచి దేవాదిగణం బులతో సకలేశ్వరమాదిరాజయ్య యేతత్ప్రసాదమాహాత్మ్యం బిం కను వినుమని యిట్లనియె. 146

సీ. రాజితకాంచనరత్ననిర్మితసౌధగోపురావరణసందీపితంబు
కమలినీషండారకుముదనిర్మలనీరకలితకాసారవికాసితంబు
నిర్జరకామినీదుర్జయశృంగారవిభ్రమాబ్జాననావిశ్రుతంబు
సంతతసముచితజాత్యనుగుణమార్గపథికచాతుర్వర్ణ్యబంధురంబు

తే. భవ్యచతురంగబలచయభ్రాజితంబు
నిరుపమోద్యానవాటికాసురుచిరంబు
దేవతాగారసందోహభావితంబు
పుణ్యనిలయంబు సింహాద్రిపురవరంబు. 147

వేదపితామహుని కథ.

ఉ. ఆనగరంబునందు ఫణిహారపదాంబుజభక్తుఁ డంతర
జ్ఞాని త్రిలోకపూజితుఁడు షట్ప్రతిపక్షవిదారణుండు భ
క్తానుగుణప్రబోద్ధ యసహాయుఁడు వేదపితామహుండు నాఁ
గా నొకభక్తపుంగవుఁ డఖండితశైవమతప్రచారుఁ డై. 148

క. నివసించు నతనిశిష్యుఁడు
ప్రవిమలతరభక్తిపరుఁడు బంధువిదూరుం
డవితథవాక్యధురీణుఁడు
భువి వామనుఁ డనఁగ నొక్కపుణ్యుఁడు వెలయున్. 149

తే. ఆతఁ డనిశంబు గురుపదాబ్జాతములకు
సేవసేయుచుఁ దద్భక్తశేషసుధ ము
దమునఁ గాంచుచు నొకసంయమున నతని
తోడ నొకనాఁడు వినయంబుతోడఁ బలికె. 150

తే. అమరగణములలో నెవ్వఁ డధికుఁ డెట్టి
చందమున మోక్ష మబ్బు నిజ్జగమునందు
నేమతం బుత్తమం బగు నెత్తెఱంగుఁ
దెలియ నానతి యిమ్ము సందియము దీఱ. 151

చ. అని యిటు పల్కుశిష్యువినయంబున కాత్మ ముదంబు నొంది యో
ఘనతరపుణ్య! నీదుమదిఁ గల్గినసంశయ మెల్లఁ దీర్తు నం
చనఘుఁడు లింగజంగమమహామహిమంబులు సత్ప్రసాదసే
వనఫలముల్ దయారసము పర్వఁగఁ జెప్పఁదొడంగె నత్తఱిన్.

సీ. బ్రహ్మాదిదేవతాభర్త జగత్కర్త
శంబరదానవశత్రుహర్త
యమితతాపసనేత యఖిలభక్తత్రాత
యత్యంతబలపురదైత్యజేత
ఫాలసంగతకీలి భవవిభంజనశీలి
భాసురానంతవిలాసశాలి
కుముదబాంధవధారి యమమదసంహారి
గ్రావరాజసుతామనోవిహారి

తే. యవ్యయుం డచ్యుతుండు సర్వాత్మకుండు
భావనాతీతుఁ డగుమహాదేవుఁ డెందు
దేవుఁ డగుఁగాని తక్కినదేవతలను
దైవ మని కొల్వవల దిది తథ్య మనఘ!. 153

ఉ. భూవిదితంబు లోకచయపూజితమాతతఘోరపాపసం
ధావనధుర్య మీశ్వరపదప్రతిపాదక ముత్తమోత్తమం
బావృతపాశబంధహరణాకరమై వెలుఁగొందునట్టి యీ
శైవమతంబుతోడ నెన సల్పఁగ వేఱెమతంబు గల్గునే. 154

ఉ. ఇట్టిది శైవ మిందుఁ గడు హెచ్చగుసుత్తరశైవ మర్థిఁ జే
పట్టినపుణ్యమూర్తి సుమబాణవిరోధి యనంగవచ్చు నే
పట్టున సంశయింపనుము భర్గుఁడె భక్తుఁడు భక్తుఁ డీశుఁడౌ
గట్టిగ నీశభక్తులకుఁ గల్గదు భేద మొకించుకేనియున్. 155

తే. పుడమి నొక్కొకభక్తుఁడు నడుచుచర్య
లహహా! యెబ్బంగి లెక్కసేయంగవచ్చు
వారిమాహాత్మ్య మంబికాధారుఁ డెఱుఁగుఁ
గానఁ దదధీనుఁ డై యుండు మాన కెపుడు. 156

క. చరలింగార్చన సేయక, గురులింగార్చనలు సేయఁగూడదు విను త

ద్గురులింగంబులకంటెను, జరుఁడేయధికుఁడని పల్కుసకలశ్రుతులున్.

సీ. భక్తుండు గురుఁ డుమాపతిశిష్యుఁ డనుటకు
గుఱుతుగా గణపాలకుండు సాక్షి
భక్తుండు తండ్రి శ్రీపతిబాణుఁ డాత్మజుఁ
డనుటకు భల్లాణఘనుఁడె సాక్షి
భక్తుండు దొర బంటు భవుఁ డని యనుటకు
రూఢిగా బాణాసురుండె సాక్షి
భక్తుండు గెల్వరి పరమేశు డోటరి
యనుటకు శ్వేతవాహనుఁడె సాక్షి

తే. తాను గోరినవస్తు వేమైన గాని, భక్తులీయకగతిలేదు భవుని కెందు
శరణవర్యునిసత్కటాక్షంబు దేవ, భూజమాణిక్య ధేనువుల్ పుట్టినిల్లు.

సీ. కాలారిగణపాదధూళి మై సోఁకిన మర్త్యునిదురితముల్ మ్రగ్గిచనవె
ధూర్జటిభక్తులుద్రొక్కినదారపఁయిఁ బోరలువాఁడఘతతుల్ పోవనడఁడె
శర్వభృత్యులతనుచ్ఛాయమైబోలసిన నరుఁడు కల్మషములఁబొరిగొనండె
హరశరణస్నానశరకుండతలపంక మలఁదిన జనుఁడు నిర్మలుఁడుగాఁడె

తే. పరమపావనజంగమప్రతతితోడ
నమరకిన్నరయక్షవిద్యాధరాహి
సాధ్యగంధర్వమునిసిద్ధసారసాప్త
చంద్రముఖ్యగ్రహాదులు సాటియగునె? 159

తే. శ్వపచుఁ డైనను హరలింగసహితుఁ డేని
యవనిలో నుత్తమోత్తముఁ డనఁగఁ బరగు
నట్లు గావున శరణదివ్యప్రసాద
సేవనము లేక ముక్తిసి జెందనశమె. 160

క. ఏవిధముననైనను మో, క్షావహశరణప్రసాద మానఁగవలయుఁగా
బావనసద్భాంగస్థం, బావంతయుదొరకెనేని యమృతముఁ జెందున్.

క. అని తెల్పిన దేశికస, ద్వనజములకుఁ జాఁగి మ్రొక్కివామనుఁడుముదం
బునఁ దేలెనన్నుఁగరుణం, గనెగురుఁడనియంతకొంత కాలముచనఁగన్.

ఉ. ఆపురిలోన నుండుగొడగచ్చ యన న్నొకభక్తురాలు చ
ద్రూపరమూర్తులైనశరణాఢ్యులపాలిటివాలు మేలు దు

ష్వాపవ్రుఁగొండప్రోవునకుఁ బాకనిషూదనుచేతివాలు చి
ద్వ్యాప్రపితవాక్యసంచయసుధారస మీనఁగ జాలు లేలనన్. 163
క. ఆవేలఁది ప్రసాదముగొన్న,గా వేదపితామహుండు కాంక్షించిమది
న్నే విప్రకులుఁడ జననిం,దావాప్తుఁడ నగుదునచటికనగుదునేనిన్.
క. నింపకు లోఁబడియుండినఁ, జెందదు తత్సాత్ప్రసాదసేవ గొనక నే
నిందుధరుఁజెందు టెటులీ,బొందివిడిచివేతెబొంచిపొందికొనియెదన్.
చ. అని యిటు లాత్మలోఁ దలఁచి యంతట శిష్యుఁడు దాను నిచ్చలం
జని మఱికొన్నినాళ్లకు నిశాకరశేఖరతుల్యుఁ డైనయ
య్యనఘుఁడు గంగలో జలకమాడి మతంబున కేగుచుండిదా
శునకకళేబరం బొకటి చూచె మతంబునఁ బ్రాణహీనమున్. 166
తే. చూచి దీనిశరీరంబుఁ జొచ్చి మఱుఁగు
దనర గోడగవ్యాసత్ప్రసాదంబు గొందు
ననుచు సంతోషపూరితుం డగుచు హృదయ
పంకజంబున నొక్కయుపాయ మపుడు. 167
చ. కనుఁగొని తత్సమీపమున క్ష్మాజము చెంతలఁ జేరి శిష్యతో
ననియె ముహూర్తమాత్ర మిట నాతపవహ్నినివారణార్థమై
యనువుగ విశ్రమింత మని యాతఁడు దానును దానినీఁ జడ
ల్లనిపవమానమందున నిలజ్ వసియించిరి మోదచిత్తులై. 168
ఉ. అటు వసియించి యాత్మకృత మాతని కేర్పడనీక శిష్య నే
నిట నిదురింపఁగావలయు నీ వతిజాగ్రతతోడ నుండు మె
చ్చుటికిఁ జనంగఁబోకు మని ఛాత్రునియూరువు మేల్తలాడఁగాఁ
గుటిలపు నిద్రఁ జెందె మదిఁ గొంకక తద్గురువర్యుఁ డత్తఱిన్. 169
తే. అసమ మైనట్టి యితరకాయప్రవేశ
విద్య తనయందుఁ గల్గుట చోద్య మలర
నాత్మదేహంబు వెడలి తదంతికస్థ
శునకదేహంబుఁ జొచ్చి గ్రక్కున లేచి. 170
ఉ. నాలుకఁ బైట వేయుచు ఘనంబుగ రోఁజుచు నాపులించుచున్
నేలనుమూరకొంచుఁ గడునిక్కుచుఁ బొర్లుచుఁ జొంగ రాల్చుచున్
వాలముఁద్రిప్పుచున్ శిరము వాల్చుచుఁ గర్ణములన్ విదల్చుచున్

మూలుగుచుఁ గ్రేసం జనుచు మోరయెత్తించుక మీఁది కెత్తుచున్.

మ. చని తత్పట్టణబాహ్యదేశగతమౌ చండాలవాటిన్ వసిం
చినదానిం గోడగవ్వ భక్తసహితం జేరంగ నేతెంచి యా
వనితామౌళికి భక్తి మ్రొక్కుచుఁ బురోభాగంబునన్ నిల్చినం
గని దివ్యేక్షణసంగతిం దెలిసి యుగ్రస్వాంతయై యిట్లనున్ 172

మ. స్వకులభ్రాంతిని వీడఁజాలక విశిష్టంబైన తజ్జంగమా
ధికవేషంబు పరిత్యజించి శుని వై తే మేలు మే లౌర జీ
వికభావింపఁ గులం బొకండు గలదే! వింతయ్యె నీమందబు
ద్ధికి సద్భక్తులు నవ్వరే! తెలియరాదే భక్తిమార్గంబులన్. 173

క. ఎందఱియోనులఁ బుట్టితి, వెందఱిచనుఁ బాలుఁద్రావి తెన్ని కులములం
బొందుగ వసియించితివిపుడందమె విప్రుండననియహంకృతిఁ జెందన్.

తే. పెద్ద లెల్లఁ బ్రతిష్ఠించుపిదప లింగ
మూర్తి యగుఁగాని శిల యనుమొఱకు గలఁడె?
యట్టిగతి దివ్యలింగాంగి యైనవాని
జాతిభేదంబు లెంచుట నీతి యగునె.? 175

క. అని పల్కి కుక్క! యిటు ర
మ్మని పెంచుకలోన నింత యన్నము వైవం
దనభాగ్య మింతె యౌ నని
కొని యతివకు మ్రొక్కి యతఁడు గుందుచుఁ జనియెన్. 176

చ. చని యొకచోట నాశునకసంహననంబును వీడి నిద్రమే
ల్కనుగతి లేచి కన్నులు కరంబుల నుల్చుచు బిట్టు నీల్గుచున్
దనప్రియశిష్యుఁ జూచి సదనంబునకుం బదమౌ యటన్న వా
మనుఁడు గురుం డొనర్చు బలుమాయ లెఱింగి సభక్తియై యనెన్.

చ. నను విడనాడి మీరు శునకాగతి నాగొడగవ్వమందిరం
బునను బ్రసాదముం గొనఁగఁ బోలునె? దేశిక తావకీనభా
జనగతసుప్రసాద మనిశంబు భుజింపుచు నేఁడు మిన్న కే
యనువున నుండువాఁడ నిఁక యబ్బుట లెట్లు భవత్ప్రసాదమున్.

ఉ. ఇత్తఱియైన నాకు నెల వీఁదగు నచ్చటి కేగి వేగమే
వత్తు రనన్ గురూద్వహుఁడు వామన! లోకు లెఱుంగఁ బోవరా

వ త్తరలాక్షి నన్నుఁ గనినట్టుల యట్లఁ గృతకాంగివైన నీ
వెత్తెఱఁ గొప్పనే గెదవొ యేగి ప్రసాదము గొమ్ము నావుడున్.179
చ. గురువరపాదపద్మములకుం బ్రణమిల్లి మహాత్మ! జంగమో
త్కరకుల మెంచఁ గా దని హితంబుగ మీరలు చెప్ప వించు నె
వ్వరుసున లోకనిందలకు భావమునందు భయంబు నొందనే
శరణవర ప్రసాదఫలసౌఖ్యము గాంచుట లెట్టు లెంచఁగన్. 180
క. కావున సహజాకృతిచే, నావనితామాళియింటికరిగెద నని స
ద్భావమునగురునియనుమతి, భూవిదితముగాగనతడుపోవగురుండున్.
ఉ. శిష్యునిమేలిబుద్ధి నన్నుఁ జెందకపోను స్మృతీతిహాసన
ద్భాష్యము లెన్ని యేని సతతంబు గ్రహించియు భక్తిమార్గవై
దుష్యము గాన నైతి మఱి దొట్టినమంచత లోకు లెల్ల నన్
దూష్యము సేతు రన్ భయముతోఁ జరియించితి మీదెఱుంగమిన్.
క. అనిపగలమిగులఁబొగులుచుఁ, జనమతమునకేగెనంతతచ్ఛిష్యుఁడుప్రా
క్తనసుకృతమహిమవలనన్, జనియాగొడగవ్వదివ్యసదనముగాంచెన్.
తే. కాంచి లోపలి కేగి యక్కాంతయడుగుఁ
దమ్ములకుఁ జాఁగి మ్రొక్కి యోయమ్మ! నీవ
హాప్రసాదంబు మద్గురుఁ డారగించు
పాత్రమం దిడి కరుణించి పంపు మనిన. 184
తే. ఎంతదాసోహపరుఁ డితం డెంతధీరుఁ
డెంతగురుభక్తినిష్ఠాత్ముఁ డెంతధన్యుఁ
డెంతసాహసుఁ డని యెంచి యింత యతఁడు
వేఁడుమాడ్కిఁ బ్రసాదంబు పెట్టుటయును. 185
క. పరమామృతమనివామనుఁ, డరుదందుచుగుడిచిలేచినంతట నెదుటన్
సులమానియశువిద్యా, ధరగరుడోరగులుగొలువదయమదిబొందన్.
సీ. ఘనవృషభేంద్రుండుగాలిమేపరిపిండువాజిగాభూషణరాజిగాఁగ
గిట్టులదొరచూలుకడిదిబెబ్బులితోలు నాలుగాఁబలుపన్నె శాలుగాగ
గడలిఁబుట్టువిషంబు కాముబూభసితంబు మేఁతగానెమ్మేనిపూఁతగాఁగఁ
బావకజ్వాలంబుబలువైనశూలంబు బొట్టుగాగడుపోటుముట్టుగాఁగ
తే. రమ్యతరవసుంధరాధరాధరములు, తేరు గాఁగ వింటితీరు గాఁగ

దనరునట్టి శ్రీసుధాకరశేఖరుం, డభవుఁ డచట నిల్చె హర్ష మలర.

తే. ఇట్లు ప్రత్యక్షమైన సర్వేశ్వరునకు, వామనుం డప్డు సాష్టాంగవందనంబు
లాచరించి యమందమోదాత్ముఁ డగుచు, విమలసద్భక్తి నిట్లని వినుతి చేసె.

నిరోష్ఠ్యస్వరలఘుగీత.—

శరనిధిశయనశర! ఖరకరదహనర, జనికరనయన! కరిదితిజహరణ! గర
గళ! సకలయతతతినతికలితచరణ!, ధనదసఖ! క్షితిరథ! రజతనగశరణ!

చ. అని నుతియించు వామను దయామతిఁ గన్గొని యోకుమార నీ
యనితరపుణ్యభావమున కచ్చెరువందితిఁ గాన మానికే
తనమగు రౌప్యభూధరము దార్చెద రమ్మని పల్క నంత న
య్యనఘుఁడు విన్నవించె వినయంబునఁ గ్రమ్మఱ భక్తి మ్రొక్కుచున్.

ఉ. ఓపరమేశ! యోవరద! యోబుధవత్సల! యోమహేశ! మీ
రిపగిది న్వచింపఁ దగునే నను ధన్యునిఁ జేయు మద్గురుం
బాపవిదూర! మున్ను నిరపాయభవత్పురిఁ జేర్చి వెన్క న
న్నీ పదమందఁ జేయుటది మేలగునట్టుల చిత్తగింపవే. 191

వ. అనిన విని పరమేశ్వరుం డాత్మగతంబున వేదపితామహుండు భక్తభు
క్తశేషోపభోగప్రభావంబున నిజపదప్రాప్తుండని యెఱింగియుఁ జంగ
మకులభేదనం బొనర్చుటవలన హీనజన్మంబగునని లోకుల కెఱుకపఱు
పను, శిష్యునిమనం బరయనుం దలంచి వామనుం గనుంగొని. 192

మ. అనఘుం డీతఁ డనంగ వన్నెగను మీయాచార్యవర్యుండు పా
వనసద్భక్తిపథం బెఱుంగక జనవ్రాతంబు లగ్గించునో
యని చిత్తంబునఁ గొంకి దా శునకదేహం బందఁ గాంక్షించె గా
వున నీమీఁదిభవంబు కుక్కయగుచుం బుట్టంగ నర్హుం డనన్. 193

సీ. బిట్టులిక్కి వామనుం డిట్టులపల్కె మద్గురుని కాహీనకుక్కురభవంబు
జగములఁ బుట్టింప నెగడింప నణగింప శక్తులౌ మీరలీసమయమందు
వేదపితామహు వెల్తి సేయక భవత్సదనంబుఁ జేర్పఁగఁ జాలవయ్య
యిదిగాక యేరూపమేని పూనియు భక్తిభుక్తశేషము గాంచి పుణ్యుఁ [డయ్య

తే. నతని విడనాడి యే వచ్చు టర్హమగునె?
గాన నాతనితోఁ గూడ ఘనత మెఱయ

నన్నుఁ గొనిపొమ్ము నావుడు నందివాహుఁ
డాత్మలోపల సంతోష మానపిల్ల. 194

క. నీభక్తినలనఁ జిక్కితి, శోభితగతి నీవు వేఁడు నొప్పున నడుతుఁ
వైభవమున గురు దోడ్కొని, నాభవనమ్మునకు నమ్ము నయగుణశీలా.

క. అనితద్గురుశిష్యుల నాత్మనికేతనమునకు సురసమూహము పొగడ
ఘనపుష్పవిమానమునం, గొనిపోయెశివుండు చిగురుకొనునయతోడన్.

వ. కావున బ్రసాదమాహాత్మ్యంబిట్టిదని తెల్పి మాచిదేవాదులతో మాది
రాజయ్య మఱియు నిట్లని చెప్పం దొడంగె. 197

బిల్లమరాజు కథ.

తే. రాజగురుబుధకవులచే దేజ మెసఁగి, భాసమానసుధర్మాధివాసమగుచుఁ
బ్రబలజిష్ణుప్రభూత్తమపాలితమయి, నాక మన నొప్పు గరిదిగియను [పురంబు.

ఉ. అపున మేలురత్నకటకాంచితపాదుఁడు ఘోరఖడ్గస
దీపితుఁ డాత్మగండతలనిర్మలరాంకవభాసమానుఁడ
ప్తాపకసానురాగుఁడు విశంకటవర్తివాపినీచయ
వ్యాపితుఁ డౌర మేలన ధరాధిపుఁ డొక్కఁడు బిల్లమాఖ్యచేన్. 199

మ. అసమానోత్తరశైవతద్విదుఁడు నుద్యద్దేశికాధీశప
ద్విసజాతాలయమానసుండు సతతార్థివ్రాతసంపోషకుం
డసమాస్త్రాంచితరూపవంతుఁడచలేంద్రాతీతధైర్యుండనన్
వసుధామండలమేలె నాతఁడు జనానందంబుగా నెప్పుడున్. 200

క. జాతిశుఁడనఁగధరబ్రఖ్యాతిగనరదేశికాగ్రగణ్యకృపావి
ద్యోతితశివలింగధరుం,డై తోరపుభక్తినలరియనిశముఁబ్రీతిన్. 201

ఉ భోజన లేప నాంబర విభూషణ వాదన నృత్త గీతికా
వాజి గజాధిరోహణ శివప్రదసత్కృతిముఖ్యముల్ హృదం
భోజ మెలర్ప సద్గురుఁడు ముందుగఁ గైకొన కేను గోనటం
చాజగతీశచంద్రుఁడు మహానియమం బొనరించె మించుగన్. 202

క. మఱియునుబ్రాతఃకాలము, తఱిగురుదర్శనము సేతువప్పక యని యే
ర్పాటువ్రతముఁబూనియుగాగతి, జఱిపెం గాలంబుకొంతసద్భక్తిమెయిన్.

సీ. అంతటఁ జామయ్య యనుదొమ్మరీలమేఁతరితనపీడును దానుఁగదలి
మనకతిత్తులుతుంగకనవు చాఁపలు పసిగొయ్యలుజనపమోకులునుసలల

చిక్కముల్త్రాళ్ళుమాసినచింపిబొంతలుదామెనత్రాళ్ళుగోతములువెండ్రు
కలమోపులునుదువ్వెనలుగేదెకొమ్ములు ప్రాతకుండలుచిన్నిబాడితె

తే. కంపు గుడిసెలసామగ్రి కంపుజోళ్ళు [లును
కుఱుచరోఁకండ్లు చిన్నిదాగఱలు మొదలు
గాఁ గలుగువస్తుజాతంబు గార్దభములు
మోచి తే వెంటఁ గూకరములు చనంగ. 204

క. అరుదెంచితత్పురివర, పరిసరమునవీడువిడిసిభావములలరన్
ధరణీశుసద్మనోత్సుక, పరులై తగువారియుక్తపద్ధతితోడన్. 205

చ. మురుగులు కాసికోకలును ముక్కువలుగ్రుచ్చిన చల్లడాలు కం
ధరలు మెఱుంగుగుండ్లు పగడంబులు పెందులినంటుపోఁగులున్
గనములు చెక్కడంపుఁజెవికమ్మలు కత్తులు తట్టుపాగ లీ
గరిమను వేషముల్ దనరఁగాఁ గన నయ్యెను వీటిపెద్దలన్. 206

సీ. రతనాలకుప్పెసౌరపుజడకుచ్చులు శశిపూలచందురుల్ సరిగెలుచెవు
లనుబవిరెలుకమ్మలునుముక్కుముక్కెర లడ్డకమ్మలుముత్తియంపుఁగమ్మ
లురుసకాత్తికహారములుభుజకీర్తులుకడియముల్ మొలనూళ్ళు కాళ్ళసజ్జ
జెలుగుపావడలునుజీనాంబరంబులువన్నెకంచెలలు పెంబట్టుముసుఁగు

తే. లమర మేనుల దీధితు లతిశయిల్ల, నోరచూపులవిటులను జేరబిలువఁ
దలిరువిలుకానిపట్టుపుదంతులనఁగ, జతనమైరంత దొమ్మరిసాను లంత.

క. ఈచందంబున నిజవ, ర్ణోచితవేషములుదాల్చి యొండొరు గడవం
జూచుజనుల్ వెఱగందఁగ, బ్రాచుర్యం బొప్ప నగరిపద్ధతి నంతన్. 208

చ. అడిదము బాసుగత్తి లసియంత్రములున్ మరుగాళ్ళు డోళ్ళు సం
గడివలయంబులున్ మెఱుఁగుకంచము లభ్రితలోన్నతంబుగా
గదలుగుదార్లు పగ్గములకత్తులఁబొనులు గడ్డపాఱలున్
బడిఁ గొని మేటిదొమ్మరులు వచ్చిరి బిజ్జలమహీశుసాలికిన్. 209

ఆ. అరుగుదెంచితద్ధరాధిపుగృహబహి,రంగణమున నిల్చి యంబువాహ
నినదమట్లు నినజనులకుఁ జెప్పఁ దొండ, బెక్కడోళ్ళుగొట్టిరొక్కమొగిని.

ఉ. ఆరవ మాలకింపి సభ నందఱు బమ్మెరపోవునంతటం
భూరమణుం డదేమి యటఁబోయి కనుంగొనుఁ డన్న వేత్రనుం
డారసివచ్చి నిల్చి వినయంబున నిట్లని విన్నవించె దే

వా రమణీయవేషముల వచ్చి వసించినవారు దొమ్మరుల్. 211

క. అనవుడు దరహసితానన, మునసచివుని గనిన నతఁడు ముదమున విద్యా
ఘనులగుటవారు దేవర, యనుకంపకు యోగ్యులగుదురని నతనితోన్.

సీ. భూమీశుఁ డనుమంత్రిపుంగవ? యే విలా
సములైన నస్మదాచార్యుఁ డెలమి
మున్నుగాఁ గనక యే కన్నులఁ జూడ నే
వ్రతము పూనితిఁ గాన వారి నచటి
కనుపంగఁ దగునన నౌఁగాక యని చారు
చే నత్తెఱంగెల్లఁ జెప్పి పనుప
వాఁడు సత్వరమున వచ్చి సంపడి పెను
బొబ్బలుడోళ్లు చప్పుడును నణఁపి

తే. పెద్దయగుచాము దేవరఁ బిలిచి మనుజ
పతినియోగంబు దెల్పినఁ బరమహర్ష
మెసఁగఁ దనవారు దాను జాతీశుఁ డున్న
రాజితోద్యాన మపుడు చేరంగఁబోయి. 213

మ. కని యెం దొమ్మరిమేదరీఁడు విలసత్కంజాశుగాప్తానన
త్యనిశాంతాయితచూతభూజఫలసారాస్వాదనాశాలస
ద్ఘనకీలోద్భటరావసంచరితపాంథవ్రాతఘర్మాపనో
దనదక్షానిలసంచలత్కదళికాతండంబు నుద్యానమున్. 214

వ. కని యొండొరులతోడ. 215

మ. వనమొప్పెన్ ఘనమై స్వకీయసితభాస్వచ్ఛాయతో నేకమా
కనకాశోకతమాలముఖ్యసుమనఃకాంతీంద్రచాపంబుతో
జనితామోదలతాంతవిశ్రుతరసాసారంబుతోఁ బన్నగా
శనశారీశుకముఖ్యనీడజరవాంచద్గర్జతో నెంతయున్. 216

క. అనియీతీరునఁ బల్కుచు, వనజాతాకరవిలాసవసతులు గనుచున్
ననలలరులుగోయుచులో, చనపర్వంబులుగ వారుచనిచని యెదుటన్.

శా. హీరోదారకవాటబంధురము రాత్రీశాశ్మకుడ్యంబు దై
త్యారాతిశ్వరనీలకుట్టిమము ముక్తాంచద్వితానంబు స

...ద్వారి స్తంభము రత్నతోరణమునై పొల్పొందుభాస్వచ్ఛతు
...ర్ద్వారాగారము గాంచి రత్తఱి సముద్యన్మోదచేతస్కులై. 218

వ. తదీయమధ్యప్రదేశంబున. 219

సీ. కేవలశాంతిచేఁ గృష్ణాజినంబునఁ బద్మాసనస్థుఁడై పరగువాని
మస్తకముఖ్యసమస్తాంగముల భసితోగ్రాక్షధారియై యొప్పువాని
శమదమానూనవిశ్చలచిత్తవృత్తి సదానందకలితుఁడై యలరువానిఁ
గరతలన్యస్తలింగధ్యానపరవశ మతి నితరం బెల్ల మఱచువానిఁ

తే. గాంచి మ్రొక్కి పరాకు భూకాంతుఁ డనుప
వచ్చినారము దేవరవారిసముఖ
మందు మానేర్చువిద్య లింపొందఁ జూప
నవధరింపుము గురువర్య! యచలధైర్య!. 220

క. అనిపల్కుచుఁ దోడ్తోడన, వనధిధ్వానముగ డోళ్లువాయింపుచు ఘ
ల్లన బొబ్బలిడిభుజాస్ఫాలనములుగావించి మదిఁ జెలంగుచు నంతన్.

ఆ. గడలునిల్పినాల్గుగడల పగ్గంబులు, గట్టిమ్రొక్కి పుడమి మట్టిదిగిచి
ఫాలములనలందిపైఁజల్లుకొనివిద్దె,లాడఁదొడఁగిరప్పుడతిముదమున.

క. పలువురు బిల్ల మెరంబులు
తిరుగుడు లంతరమునందుఁ ద్రిమ్మరుటలు దు
ర్ధరమత్స్యపుటము లొండొరు
లురువడి నరిఁ బెనఁగుటలు జనోత్సుక మయ్యెన్. 223

క. కత్తులబోనులుదూరుచుఁ, గుత్తిగఁ బెక్కండ్రనొకటిగొనిమోయుచును
వ్రేత్తునఁబంటనుదూలము, లెత్తుచుమఱికొందఱాడి రెలమిఁవహింపన్.

ఉ. మూఁపునరాసభంబులను మోచుచు దండెపుఁదోలుమోకుపై
నేపున జంకులేక యెదురేగి శరీరము లంటనీక కాల్
చాఁపుచుఁ దప్పరించి పదిలంబుగ నొండొరు లీవలావలై
చూపఱు లాత్మ మెచ్చఁ జనుచుం నటియించిరి కొందఱందులోన్.

క. వాయునిరోధముఁజేసివి,హాయసమధ్యంబునందు నసియంత్రముపైఁ
గాయమునిల్పెను జను లా,హాయన నందొకసరోరుహానన చులకన్.

సీ. తలఁ గొన్నిదొంతికుండలు నిల్పి తలఁకక
గడయెక్కి నటియించెఁ బడఁతి యోర్తు

నాభియం దమ్ము మొనను నాటి చక్రంబు
కైవశిఁ దిరిగెను గాంత యోర్తు
చివర వెన్నున మోపి యవలీల మ్రొగ్గుగా
వ్రాలెఁ జలింపక బాల యోర్తు
కా లడ్డమైయున్న కట్టకుఁ బదిలించి
తల క్రిందుగా వ్రేలెఁ దరుణి యోర్తు

ఆ. పదయుగంబునందుఁ బాదుకల్ బదిలించి
మోకు వెంటఁ దిగియె ముదిత యోర్తు
మీఁదనుండి పిల్లి మొగములు వేయుచు
వచ్చి పుడమి నిల్చె వనిత యోర్తు. 227

ఉ. ఈపగిదిన్ సమస్తమనుజేక్షణపర్వముగా నటించి ని
ష్ఠాపరిపూర్ణులై యలరు సద్గురుసన్నిధి నిల్చి మ్రొక్కి దే
వా! పొలుపొందుమీఁదయకుఁ బాత్రుల మింతియె కాని యిట్టివి
ద్యా? పరికింపఁ గారణము ధారుణి మిమ్ముల మెచ్చఁజేయఁగన్?.

క. అనియంతటొక్కమొగిఁ ద,న్వినుతించినపల్కులతఁడువినక కనక పా
వనలింగలీనవీక్షా, జనితామోదమున నున్న చామయ వగచెన్. 229

చ. కటకట మీర లాడు పెనుకష్టపువిద్దెలు చూడఁడాయె ము
చ్చటకుఁ బనేమి పోద మని చామయ పల్కినఁ దత్తనూజ మా
రట సురవేశ్యయో యనఁగ రాజిలుచుండెడి చెన్నసాని నీ
విటు వగఁజెంద నేమిటికి నే గుటిఁ జెప్పెద నంచు నిట్లనున్. 230

ఉ. ఉల్లములోన నుంచు సమయోచితభంగి దలిర్ప గట్టురా
జల్లునిఁ జూచు నీగురుమహాత్ముని నెవ్విధినైనఁ దమ్మిచూ
డల్లునిబారిఁ ద్రోచి హృదయంబు గలంగ నొనర్చి రేపె నీ
యల్లునిఁ జేసి తెచ్చెద రయంబున నేఁ గనుగీటి పీటికిన్. 231

క. అని పల్కి యవ్విలాసిని,జనకుని యొడఁబఱచి తిరుగఁజనుదెంచుతలం
పునఁ దనవారునుఁదానును,మునువిడిసినపీటికరిగి ముదముదలిర్చెన్.

సీ. చిత్రదుకూలంబు చెలువుమీఱఁగఁగట్టి రవపైఁడిమొగ్గల రవికదొడిగి
సొగసుగా నుదుటఁ గస్తురిరేఖ గీలించి పూలదండలు సిక వ్రేలఁజుట్టి

కన్నుల సన్నముగాఁ గజ్జలముదీర్చి లీలాసరోజంబు కేలనునిచి [ల్చి
యగరుగంధముచెక్కులను బల్చుగనలంది యెదలింగపేటికకుదురుకొ
తే. యాకుమడుపాకచెలి యివ్వ నందికొనుచు
వీణఁ గైకొని యొకసఖి వెంట రాఁగ
వీరమోహినికైవడి వీడు వెడలె
సిరుల వెదచల్లు వగఁ బూని చెన్నసాని. 233
క. ఇవ్విధమున నాజవ్వని, పువ్వులవిలుకానిదంతిపోలు పమరునడల్
నివ్వటిలమొగమునసుజిలు,నవ్వాలయఁగగురునియు పవనస్థలిఁ జెందెన్.
సీ. అటు చని తద్దేశకాంతికస్థలమున
నాసీనయై సరోజాయతాక్షి
చెలిచేతివీణియ చే నంది గవిసెన
సడలించి సారెలు చక్కనొత్తి
కొవాఁడిగోళ్లఁ దంత్రులు మీటి యొండొంట
జత మేళవింపంగ శ్రుతు లమర్చి
విరచితాత్మీయకంఠరవమ్ము హ స్తవి
పంచికాస్వనములోపల మెలంగ
తే. రమ్యతరధృతమధ్యవిలంబితములఁ
దాళమానక్రమంబులు దప్పనీక
లలితమందరమధ్యతారములు మెఱయఁ
క్రమము మీఱంగ సప్తస్వరములు చెలఁగ. 235
ఉ. భైరవి నాట తోడి సిరిపాళి దిశావిశి దేశి మారువా
గౌరి బిళాహురీ లలిత కన్నడ గౌళ ముఖారి దేవగాం
ధారి వరాళిమోహాన ధనాసరి ఘూర్జరి పూరి బేగడా
యారభి రామఖల్లి మొదలై తగురాగము లింపుమీఱఁగన్. 236
క. మొరడులుచిగురింపఁగరాల్గరఁగఁగఁజత్తురుపుబొమ్మకదుఁదలలూఁచఁ
దెఱవలతలమూనిక యే, దెఱఁ బాడుచు వీణపై జతిం బలికించెన్.
క. అంతట లింగగతధ్యా, నాంతం బగుటయును దేశికాగ్రణికరయు
క్కంతువిదారునిపేటిక, సంతసగాఁగుదురుకొలుప్వసమయమునందున్.
క. ప్రమదాళినీస్వనంబునఁ, బ్రమదాంతత్నంబు పాడుపాటలు చెవికిన్

భ్రమసంబెనయింపవిశీ, భ్రమసనహంసమూర్తిచలితభావుండగుచున్.

మ. కనియెం గట్టెదుటన్ మనోజ్ఞశశభృత్ఖండాలికన్ మేఘవా
హనసీలోపలసీలకైశికసుమోద్యన్మాలికన్ భవ్యయా
వనగంధానిలధూతకామిజనభాస్వద్ధీరతాతూలికన్
వనజాతాంబకహస్తకీలితమణీపాంచాలికన్ బాలికన్. 240

చ. కనుఁగొనునంతలోన సుమకార్ముకుఁడాత్మవిరోధికల్పునిన్
ఘనుని మదిం గలంచఁ దలఁచె గన్పడె సంచు: గుతూహలాత్ముఁడై
కనుగలవింటఁ దమ్మిసెలకట్టియ లెక్కిడి చక్కఁగా నుర
మ్మున గుఱిచేసి వేసిన సముత్కటమోహము నిల్పఁజాలమిన్. 241

సీ. ఘనపురాతనభక్తకథలు విన్వీనుల
వెలఁది లేఁబల్కులు వినఁగఁ గోరు
గురుచరేశ్వరుల మక్కువఁ బూన్పు కరముల
నంగనకుచయుగం బంటఁ దివురుఁ
గరతలన్యస్తలింగముఁ గనుకన్నుల
సుదతిచక్కఁదనంబుఁ జూడ నెంచుఁ
ద్రివిధప్రసాదముల్ చవిగొనుజిహ్వచే
నతివసుధారసం బానఁ దలఁచుఁ

తే. గలితనిర్మాల్యవాసనల్ గాంచుఁ నాస
చెలియనెమ్మేనితావులుఁ జెంతఁగోరు
నట్లు పంచేంద్రియవ్యవహార మెల్ల
నంబుజాతాక్షియందున హత్తుకొల్పె. 242

క. ఇటులుండి కొంతవడి కా, కుటిలాలకపలుకు వినెడి కుతుకంబునఁ దె
జ్జటియిటులపల్కె న త్తఱిఁ, బటుతరమోహాతిరేకభావుం డగుచున్.

క. ఎవ్వరిదానవు? జవ్వని!, యివ్వని కేకతమ వచ్చి తేమని? మదిలో
నువ్విళులూరుచుఁబల్కిన, నవ్వారణయానయిట్టులనియెనతనితోన్.

ఉ. దేవ! మహానుభావ! భవదీయపదాంబుజదర్శనేచ్ఛ ధా
త్రీవరమౌళి యంప నరుదెంచితి దొమ్మరిపీటిమేతరిఁ
జై విలసిల్లుభామయకు నాత్మజఁ జెన్నకపేరుదాన వి
ద్యావిభవంబు గాంచి కరుణామృతదృష్టిఁ గృతార్థఁ జేయవే. 245

క. అన విని వనితాతనునూ,తనయాావనఘనతఁ గని ముదమునొందినయ
మ్మునియప్పలుకుల కెంతయు, ననురాగమునొందియిట్టులని యెవనితతోన్.

చ. కలితభవద్వయోగరిమ కన్నుల కింపుగఁ గాంచినంత నే
తలిరులవింటిజోదు బెడిదంబుగ నీకడగంటివాఁడిచూ
పుల బలునారసంబులుగఁ బూని యెదం గుఱిచేసి యేయ నో
చిలుకలకొల్కి! నాహృదయసీమ చలింపఁగఁ జొచ్చె హెచ్చుగన్.

క. కల తెఱఁగుదాఁచ నేటికిఁ, జెలియా! నీ యెడలవాంఛ చెందినయదియ
వ్వైలరాజు బారిఁద్రోయం,బలఁపక రతి నేలు మతిముదం బిగురొత్తన్.

ఉ. కూరిమిశిష్యుఁడై వినుతిగొన్న మహాత్ముఁడు గాన వేడ్క నా
కోరిక దీర్పఁగాఁ బుడమికొమ్మమగం డిటు నిన్నుఁ బంపె నో
వారిజగంధి! నీచిగురువాతెర తేనియఁ గ్రోల నిచ్చి య
మ్మారునితాపవేదనలు మాన్పఁగదే యిదె నిన్ను వేఁడెదన్. 249

ఉ. నావుడుఁ జెన్నసాని వదనంబున లేనగ వంకురింపఁగా
నావలఁ జిక్కి మేటిద్విజనాయకుఁ డంచు మదిం దలంచుచుఁ
ధీవర! యిట్టు లాడఁదగునే? మీముబోఁటిమహాత్ము లైనవా
రీవిధి కిచ్చఁ జేతురె? గణింతురె? కంతుభవానురాగమున్. 250

ఉ. కామముఖారిసంచయముగం డడఁగించి మహేశదివ్యనా
మామృతపానతృప్తిఁ బనరారి కరస్థలలింగలీఢపీ
యూమతి నాజపంబున సుఖం బెడఁ గోరక రాజయోగని
ష్ఠామయు లైనవారి కకటా! తగునే యిటువంటిమోహముల్. 251

చ. అని యిటు పల్క విన్నఁదన మాననమందునఁ గానుపింప ని
ట్లను ననఁబోఁడి! నీ విటుల నారడిపల్కులు పెక్కుపల్కి చు
ల్కన నను నీడనాడి చనఁగాఁ దగునే? ఘనుఁడైన నీదుచ
న్నానల నురమ్మునం బిగియ నొత్తి కవుంగిటఁ జేర్చు మిత్తఱిన్. 252

తే. ము న్నొడయనంబిముఖ్యులు మోహవృత్తి
వాసి గోల్పోయిరే యెందు? వారికంటె
నేను ఘనుఁడనె మఱుమాట లేల లీలఁ
బూవువిలుకానికేళి న న్నేలు బాల!. 253

చ. అనవుడుఁ గేలుమోడ్చి వినయంబున నిట్లని విన్నవించె స
జ్జనసుత! తావకీనతనుసంగతి నేఁ గడు ధన్య నౌదు మీ
యనఘతపోబలంబునకు హాని ఘటించు నటంచుఁ గొంకి తిం
పెనయఁగ మీయభీష్ట మిపు డెట్టుల యట్టుల చిత్తగింపవే. 254

తే. అనిన నమ్మాట కర్ణరసాయనముగఁ
జెవులు సోఁకినయంత దేశికవరేణ్యుఁ
డౌర కోరినకోర్కి చేకూరె ననుచు
నాత్మ సంతసమందు నయ్యవసరమున. 255

ఉ. వారిజమిత్రసింహము దివస్పతిదిగ్గిరి నిర్గమించి దై
త్యారిపదాటవీస్థలి దినాఖ్యమదేభము వెంటనంటి త
త్సారమదంబునం జరమశైలతటంబునఁ జెంది సక్తర
క్తారుణదేహమై యరిగె నగ్గిరిమాటునకున్ రయంబునన్. 256

చ. వనరుహమిత్రుఁ డస్తగిరివ్రాలుతటిన్ గవ వీడుజక్కవన్
ఘనతరశోక మంపఁ గని కాంతుఁడు నన్ గవయంగ రా వనం
బునఁ గడుసైఁపలేక నివి పొక్కఁ బనేమి యటంచు వారుణీ
ఘనకచ వానిబల్కినుకఁ గన్గొనె నా నెఱ దోఁచెఁ దద్దిశన్. 257

చ. పనిగొని కాలమాంత్రికుఁడు పాంథవిదారణ రాత్రిశక్తి సే
వున సృజియింపఁగాఁ జరమభూధరవేదిక సాంధ్యరాగవ
హ్ని నిలిపి పద్మబాంధవఘృణిస్ఫుటపల్లవరాజి వేల్వ హె
చ్చినసితధూమముల్ దెసలఁ జెందె నినాదము నొప్పె నెల్లెడన్.

మ. చటులధ్వాంతగజాధినాథుపయి నాచ్ఛాదింపఁగా నొప్పు వి
స్ఫుటతారాపథనీలపట్టవసనాభోగంబునం జిత్రితో
త్కటపాండుప్రసవంబులో యనఁగ దిక్కాండంబులం గాంతి మి
క్కుట మై పర్వఁగఁ దారకావళులు గన్గొనయ్యె నప్పట్టునన్. 259

ఉ. ఖ్యాతమహీధ్రసంగతదవాగ్నులు నారతిదీపముల్ చకో
రీతతి పేరఁటాండ్రు దివిరిక్కలు నీలపుఁబాత్ర సేసఁబ్రా
లాతతరాత్రి యన్ సరసిజాక్షి వరింప గజాధిరోహణం
బై తనరారె నాఁగ నుదయాద్రిపయిన్ శశి దోఁచె వింతగన్. 260

చ, తొవ వికసించెఁ బేటిగమి తోయజగేహములఁ న్వసించెఁ బ

క్షితితతి నీడ సంయమునిఁ జేరి సుషుప్తి సుఖంబుఁ గాంచె న
ర్ణవములమ్రోఁత మించె వలరాజు ముదంబు వహించెఁ జక్రముల్
కవవిడి సంచరించె శశికాంతశిలల్ ప్రవహించె నీరమై. 261

ఉ. ఆసమయంబునన్ గుహలయాంబకబాణము లిందుపాదవి
న్యాసము లంగవేదన మొనర్పఁగఁ దాలిమి నిల్పలేక త
ద్వాసవరత్నవేణికరతామరసగ్రహణం బొనర్చి దా
భాసురసూనయుక్త మగుపాన్పునఁ దార్చి గురుండు వేడుకన్. 262

మ. సరసాలాపనఖక్షతాధరసుధాస్వాదాచ్ఛతాంబూలదో
ర్భరితాలింగనచుంబనాదికములన్ రంజిల్లుకందర్పసం
గరకేళిన్ రసవార్ధిఁ దేలి మలయాగస్పర్శనాంకూరకో
త్కరముల్ పర్వఁగఁ గొంతప్రొద్దుసుఖనిద్రం జెందె నవ్వేకువన్.

చ. సతి గురునాథు మేల్కొలిపి స్వామి! భవత్కరుణాకటాక్షసం
గతిఁ గడుధన్యనైతిఁ జనఁగావలె వీటి కనుజ్ఞ సేయుఁ డీ
గతిఁ దెలవాఱ నన్నిచటఁ గన్గొని కిన్క వహింపకుండునే ?
క్షితిపతి మీకు లాఘవముఁ జెందకపోవ దటన్న నిట్లనున్. 264

చ. ఘననిభవేణి! యొక్కత్రుటికాలము నిన్నెడఁబాసి నిల్వ నే
ర్తునె? విరహాంబురాశి ననుఁ ద్రోచి చనం జరణంబు లాడునే ?
పనిగొని నీవు నాకయినభాగ్యమునం జనుదెంచి తిప్పు డ
జ్జనపతి యాజ్ఞసేయు నని సాధ్వస మేటికి? నేను గల్గఁగన్. 265

ఉ. నావుడు మీరు పల్కువచనంబులు సత్యము గాని నే వినన్
భూవిభుఁ గానఁ బోవలయుఁ బొమ్మనినం జని రాజుచేత సం
భావన లంది వేగ యిట వచ్చెద నేఁ జనకున్నఁ జంద్రికన్
భావమునందు వేరె యొకపద్ధతి దోఁచు ననుజ్ఞ యీఁగదే!. 266

చ. అనవుడు దేశికుండు కమలాసన! భూపతిఁ గానఁ బోవుటల్
ధనమునకై కదా? వలయుద్రవ్యము లిచ్చెదఁ గొమ్మటంచుఁ గాం
చనమణిభూషణావళు లసంఖ్య మొసంగిన సంభ్రమంబునం
గొని వినయంబుతోఁ బలికెఁ గోకిలవాణి నమస్కరించుచున్. 267

ఉ. కన్నది యాది మజ్జననికన్నఁ బ్రియంబున గారవించు మా
యన్న యొకప్పుడుం దరియ నన్నుముపొత్తున నాకు ముద్దలీ

కున్న భుజింపఁ డట్లగుట నొద్దికఁ బొద్దటిచద్దివేళ దా
ర్కొన్నది కాచియుండు జనకుం డిదె వేగమె పోయివచ్చెదన్. 268

క. అనవుడు నెన్నివిధంబులఁ, జనవలెననువాంఛ నీదుస్వాంతములోనన్
జననం బయ్యెను గావునఁ, జనివేగమ మరలి రమ్ము సరసిజనయనా!

తే. ఈవు వచ్చినదనుక నాహృదయ మెందు
నొంద దని కన్నుఁగవబాష్పబిందు లురల
గబ్బిచనుగుబ్బ లెద నంటఁ గౌఁగిలించి
సెల వొసఁగి పంప నంత నచ్చిగురుఁబోఁడి. 270

ఉ. అచ్చట వానియాత్మ ముద మందుచుఁ గ్రక్కున వీడుఁ జేరఁగా
వచ్చి నిజక్రమంబు తమవారల కంతయుఁ జెప్పి సద్గురుం
డిచ్చిన వస్తుభూషణము లెల్లను దండ్రి కొసంగ మెచ్చి లో
నచ్చెరువంది కూఁతుఁ గొనియాడుచు వేడుకనుండు నత్తఱిన్. 271

మ. ఘనమందేహనిశాచరు ల్బలసి బిగ్గం బట్ట నేతెంతురో
యని పూర్వాచలదుర్గసీమ జలజాధ్యక్షాజ్ఞఁ దత్పూతనూ
తనసేనాపతి వెల్లువై నిలుపు చంద్రజ్యోతియో నాఁగ మిం
చినతేజంబున వేగుచుక్క యుదయించెన్ జంద్రుతో నుద్ధయై. 272

ఉ. వాసిగఁ గర్మసాక్షి యిదె వచ్చె నుపస్సమయోచితక్రియా
భ్యాసులు గాక యిప్పు డనయంబున నిద్దురఁ జెందఁ జెల్ల దో
భూసురులార! మీ కనుచుఁ బోధ మొనర్చినమాడ్కి వేకువన్
గూసెఁ బదాయుధప్రతతి కో యని కాల మెఱుంగుఁగావునన్. 273

చ. తెలతెలవాఱవచ్చె నలుదిక్కులు చీఁకటిఁ బుచ్చె నండజం
బుల రొద హెచ్చెఁ బన్నగసమూహము పుట్టలఁ జొచ్చెఁ గైరవం
బులమది నొచ్చె జక్కవలు పొందుగ మెచ్చె మనోభవుండు పూ
విలు రతిచేతి కిచ్చె సరవింపదళంబులు విచ్చె నచ్చుగన్. 274

సీ. అంధకారాతి బలాపహారుఁడవౌట బద్ధాప్తసంజ్ఞ చేఁ బరిఢవిలుట
జననుతంబగుత్రయీతనుత వర్తిల్లుట సంతతనాకసంచారి వగుటఁ
గువలయోల్లాససంభవకీర్తియుతుఁడౌట చిత్రభానుఖ్యాతిధాత్రిఁ గనుటఁ
బలుపలాశులపెంపుభగ్నంబు సేయుటఁ దారకాంచత్ప్రభావర్తివగుట

తే. నీవ శివుఁడవు హరి విధు లీవ వజ్రి
నీవ చంద్రాగ్నులును వాయు వీవ గుహుఁడ
వీవ యని భక్తిచే జను లెల్ల మ్రొక్కఁ
బూర్వదిగ్భూధరంబునఁ బొడిచె నినుఁడు. 275

తే. అపుడు చెన్నక నిత్యకృత్యములు దీర్చి
తండ్రి యనుమతిఁ గైకొని ధరణినాథ
దర్శనం బొనరింపఁగఁ దగినవేష
మొకటి నెమ్మది నూహించి యొరపు దనర. 276

చ. పద కటినేత్ర హస్త గళ ఫాల శిరంబుల నొప్పఁ బన్నగాం
గద కరిచర్మ శూల గరగంధవ హాస్త జటాళి యొక్కెడన్
గుదురుగ నిల్పి మున్నె తనకుం గలయట్టి యలంక్రియల్ శుభా
స్పదముగ నొండువైపునఁ బొసంగ నెసంగువిలాస మేర్పడన్. 277

క. తరుణి యిటు లర్ధనారీశ్వరవేషము దాల్చి యాప్తజనములతో నా
గరికు లరుదంద ధరణీశ్వరునాస్థానంబుఁ జేరవచ్చి ముదమునన్. 278

చ. ప్రకటమృదంగతాళఘనరావము లుప్పతిలంగ నిల్వ నం
తకమును దేశికప్రవరదర్శనకృత్య మొనర్చి సింహపీ
ఠిక వసియించు భూపతి వడిం గని దిగ్గున లేచి నిల్చి హ
స్తకమలముల్ మొగిడ్చి మదిఁ దాల్చె శివాధవుఁ డన్నభావమున్.

తే. ఇటుల భావించి యపు డమ్మహీతలేంద్రుఁ
డీశ్వరాకృతిఁ దాల్చిన యింతిప్రజ్ఞ
కద్భుతం బంది మితి మీఱునట్టివస్తు
వాహనాంబరభూషణావళు లొసంగె. 280

ఉ. ఇచ్చిన వేడ్కఁ గైకొని మహీతలనాథునినుజ్ఞఁ గాంచి ము
న్నెచ్చట నెవ్వ రిప్పగిది నీప్సిత మిచ్చిరె! యంచు నాత్మలో
నచ్చెరువందుచున్ మరలి యందఱితోఁ దమవీడు చేరఁగా
వచ్చి వినోదలీలలఁ బ్రవర్తిలుచుం జెలి యుండె నచ్చటన్. 281

మ. సతి తన్ జాల మొనర్చి చన్న మొన లాజాతీశుఁ డత్యంతమో
హితుఁడై వేగము వత్తు నంచుఁ జని యావేణాంకబింబాస్య స
న్నతి నూహింపక యుండె నిప్పు డహహా! నాభాగ్య మిట్లుండెనే

గతి వేగింతు నటంచుఁ గ్రిమ్మినమహాకామాంధకారంబునన్. 282

సీ. కొమ్మకైచిగురాకుఁ గొరికి కోయిల గూయ
    నబల పల్కె నటంచు నాలకించుఁ
గోలఁకులకై యంచకొదమ రాఁ గనుఁగొని
    ముదిత వచ్చెన యని కదియఁ దివురు
సుమగుచ్ఛముల వ్రాలి భ్రమరి ఝంకారింపఁ
    జెలివీణపల్కని చెవులఁ జొనుపుఁ
గలికిగంధపుగట్టుగాడ్పు మైఁ బొలయంగ
    సకిమేనివల పని సంతసించు

తే. నాత్మసంభవహస్తవిన్యస్తసూన, చాపనిర్ముక్తకోరకశరనికాయ
మ్మాతరిశ్వాపకీలాసమాజకృఛ్రి, భాజనాత్మీయమానసాంభోజుఁడగుచు.

చ. కలవల మందుఁ గుందుఁ గడగన్నుల నీరము పొచ్చు పెచ్చు లో
    నలమటమారు దూరు! జెలియా! యిటు రమ్మని పిల్చు నిల్చు మి
    క్కిలి వెత జిక్కు స్రుక్కు వలకేల నొసల్ గదియించు మించి వ
    వలగొనుతాపవేదనల వాసి దొలంగి గురుండు దీనుఁడై. 284

చ. జలచరకేతనాబ్జపికచందనశైలసమీరహంసముల్
    వలగొని తన్ను నొంపఁ దల వంచుచు హా! శిఖనేత్ర! హా! సము
    జ్జ్వలశశిభూష! హా! ధరణిజాధవసేవితపాద! హా! యధో
    నిలయవిభూష! హా! శరదనీలగళా! యని పేర్కొనున్ శివున్. 285

క. ఈరీతి వగలఁ బొగులుచు, నారీమణియందు మిగుల నాటినమదిచే
    నీరము నన్నము ముట్టక, భారముగా నొక్కగతి దివసమెడలించన్.

ఆ. తరణిగ్రుంకెఘోరతమముసర్దిక్కులఁ, గ్రమ్మెఁ జీకురాలరవము లెసఁగె
జారచోరనికరసంచారములుమీఱె, విరహిజనులనొంపవెడలెమరుఁడు.

క. అత్తఱి మత్తిలుచిత్తజు, కత్తులచే మొత్తఁబడి ప్రకంపితతనుఁడై
    హత్తినయుత్తలమున నా, బిత్తరిఁ గనుత త్తరంబు పెంపెసలారన్

క. శివపూజోపకరణములు, భవనంబున నొక్కచోటఁ బదిలపఱచి శి
    ష్యవితానమునకుఁ జెప్పక, శివమెత్తినవానివగిది శ్రీగురుఁ డంతన్.

చ. జనపతి విన్న నొమ్మనుచు జంగమభక్తు లెఱుంగఁ జుల్కగాఁ
    గనియె రన్న కొంకు మదిఁ గానక పౌరులు చూచిరేని ద

న్వైనుకొని గేలి సేతు రని వెల్వెలఁ బోవక లజ్జమాని ప
ర్వినతమి నేగె పేటికయి వేగమ తా మును విన్న జాడలన్. 290

క. ఈలీలఁ 'గాముకన్య సు,తో లజ్జా' యనెడుమాట ధ్రువముగ నపుడ
బ్బాలామణినావాసపు,టాలయమరయంగఁజనుచునంధతమము చేన్.

సీ. దామెనమోసులు దగిలియించుక మొగ్గి
గడలుపగ్గము లూఁతగా నిలుచుచుఁ
గ్రొత్తయా తనుఁ గని కుక్కలు గురువెట్టి
కఱచునో యని దవ్వుగా నరుగుచుఁ
జిరుగువెల్లుఁలను గొంచెము దారి గనుపింప
వేసఁ జను చది యాఱ దెస లరయుచు
నెడనెడ గుడిసెలఁ బడఁతులనుడుపులు
విని చెన్నిమాటలో యని తలఁచుచు [క్కటిలఁగ

తే. నంధకారంబు గాఢమోహాంధకార, మొక్క మొగివెలిలోఁ గ్రమ్మిపి
రేవుడప్పి చరించెడి నావకరణి, వీడు కలయంగఁదిరుగుచు వేసరిలఁగ.

క. ఇట్టిమహాత్ముని కాహా!, పుట్టెఁ గదా చెడ్డవెతలు పొలఁతుక నిఁకఁ గ
న్పట్టగఁ జేయుదు నని దయఁ, జట్టుల పగవానిదెస నిశాపతిదోఁచెన్.

తే. అట్టితఱి బండువెన్నల పట్టపగటి
వరణి గాయంగ నందలిజనము లతని
గాంచి జాతీశుగా నిశ్చయించి పలికి
రొండొరులతోడ నగుచు హాస్యోక్తు లలర. 294

క. ఓహో! చూచితిరే యీ, మోహాదివికారదూరు మునిచర్యబుధ
స్నేహార్జనరతుయువతీ, వ్యూహవిముఖుస్థైర్యచిత్తునుత్తమచరితున్.

తే. అతను గురుధర్మగుణకాండ యుతున కిప్పు
డతను గురుధర్మగుణకాండహతులు నమరె
పేటిలో రాజముఖులు సేవింప సింక
పేటిలో రాజముఖులను వెదకవచ్చె.

ఉ. ఎక్కడ బోయెనో నియమ మెందున డాగెనో మౌనివృత్తి యే
దిక్కున నుండెనో తపము దేశికుఁ డన్నియు నుజ్జగించి మా

చక్కెరబొమ్మకై యిటు నిశాసమయంబున నేగుదెంచె న
మ్మక్క కనంగ నయ్యె నొరవై యిపు డీతని విద్దె యంతయున్. 297

చ. అనవుడు నొక్కచేడియ మహాత్ముని మీ రిటు లాడఁ గూడునే?
యని యదలించి చెన్నక గృహంబిదె చూపెద రమ్మటంచుఁ దో
డ్కొని చని నిద్ర చెందుసుమకోమలి లేపి గురుండు వీఁడె వ
చ్చె నసిన నుల్కి లేచి వెఱ జెన్నె దురేగి నమస్కరింపుచున్. 298

శా. సామీ! నాయెడ జాలతప్పు గల దే చందంబునన్ వచ్చెదో
యే మీ రంపిన వచ్చి చద్ది దిని భూమీశాధ్యుచే గామిత
స్తోమంబుల్ గొని వీడుఁ జేరి సిల నిచ్చోఁ కార్య మే మన్యమా
సీమం జేరుద మంచు నయ్య యనిసన్ సేవింప రాకుండితిన్. 299

చ. అనుచుఁ గరంబు పట్టి వినయంబునఁ దోడ్కొనిపోయి శయ్యపై
నునిచి మనోజకేళి ముద మొంద నొనర్చి నెలంత కొంతసే
పున కిటు వల్కె నాదయనపుణ్యమునం నిను గూడఁ గంటి ని
ట్లనిశము బాయకుండునటు లబ్బకపోయె నికేమి సేయుదున్. 300

ఆ. వీడుదరలిపోవు వేళయౌ మాకిఁక, నెలవా సంగి మీరు శీఘ్రమేగుఁ
డపనిపతి ప్రభాతమైన మి మ్మర్చింప, వచ్చు నప్పుడుండవలయునచట.

క. నను జిత్తంబున మఱవకుఁ, డని తక్కిడివగల లోచనాంబువ్రులురుల
స్వనితామణి కౌఁగిట జే, ర్చిన గుండెభిగుల్లుమనఁగ శ్రీగురుఁ డనియెన్.

ఉ. కువలయపత్ర నేత్ర! నిను గూడి సుఖింపక యున్న నాకు భూ
ధవుని సపర్య యేల? మణిధామము లేల? సమస్తభోగ్యవ
స్తువితతు లేల నీ వరుగఁ దోఁ జనుదెంచెద నీకటాక్షమే
యవిరళవాంఛితార్థముల కన్నిటికిం గురు కాదె నావుడున్. 302

క. దొమ్మరికొమ్మఁ దగుల్కొని, ద్రిమ్మరె నను లోకనింద ద్రెళ్లక మిదెశీ
ఘ్రమ్మేను మరలివత్తుని, జమ్ముగ నామాటనమ్మి చనుమని యనుడున్.

సీ. జలజాక్షి! పెక్కుమాటల పనియేమి సింధాస్తుతు లాత్మకుఁదగుల నేర
వటుగావున ననిత్యమగు దేహమున నంటు సిందకు వెఱవనీవిఁదు జరిగి
వచ్చునంతకు నిలువఁగ నేర్తునే! నిను గలసి రా నీకుండు తలపుపుట్టెఁ
జేసె నిక్కార్యము సిద్ధము వలదని మానిచితేని మాయాన నిక్క

తే. మనుడు నేమియు నన. నేర కయ్యగారి
చిత్త మని సమ్మతించి యా చిగురుఁబోఁడి
తండ్రిఁ బిలిపించి వార్త యంతయును దెలిపి
పీడు దరలింపు మిప్పుడ పీడ ననిన. 304

క. వీటిజనములకుఁ బయనము, చాటఁబసిచి సకలవస్తుసహితముగా న
చ్చోటు వెడలిరప్పుడ వే, హాటకనగచాపుభక్తుఁ డరుదేఁదొడఁగెన్. 305

మ. చని కాశీనగరంబుఁ జేర నచటన్ సర్వంసహాభర్త వే
గిన గాలోచితకృత్యముల్ సలిపి రక్తిన్ దేశికాధీశుద
ర్శనవాంఛం జనుదెంచి తన్మణిగృహస్థానంబు నం దాతనిం
గన కెచ్చో వసియించెనో యనుచు దా నల్దిక్కు లీక్షించుచున్. 306

ఉ. అచ్చటనచ్చటం దిరిగి యాతనిశిష్యులఁ గాంచి దేశికుం
డెచ్చట నున్నవాఁ? డన మహీధవ! సిన్నటనుండి కాన లే
దెచ్చటి కేగెనో యెఱుగ మే మని గుందుచుఁ బల్క వారితో
జెచ్చెర నవ్వనస్థల మశేషముగాఁ గని యందు లేమికిన్. 307

ఉ. నమ్మినచారులం బిలిచి నాగురుఁ డెచ్చట నున్నవాఁడో శీ
ఘ్రమ్మున గాంచి రండు మణికాంచనవస్త్రము లిత్తు నన్న వా
రమ్మనుజేశ్వరాజ్ఞ బుర మంతయు నారసి యంద ఱొక్కటై
క్రమ్మఱ వచ్చి యం దతనిఁ గానఁగ లేదని తెల్ప నార్తుఁడై. 308

చ. హా! యను సన్నుతోజ్జ్వలమిహిరా యను నన్ విడి పోవ నీకుఁ జ
న్నే యను నాయెడన్ మిగుల నేరము గల్గిన శిక్ష సేయరా
దే యను వింతవింత గలదే యను నేగతిఁ దాళు దింక స్వా
మీ!యను నెవ్వ రింక గృప నేలఁగఁజాలుదు రయ్యయో!యనున్

చ. ఇది గురులింగజంగమమహిష్ఠపదాంబుజసేవనాపథం
బిది నిరపాయముక్తిరజనీశముఖీపరిలబ్ధిసాధనం
బిది నగజామనోహరగణేశమహత్త్వ మటంచు నెప్పుడున్
విదితము గాఁగఁ దెల్పి కరుణించు గుహేశ్వర! యెందు డాగెనో.

క. ఇటు లరుగుదు వని తెలిసిన, నెటుబోవక నీపదంబులే పూన్చుచు ని
చ్చటనిల్తు మోసమందితి, గటకటనను విడిచిపోవఁగాఁ దెలుపన్.

ఉ. తల్లియుఁ దండ్రియున్ సఖుఁడు దాతయు దైవము నీవె యంచు నా

యుల్లమునం దలంచి పరమోత్సుకవృత్తి భజింపుచుండు నా
కెల్లడ నెవ్వరుం బడనియట్టి మనోవ్యథసంఘటించెఁ బో
చెల్లునె రాజసఖ్యము లిసీ యని రోసితివో? దయాకరా!. 312

క. అని వగలఁ బొగులు జననా
థునిఁ గని యొకమంత్రి పలుకుఁ దోఁచక దుఃఖిం
ప నగునె తెలియనివాఁడవె
విను మొక్కయుపాయ మిపుడు వినుపింతు నృపా!. 313

క. గురులింగజంగమంబులు,పరికింపఁగ నొక్కఁ డగుటఁ బరమేశ్వరు ద
ద్గురుఁడని పూన్పుము జాతీ,శ్వరునర్చించినఫలంబు సమకూరుననన్.

క. మఱియొకఁడు పల్కు మున్నొక
యెఱుకఁ ముని యొసఁగుమంత్రమే కాదె తుదిఁ
దరిఁ జేర్చె? నతఁడు చెప్పిన
నెఱమంత్రముచేత ముక్తి నిత్యత గనుమా. 315

క. అనవుడు నానియమం బెఱుఁ
గనివారలువోలె పల్కఁగా దగునె? యా
ఘనునిఁ గనుఁగొనినతుది భో
జన మొనరుతు నంచు బల్కుసమయమునందున్. 316

తే. చారుఁ డొకఁ డేగుదెంచి జోహారు చేసి
నేటిప్రొద్దున దొమ్మరవీటితోడ
గాశికాపురి కరుగంగఁ గాంచినాఁడ
ననఘ! జాతీశు ననుడు నయ్యవనివిభుఁడు. 317

ఉ. సంతస మంది వానికి ననంఖ్యధనంబు లొసంగి భూతలం
బంతయు మంత్రిశేఖరున కప్పనసేసి మితాప్తవర్గుఁడై
భ్రాంతదరీఝరీసరిదరణ్యమృగంబుల నెన్న కాతఁ డ
త్యంతరయంబునం జనియె నార్తి గురూత్తముఁ డేగుజాడలన్. 318

క. చని కనియె నెదుటఁ గాశిఁ, ఘనకల్మషభేకనికరగంధవహాశిఁ
మునిసేవ్యతీర్థరాశిఁ, వినతాశ్రితభక్తలోకవిబుధవరాశిన్. 319

క. చని పురలక్ష్మీహారం, బన దగుగంగానదీతటాంతికమున ని [న్.
ల్చినవీడుఁజొచ్చిజాతీ,శునిగానరె యనుచు నడుగుచుంజని యొకచో

ఉ. చామయయిల్లు గన్గొని రసావరుఁ డచ్చట చెన్న సానితో
సామెత గాఁగ నొక్కతళియన్ భుజియించుచునున్న దేశిక
స్వామిని గాంచి మంటి భవసాగరముం దరియింపఁగంటి నీ
వే మహితప్రసాద మని యెంతయుభక్తి నమస్కరింపుచున్. 321

క. దగ్గఱి కర మొగ్గిన నపు, డగ్గురుఁ డచ్చెరువు గదుర నవనతముఖుఁడై
సిగ్గున నూరకయుండిన, దగ్గని ధృతి సతియునని యె ధరణీపతితోన్.

ఉ. ఈయన నన్నుఁ గూడి వసియించుటకై చనుదెంచి నెమ్మదిం
బాయనిప్రేమ నేకమగు భాజనమందు భుజింపుచుండ నీ
వీయెడఁ గాంచియుం గొనెదవేని ప్రసాదముఁ గొమ్ము నావు డ
బ్జాయతనేత్ర కిట్లను ధరాధిపుఁ డెంతయు భక్తిపెక్కువన్. 323

క. లింగశరీరపు దేశిక, పుంగవుదివ్యప్రసాదభోక్త్రివి నీ వీ
భంగిమదిసంశయించుట, కంగన గణియింపఁజాల! నచ్చెరువయ్యెన్.

క. నామదిఁ దెలియక పలికెదు, కామిత మిబ్భంగి దేశికస్వామిప్రసా
దామృతముకొనక చననని, యామానవపతిగురునకు హస్తముసాచెన్.

క. కరమొగ్గినధరణీశ్వరుఁ, గరుణామృతదృష్టిఁజూచికైవల్యపదా[మిన్.
కరసత్ప్రసాద మొసఁగిన, బరమామృతమనుచుగొని యెఁబార్థివుఁడెల

క. ఆసమయంబున శైలశ, రాసనుఁ డవనీశుభక్తి కత్యంతసము
ల్లాసంబు నొందినలినజ, వాసవముఖసురలఁగొలువవాత్సల్యమునన్.

చ. అరుణజటాలి పల్లవము లబ్జవిరోధి ఫలంబు పన్నగో
త్కరము లతావళుల్ గరళకాంతి శిలీముఖరాజి భూమిభృ
ద్వరసుత చేగ మానితతి పక్షిసమాజము గా ధరిత్రికిన్
సురతరుభాతి దోఁపఁ బొడఁజూపెఁ దదతికసీమ నయ్యెడన్. 328

తే. ఇట్లు ప్రత్యక్షమైన సర్వేశ్వరునకు
బుడమి జాఁగిలి మ్రొక్కి యాభూమిభర్త
ఫాలతలమున కెంగేలు కీలుగొల్పి
భక్తి మొలుకంగ నిట్లని ప్రస్తుతించె. 329

లయగ్రాహి. దండధరదోర్మదవిఖండన! పయోజరిపు
ఖండధర! పక్షివిభుకాండవరకాండా!

కాండపరశోషఘన! కాండజశరాపహార
భండ! శిఖినేత్ర! ఫణికుండల! ధరిత్రీ
మండలశతాంగ! మునిమండలమనోనిలయ!
పాండురశరీర! గణకాండ! భవమేఘో
ద్దండపవమాన! కరమండితకరోట! ఖల
తుండిపలలాశిజయ! భండనవిహారా!. 330

ఆ. అనుచు సన్నుతించుజనపతిఁ గని శర్వుఁ
డాదరించి నీప్రసాదనిష్ఠ
కలరినాఁడ దివ్యయాన మెక్కుము రాజి
తాచలమున కిప్పుఁ డరుగవలయు. 331

ఉ. నావుడు దేవదేవ! గురునాథుకతంబునఁగాదె? నీదుసం
భావన గాంచి తీయెడల భావ్యమె యీఘనుఁ బాసి రా ననఁ
భూవర! వీని నిన్నుఁ గొనిపోయెద నాఁగ గురుండు చెన్నకఁ
నే విడలే నటన్న నగి నీలగళుం డటు సమ్మతించినన్. 332

తే. ఆసతీమణి యిటు పల్కు నాస పూని
నన్నుఁ గనిపెట్టియున్న మాయన్న యమ్మ
మొదలుగు వీటిజనముల వదలివచ్చు
టుచితమే! యన దరహాస మొనర హరుఁడు. 333

క. గురు రాజ చెన్నకం ద, త్సరసిజముఖివీటిజనుల స్వర్ణవిమానో
త్కరములనిడికొని చనెనీ,శ్వరుఁడరుదుగరజతశైలసదనంబునకున్.

వ. కావునఁ బ్రసాదమాహాత్మ్యం బిట్టిదని మాచిదేవాదిగణంబులతో
సకలేశ్వరమాదిరాజయ్య వివరించుటయు నందఱు నత్యాశ్చర్యంబున!
నతనిఁ బెక్కుభంగులం గొనియాడి నాగమాంబికచే ననుజ్ఞాతులై!
తమతమనివాసంబులకుం జని రని తెల్పిన నగస్త్యుం డవ్వలికథ యె
ట్లయ్యె నని యడిగిన. 335

శా. విద్వత్పూర్వసుపర్వవైరిపురపృథ్వీజాతభాస్వన్నభ
స్వద్వాహాంకకళాకిరీటపదపూజాశాలి! మాహేశ్వరో
ద్యద్వాక్యశ్రవణానురంజితనిజాత్మాంభోజవిఖ్యాత! సిం
హద్వారాంగణవేదికాఖిలనరేశామాత్యజాతాంచితా!. 336

క. ఉదృగ్విపముఖీమన్మథ!, రాడ్వల్లభ రాష్ట్రదుర్గరక్షణదక్షా!
షడ్వర్ణమంత్రవదన! సు, రేడ్వైభవ! పద్మభూమహితవాగ్విభవా!.

పంచచామరము. ప్రభాతిశంబరప్రభూతబంధుకల్పభాకరా!
శుభావహావ్రతప్రతాన! సూరిహృద్వశీకరా!
విభావరీశఖేచరేంద్రవృక్షదానభూసురా!
ప్రభూతసమ్మదోరుచిత్తపాలితాప్తభాసురా!. 338

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకృపాకటాక్షలబ్ధ కవితామాధురీ ధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతం బైనచెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.





మద్గౌరారాధ్యశి
ఖామణ్యుపదిష్టమంత్రగతపదవర్ణ
స్తోమజప్రకరణరసనా
సీమా! యమృతేశనామసేవితసోమా!. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తదనంతరవృత్తాంతం
బిట్లని చెప్పందొడంగె. 2

ఉ. ఆగ్రహదూరుఁ డన్యసమయప్రవిదారణశూరుఁ డాత్మవిద్యా
గ్రహణప్రచారుఁ డఖిలామరలోకవిహారుఁ డంబికా
విగ్రహభక్త్యుదారుఁడు వివేకవిచారుఁడు సిద్ధరామయో
గ్యగ్రణి సొన్నలాపురమునందు విలాసగతిన్ వసించుచున్. 3

మ. ఫలకృద్దేశికపాదపంకరుహషట్పాదుండు వేదోక్తషట్
స్థలవిజ్ఞానవిశారదుండు శిఖిగంధర్వావతారుండు ని
ర్మలకీర్తిద్యుతినిర్జితాద్రిరిపుసారంగాయుధుం డంచు భ
క్తులు సెప్ప న్విని నాగమాత్మజునిఁ గన్గోర్కుల్మదిం బర్వఁగాన్.

ఉ. అణిమమాదియగా మలము లన్ని యడంచుచు శాతకుంభముం
గాణవరాటకంబు సరిగాఁ గనుచున్ జరియించు సింధురా
ట్త్రాణపదాబ్జసేవకులతో నెడ మించుక లేకయుండు క
ల్యాణపురంబుఁ జేరి హృదయాద్భుత మొప్పఁగఁ జూచి మెచ్చుచున్. 5

తే. అరిగి చెన్నవృషేశుమందిరము గలిసి
ద్వారపాలకుచేఁ దనవార్తఁ జెప్పి
పనుపఁ జని సిద్ధరామయ్య యనునొకండు
వచ్చె దేవరదర్శనవాంఛ ననిన. 6

చ. అతఁడు మహాత్ముఁ డీశ్వరకృపాయుతుఁడే యగుఁగాని షట్స్థల
వ్రతసహితుండు గామి యిట రాఁ జన దచ్చట నుండఁ జెల్లఁ డే
గతి నని నెమ్మదిం దలఁచి గ్రక్కున వేఱొక భక్తుఁ బిల్చి మా
స్థితులను జెప్పి సమ్మతిలఁ జేయుము నే నిదె వత్తు నావుడున్. 7

క. చనియతఁడుసిద్ధరామునిఁ, గనుఁగొనిమీరాకకతివికాసహృదయుఁడ
య్యెను జెన్నబసవధీమణి, యనిక్రమ్మఱనిట్లులనియెనతివినయమునన్.

చ. అనఘ! ప్రసాదభోగసమయం బిది తద్విధిఁ దీర్చి మిమ్ముఁ గ
న్గొన నిట వచ్చుఁ దచ్చరణకం జనుఁ డన్న మఱిం గలంగి హా
ఘనతరలింగసంగతుఁడఁ గామిఁ గదా యిటు లయ్యెఁ గాన నీ
తని గురుఁగా భజించి యమృతప్రదచిన్నయదీక్ష గాంచెదన్. 9

తే. ఎంతవిజ్ఞానయుతుఁ డైన నిష్టలింగ
ధారకునితోడ సరిపోల్పఁ దగద టంచు
వేదశాస్త్రము లెఱిఁగింప వినియు నింత
కాల మూరక వృథచేసి జేల నైతి. 10

తే. ఇపుడు నాభాగ్యవశమున సిందుజూట
తుల్యుఁ డైనట్టిగురుమూర్తి దొరకె ననుచు
నాత్మ సంతస మందునయ్యవసరమున
భక్తతతితోడ శ్రీచెన్నబసవవిభుఁడు. 11

సీ. చనుదేర రామయ్య కని భక్తిఁ జాఁగి మ్రొ
క్కిన లేవనెత్తి కౌఁగిట నమర్చి
యనుభవమంటపంబునకుఁ దోడ్కొనిపోయి
యుచితాసనంబున నునిచి తాను
భక్తులతో మణిభద్రాసనస్థుఁ డై
రామయ్యఁ గని పల్కె రాజయోగ
నిష్ఠాగరిష్ఠత నిరతిశయానంద
పరిపూర్ణనిరుపమభావశుద్ధి

తే. నిన్నుఁ జేర్కొనుచో నోరు నెన్నఁదగునె?
సదయ! మీరాకచే నేఁడు సుదిన మయ్యె

నిందుధరభక్తలోచనానంద మొదవె
ననఁగ ముకుళీకృతకరాబ్జుఁ డగుచుఁ బలికె.    12

ఉ. లౌల్యగుణప్రచారు నవిలక్షణయోగవిహారుఁ జారుసౌ
శీల్యవిదూరు నన్ను శశిశేఖరపాదపయోజభక్తరా
ట్తుల్యునిఁ గాఁగ మీ రిపుడు తూఁగి వచించుట దాసునందు వా
త్సల్యము గాక నే నరయఁ దద్వ్రతనిష్ఠులసాటి వత్తునే?.    13

ఉ. దేవ! మహానుభావ! భవదీయవచోగరిమంబు రిత్తయై
పోవఁగ నేర దట్టిగుటఁ బూర్ణకృపామతిఁ ద్వత్ప్రసాదసౌ
ఖ్యావహమౌఁ జేయుమార్గ మిపుఁ డారసి యీరసికాగ్రగణ్యభ
క్తావళిలో నొకండ నగు నట్లగు నన్ను ననుగ్రహింపవే!.    14

చ. అనుడు ముదంబు నొంది దరహాసము మోమునఁ బర్వ సిద్ధరా
మునిఁ గని పల్కె నోకలుషమోచన! నీమది గంటి సంతతం
బును హృదయారవిందమునఁ బూని శివు న్భజియించుచుండు పా
వనుఁడవు నీకు వేఱె యొకవాంఛిత మేటికి? దీక్షఁ గైకొనన్.    15

ఉ. నావుడుఁ బ్రాణలింగభజనంబున నెంత సమర్థుఁడైన దీ
క్షావిధి నిష్టలింగధరకాయుఁడు గామి ననూనవీరశై
వావహుఁ డౌనె? కావున దయాపరతన్ భవదీయశిష్యుఁగా
భావనచేసి యక్కొఱఁతఁ బాయఁగఁజేయఁగదే రయంబునన్.    16

వ. అనినఁ జెన్నబసవేశ్వరుం డి ట్లనియె.    17

క. నీకు గురుత్వము సేయఁగ
నాకొలఁదియె? నిష్ఠగా మనంబున దృఢమై
యీకోరికయే గలిగినఁ
గైకొను మొక్కరుని గురునిగా వీరలలోన్.    18

తే. అనుచుఁ బల్కిన సిద్ధరామయ్య భక్త
సంతతికిఁ జాఁగి మ్రొక్కి మత్స్వాంత మెఱిఁగి
దీక్ష యొనరింపు మని కృపాదృష్టి మెఱయఁ
జెన్నబసవేశ్వరునితోడఁ జెప్పరయ్య?.    19

వ. అనిన.    20

ఉ. అమ్మాటల్ విని యందు నున్నప్రమథాధ్యక్షవ్రజం బేకవా

ద్య ష్మింపొంద మహాత్మ ! రామయకు మాయందే గురుత్వంబు హ్యా
ద్యమ్మై యున్నది గాన మాయనుమతిం దద్వాంఛ చేసూర్చి వై
కొమ్మా యన్న గణాజ్ఞ మౌళి నిడియెం గోటీరభావంబునన్. 21

శా. ఈలీలన్ గణశేఖరాజ్ఞ గొని నీయిష్టంబు చేకూర్తు ర
మ్మా లింగార్చన సేయఁగావలయు లెమ్మా యంచు మున్నట్టు ల
వ్వేళం దీర్పనొనర్చి దీక్ష గొన రేపే మంచి దంచు స్సి యో
గ్యాళిన్ గేహ మలంకరింపఁ బనుపన్ హర్షించి చోద్యంబుగాన్.

సీ. సౌరభం బీనుకస్తూరి గేహములక్కిముత్తియంబుల దేలిముగ్గుదీర్చి
గోడలుసొగసుగాఁగుంకుమచేఁబూసిబహువిధచిత్రరూపములవ్రాసి
పొందుగావెలిపట్టుచందువాలమరించినవరత్నమయతోరణములుగట్టి
కదళికాస్తంభముల్ పొదిక్ళ్లనమరించి కేతువులందంద గీలుకొల్పి

తే. మఱియు నివ్విధమునఁ బెక్కు తెఱఁగు లమర
మంగళప్రదలీలచే మందిరము ల
లంకరించినఁ గని మెచ్చి శాంకరేష్ట
గోష్ఠి నవ్వేళఁ గడపి వేగుటయు నంత. 23

వ. చెన్నబసవేశ్వరుం డరుణోదయంబున మేల్కాంచి నిత్యకృత్యంబులు
దీర్చి సమస్తభక్తసంఘపరివృతుం డై దీక్షాగేహంబునకుం జని తన్మ
ధ్యంబున శాతకుంభచతుస్స్తంభగుంభితంబును బ్రవాళప్రసూనమం
జరీఫలముక్తాదామాభిరామోల్లాభశోభితంబును నానావిధపరిమళో
పేతధూపధూపితంబును గర్పూరదీపదీపితంబును నగుమంటపంబు
గదియం జని యందుఁ బంచవర్ణచూర్ణంబులచే గౌరీతిలకం బనురంగ
వల్లి రచియింపం జేసి తచ్చతుర్దిఙ్మధ్యస్థలంబుల శాలితండులంబులఁబో
యించి వానియందుఁ బానీయపూర్ణకలశపంచకంబు నిలిపి తత్పశ్చి
మప్రదేశంబునఁ దానుదివ్యసింహాసనంబున నాసీనుండై చతుర్దేశికులఁ
జతుర్గకలశంబులయొద్ద నధికారు లయియుండునట్లుగా నియమించి
తక్కినభక్తానీకంబుల నుచితాసనంబుల నునిచి మధ్యకలశంబుగాఁ
గొని వారునుం దానును దత్కలశంబుల గంధపుష్పోపకంబులం
బూజించి తదుపరి నూతనవస్త్రావరణంబుగావించి కాంచనరత్నంబు
లు వానియం దిడి చూతప్రవాళతాంబూలీదళంబులు తన్ముఖంబున

మైదుకలశంబులకుఁ జుట్టి తంతువేష్టనం బొనరించి తత్కలశం
పంచాక్షరిపంచబ్రహ్మమంత్రంబులనభిమంత్రించిధూపదీపాదు
ంగి యచ్చటనున్న భక్తపుంగవుల విభూతితాంబూలపూర్వకం
నారాధించి వారిచేదీక్ష యొనరింప ననుజ్ఞాతుండై భేరీవేణువీణా
ంబులు చెలంగ నంతకమున్న సుస్నాతుండై భస్మరుద్రాక్షధా
బొనరించి మంటపపూజానంతరంబునవచ్చి యచ్చటవసియించి
మయ్యె డాయం బిలిచిన నతండు పరమాత్మైక్యంబున నరుగు
భక్తసమూహంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచ
తదనుజ్ఞఁ గాంచి గురుపదంబుల కెరఁగి ముకుళీకృతకరుఁడైయు
ప్రావలోకనమాత్రఁదత్పాపనిర్ముక్తనకర్మంబుఁడించి మంటపప్రదేశం
శిష్యుంబూర్వాభిముఖుంగాఁగూర్చుండంజేసి, తాను నుత్తరా
ఖుండై తత్కలశోదకంబుల నభిషేచనం బొనరించి శైవసం
రుంజేసి వీరశైవదీక్షావిధానంబునఁ దప్పనీక ఫాలసంగతదుర్లేఖ
గునట్లుగా భూతిపట్టంబు గట్టి నిజహస్తస్పర్శనంబునఁ దత్తనుగ
చభూతవికారం బుడిపి పంచాక్షరీమంత్రోపదేశంబుఁ గావించి
మాధ్యాంతాహంకారాదిగుణశిక్షితుం జేసి బ్రహ్మంబును
హ్మేంద్రాదిలోచనాగోచరుండును సర్వగతుండును నగుపరశివ
ర్తి నవయవరహితంబును జ్యోతిర్మయాకారంబును సకలమూ
తీతంబును నగులింగమూర్తిగా నియమించి షడ్వర్గపూరకంబు
గాంచి యాలింగంబునకుఁ బంచామృతస్నపనంబుగావించిసర్వో
రంబులనర్పించి శిష్యమస్తకస్థితకళభావానుగతంబుగాఁగనియా
చి లింగంబునందు మంత్రోక్తంబుగాఁ బ్రతిష్ఠించి యాలింగం
చ్ఛాత్రనికరంబునం దుంచి వీని నెడఁబాయకుండుమని యద్దే
ప్రార్థించి శిష్యుం గాంచి లింగమూర్తిం బ్రాణపదంబుగా ధరి
పుము ప్రమాదంబుఁ జెందెనేని దేహపరిత్యాగం బర్హం బని
పి లింగాంగైక్యక్రియానిపుణుం గావించి ప్రసాదాంగుంజేసి వా
ప్రాణసంబంధం బెడలించి లింగప్రాణుఁ గావించి జీవన్ముక్తిహేతు
శైవరహస్యంబు లన్నియుం దెలిపి తీర్థప్రసాదోపభోగుం గావిం
సిద్ధరామవిభుండు పరమానందకందళితహృదయారవిందుం డై

నిత్యనిర్గుణానుపమానంద మయాద్యంతరహితబ్రహ్మంబగు లింగ మూర్తి నొసంగు గురుమూర్తి యైనచెన్నబసవేశ్వరపదంబులఁ కెరఁగి దేవా! భవదీయకరుణావశంబున గురుచరేశ్వరులసపర్య లొనరింపం గంటి మీప్రసాదంబున కర్తృం తనైతి భక్తగణంబుల లో నన్నియు కెక్కితి నని పెక్కుభంగులం గొనియాడుచుండు సమయంబున నచ్చటిగణంబులు. 24

క. జలజాసనాదిసురలకుఁ, దెలియంగానలవిగాని దివ్యామృతముం
జలపట్టి కాంచితౌరా!, భళిరా! శ్రీసిద్ధరామ! పావననామా!. [నఁ

ఆ. మలయజమునఁబువ్వమానికంబునదీప,మమృతమందు:జేగహాటకము
బరిమళము చెఱకునఁ బండుచిత్తరువున, జీవమట్లునిన్నుఁ జెందెదీక్ష.

చ. అని వినుతింప వారు బసవాధిపుఁ డిట్లను నయ్యలార! యీ
యనఘుఁడు పిన్ననాఁడె మది కంపని శ్రీగిరినాథు మల్లికా
ర్జునుఁ గొనితెచ్చి యాత్మపురిఁ జోద్యతరంబుగ నిల్పెఁగాదె యీ
తనిచరితంబు లెక్కయిడఁ దామరచూలికి నైన శక్యమే?. 27

క. అనవుడు నత్యాశ్చర్యం, బున వారలు చెన్నబసవపుంగవుఁ గని యే
యనువున శ్రీగిరినాథుని, గొని తెచ్చెనువినఁగమాకుఁగోర్కి జనించెన్.

ఉ. ఆవిధ మానతీవలయు నన్నఁ గరంబులుమోడ్చి పల్కె నో
ధీవరులార! తత్క్రమము దెల్పెద నెప్పుడు సొన్నలాపురిం
దా విహరించు ముద్దయ యనఘ భవపాదపయోజభక్తుఁ డా
పావనుఁ డీతనిం గనియె భర్గజయాప్తి శుభాంగి యందునన్. 29

తే. కాంచి యల్లారుముద్దుగాఁ బెంచుచున్న
నాఁడునాఁటికిఁ దనయీడుజోడువారిఁ
గూడి వేడుక నాడుచుఁ గొన్నినాళ్లు
శైశవక్రీడ లెల్లను జఱుపు చుండి. [ముం

క. తలిదండ్రులయనుమతి దూ, తలఁగాయఁగఁ బూనిగోరువడము చల్లడ
దలచీరకోలకిఱుచె, ప్పులుపిల్లనగ్రోవి యమరఁబోఁ ము దిరుగుచున్.

ఉ. శ్రీగిరినాథుదర్శనము సేయఁగ నేగెడునట్టి సర్వదే
శాగతమర్త్యకోటిఁ గని యచ్చెరువందుచు నంద తేగతిం

బ్రోగులు గూడి యచ్చటికిఁ బోయెదరో యని యెంచి యందు వే
దాగమవేదియైన శరణాగ్రణి నొక్కరిఁ జేరి యిట్లనున్. 32

ఉ. కావటిబొట్టె లేదు సొరకాయలు బుఱ్ఱలు కంట్లపెద్దులు
న్నోవఁగ వెక్కసం బయినమాటలు మున్నగువానిఁ గొంచు మీ
రీవిధి నెందుఁ బోయెదరొ యేర్పడ నా కెఱుఁగంగఁ దెల్పవే
నావుడు మందహాసవదనంబున నిట్లని పల్కె వానితోన్. 33

చ. మునులకుఁ జెంకి భక్తులకు ముంగిటిపెన్నిధి తీర్థకోటికిన్
జననపుఠావు సర్వసురసంతతినిల్కడపట్టు ముక్తిభా
మినికి నివాసభూమి ఘనమేచకకంఠువిహారదేశమై
ఘనత వహించు శ్రీనగముఁ గన్గొనఁ బోయెద మన్న నిట్లనున్. 34

ఉ. అంచలు గుంపులై చనఁగ నచ్చట నెప్పని గల్గెఁ బెండ్లికో
బందుగు లున్నవారొ తెల బల్కుము నావుడు వత్స! తన్నగం
బందు సమస్తదేవనిచయాధిపుఁడై తగుమల్లికార్జునా
ఖ్యేందుకిరీటిఁ గన్గొనుట కేగెద మంచు వచింపఁ గ్రమ్మఱన్. 35

తే. అనియె గిరిమల్లికార్జునుఁ డనఁగ మునియొ
దెవ్వఁడో నేలతేఁడో యత్తెఱుఁగు దెలియఁ
జెప్పవే యని పల్కినఁ జిఱుతవాని
మాటఁ బోఁ ద్రోయఁజాలక మగుడ ననియె. 36

తే. తాపసుండును గాఁడు భూధవుఁడుఁ గాఁడు
దేవతాధీశుఁ డగు మహాదేవుఁ డనిన
సామి! యాసామిరూప మేచందమొక్కొ
యెఱుఁగుదే దేఁటపడఁ జెప్పు మిప్పు డనిన. 37

ఉ. కేలను బోటువాలు దులకింపఁ దలం దొగమేలు మేనిసోఁ
బాలున నాలు కెంజెడలపట్టునఁ దొన్కసలాడుచుండు పె
న్జాలు పిఱుంద గబ్బిపోడచారలవన్నె మెకంబుతోలు డా
కాలున గంటపెండెపుఁజొకారవుడాలును గల్గు సామికిన్. 38

ఆ. నంది యెక్కి గిత్త నాగులు సొమ్ములు
చేదు మెడను బునుక చేరు భూది

నుద్భట సరసులుగొన్న రుదురాక లెదఁ గల్గు
నయ్య యొరవు దెలుప నలవి యగునె?. 39

క. అనుటయు నాజేజేదొరఁ, గనుఁగొనఁగామనసుపుట్టఁ గావున నీవ
జ్జనరుగు దెంతుసనుఁదో,డ్కొనిచని కాన్పింపుమనినఁగుట్టునికనియెన్.

చ. అడవులఁ గొండల న్నడిచి యన్నము వేళకు లేక యెండలన్
బడలికఁ జెందలేవు పసిబాలుఁడ వాప్తులఁ దల్లిదండ్రులన్
విడి చనుదేర నీ కగునె? వీత్తేఁడిబుద్ధులు మాను మీఁద నేఁ
దడవు వసించినన్ వరుస దవ్వగు నేగెద నన్న ని ట్లనున్. 41

ఉ. కూడదు దారి కష్ట మని కొంకు జనింపఁగఁ జెప్పకయ్య నా
యీడగుకుఱ్ఱలీవరుస నెందఱు లే రటు చూడు వారితో
జోడుగ నీపిలుంప నగుచుం జనుదెంచెదఁ దల్లిదండ్రులన్
వీడఁగఁజాలు చంతబలు వేలుపుఁ గన్గొనుభాగ్య మబ్బినన్. 42

చ. అన విని వీని రమ్మనుట కర్హము గా దిది మాన్పఁ గూడ దె
ట్లని మది సంశయించి శరణాగ్రణి యూరక పోవుచుండి ద
న్వెనుకొని వచ్చుబాలుఁ గని వీఁ డెటుల న్విడఁ డంచు నెంచి దో
డ్కొని యలయంగనీక సిరికొండకు వేడుకఁ బోయి యచ్చటన్. 43

వ. తదీయమహిమావిశేషంబు లి ట్లని చెప్పందొడంగె. 44

సీ. ఇది తీర్థసందోహ మిదికుండసంఘాత మిదిమంటపవ్రాత మిది వనాళి
యిది గోపురానీక మివినందు లివి భృంగు లివి శిఖావళి యివివనంబు
లిది నదీనదజాల మిదిసాల మిదిగంగ యిదిమూలికోత్కరంబివిసరంబు
లివిమునిస్థానంబు లిది పరిఘావార మివి చిత్రకంబులు నివి రథంబు

తే. లివి మహాశక్తు లివి జోతు లివి మఠంబు
లివియ మణిమయపుందంతు లివి కుళంబు
లివి సువర్ణాశ్మసముదయం బివి తటంబు
లనుచు వేర్వేఱఁ జూపుచు నరిగి యంత. 45

సీ. కలితవజ్రోపలకల్పితకుడ్యంబు శాతకుంభస్తంభసంభృతంబు
వైడూర్యరజతకవాటసందీప్తంబు శక్రాశ్మజాలకసముదయంబు
ఘనధూపపరిమళాక్రాంతదిగంతంబు ప్రాజ్యకర్పూరదీపావృతంబు
నానాదిశాగతమానవాకీర్ణంబు వేత్రహస్తార్భటావిశ్రుతంబు

తే. పటుచతుర్విధవాద్యవిభ్రాజితంబు, వేదవేదాంతపాఠక విలసితంబు
రమ్యవారాంగనాలాస్యరంజితంబు, నైనశ్రీమల్లికార్జునాలయ ముగదిసి.

చ. పదిలము గాఁగ రమ్మనుచు బాలకుహస్తము వట్టి యబ్జభృ
త్సదనము జొచ్చి యందుఁ గలసందడి మెల్లన యోసరింపుచు
న్మదమున నేగి యీశ్వరునిముంగట మ్రొక్కుచు నిల్చి యీతఁడే
సదయుఁడు మల్లికార్జునుఁడు చక్కఁగఁ జూడుకుమార! నావుడున్.

మ. ఇతఁడా? శ్రీగిరిమల్లికార్జునుఁడు! సామీ! లెస్స బాగాయె నీ
మతిలో నేమి తలంచి దైవ మని సంభావించి కాన్పింపఁ జూ
చితి? నే వెఱ్ఱిని గాను వేలుపు నిదర్శింపంగ; నాతోడనా
చతురత్వంబులు? చాలు దేవు నిఁక దాఁచంబోక కాన్పింపవే. 48

వ. అనిన. 49

శా. ఏమేమీకి వెడమాట లాడెదవు వారిచ్చ న్విచారించ కే
స్వామీ! స్వామి యితండు గాఁ డనుట యేచందంబు? గాకున్నచో
నీమర్త్యావళు లెల్ల భక్తిరతులై యేతెంచి వాంఛాఫల
స్తోమాపేక్షలఁ గొల్వ నేమిటికి? నీతోఁ జేతునా? మేలమున్. 50

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యోయయ్య! తలఁప
కేరడంబున కిఁక వేఱె దారి గలదె
బెల్ల మని చోళపిండి చేఁ బెట్టినట్టి
చంద మయ్యెను నీవాఁడు చూడఁజూడ. 51

తే. ఏది? వినుజాలు మొనవాలు నిఱ్ఱికేలు
నేది? తోల్చీర మెడచాలు యెముకకోర
యేది? నెలకూన సామేన నిడినచాన
యితఁడు జేజేలదొర యని యెటుల నందు?. 52

చ. అనవు డితండు సావయవుఁ డైనతఱిఁ ధరియించుచిన్నె లీ
యనవున నన్ను నీ వడుగినట్లు విభావనఁ గాని కర్మదృ
ష్టిని గనరాదు గాన మదిఁ జేర్పకు సంశయ మీశుఁ డీతఁడే
వినుతి యొనర్చు మ్రొక్కు పద వెఱ్ఱితనంబులు మాని క్రమ్మఱన్. 54

వ. అనిన నచ్చిఱుతం డి ట్లనియె.

చ. హరుఁడు మదిం దలంప నొకయాకృతిఁ గన్పడుఁ గర్మదృష్టిచే 54

నరసిన వేఱెరీతిఁ దగునంచు వచించితివయ్య మున్న యా
దరమున మీఁద లాడునుడి దప్పగఁ గూడునె? నన్ను మీఁద లి
వ్వరుసునఁ బిన్నగాఁ దలఁచి పల్మఱుఁ జిక్కులఁ బెట్టఁ బాడియే?
వ. నావుడుఁ దజ్జంగమవరుం డతనితోడ. 56
చ. హరుఁ డెటువంటి వాఁ డనిన నాకృతిఁ జెప్పితిఁ జెప్పినట్ల యా
స్మరహరుఁ గానుపింపఁ దరమా? మముబోఁటికి ధ్యానగమ్యుఁడై
పరగు నతండె యాత్మ దయ పర్వఁగ సన్నిధియైనఁ గాక యీ
ధరజను లెల్లఁ గొల్చుపరతత్త్వ మిదే యిఁక లేదు కావునన్. 57
ఆ. భక్తితోడ మ్రొక్కవలస క్రమ్మఱఁబోవు, చున్న దీడ నింకనునికిగాదు
పోదమూరికిపుడు వాదు లేమిటికిర, మ్మనినసిద్ధరాముఁ డతనికనియె.
చ. దయ జనియించి యాతని కతం డిటు రావలె గాని నీవు ని
ర్ణయముగఁ జూపలేవు గద? నా కట రాఁ బని యేమి? మీరు పాం
డయినను నేను వచ్చి జను లారడి సేయఁగ సిగ్గుఁ జెందనా?
యయుతసమంబు లైన శివు నారసి క్రమ్మఱి వత్తు నావుడున్. 59
చ. కలఁగుచు జంగమయ్య కనుగందును దుర్గమసీమ డించి యే
కొలఁదిఁ జనంగవచ్చు? ననుకూరిమి మీఱఁగ బుజ్జగించి య
గ్గలముగ మందలించి కొఱగా దని బి ట్టవలంచి యెన్నిభం
గులఁ దనతోడ రామికి నెగు ల్కొను నంచని యేగె నంతటన్. 60
చ. ఇటు తనుఁ బాసి యాశరణుఁ డేగినపిమ్మట సిద్ధరాముఁ డు
త్కటముగ మూర్ఛఁ జెంది బెడిదంబుగఁ గన్నుల నశ్రుబిందువుల్
పొటపొట కాఱ నేలపయిఁ బొర్లుచు లేచుచు నుస్సు రంచు ది
క్తటములు చూచి బెగ్గిలుచుఁ గ్రమ్మినశోకముతోడ నాత్మలోన్. 61
ఉ. శర్వునిఁ గానుపింతు నని జంగమవర్యుఁడు నన్నుఁ దెచ్చి యీ
యుర్వర డించిపోయె నయయో! యిఁక నెవ్వరు? దిక్కటంచు లోఁ
బర్వినచింత రాముఁ డటఁ బాసి గనుంగొనువారి నెల్ల వే
దార్వునిఁ జూపలేరుగద? యాదరణంబున నంచు నార్తుఁడై. 62
ఆ. గిరులఁ జఱుల ఝరులవీరులఁ దగు, తరుల సిరులవఱలుదరులఁ బరుల
హరులఁ గరులసరులఁ బరగినవనముల, శరధిశరధి వరుస నరసియరసి.
సీ. శార్వ! కానవే? శారదాంబుదవర్ణ మన్మథ! కానవే? మన్మథారి

శాండిల్య! కానవే? శాండిల్యనుతపాదు బాటల! కానవే? పాటలజటి
వారణ! కానవే? వారణాజినచేలు నమృతంబ! కానవే? యమృతదేహు
స్యందన! కానవే? స్యందనాయితధరు నభయంబ! కానవే? యభయ
తే. రాజవృక్షమ! కానవే? రాజధరుని [హస్తు
బాణభూజమ! కానవే? బాణవరదు
నందివర్ధన! కానవే? నందితురగు
ననుచుఁ గుజముల శివుజాడ లరసి మఱియు 64
తే. ఘనుని శ్రీగిరిమల్లికార్జునుని మీఁదు
గనరె? శ్రీగిరిమల్లికార్జునములార!
యతులఖర్జూరశిఖరిప్రియాళుఁ గనరె?
యతులఖర్జూరశిఖరిప్రియాళులార!. 65
వ. అని యడుగుచు. 66
క. తిరిగినచోటు లెతిరుగుచుఁ, దరపినతృణగుల్మలతలె యరయఁగఁ జనుచుఁ
జొరఁబాఱుగుహాలె చొచ్చుచు, సిరిగిరిపతిఁ గానలేక చింతిలి యంతన్.
ఆ. నడవలేక చిక్కువడి మేనఁ జమటలు
గ్రమ్మఁ బెదవు లెండఁ గంప మడర
నాదరించి జడియ కను వారిసిం గాన
నుండి యొక్కచోటఁ గూరుచుండి. 68
ఉ. అక్కట! జంగమయ్య యరు దందఁగఁ జెల్పిననీదురూప మే
నెక్కడఁ గాననైతిఁ బరమేశ్వర! నన్నలయింపఁ బూని యే
దిక్కున డాఁగితో యడవి ద్రిమ్మరి వేసరినాఁడ నాఁకటం
జిక్కితి దప్పి నుక్కితిని నే నొకపల్కెఁక నైనఁ బల్కవే!. 69
చ. కరుణ దలిర్ప నీవె పొడగట్టెద వంచు వచించె మున్న యా
శరణుఁడు నేను జాలిఁబడి సందుల గొందులఁ జట్టు మెట్టలం
దిరిగియు నెల్లచోటులను దేవభరూపము గాననైతి నీ
వరవుడ నయ్యెదఁ నెనరు పాటిఁగ నీ విన నైన రాఁగదే!. 70
చ. కటికితనంబునం బసులకాఁపరికట్టఁడు పీఁ డటంచు న
న్నిటువలె గాసిఁ బెట్టఁజనునే? తలిదండ్రులఁ బాసి నన్ను మ
న్నుటకు గుఱండ నీవె యని చొచ్చితి నీయిలు గాన నింక వే

సట పడసీక నాకనులు చల్లఁగ ని న్గనఁజేయు మ్రొక్కెదన్. 71

చ. నను వెతఁ బెట్టకిప్పుడ కనంబడి తేని రయంబు మీఱ నే
నినుఁ గొనిపోయి మాకుఁ గలనెయ్యుల బంధులఁ దల్లిదండ్రులం
బనుపడ వేఁకటాల సిరిఁ బాయనియిందులదొడ్డిమండలం
దనియఁగఁ జూపెద న్నుడువు దప్ప బిరాలున నీవు రాఁగదే. 72

చ. తడయక రమ్ము ని న్నతిముదంబునఁ దోడ్కొనిపోయి పాలు మీఁ
గడ నెయి వెన్న జున్ను పులఖండము గొబ్బరిపప్పు నానఁబ్రా
లడుకులు తేనె పండు లొడియంబులు పానక మూరుగాయ ల
ప్పడములు జీటిలా పెరుఁగు పాశము కజ్జము నీ కొసంగెదన్. 73

తే. అనుచు నీరీతి సిద్ధరామయ్య తన్నుఁ
దలఁచి ముగ్ధానులాపముల్ పలుకునట్టి
సమయమున మల్లికార్జునస్వామి నెనరు
దవుల నొకజంగమై వానిఁ దఱియ వచ్చి. 74

ఉ. ఎవ్వఁడ వీవు? కాడుపడి యేకత మేటికి సంచరించె? దీ
విప్వనసింహగండకమదేభము లాదిమృగంబు లెల్లెడం
గ్రొవ్వి యనేకముల్ తఱుచుఁ గ్రుమ్మరు ని న్నిట డించి పోవువా
రెవ్వరు? మాకుఁ దెల్పు మిపు డేర్పడ బాలక! యన్న నిట్లనున్.

ఉ. పొన్నలయూరు ముద్దయకు సూనుఁడ దూడలఁ గాయుచుండఁగా
న న్నొకజంగమయ్య గిరినాథునిఁ జూపెద నంచుఁ దెచ్చి ము
న్నెన్నినవానిఁ జూపడక యిచ్చట న న్విడనాడి యేగె నే
తెన్నునఁ గాంతు సామి నని ద్రిమ్మరి డస్సితి నెందుఁ గానమిన్. 76

తే. అయ్య! నీవైన నెఱిఁగిన నాతఁ డుండు
చోటుఁ జూపింపు వేలుపుఁ జూపినపుడె
యెలమి నాపయిగోర్పడ మిత్తు నీకు
నమ్ము మనుటయుఁ జిఱునవ్వు నవ్వి హరుఁడు. 77

చ. జడియకు మేల యేడ్చెదవు? జంగమవర్యుఁడు చెప్పినట్టి యా
మృడునిఁ గనంగఁ జేతుఁ గడు మేలగు రాగ కుమార! యన్న న
బ్బుడుతఁడు నెన్నొసల్ పుడమిఁ బొందఁగఁ జాఁగిలి మ్రొక్కి వేడుకల్
వడసితినయ్య! మిమ్ముఁనెడ బాయక పట్టెద సామిఁ జూపవే! 78

క. అను డబ్బాలునిఁ దోడ్కొని, చని మల్లేశ్వరమనోజ్ఞసదనసమీపం
బున నిలిచి లోన వసియిం, చినవాఁ డదె చూడు రాజశేఖరుఁడనినన్

క. మును జంగమవర్యుఁడు చూ, పినతలమే యిచట లేఁడు వేల్పాతనిలా
గున నన్నుఁ గానిఁ బెట్టక, చెనమల్లేశ్వరుని టెంకిఁ జెప్పంగదవే! 80

ఉ. నావు దళీకజంగమము నమ్ముము నావచనంబు తప్ప దీ
తావుననే వసించుఁ గనుఁదమ్ము లొకించుక మూసి విప్పు మా
దేవుఁడు కానుపించు నని తెల్పి యదృశ్యతఁ జెంద బాలకుం డా
విధ మాచరించి ప్రియ మందుచుఁ గ్రమ్మఱఁ దేఱి చూచినన్. 81

మ. అనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డచలుం డాద్యంతశూన్యుం డనా
తనుఁ డానందమయుం డగమ్యుఁ డఖిలాధ్యక్షుం డచింత్యుం డవా
మనుఁ డద్వంద్వుఁ డనాముఁ డచ్యుతుఁ డనూత్మజ్యోతిరాకారుఁ డా
ఘనుఁ డాభక్తుఁడు చెప్పినట్ల సగుణాకారంబు సంధిల్లఁగాన్. 82

క. కనుపట్టె సిద్ధరామయ, యనుపమమోదమున నీతఁడయ్యా! యెఱుఁగఁజె
ప్పినవేల్పని సాఁగిలి వం, దన మొనరిచి యిట్టులనియెఁ దద్దేవునితోన్.

ఉ. ఎక్కడ డాఁగి? తింతదడ వెయ్యెడ నారసి కాననైతి నీ
విక్కడి కింతలో మరలి యెప్పుడు వచ్చితివయ్య! కానలోఁ
జిక్కి యొకంత నే వెతలఁ జెందఁగ నాదగుపుణ్యమూర్తియై
యిక్కరుణాకరుం డభయ మిచ్చిటు రమ్మని చూపె మిమ్ములన్. 84

క. కాకున్న నేమి గతి యగు, నో కదయని తిరిగి యటఁగనుంగొన గణవ
ర్యాకృతి యచ్చటనగాఁగ, రాకుండినతఁడుత్తలంబగుమదితోన్.

చ. కటకట! మోసపోతిఁ గదె! కన్నులు మూయుమటన్న మూసిన
న్నిట దరిఁ జేర్చు భక్తవరుఁ డెచ్చటికేగెనో యేమి సేతు నే
నెటు గనుఁగొందు నింక భ్రమియించి వెసం జననీక గట్టిగాఁ
జిటుకునఁ బట్టనైతి నని చింతిలుచుండ దయానురక్తిచేన్. 86

సీ. చిఱుతనిఁ జేరంగఁ జీరి కౌఁగిటఁ జేర్చి
తొడలపై నిడుకొని యొడలు నిమిరి
కూఁకటి పుడికి వైకుంఠాస్త్రుఁ డిట్లనుఁ
దనయుని ముగ్ధత్వమునకు మెచ్చి

వచ్చె నిన్నిట దోడి తెచ్చుటకై యల
భక్తు నీకడకు నేఁ బంపినాఁడ
నతఁ డగపడఁ డని యడలకు మని వాని
పైఁ గప్పుకొనుగోరుపటము వజ్ర
తే. కవచముగఁ జేసి యోగవేగములు ఫాల
నయనమును మఱి స్పర్శవేదియు నొసంగి
యింటి కేగుదు గాని నీ యీప్సితార్థ
మింక పలసినయది గోరు మిత్తు ననిన. 87

శా. గౌరీవల్లభ! వాంఛితం బొకటి నేఁ గాంక్షించెద న్నిన్ను నీ
వీరూపంబున నీశుభాలయముతో నీవేళ నావెంబడిన్
మావా రందఱు సంతసంబునఁ గన న్మాయూరి కేతెంచి బ
ల్కారుణ్యంబున నెల్లకాల మట సౌఖ్యం బొప్పఁగా నిల్వవే!. 88

క. ఇది దప్ప వేఱె వాంఛిత, మది లేదన నీశుఁ డనియె నాగతి నీ విం
పొదవఁగఁగోరినకోరిక,లొదవఁగఁజేయఁదగుఁగాననొక్కటివినుమా.

తే. లోకమునకుఁ జూడ నీకు ముక్తజంగమ,వరుఁడుచూపినట్టిపగిది నిల్తు
నీకుఁ జూడనట్టి యాకృతి నుండెద, ననిన సమ్మతించి యర్భకుండు.

వ. గౌరీశ్వరానుగ్రహంబున నసాధారణమేధాయుతుం డై యద్దేవు ని
ట్లని స్తుతియించె. 91

ఉ. ఫాలకృశానుకీల! భవపాశవిమోచనశీల! మానిహ్వా
ల్లోల! దయాలవాల! హితలోకసుధాశనపాల! కంఠకా
కోల! విధూతకాల! శతకోటిధరాదిసురాళిపాల! స
ల్లీల! శివానుకూల! వినుతించెద నిన్నిదె మల్లికార్జునా!. 92

ఉ. శారదకంప కాదప తుషార పటీర మృగేంద్ర కుంద ఖ
ర్జూర మరాళ వారిజ మరుద్గజ పారద హార హీర మం
దార సమీక జేమన సుధాకర చంద్ర సురేశ్వరరాశ్వ భా
షారమణీశరాభనిజసంహాననాంచిత! మల్లికార్జునా! 93

చ. అని వినుతించునాతనిఁ బ్రియంబునఁ గన్గొని చెన్నమల్లికా
ర్జునుఁ డను వత్స! నీ కెదురుచూతురు నీతలిదండ్రు లావ్పు లో
క్కనిముష మెండఁ గాఁగ నటు గావునఁ బోద ఘటంచుఁ దక్షిణం

బున నిజపాదసేవకసమూహవిహారిణి సొన్నలాపురిన్. 94

చ. కనకమణీమయాలయము కల్పనచేసి తదంతరోర్వి నా
తనఘనలింగరూపమునఁ దా వసియించి యమేయభక్తిభా
జనమగు సిద్ధరామవరు సన్నిధి నుంచి జగజ్జనానురం
జన మొనరింపుచు న్నిలిచె శర్వుఁడు శ్రీగిరినుండువాడ్పునన్. 95

చ. అటు కనిపెట్టి పౌరజను లందఱు గన్గొని యద్భుతాత్ములై
యిటు మును పెన్నఁ డిప్పగిది నీమణిధామము గాన లేదు ని
క్కుటమగు కాంతి నల్దెసలఁ గప్పుచు నున్నది చూడుఁ డంచు నొ
క్కట ప్రమదం బెలర్ప గుమిగా గుడిఁ జేరఁగ నేగి యందునన్.

చ. అనుపమలింగమూర్తిఁ గని యందలిభక్తి వసించు సిద్ధరా
మునిఁ దిలకించి యద్భుతము మోదము స్వాంతమునందు నొక్కటం
బెనఁగొన నందుఁ గొంద ఱతివేగము ముద్దయఁ జేరఁ బోయి నీ
తనయుఁడు వచ్చినాఁ డనినఁ దక్షణమాత్ర వధూసమేతుఁడై. 97

క. భవనము వెలువడి తజ్జననివహముఁ జూపించుదారి నేసని యెదుటన్
నవరత్నఖచితమైతగు భవగేహముఁ గాంచిచొచ్చి ప్రబలినతమిచేన్.

క. రెండవరుద్రుసికై వడి నుండుతనయుఁ జేర జపమహాత్మ్యకుఁడై యా
తండు జననీజనకపద కాండజముల కేరఁగి నిలువఁ గడునేడుకతోన్.

సీ. జనకుఁడు గూరిమితనయుఁ గౌఁగిటఁ జేర్చి
నాకులపావనా! నాయశంబ!
నాపెన్నిధానమ! నాతండ్రి! నాపట్టి!
నాతపఃఫలమ! యిన్నాళ్లు నన్ను
నెడఁబాసి యెచ్చటి కేగితి? విచ్చటి
కెప్పుడు వచ్చితి? వీగు డేమి?
యీలింగ మెక్కడి? దింతయు నేర్పడ
నెఱిఁగింపు మనుటయుఁ జిఱుత తాను

తే. వరుసతోఁ గూడి శ్రీగిరి కరుగునాఁడు
మొదలు నగరప్రవేశంబు తుదిగ జరుగు
తనదువృత్తాంత మంతయు వినఁగఁ దెల్ప
నెల్లవారలు సంతోషహృదయు లగుచు. 100

తే. భళిర! జితకామ! శాంభవభక్తిధామ!
కమలసుఖధామ! సమదృష్టకాచహేమ!
భువనసుతనామ! పరిపంథిసివహాభీమ!
సేవకావలిరామ! శ్రీసిద్ధరామ!. 101

క. బాలుఁడవై యుండియు నీ
లీల మహామహాఁడ వగుట లేశము దెలియం
జాల మయితి మింక నీ సరి
యేలోకమునందు నైన నెన్నం గలదే?. 102

వ. అని యత్తెఱంగునఁ గొనియాడి యేతల్లింగమూర్త్యభిధానం బెద్ది? యని యంతయు విచారించి సిద్ధరామునిచేఁ గొనితేఁబడు మల్లికార్జునమూర్తి గావున సిద్ధమల్లేశ్వరాభిధానం బిడి షోడశోపచారంబులం బూజించి గీతవాద్యాదులఁ గొంతప్రొద్దు వినోదంబు సలిపి తదనంతరంబ యబ్బాలుం దోడ్కొని తదీయనివాసంబునకుం జని ముద్దాఖ్యదత్తోచితాసనంబుల నాసీనులై భూతిపీడ్యంబులు గైకొని యొండొరులు తమలోన. 103

మ. ఘనగిరిమల్లికార్జునుని గన్గొన తత్కృపఁ గాంచి యిందుఁ దోడ్కొని చనుదెంచు వీనిజనకుం డగుముద్దయభాగ్యవృత్తి చెప్ప నగునె? సొన్నలాపురి శుభంబు వహించెఁ బురంబులోని యీజనులు నిరంతరం బతులసౌఖ్యముఁ జెందుదు రింకమీఁదటన్. 104

తే. ధీరుఁ డై నట్టిషోడ్డలదేవుఁ బాచి
రాజు సౌరాష్ట్రమునుండి రాజమౌళి
వచ్చెఁ గళ్యాణమునకు మందిరముతోడ
వచ్చి నీతనిభక్తికి మెచ్చి హరుఁడు. 105

వ. అదియునుంగాక. 106

క. శ్రీ మెఱయ మున్ను మైధున, రాముఁడు నిటలాక్షపాదరాజీవార్చా
కాముఁడు నగపతినిటుతన, ధామమునకుఁ దెచ్చెఁ దద్విధం బెటులన్నన్.

## మైధునరామునికథ.

క. హైమప్రాసాదచర, త్సోమమాస్యాకచవిరాజసుమనస్సుమన
స్తోమాయితనక్షత్రము, భీమావతి యనునెడుపురముపృథివిఁ దనర్చున్.

వ. తత్పురంబున. 109

ఉ. ప్రాకటనైజవంశజలరాశివిధుం డొకసోమయాజి ని
ష్ఠాకలితాత్ముఁడై తపము సల్పి కులాంగనయందుఁ బుత్రశో
భాకరుఁ గాంచె నీశ్వరుకృపారతి మైథునరామనాము మై
నాకుని ద్రొల్లి శీతనగనాథుఁడు గాంచినరీతిఁ బ్రీతిగాన్. 110

తే. కని మనోరథ మీడేరె ననుచు సతియుఁ
దాను సంతోషకలనచేఁ దనరి బంధు
రాజి కొనియాడఁ దత్సోమయాజి భూత
లస్థసౌఖ్యాప్తి కొంతకాలంబు జరిపి. 111

ఉ. అక్షయు నవ్యయాత్ముఁ బ్రమథాధిపుధ్యానతఁ గంటిఁ గాని ప్ర
త్యక్షము గాఁగ దివ్యవిమలాకృతిఁ గాంచఁగ నైతి నింకఁ ద
ర్త్ర్యక్షునిఁ జూడఁగావలె నటంచు ముదంబున నేగి యాసహ
స్రాక్షముఖామరాభినుతమౌ శివలోకముఁ జెందె నంతటన్. 112

క. జనకుఁడు పరమేశ్వరుఁ జెం,దినపిమ్మటఁ దల్లిఁ బెనుప దినదినమును మై
థునరాముఁడుప్రబలుచు హా, యనస త్తక మైనపిదప నంబపనుపునన్.

మ. ఒకనాఁ డాటలకుఱ్ఱలం గలిసి తా నుద్దండకాంతారభూ
మికిఁ బర్ణేంధనసంగ్రహార్థముయి తాల్మిం బోయి యిందొక్కచో
సకలాండోద్భవసన్నివేశవటవృక్షచ్ఛాయయం దాత్మ ను
త్సుకలీలన్ వసియించువేళ సహవర్తుల్ వేడుకల్ మీఱఁగాన్.114

క. ఒండొరులతోడ దివ్వెల
పండుగ యిదె వచ్చె నింకఁ బదిదినములకున్
వండుదు రరిసెలు గజ్జపు
టుండలు మాయింట ననుచు నొక్కఁడు పలికెన్. 115

క. మఱియొకఁడు పలుకుసన్నపు, సెఱవగుదుప్పటులుపూలు నేసినయంగీ
లౌఅపుగలుగుతలపాగలు, నఱిముఱిగొని తెచ్చునాటికయ్యయటంచున్.

క. మాయక్కలమాబావలఁ, దోయంబులవారి నెల్లఁ దోడ్తేరఁగ నే
నాయత్తపడఁగవలెఁ జుం, డో యని వేఱొకఁడు పల్కె నుత్సుకలీలన్.

ఉ. అప్పుడు రాముఁ డిట్టు లను నందఱఁ గాంచి కుమారులార! మా
యప్పను బావనుం బిలిచి యప్పెనుపండువునాఁడు పాశముం.

బప్పాలు కుప్పతెప్పలుగ బంతిని వారలతో భుజింతుఁ బై
గప్పఁగఁ గట్టి నిత్తు నెసకంబున వారికి సన్నపుట్టముల్. 118

మ. అనినం బక్కున నవ్వి బాలకులు చోద్యం బయ్యె రామయ్య! నీ
వనువాక్యంబులు నూఱులేని పొలిమే రన్నట్లు సన్మిత్రచా
రిని నా కిందఱు బిడ్డ లన్నగతి నోరి! నీకుఁ దోఁబుట్టువే
విన మేకైవడి బావ గల్గెఁ? జెపుమా! విందాము నిక్కంబుగాన్. 119

ఉ. అందఱితోడ వంతుకొఱ కక్కను బావను దెత్తు నంటి వీ
రిందఱు నమ్మియుండి రిపు డెక్కడనుం డిట వచ్చినారు! మీ
చందము ముస్నె ఱుంగరు మృషావచనంబులు వింతవారికిన్
బొందెడుఁ గాక మాకు విన యోగ్యముగా దటులైనఁ దెల్పుమా. 120

సీ. మీయక్క యెవ్వరు? మీ బావ పేరేమి? వారిదే యూరు? దవ్వా సమీప
మా? కలిగినవారో? లేక దరిద్రులో? వారిచుట్టంబు లెవ్వారు? వారి
కెందఱుసంతానమేవృత్తిఁ జరియింతు? రెన్నఁడు మీయింటి కేగుదెంచి
రెవ్వరు మీ బావ కిష్టు? లాతఁడు చదు వేపాటి చదివె? నీవిపుడు మాకు

తే. నెఱుఁగఁ జెప్పుమటంచు నందఱును నవ్వ
లెసఁగ గుమిగూడి డాయంగ నేగుదెంచి
మాటమీఁద నె మాటగా మఱియు మఱియు
నుడుగ కత్తఱిఁ దఱిమి తన్నడుగుటయును. 121

చ. వెలవెలఁబాఱి బాలకుఁడు వీఱిఁడి యై మఱుమాట లేమియుం
బలుకక వారి నెల్ల నెడఁబాసి కనుంగవ బాష్పబిందువుల్
దొలుకఁగ నింటి కేగుచు నెదుర్కొను తల్లిని గాంచి శోక మ
గ్గలముగ నేడ్చినం బెదరి గ్రక్కున నాత్మజుఁ గౌఁగిలించుచున్. 122

ఆ. వీఁపు చఱచి కనుల వెడలునీరము తన
పైఁటకొంగుచేతఁ బాయఁ దుడిచి
నాకుమార! యన్న! నాతండ్రి! నాకుఱ్ఱ!
యేల యేడ్చెదయ్య? యింత వెక్కి. 123

క. అడవిని మృగములఁ గనుఁగొని, జడిసితివో యయ్య! లేక సహచరులటని
న్నొడిచి తమరేగుదెంచిరో!, వడుచులతో నేలసిన్నుఁ బంపితిఁ దండ్రీ!.

క. ఒడలెఱుఁగక మూర్ఛంబునఁ, బడుగులు నిన్నెవ్వరేనిఁ బెనకిరొ! వారిం
దడయక నే శిక్షించెదఁ, గొడుకా! కల తెఱఁగు నాకుఁ గొంకక చెపుమా.

చ. అనినఁ గుమారుఁ డిట్లనియె నమ్మ! సహాయులు నే నరణ్యమే
దిని గుమిగూడి యాడునెడ దివ్వెల కక్కల బావగార్ల క
మ్మనియెద మించు నంద అన నట్లన నేఁ బలుకంగ లేసివా
రి నెటులఁ దెత్తు వంచుఁ జెలరేఁగి వికావికనవ్వి రత్తఱిన్. 126

క. అని యతఁ డాడినమాటలు
విని నెమ్మదిఁ జింత నొంది వీని నెటుల రో
దన ముడుపుదు నని యపు డొక
యనువు విచారించి పలికె నాత్మజుతోడన్. 127

తే. అన్న! ప్రేలరితనమున నడవి వడుగు
లాడుమాటలకీ వింత యడలె దేల?
తెలియ కాఱడి యైన సందియము దీఱ
వార లడిగినక్రమ మెల్లఁ నేరుపఱతు. 128

సీ. మీయక్క భ్రమరాంబ మీబావ మల్లన్న
వారలయునికి శ్రీపర్వతమున
నతిదూర మిచటికి కష్టైశ్వర్యసంపత్తి
గలవారు బంధువర్గంబు హిమవ
దాదులు సుతులు గణాధిపప్రముఖులు
సకలలోకాఢ్యులై జరుగు వృత్తి
లేమి చేఁ బిలుచుటలే దెన్నఁ డిటు వారి
శ్రీదుఁడు మీబావ చెలిమికాఁడు [చుట్ట

తే. ప్రజ్ఞ వివరింప నేల? సర్వజ్ఞమూర్తి, యరయ నాయల్లునంత వేత్తైన
మేఁడినిను గెలిచేసినహీనవిప్ర, బాలకులకన్న సంతోషభరితుఁడగుచు.

ఉ. బాలకుఁ డిట్లు పల్కె నిదె పండువు డాయఁగ వచ్చెఁ దల్లి! నీ
వేల తనూజ ధానిహ్వాదయేశ్వరుఁ బిల్వఁగఁ బంప? విట్టులం
బోలునె? క్రిందటం బిలువఁ బోవమియే కదఁ దప్పు పంపినన్
లీలను నేను వారిఁ దరలించుకవచ్చెద సత్వరంబుగాన్. 130

తే. వసుమతిని నల్లుఁ దోడ్కొని వచ్చినట్టి
పండుగ శుభాస్పదం బయి పరగు నెందు
నట్ల సేయకయున్న హీ యనుచు నగరె ?
పలుచఁగాఁ జూచి మనసాటిబంధుకోటి. 131

చ. అనవుడుఁ దల్లి యి ట్లనియె నన్న! కుమారక! నిన్నుఁ గాంచి నీ
జనకుఁడు చన్నపిమ్మట విచారముచే నిరతంబుఁ దోఁచ కె
వ్వని నటఁ బంపలే దతఁడు వచ్చుట లేదు తొలంగి నిన్నుఁ బొ
మ్మని యెటు నైతు? స్త్రీలు చనునట్టివి గావుగదా? పరాపనుల్.132

సీ. అది గాక మీబావ కతులితసంపదల్
గల వట నిట కేల కదలివచ్చు?
నొకవేళ వచ్చెనా యొంటిరాఁ డతనితోఁ
బరివార మరుదెంచు బహుళ మగుచు
నంపజి కేరితి విందు సేయఁగఁ గల
మిప్పాటఁ గుడుచుట కింట లేదు
సాటికిఁ జెవులు పెంపఁగవచ్చుఁగాని పోఁ
గులు పెట్టఁగలరె? భూవలయమందుఁ

తే. బూని మున్నాటయిలువడిపుట్ల తండు
లములు వానికిఁ దగువ్యంజనములు గూర్చి
పాక మొనరించి పెట్టి మీబావచేత
మెప్పుగనెఁ గరికాలుండు మిగులఁ దొల్లి. 133

ఆ. కాన భాగ్యవంతు లైనవారలతోడ, నెట్లు సాటివత్తు? మీవు పెద్ద
వాఁడవై గణించవచ్చినప్పుడువారిఁ, దోడితెత్తుగానికాడదిపుడు.134

వ. అని పల్కిన జననిపల్కులు వెడవెడయూఁకొని తన్ను గేలిసేయువిప్ర
కుమారులమాటలుమనంబుననాటుటయు నేగతి నైన నభగిసీభావుకులఁ
దోడితెచ్చి పండువు సేయదుంగాక యని తలంచి యొకతీరున నద్దినం
బు గడపి మఱునాఁ డరుణోదయంబున లేచి యెవ్వరితోడం జెప్పక
మరు లెత్తినకై నడిఁ బురంబు వెలువడి. 135

చ. కరి చమరీ తరక్షు వృక గండక భల్లుక పుండరీక కే

సరి కిటి భూరిమాయు శశ శల్య వలీముఖ కృష్ణసార కా
సర శర భాఖుభు గ్గవయ శాక్వర రౌహిష రామ ఋశ్య శం
బరముఖసర్వదుష్టమృగబంధురకాననభూమిఁ ధీరుఁడై. 136

క. ఒక్కరుఁ డదరక బెదరక, యెక్కుడుమైనములుచనుచు నంతటిదవ్వో
యిక్కడికి శ్రీనగంబని,యక్కడియక్కడిజనాళి నడుగుచుఁజని యెన్.

మ. చని కాంచెన్ ధరణీసురాత్మజుఁడు భాస్వద్భక్తి శ్రీశైలమున్
ఘనపాపాటవికీలమున్ వరదివౌకశ్శకామినీఖేలమున్
మునిగేయాఖిలతీర్థజాలము సదామోక్షోత్సుకైకాలమున్
జనితాభీష్టదకల్పసాలము మనోజాతారిమున్మాలమున్. 138

తే. కాంచి సంతోషపులకితగాత్రుఁ డగుచు
నమ్మహీధరశిఖరాగ్ర మధిగమించి
యెచట నుండునో మాబావ యిపుడె వెదకి
వెంటఁ గొనిపోదుఁగాక మాయింటి కనుచు. 139

సీ. రాజతశిఖరేశ్వరంబందు వీక్షించి హాటకేశ్వరుని గేహంబుఁ గాంచి
గణపతిస్థానంబుఁ గలయంగఁ దిలకించి పంచమఠంబులపజ్జ వెదకి
కలితపాతాళగంగాప్రతీరముఁ జూచి కుండికానికహంబుదంశ నెమకి
కోటిలింగాకారకుంభినిఁ గనుఁగొని చంద్రగుప్తనగంబుచాయ నరసి

తే. రమ్యతరశంఖ చక్ర వరాహ బిందు
నారసింహ సరస్వతీ నామతీర్థ
రాజిఁ బరికించి కాంచనరత్నసాల
గోపురంబులు గ్రుమ్మరి పాపఁ డంత. 140

వ. మఱియుఁ ద్రిపురాంతకాలంపురీబాలబ్రహ్మేశ్వర సిద్ధమాహేశ్వర
వీరేశ్వర స్కంధసోమేశ్వరప్రసూనాచలసంగమేశ్వరంబు లనుచతు
ర్ద్వారోపద్వారమధ్యంబునం గలతీర్థంబులం బరామర్శించి ప్రాకారం
బుం దఱియం జొచ్చి యంతటం గలయం దిరిగి మల్లికార్జునుం డెచ్చ
ట నున్నవాఁ డని కనుపడుజనంబుల నడిగి వారివలన నిక్కువంబ
తెలిసి తదీయాలయంబు చేరంబోయి యచ్చట లింగాకారంబు గాం
చ యస్మద్భావుకాగారం బిదియ యని చెప్పి రిచ్చట లేఁ డిదేమొకో

యని చింతించి దూరపథశ్రమంబు నొందినవాఁడు గావున నొక్క-
యెడఁ గూరుచుండి యద్దేవు నుద్దేశించి. 141

ఉ. నిండినవేడ్క దివ్వెలను నిగ్గొనిపోవఁగ బుద్ధి పుట్టి నే
నెండకు వానకుం దలఁక కెచ్చట నిల్వక తోడుగూడి నా
దండ వసించుబాలురకు దవ్వయి తల్లినిఁ గన్మొఱంగి యీ
కొండకు వచ్చి నద్దెసలు గ్రుమ్మరితిన్ నినుఁ గాంచువాంఛచేన్. 142

ఉ. ప్రొద్దునఁ జద్దిబువ్వ దిని పుస్తకముల్ పడకింటఁ జాటుగా
మిద్దియమీఁద డాఁచి కడిమిన్ బడి కేగక యెక్కగుండ నే
నిద్దెస కేగుదెంచితి నిఁ కేమియుఁ బల్కక యప్ప నీవు నన్
ముద్దొనరించి రండిపుడ మోదముతోడుత మల్లికార్జునా!. 143

ఉ. మాసరివారు దివ్వెలయమాసకు నల్లుర నాఁడుబిడ్డలన్
వాసి యెసంగఁ దోకొనుచు వచ్చుచునుండిరి గాన నీవు ను
ల్లాసముతోడ రమ్ము పదిలక్షలొసంగుట నీవు రాక న
న్నాసి యొనర్పఁబోకు కసుగం దని చూడకు మల్లికార్జునా! 144

ఉ. తాను వసించునట్టి పురిదండకు దూరపుఁజుట్టమైన రా
వారలఁ దోడితెచ్చి కుడువంగ నొనర్చి బహూకరింతు రె
వ్వారలు నట్లు గాదు ప్రియబంధుఁడ నింటికి వచ్చినాఁడ నన్
గూరిమిఁ గాంచి పల్కవిటు గూడునె? శ్రీగిరిమల్లికార్జునా!. 145

క. ఇన్నాళ్లనుండి పిలువక, న న్నిప్పుడు పిలువ వచ్చినాఁడని నాపైఁ
గ న్నెఱ్ఱసేసినాఁడవొ, గున్నలపైఁ గినుక సేయఁగూడునె? బావా!.

క. మాతల్లి గూఁతు నల్లుని, నే తెఱఁగునఁ జూతునను చు నెప్పుడుగడు వాం
ఛాతత్పరయై యున్నది, ప్రీతి [illegible]లర్పంగ రమ్ము ప్రిదులకు బావా!.

చ. ప్రియమె గణింతు గాని నిజుపేవ లటంచుఁ దలంచఁబోకు నీ
దయను సమస్తవస్తువులు తక్కువ గావు మదాలయంబునన్
రయమున రమ్ము నీ వటకు రాకకుఁ దీఱ దటంటివేని ని
శ్చయముగ నిన్ను నే వదల జాగువ నేమని పెక్కుభంగులన్.

ఉ. భూసురవర్యనందనుఁడు బుద్ధికిఁ దోఁచినయట్లు పల్కి ది
గ్వాసుఁడు కానరామికిని గాడ్పడి దిక్కులు చూచి బావ నా

వాని మెఱుంగఁడాయెఁ వనవాసముఁ జేరినఁ జూడఁ డాయె నేఁ
జేసిన నేర మేమి? యని చింతిలి యంబఁ దలంచి యి ట్లనున్. 149

ఉ. తల్లిని నన్ను బంధుల ముదంబునఁ జూడఁగవచ్చు కోర్కి నీ
యుల్లములో జనింపదె? ప్రియుం డెటు లట్టుల నీవు చేయఁగాఁ
జెల్లునె? యత్తవారిగృహసీమలసంపద లెన్ని గల్గినన్
ఫుల్లసరోజలోచనలు పుట్టినయిండుల కాసఁ జెందరే?. 150

క. ఓయప్ప! నీవు బావయుఁ, బాయక నాతోడ దివెలపండువ కిటు ర
మ్మా యనుచుఁ బెక్కుభంగులఁ, దానోడకపిలిచిపిలిచివారలుదనకున్.

క. పొడచూపకయుండిన న, బ్బుడుతఁడు నే నింటి కెటుల పోఁదగు వీరిం
దోడుకొని యేగక నాసరి, పడుచులు నను గేలిచేసి పకపకనగఁగాన్.

క. సరివారు తన్నుఁ గనుఁగొని, పరిహాసము చేయువారిపలువురినడుమన్
ధర బ్రదికియుండుకం టెన్, మరణంబె మేలటంచుమది నిశ్చలుఁడై. 153

చ. అలశిఖరాగ్ర మెక్కి తనయప్పను బావను నెమ్మనంబులో
నిలిపి సహాయబంధుజననీగృహపట్టణవాంఛ లేమియుం
దలఁపక నిల్చి యొక్క బెడిదంపుజటిం బరికించి చూచి ని
శ్చలమతి వానిలో నురుగ శంకరుఁ డంబయు నంతలోపలన్. 154

క. ఇరు గెడల నిలిచి దండలు,కరములుఁ బట్టుటయుఁ దిరిగికమలాంకముఖీ
పురుషులనిరువురఁ గనుఁగొని,పరమాశ్చర్యంబునొంది బాలుఁడని యెన్.

ఉ. ఎక్కడనుండి వచ్చితిరి? యెవ్వరు మీరలు నన్నుఁ బట్టి? మా
యక్కయు బావయే కరుణ యాత్మఁ దలంచినవారు కారు నెం
పెక్కినకూర్మి మీకు జనియింపఁ బనేమి? విడుండు ప్రాణముల్
దక్కఁగొనంగ నేని నిటు తప్పక నే నన నవ్వి వానితోన్. 156

సీ. పరమాదరంబున గిరిజ యి ట్లని పల్కె
మాముద్దుతమ్ముఁడ! మేము నీకుఁ
బరులమా? నీయక్క భ్రమరాంబ నేను మీ
బావ యీతం డితె కావు మాకుఁ
బృథివి నీవు జనించునదప ని న్నెన్నఁడుఁ
జూడలే దటు గాన నేఁడు గుఱుతు

తెలియంగఁజాలమైతిమి సోమయాజిపు
త్రుండు భీమావతినుండి వచ్చి
తే. నాఁడు నేఁ డన విని చిన్నవాఁడు బ్రిమసి
యొంటి నెక్కడఁ దిరుగుచు నున్నవాఁడొ
యనుచు నీకొఱ కందంద నరసికొనుచు
వచ్చి కనుఁగొంటి మిచ్చట వత్స! నిన్ను. 157
చ. అన వినునంతలోనఁ బ్రమదాంబుధిఁ దేలి కుమారుఁ డంబప
ద్వనజయుగంబుమీఁదఁ దనఫాలము సోఁకఁగ వ్రాలి నవ్వుచుఁ
నెనరున గ్రుచ్చి యెత్తి ధరణీధరసంభవ నీదు బావకుఁ
వినుతి యొనర్పు తంబి! యన నీలగళుం గని సాఁగి మ్రొక్కినన్.
ఉ. నవ్వుచుఁ గౌఁగిలించి కరుణారస ముప్పతిలంగఁ గూఁకటిం
దువ్వుచు జెక్కు గీటుచుఁ గుతూహల మొప్పఁగఁ బల్కె నన్న మీ
యవ్వకుఁ దెల్పి వచ్చితివొ యూఁపె నెఱుంగఁగనీక వచ్చితో
యెవ్వరుఁ దోడు లేక భయమేది యొకండవు రాఁగఁ జెల్లునే? 159
ఉ. వచ్చితి మేలు చేసితివి వారె కనుంగొను మేనయల్లు రా
వచ్చుచు నున్నవారు గణపాలకముఖ్యులు వారిదండలఁ
వచ్చెదుమూఁక పారిషదవర్గము మత్ప్రియకోటి నీవు మ
మ్మిచ్చ దలిర్పఁ జూచితిగదే! మదిలోనికొఱంత తీఱఁగాన్. 160
క. దుర్గమకంటకకర్కశ, మార్గశ్రమ దీఱఁ నిల్వుమా మత్సుతసం
సర్గుఁడవై యిచ్చట సుఖ,వర్గంబులఁ జెందికొన్ని వాసరము లనన్. 161
చ. చిఱుతఁడు పల్కె నిచ్చట వసింపఁగ వచ్చితినయ్య? మిమ్ము నం
దఱ మదివేడ్కఁ బండువదినంబునకుం గొనిపోవ వచ్చితిఁ
గుఱుచగ నన్నుఁ గన్గొనక కోమలి నీవు దనూజు లొప్పు లి
త్తఱిఁ బయనంబుగండు ప్రమదంబున మామకరాజధానికిన్. 162
క. మాదాయాదులు బంధువు, లాదివ్వేల కాత్మసుతల నల్లుండ్రను స
మ్మోదమునఁ దోడితెత్తురు, కాదన కటుమీరురండు గ్రక్కననినన్.
క. ఎడలేదు దివెల నడుమనె, గడుచు స్త్రీపురముఁ జేరఁగాలే మీ యేఁ
డుదుగుముపచ్చెదుపండువ, కెడపక యటకేగు దెంతు మిందఱమనినన్.
చ. విని బెగ డొంది బాలకుఁడు వీరలఁ దోడ్కొని వత్తు నంచు నేఁ

బనిగొనివచ్చి తా మునిన బంధువు లెల్లను గేలి సేయఁగాఁ
జను టుచితంబె? యంచు హరిసాయకపాదములందు వ్రాలి మి
మ్ము నెటులనైనఁ దోడికొని పోవకమాన నటన్న నవ్వుచున్. 165

ఆ. అట్టులైన నీమహావాంఛ యీరక,చెలువ నేల గమ్ము చిలుక! ప్రమథ
సమితిమత్కుమారసముదయమేనును,సత్తమునితెఁగరుణవఱలనిచట.

చ. తనసుతు లోగిట న్వెదకి తల్లి దిగుల్కొని పల్లెకూటమం
దునఁ దిలకించి బాలకులతోఁ జని యాడుచు నుండెనేమొ రాఁ
డని చని వాడవాడల భయాకుల యై కనుఁగొన్న వారి నా
తనయుని గానరే? యనుచుఁ దప్పక వేఁడుచుఁ గాన కార్తయై. 167

చ. కనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మగఁ బాదయుగంబు దొట్రిలం
దనువునఁ జెమ్మట ల్వొదమ దాలిమి దూలఁగ వ్రాలి లేచి నా
ఘనధనరాశి! పుత్ర! చనఁ గారణ మే? మని పిల్చి పిల్చి మా
నిని దనయింటి కేగి మది నిండినదుఃఖముతోడ నెంతయున్. 168

వ. అన్న పానంబులు విసర్జించి దినదినం బొక యుగంబుగాఁ గడుపుచు
నుండి యొక్కనాఁడు తనమనంబున గిరీశ్వరుం దలంచి. 169

ఉ. పో రుడుపంగ నేఁ బలుకుబూటక మెల్ల నిబద్ధిఁ జేసి యే
దారిని బోయెనో సుతుఁడు దాఁ దగ నాఁకట నెంత సోలెనో
ఘోరవనీమృగాళిఁ గని కుత్తుఁడు నెమ్మది నెంత జంకెనో
నేరక మోసపోతిఁ గరుణింపుము శ్రీగిరిమల్లికార్జునా! 170

చ. నినుఁ దనబావఁగాఁ దలఁచి నేస్తులతోఁ గడుఁ బంతగించి నా
తనయుఁ డమాసపండువకు దంపతుల న్విముఁ దోడిదెత్తు నం
చనుకొని వచ్చెనేమొ కరుణాకర! శ్రీగిరినాథ! వాఁడె నీ
యనుఁగుమఱంది వానికి దయామతితోఁ బొడచూపవే వెసన్. 171

ఆ. ప్రియునిఁ బాసి చాలపేదఱికంబునఁ,దగిలి పిఁడెపెన్ని థాన మనుచు
సంతసించియుంటి సకలదుఃఖంబులు,మఱచి నేఁడు వెతలమఱుగవలసె.

ఉ. దీనశరణ్య! నాదుకులదీపకుఁ గ్రమ్మఱఁ గానుపించి నా
మానసశోకవేదనలు మానపవే యని కన్ను మోడ్చి లో
ధ్యానము సేయఁ దత్సుదతి కత్తఱి స్వప్నమువోలె భ్రామరీ
మానినితోడఁ గూడి గిరిమందిరు డద్భుతజంగమాకృతిన్. 173

క. సాక్షాత్కరించి సతి నీ, వి క్షేపము మాన్పుకొఱకు విచ్చేసితి నే
దక్షమఖశిక్షకుఁడ నీ, ఋక్షేశ్వరవదన భ్రామరీరమణి సుమీ. 174

చ. సొలఁతుక! నీవు పుత్రునకుఁ బూర్వము చెప్పినరీతి నప్ప బా
వల మని యేము గన్పడినవారము వానికి నేతదాకృతిన్
బలుకఁగ వానితో నిటకు వత్తుము రేపె యటంచుఁ బల్కఁ గ
న్గలువలు విచ్చి వారి నట గానక విస్మయమంది యాత్మలోన్. 175

ఉ. ఎంతకృతార్థ నైతిఁ బరమేశ్వరదర్శన మబ్బె నేఁడు నా
చింతలు దీఱె నింక శశిశేఖరుఁ డెప్పుడు వచ్చునంచుఁ ద
ద్భ్రాంతిన యుండె నచ్చట ధరాధరచాపుఁడు బాలుఁ గాంచి య
త్యంతకుతూహలంబునఁ గరంబు కరంబునఁ జేర్చి చెచ్చెరన్. 176

క. మీఁదగుపట్టణమున కిదె, పోఁద మనుచుఁ బలికి ప్రమథపుంగవసుతభా
ర్యాదులతో నప్పుడు కా, కోదరభూషణుఁడు సత్కృపోన్నతమతియై.

ఆ. మాయని య్యకొలిపి మదిలోన సంశయం, బొదవనీక వానియూరుఁ జేర్చి
కన్ను గలిపి మీరలున్న తావి దెకదా, యన్న నిదియె నాపు డభవుఁ డలరి.

క. పదపద ముందర నని చే, వదలిన వేగమున నేగి బాలకుఁ డంబా
పదయుగమున కెరఁగి నన, మ్మదవతి యాశ్చర్యమోదమానస యగుచున్.

చ. కనుఁగొని గ్రుచ్చియెత్తి సుగుణాకర! నాకులదీప! వచ్చితే
యన గుడిలోనఁ జూడు మదె యప్పయు బాయియు వచ్చిరంచుఁ బ
ల్కిన సుతుమాట కర్ణములఁ గీల్కొనునంతనె మేను పొంగ నేఁ
గనుకల నిక్క మయ్యెఁ గఱకంఠుఁ జూచెద నంచుఁ జెచ్చెరన్.

చ. ఎదురుగ నేగి శంకరగిరీంద్రసుతాదులఁ గాంచి భక్తి పెం
పొదవఁగ నాత్మ మ్రొక్కి వినయోక్తు లెలర్పఁగఁ దోడితెచ్చి త
త్పదమలదృష్టిఁ బ్రాఘునసంపద లచ్చెరు వందఁ జేయ న
మ్మదవతి నైజభర్తృమణిమందిరమం దొకచక్కి మక్కువన్. 181

సీ. అందఱ నుచితాసనాసీనులుగఁ జేసి యర్ఘ్యపాద్యములిచ్చి యంబికేశ్వ
రాదుల కతిభక్తి నభ్యంజన మొనర్చి నలుగులు నలిపించి జలకమార్చి
ధౌతవస్త్రంబు లాదటఁ గట్టఁగా నిచ్చి రాజవదుపచారరాజిఁ బూన్చి
పంచభక్ష్యంబులు పాయసాన్నాదికంబులు షడ్రసోపేతముగను భర్మ
తే. పాత్రముల నిరచి యారగింపఁగ నొసర్చి

గంధ కర్పూర తాంబూల కనకరత్న
భూషణాంబరముఖవస్తుపుంజ మొసఁగి
సంతసం బందుచుండు నాసమయమందు. 182

వ. తొల్లి కాననంబున రామునిం గేలిసేయువిప్రబాలకు లవ్వేళ యతం
డింటి కరుదెంచుట కర్ణాకర్ణికగా విని నేఁడు పండువకు మీయక్కఁ
బావలఁ దోడి తెచ్చితివే? యని మందలింత మని యందఱు గుమిగూ
డి వారియింటి కరుదెంచి కమనీయకనకరత్నమయసౌధతోరణవితర్ది
కాదుల నవలోకించి లోపల ననేకజనకలకలం బాకర్ణించి బహిర్ద్వా
రకవాటంబులు మూసియుంట నవ్వలి కరుగునుపాయంబు లేకతిరు
గం జనుదెంచి తద్వృత్తాంతం బంతయు నిజపితృబంధుసఖాదులకె
ఱింగించిన వా రచ్చటికి వచ్చి నిజంబుగాఁ గని యిది యెంతకతం
బొకో కేవలదరిద్రుల కిట్టిభాగ్యం బబ్బెనని సందేహంబు నొందుచుండు
నవసరంబునఁ ద్రికాలవేది యగు నొక్కయోగిపుంగవుం డారామ
య్య బాలురతోఁ బంతగించి భ్రమరాంబామల్లికార్జునుల నప్పబా
వలనుదోడి తెచ్చి విందుపెట్టుటయుఁ బ్రమథసుతాదులతో నప్పుడు
వారియింట నీశ్వరుం డుండుటయుం జెప్పిన నత్యాశ్చర్యప్రమోద
మానసు లై యయ్యుమామహేశ్వరులకు ధ్యానపూర్వకంబుగా
నమస్కరించి నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ. 183

ఉ. అత్తరలాక్షి గాఢపులకాంకురసమ్మదబాష్పనేత్రయై
చిత్తజవైరిపాదసరసీజములం బ్రణమిల్లి యాత్మలోఁ
జొత్తిలుభక్తిచే మృదువచోగరిమం బమరంగఁ బల్కె లో
కోత్తర! వామదేవ! శివ! యోగిహృదాలయ! మల్లికార్జునా!. 184

చ. పురహర! యెంతభక్తసులభుండవు బాలుఁడు గోరినంత నా
కరయఁగ నేఁడు నీ వనుఁగుటల్లుఁడ వైతివి లోకమాత భ్రా
మరి వరపుత్రి యయ్యెఁ దరమా యిఁక మత్సుకృతంబు లెన్నఁగా
సురలకునైన నిట్లు పొటచూపుట చోద్యము గాదె? శంకరా! 185

చ. అని వినుతించుచున్నఁ గమలారిశిఖామణి యాదృతిన్ దయా
వననిధిఁ దేల్చి భక్తగణవర్యుఁడు మైథునక మనాంకుఁడున్
జననుతశీల నీవు ద్విజవ్రజ మక్కజ మంది చూడ నీ

తనువులతోడ రెండు సుఖదాయకమత్వమందుఁ జేరఁగాన్. 186

క. జాగింక నేల పుష్పక, మాగతమై యున్న దెక్కుఁ డని వారి న్వే
వేగ గొనిచనియెఁ దత్పురి, కాగమవేద్యుండు జగములచ్చెరువందన్.

తే. ప్రకటితంబగు మైథునరాముచరిత, మెలమిఁ జదివినవినినవారలకు మల్లి
కార్జునస్వామికరుణాకటాక్షకలన, నైహికాముష్మికఫలంబు లందఁగలు

తే. అనుచు మైథునరామునియద్భుతంపుఁ [గు.
జరిత చెప్పఁగ వినఁబడు సకలమనుజ
రాజి తిలకింప నీసిద్ధరాముఁ డిపుడు
మల్లికార్జును దేఁ గంటి ముల్ల మలర. 189

వ. అని యతనిప్రభాసంబు గొనియాడి ముద్దయ్యచేత ననుజ్ఞాతులై భక్తపుంగవులు నిజనివాసంబుల కరిగిరి గావున సిద్ధరామయ్య మహత్త్వం బిట్టిదని చెన్నబసవేశ్వరుండు చెప్పినఁ దత్ప్రభాసదు లత్యంత సంతోషాబ్ధిఁ దేలుచుండి రయ్యవసరంబున రామయ్య నిజదేశికపాదపద్మంబులకుఁ గ్రిమ్మఱఁ జాఁగి మ్రొక్కి దేవా! యిష్టలింగప్రభావం బానతీవలయు నని వేఁడిన యచ్చటిశరణులయనుమతిం గాంచి శిష్యునకు నాగమాంబాత్మజుం డిట్లని చెప్పందొడంగె. 190

## మడివాలు మాచయ్యకథ.

సీ. భూరమణీశిరోభూషణం బన ఖ్యాతిఁ
బరగు హెబ్బరిగె యన్పురవరంబు
నప్పురంబునఁ గళాధరజూటపదలగ్న
మానసుం డతులసన్మార్గవర్తి
యారూఢవీరభద్రావతారుం డయో
నిజుఁ డింద్రియవ్రజనిగ్రహుండు
భవిజనదూరుండు పండితనుతభక్తి
మహితుండు మడివాలుమాచిదేవుఁ

తే. డతులలింగధారణావాప్తికై కోరి, కల్లినాథుఁ డనెడుఘనునిఁ జేరి
భక్తితోడ మ్రొక్కి పరమాత్మ! మద్గురు, స్వామి! దీక్ష సేయవలయు నాకు.

ఆ. అనిన నతనిభక్తి కలరి దేశికవర్యుఁ, డట్లసేతుఁగాక యనిన మ్రొక్కి
స్వామి స్థూలమైన శాంభవలింగంబు, సిమ్మునావు డతఁడు సమ్మతించి.

ఉ. ఒక్కొకలింగమూర్తి నిది యోగ్యమె? నీ కని చూప నీతఁ డం
దొక్కటియైనఁ దాలుచుట కొప్పకయుండిన వేసరిల్లి వెం
పెక్కుఁ ఘురట్టె మొక్కటి మహీజను లక్కజ మందఁ జూపి యా
యక్కజమైనలింగము ప్రియం బగునే? కొన నీవు నావుడున్. 193

క. క్రమ్మఱ మ్రొక్కుచు గురువర!, యిమ్మహనీయమగులింగ మిష్టంబగు నీ
విమ్మనిన నవ్వి వేదో, క్తమ్ముగఁ దల్లింగ మపుడు ధరియించుటయున్.

చ. ప్రకటితభక్తిఁ గైకొని యురమ్మునఁ దాల్చి సమస్తభక్తరా
జ్ఞికరపదాంబుజాతములు నెన్నుదు రంటఁగ మ్రొక్కి నిల్చి కా
యక మొక టేను గోరితి మహాత్ముల సన్నిధి నెట్లనన్ గదా
ధికులమలీమసాంబరతతిన్ బరిశుద్ధినిఁ జెందఁ జేయఁగాన్. 195

క. అని పల్క భక్తసమ్మతిఁ, దనగురుచేనపుడు భస్మధారణమై యిం
చినవీరభక్తిఁ దత్పుర, మునఁ గొన్ని దినంబు లుండిముదమున నంతన్.

మ. బసవాధీశ్వరుఁ జూచువేడ్క మదిలోఁ బర్వంగ నేతెంచి భ
క్తసమూహంబున కర్చ లిచ్చుచు నమాత్యశ్రేష్ఠుఁ డర్చించుని
త్యసమారాధనఁ గాంచుచున్ శరణజాతం బెన్నఁ గళ్యాణమం
దనసమాస్త్రాంబకసన్నిభుం డతులచర్యాస్ఫూర్తి వర్తించుచున్.

ఉ. లేవకమున్ను మేలుకొని వేఱొక రేవున కేగి భక్తవ
స్త్రావళి గుంజుచో నతనికా? యెవరాపిడి యంచు నొక్కెడన్
దేవుని నుంచి సూత్ర మెడఁ ద్రెవ్వకయుండ ధరించి పూర్ణస
ద్భావుఁడు తత్క్రియాంతమునఁ దాలుచు నొమ్మునఁ నీశుఁ గ్రమ్మఱన్.

చ. అటు ధరియించి యాలుపసనావళు లన్నియు నేర్చి కూర్చి యొ
క్కట బలుమూట వీఁక మెయిఁ గట్టుక మూఁపునఁ దాల్చి వచ్చుచోఁ
గటకపువీథులందు భవికాండము ముట్టినఁ ద్రుంతు నంచు ను
త్కటముగ ఘంట వేయుచు నకంపనుఁడై మహి మేగి యచ్చటన్.

తే. లీల మడుఁగులు గట్టించువేళ జంగ
మంబు లడిగిన నిష్టాంబరంబు లిచ్చు
నెడప కాపస్త్రములవార లడుగ వారి
బట్ట లర్పించు లింగసంపద దలిర్ప. 200

సీ. అటు లుండి యొకనాఁడు హరభక్తవస్త్రముల్

గొసితెచ్చుచో భవిమనుజుఁ డొక్కఁ
డంట శిరము గుమ్మి యాకసంబునఁ కెగఁ
జిమ్మిన నవార్త క్షితితలేశ్వ
రుఁడు విని కోపంబు వొడమ వాని వధింపుఁ
డని మావతులఁ బంప నరిగి మత్త
కరి దీకొలుప దాని ఖండించి యాదోర
ణులఁ జంప భీతి బిజ్జలుఁడు బసవ

తే. సచివుప్రేరేపణంబున శరణ మడుగఁ
గరిని భవి మావతులఁ బ్రదుకంగఁజేసి
చాల దృష్టాంతములు దెల్పి సచివవర్యు
విమలమానసయుతునిఁ గావించి యంత. 201

తే. అలఘుఁ డొకనాఁడు తొల్లిటియట్ల యేగి
లింగ మెప్పటిపొద నుంచి లీలఁ గాయ
కంబు సేయుచునుండఁగఁ గష్టకర్మ
చిత్తు లొకకొంద ఱది చూచి కెలఁగి నగుచు. 202

చ. తిరుగటిజాయి ప్రాణమగు దేవుఁ డటంచు ధరించి మోయఁగా
బరువని వేతె యుంచి సరిబత్తులు గాంచిరయేని యెగ్గుసే
తు రనుచుఁ ద్రాడు గట్టె నిది దుస్సిన నేమగునొక్కొ? చాకి యి
వ్వరుసున నంచు హేళనపుఁబల్కులు వల్కి దురాత్ము లత్తఱిన్.

చ. మఱుఁగుగ గుంజపుంజములమాటున దారి స్వకార్య మీఘనుం
డెఱుఁగక యుండ సూత్రమున యేతరలై తెగఁ గోయ నెత్తురు
ల్వఱదలువాఱె నీశరణవల్లభుఁ డప్పుడ చాకిబండపై
నొఱగి గతాసుఁడై శివనియోజితమానసుఁ డయ్యె లీలచేన్. 204

ఉ. అట్లగుటన్ దురాత్ములు భయాకులులై వెసఁ బాఱ నప్పు డా
చుట్టున నాల మేపుపసులుల్ గని యద్భుత మంది యిచ్చటం
బుట్టనివింత పుట్టె నని బోవన నేగి వృషేశుసన్నిధిం
గట్టలు గాఁగ నిల్చి యనుకంప జనింప వచించి రీగతిన్. 205

తే. అయ్యా! మడివాలు మాచిదేవయ్య యిపుడు
బట్ట లుదుకుచు నున్నచో బాము గాము

తెవులో యేమాయెనో మదిఁ దెలియ దహహా!
యేమి సోఁకెనో జీవంబు నోటువడియె. 206

చ. అని వినిపింప బిట్టులికి హా! మడివాలుమహాప్రతాప! స
జ్జనసుత! భక్తిసంచరణ! సంయమదేవ! భవత్పదార్చకుఁ
డను విడనాడ నీకుఁ దగునా? కఱకంఠునిఁ జెంద నంచు లో
చనముల బాష్పముల్ దొరఁగఁజాలవగ న్విలపించుచుఁ బడిన్. 207

ఉ. అచ్చట లేచి భక్తనివహంబులు దుఃఖము నొంది తోడ రాఁ
జెచ్చెర నేగుదెంచి గతజీవితుఁడౌ మడివాలుఁ గాంచి యీ
సచ్చరితాఢ్యుఁ డిట్లు గతసంజ్ఞవహింపఁగ నేమిహేతువో
యిచ్చఁ దలంపరా దనుచు నీవల నావలఁ జూడ నొక్కచోన్. 208

తే. తెగినసూత్రంబు పొద లింగదేవు వఱద
బాఱురక్తప్రవాహంబుఁ దేఱి చూచి
యద్భుతం బంది యచట నున్నట్టిభక్త
వరులతో నిట్టు లనియె నబ్బసవవిభుఁడు. 209

ఉ. జీవము లింగమందుఁ దనుచేష్టలు భక్తసపర్యలందు సం
భావన చేసి యంశుకసమాజము భావన మాచరించుచో
నా వినయంత నాత్మకశిరోన్నతతత్తుము దాఁకి నొచ్చునో
దేవర యంచు గుల్మవసతిఁ జవరించి దృఢాంతరంగుఁ డై. 210

క. గాత్రమునకు లింగమునకు, సూత్రము దగిలించియున్న చోఖలుఁడె వ్రాం
డో త్రెవ్వనడచెఁ దచ్చివ, సూత్రంబటు గాన సితఁడసువులకుఁ బాసెన్.

క. దేహము లింగము సూత్రం
బూహింపఁగ నొక్కటగుట యురి త్రెవ్వటయుఁ
దేహం బారక్తంబు ప్ర
వాహంబుగ వెడలెఁ ద్రాటివలన భయదమై. 212

ఆ. ఇట్టులుండవలయునిష్టలింగానుసంధాన మనుచు మరలఁ దద్గుణంబు
గలయఁ బెనిచి మదనఘస్మరభక్తాంఘ్రి, జలము భూతిపై నిఁజల్లునంత.

క. బిట్టులక్క నిదుర తెప్పిలి, నట్టులవడి లేచి [illegible] ములలోఁ
దొట్టినము నమునగనుఁగొని, చట్టన మాచయ్యనతులు సలుపుచు పసలోఁ.

క. దివమున నెన్నఁడు నిద్దుర, దవులుట నే నెఱుఁగ నిట్టి తలిస్మృతి చెడి యి

ఖ్యువినొరు గు టేమి హేతువొ, శివశివయనితలఁచివారిఁజేరివచించెన్.

క. మీరంపజేచ్చటికిరాఁ, గారణమే? మెచటికైన గమనోన్ముఖులై
కారుణ్యంబున నసుఁ గన,నీరేవున కిపుడు పూని యేతెంచితిరో!. 216

సీ. అనవుడు బసవేశుఁ డాదియౌ సద్భక్తు లేకవాక్యంబుగా నిట్టులనిరి
మాచయ్య! ఖలులునీమహిమగానకలింగసూత్రంబుగోసినధాత్రి నీవు
ద్రెల్లుట విని వచ్చి ధీరభక్తులకృప గ్రమ్మఱ బ్రతుకుని స్గంటిమనఘ!
నీకు నీవే సరి గాక లోకంబున మాబోఁటిభక్తుల మహిమ యెంత

ఆ. యనుచుఁ బెక్కువిధులఁ గొనియాడి యవనత
వదనుఁ డై నమాచవరుఁడు దారు
సకలసంభ్రమనుల సదనంబులకు వచ్చి
యుక్తభక్తిరక్తి నుండి రెలమి. 217

క. మడివాలుమాచిదేవుని, నడినన్న చరిత్ర వినిన చదివినవారల్
జడజాతసంభవాదులుఁ, బడయంగా రానిముక్తిఁబడయదు రెలమిన్.

వ అదియునుంగాక. 219

హాళికమారన్న కథ.

మ. అకలంకోజ్జ్వలలింగమార్చనరతుం డంహోవిదూరుండు శ
ర్వకథాసారనిమగ్నచిత్తుఁ డచలేంద్రాతీతధైర్యుండు స
ర్వకళాపారగుఁ డాత్మలింగగురుచర్యాయుక్తుఁ డార్యుండు హా
ళికమారన్న యనంగ భక్తహితసల్లీలాఢ్యుఁ డొప్పున్ రహిన్. 220

శా. ఆసిద్ధానిధి భక్తిమార్గరతిఁ గల్యాణంబునం దుండి లిం
గానందంబుగ దండనాథకృపఁ గధ్యక్షత్వముం బూని స
స్యానీకంబు ఫలింపఁజేయు చోకనాఁ డంభోజబంధూదయం
బౌనవ్వేళఁ బొలంబుఁ జేరి చతురాశాన్వేషియై యత్తఱిన్. 221

ఆ. నడిమిమంచెనెక్కి యొడిసెలఁ దాల్గొని,చుట్టువాలునట్టిపిట్టగముల
విసరివేసియబాహువిన్యస్తలింగమ్ము,వస్త్రయుతముగాఁగవదలిపడియె.

క. శివలింగము ధరఁదొరఁగిన,భవిదూరుం డతఁడు మున్నె ప్రాణంబులుత
ద్భవునందు చేర్చెఁ గాప్రన, బవిహతగిరివోలె మంచెపైఁబడెనంతన్.

చ. తనపతిరాక జాగయినఁ దత్ప్రియదామణి చింతచే శివా
ర్చనసమయంబు వచ్చెఁ బతిజాడ కనంబడ దయ్యె నంచు వే

చని పొలిమేర చేనినడుచక్క వసించినమంచెపై గతా
సునిఁ బతిఁ గాంచి యప్పుడె వసుంధరఁ ద్రెళ్లె విహీనజీవ యై. 224

వ. అంత. 225

ఉ. అచ్చటిచేని కాఁపరులయం దొకఁ డంతయుఁ గాంచి చెచ్చెరన్
వచ్చి విలాసగోష్ఠి గణవర్యులతోఁ గొలువిచ్చియున్న భా
స్వచ్చరితుం గృతజ్ఞు బసవప్రభుఁ గాంచి నమస్కరించి వా
క్రుచ్చఁగలేక కొంతవడిఁ గొంకుచుఁ గొంకుచు నెట్టకేలకున్. 226

ఉ. ఇట్టుల పల్కె దేవ! బసవేశ్వర! మారన నేఁటిప్రొద్దునన్
బిట్టలఁ దోల మంచెపయి నిల్చిన నిల్వునఁ ద్రెళ్లిచచ్చె న
ప్పట్టున వానియా లటకు వచ్చి కనుంగొని ధాత్రిఁ గూలె నే
నిట్టిమహాద్భుతం బెచట నెన్నఁడుఁ జూడఁగలేదు నావుడున్. 227

చ. విని బసవేశ్వరుండు కడు విహ్వలతన్ సభ నున్నభక్తులం
గనుఁగొని యెన్నఁ డిట్టిగతిఁ గంటిమె? వింటిమె? యంచు వారితోఁ
జని పడియున్న దంపతులచందముఁ గాంచి మదిం గలంగి లో
చనముల బాష్పముల్ దొరుఁగ సంగయదేవుని సంస్మరించుచున్.

క. తనతోడం జనుదెంచిన, ఘనభక్తులయాననములు గని వీరలు తి
ట్టినఁబడుచాడ్పునమృతిఁ జెం,దినకత మేమొకొ యటన్నఁ దెలియక వారల్.

క. గా మడఁచలేదు పాపపుఁ
బా మంటెను గాదు కాదు పటురోగగుణం
బీమాడ్కిఁ జంపె ననియెదు
సాములఁ గని యపుడు మిండసంగయ యనియెన్. [నునే!

క. ఈమహితలింగదేహులఁ, గామంటునె? దుష్టపన్నగము మారొక్క
యామయముఁ జెంద నేర్చునె?, యేమియుఁగా దింకనొక్కటేర్పడవినుఁడీ!.

సీ. అనఘుఁ డీతండు ప్రాణావలి లింగంబునందుఁ గూరిచి శివానందలీల
గాయకం బీరీతిఁ గల్పించుకొనియుండె నిప్పుడీతనిలింగ మెడలిపోయె
దానితోఁబ్రాణముల్ దలఁగెఁదత్సతితనజీవంబుప్రియునందు చేర్చిపడియె
నింతయు నిజ మని యేర్పడ సంగయ్య పలికిన నచ్చటిభక్తుఁ డొకఁడు

తే. కడియ నేతెంచి మారన్న కంఠమందు
లింగమూర్తిని గాన కబ్బంగి భక్త

వరులతోఁ జెప్పి తానును వారు మంచె
చుట్టి వెదకిన నందొక్కచోట నంత. 232

తే. ముడివదలువస్త్రమున లింగమూర్తిఁ గాంచి
బసవదండేశముఖులు సమ్మదము దొలుకఁ
దెచ్చి మారన్నగారిసందిటిని గట్ట
నంతలో నిద్ర తెప్పిఱినట్లు లేచె. 233

క. తోన సతి లేచె లేచి గణానీకముఁ గాంచి యిరువు రద్భుతమతులై
యీనెలవున కింపలు నిట,రా నే? మని తలఁచి బసవరాజున కంతన్.

ఉ. మారన మ్రొక్కి యిట్టు లను మాయెడఁ గూరిమిఁ జేనుఁజూడఁగా
మీ రిట వచ్చుట న్మదికి మిక్కిలి సంతస మయ్యె సామి! నా
నేరిచినట్లు గాచితి వనీమృగ చోర పతంగబాధలం
జేరఁగ నీక యన్నఁ బ్రహసించి యమాత్యవరేణ్యుఁ డి ట్లనున్. 235

చ. వరతరపుణ్య! యిచ్చటికి వచ్చుట చే నరయంగఁ గాదు నీ
తరుణియు నీవుఁ ద్రెళ్లినపథం బిపుడే విని వచ్చి చూచి యీ
శ్వరగతజీవుఁ డీతఁ డని సంగయ తెల్పిన జాతిపద్ధతిం
కరుని భవచ్ఛరీరమునఁ గట్ట సజీవుఁడ వైతి వంతటన్. 236

తే. ఇన్ని దినములు నీసత్త్వ మెఱుఁగ నైతి
శరణసంతతిలో వన్నెఁ బరగి తౌర!
యనుచు వినుతించి యఖిలభక్తాళిఁ గాంచి
బసవనామాత్యచంద్రుండుఁ బ్రమద మెసఁగ. 237

మ. పలికెన్ బాపురె! మారయాఖ్యునిమహత్త్వ మ్మాతఁ డిష్టంబుగన్
దొలఁగన్ జీవముతోన పాసె మరల న్నాల్గొల్ప జీవించె భూ
తలమం దెచ్చటఁ గల్గునే? యిటుల తత్తసీవ్రతంసంబు ని
శ్చలభక్తానుగచర్య లెక్కయిడ శక్యం బౌనె! వాగ్జానికిన్. 238

సీ. అనవుడు మాదిరాజయ్య యిట్లను బస
వాధిప! లింగంబునందుఁ బ్రాణ
ములు చేర్చు టఖిలభక్తులకు నైజమె వీని
భామినీచర్య చెప్ప నగుఁ గాక
విగతజీవుం డైనమగనిఁ గాంచినమాత్ర

నిద్రయో రోగమో కాద్రవేయ
దంశమో యని మదిఁ దా నించుకేనియు
సంశయింపక యసుసమితి విభుని
తే. యందు సంధించి వేమృతిఁ జెందె నహహా!
యట్టిపరమపవిత్ర యిం కెందుఁ గలుగు?
నన్న బసవన్న యార మారన్నబుద్ధి
నెన్న నీకన్న మహిమాఢ్యు లున్నవారె?. 239

తే. అనిన నమ్మాట మండసంగయ్యగారు
విని బసవరాజుఁ గని యిట్టు లనియె మాది
రాజు పల్కినపల్కుల రాజ! ధరఁ బ
తివ్రతాధర్మ మిందు సందియము లేదు. 240

క. ఇమ్మార్గ మిష్టలింగులు, క్రమ్ముదు రెటులన్న మారగణార్యుం డి
ష్టమ్మునకై ప్రాణమ్మొఱ్ఱెయిమ్మానియేలచెప్పె?నిష్టము గలుగన్. 241

తే. అనిన బసవయ్య విస్మయం బంది ధర్మ
సూక్ష్మములఁ దెల్ప సంగ! నీసొమ్మ యయ్యె
నాగురుస్వామి సంగయ్య వే గణింప
నిన్నుఁ గొనియాడ నేజాడ నేర్చువాఁడ. 242

క. అని యాతని వినుతింపఁగ,విని మాచయ భక్తవరుల వీక్షించుచు నూ
తనమేయీతనిచరితం,బనిశము బసవేశుఁ డెఱుఁగఁ డాయె నెమనుతాన్. 

తే. నావు డందొకశరణుండు దేవ! సంగ
మయ్యచరిత మ దెట్టిది? యానతీయ
వలయు ననవుడుఁ దద్భక్తవరుని గాంచి
చిత్రముగ మాచిదేవయ్య చెప్పఁదొడఁగె. 244

ఉ. శ్రీతుహినాద్రిజారమణసేవకపాదసమర్చనారతుం
డీతఁడు యాంపవనంబున మహిష్ఠమహేశ్వరభక్తి నల్పుచుణ
భూతలమందు భక్తిగతిపోషణ మొప్పఁగఁ బుట్టి లోకవి
ఖ్యాతి నెసంగునట్టి బసవాధిపుఁ గన్గొనువాంఛ చెందినన్. 245

తే. అనఘ! కల్యాణపురిఁ జేర నరుగునంత
సంగమేశ్వరునందు నా సంగమేశు

రాక బసవేశ్వరుండు దర్శన మొనర్చి
యెదురుగాఁ జని యడుగుల కెరఁగి భక్తి. 246

ఉ. ఇంటికిఁ దోడి తెచ్చి మణిహేమమయాసనమందు నుంచి ము
క్కంటినిబోలెఁ బూన్చి సుమకార్ముకసంహరతుల్య! నేఁడు నీ
వంటిమహాత్ముఁ డిచ్చటికి వచ్చుటచే శుభముల్ ఘటిల్లె నే
మంటి నటంచుఁ బల్కి విని మానసమందు ముదం బెలర్పఁగాన్. 247

తే. ఖ్యాతియో లేక భక్తిసమేతుఁడో ప
రీక్ష సేయంగవలె నని వృషభమూర్తి
గాంచి దరహాసితాననకమలుఁ డగుచు
నంచలును విన మిండసంగయ్య యనియె. 248

చ. బసవమహాప్రధాన! శివభక్తినిధాన! కళావధాన! సం
తసమున వారకుందరదనాసురతానుభవాప్తిఁ గోరె మా
నస మట నిష్టలింగభజనం బొనరించుచు నున్నప్రొద్దు లే
దెసకము మీఱఁ గేళి నటియింపఁగ మా కటుఁగానఁ జెచ్చెరన్. 249

శా. నాలింగం బిపు డీవు చేకొని మహానందంబు మీఱంగ ప
ట్కాలం బర్చన లిచ్చి యేమఱక వెంటం దత్ప్రసాదంబు త
త్కాలాతీతము గాకయుండ నతిసౌఖ్యం బొప్ప మా కవ్వవే
పాలోమీవరముఖ్యదేవనుతచిద్వ్యాపారపారంగతా!. 250

చ. అనిశము లింగమూర్తిఁ దనువందు ధరించుట గాక వీడఁగాఁ
జనునె? యటంచు నీమదిని సంశయ ముంచకు మేడ నున్న నా
మనసు మదీశు నేమఱదు మర్కట మెందు నటించు చుండనౌ
దనుఁ దనపట్టి పీడనివిధంబున నాశ్రితలోకపాలకా!. 251

తే. కనుఁగొనఁగ నింద్రియములకుఁ గారణంబు
మానసం బింద్రియము లెటు మలయు నేమి?
మనసు లింగమునందుఁ జెందనిసపర్య
యోటిభాండంబులో వారియోజఁ గాదె?. 252

చ. అన బసవండు మ్రొక్కి వినయంబున ధీనిధి! మీయభీష్ట మే
యనువున నుండు నట్ల యగు నన్న గళస్థితలింగమూర్తి నా
తనిగళమందు నుంచి ప్రమదంబున సంగయ యేగునంతఁ దా

దిన మతఁ డాజ్ఞ యిచ్చినగతిఁ శివలింగముఁ బూజ సేయుచున్. 253

తే. తత్ప్రసాదంబు వెలకొమ్మఁ దగిలియున్న
భక్తవర్యుని కతిభక్తిఁ బంపుచుండె
నంత నొకనాఁడు శివరహస్యార్థగోష్ఠి
మహితగణవర్యులను భవమంటపమున. 254

క. వసియించినవారలతో, బసవఁడు గూర్చుండి వినెడుపట్టున మధ్యా
హ్న సమయమగుడాచరలిం, గసపర్యలొనర్ప లేచి గ్రక్కునఁజనియెన్.

చ. చని కడువేడ్కఁ దత్క్రమము సర్వము దీఱిచి వేగ వచ్చి యా
ఘనులకు మ్రొక్కి సిల్వ గణకాండము కన్గొని నెమ్మనంబునం
గినుక వహించి యిట్టితఱి నీ వెటు పోయితి వన్నఁ గొంకుచుఀ
వినయము మీఱ నిట్లనియె వేదహయాపరమూర్తి వారితోన్.

ఉ. సంగయదేవుఁడై పరగు సంగయదేవునిలింగమూర్తికిఀ
సంగతిఁ బూజనావిధు లొసంగఁగఁ బోయితి నన్న నంబికా
సంగగణాళి హాసము లెసంగఁగ హా! వెలయాలిఁ గూడునా
సంగమనించువారికిఁ బొసంగఁగ నేర్చునె? లింగలీనతల్. 257

తే. హారఁ బ్రమాదవశంబున నైన నరుఁడు
వాసెనేనియుఁ బ్రాణముల్ వదలవలయు
ననుచు శ్రుత్యాగమంబుల వినుచుఁ బ్రాణ
లింగముల వేఱుసేయుట లెన్స యగునె?. 258

క. అని యాతని నిరసించుట, విని బసవామాత్యవరుఁడు విహ్వలభావం
బున నేమియు నన నేరక, మనముననొచ్చుకొనెవారిమాటలకంతన్.

సీ. ఖరకరుం డపరదిగ్గిరిఁ జేరుతఱి భక్త
కథితతత్త్వప్రసంగంబు వినుచు
నుండి యమాత్యుండు మిండసంగయలింగ
పూజావసర మయ్యెఁ బోవలయు
ము న్నేగుటకుఁ గోపమున నొందు భక్తాజ్ఞ
మీఱుట భక్తికి మెచ్చు చెంద
దనుచుఁ గొంత విచార మొనరించి యాయయ్య
దృఢభక్తి వీరికిఁ దెలియఁగాక

తే. యని తలఁచి యొక్కపరిచారు నపుడు పిలిచి
పోసఁగ దిప్పుడు లింగంబు పూజ సేయఁ
బంచభక్ష్యాన్నములు వేగ కొంచుఁబోయి
యిట్లు దెల్పక సంగయ్య కిచ్చి రమ్ము. 260

క. అని యచటిభక్తవర్యులు, వినఁ బల్కిననతఁడు నగుచు వేగ మెదొరచె
ప్పినగతినర్పితాన్నము,గొనిచనిసంగయ్య యెదుటఁగొంకకనిలువన్.

చ. కని తల యూఁచి యాతఁడు మొగం బటు ద్రిప్పి యనర్పితాన్నముం
దిను మని పంచెనే? బసవధీమణి యంచు వచించి తోన మే
దిని గతజీవుఁడై పడ మది న్వెఱఁగందుచు వేగ గ్రమ్మఱం
జని పరిచారుఁ డాక్రమము సర్వ మమాత్యునితోడఁ దెల్పినన్.

శా. ఆమాట ల్విని మున్ను తద్ఘనుని నిందాలాపముల్ పల్కు వా
రేమీ? యింతటిమాట పుట్టె ననుచుఁ బ్రాక్శైవులుం విస్మయో
ద్దామవ్రీడలు గ్రమ్మ శ్రీబసవరాడ్దండాధిపుం గాంచి భ
క్తామర్త్యాగమసంగమేశ్వరునిమాహాత్మ్యంబు నిం తయ్యెడిన్. 263

క. కాలము దప్పఁగ నియ్యక
నీలగళుప్రసాద మూను నియమము గానన్
వాలె దినకరుఁడు నియమం
బాలన యగునో యటంచు ననుపులఁ బాసెన్. 264

చ. ఇంతమహత్త్వుఁ డౌట మును పెన్నఁ దెఱుంగమిఁజేసి యింద్రియ
భ్రాంతుఁ డటంచు నింద్యముగఁ బల్కితి మీకలుషంబు వాయ దా
నంతయుఁ బాయ దేమి గతి యా నిఁక మా కని మ్రొక్కి సంగమా
కాంతుఁడు పల్కెఁ దద్గణనికాయముతో వినయం బెలర్పఁగాన్.265

చ. అలఘుకృపాత్ములార! వినుఁ డాతనిభావము తేటతెల్లగాఁ
దెలిసియు నన్ను వంచనకుఁ దెచ్చుటకై యిటులాటి రైన ని
ప్పలుకుల కేమి యిప్పు డలభక్తునిలింగముఁ బూన్చి కాఁమ
గ్గల మరుగంగనీక కటాక్షించుఁ బ్రసాదముఁ గొంచు భక్తిచేన్. 266

ఉ. అంచటి మాత్రఁ దున్న వెలయాలిగృహంబున కేగి వేఁడినం
బొందినిఁ బ్రాణము ల్నిలుచు భోగ్యతరంబుగఁ దత్ప్రసాద మిం
పొంద గ్రహించు నంచు శరణౌఘము సమ్మతి నొందఁజేసి యా

చందమునన్ సభక్తుఁడయి సంగయలింగముపూని చెచ్చెరన్. 267

తే. తత్ప్రసాదంబు భర్మపాత్రమునఁ గొంచు
భక్తసంఘంబు దానును బసవవర్యుఁ
డరిగి గతజీవుఁ డైనసంగయ్యఁ గాంచి
విస్మయానందములు మది వెలయుచుండ. 268

శా. ఔరా! యెంత మహాత్ముఁ డీతఁ డని డాయం బోయి కేల్మోడ్చి దే
వా! రక్షింపుము సంగమేశ్వర! కృపావర్ధిష్ణుభావంబుచే
నేరంబుల్ సయిరించుమంచుఁ దనుఁ దా నిందించుకొంచున్ సుధా
ధారం బైనమహాప్రసాదము గణాధ్యక్షాజ్ఞ చే నత్తఱిన్. 269

ఉ. ఆతనియంకమం దునుచునంతటఁ దెప్పిరి లేచి భక్తరా
డ్జాతము గాంచి యచ్చెరువు సంభ్రమ మొప్ప నమస్కరించి కా
లాతిగమంబు గాక మును పొందుప్రసాదసుఖంబు నొంది వా
క్చాతురిఁ బల్కెఁ దత్కుసుమసాయకసంహరభక్తరాజితోన్. 270

చ. అనఘతరాత్ములార! వెలయాలిగృహమ్మున కిట్లు మిమ్ముఁ బో
లినఘను లేగుదెంచు టిది లెస్సగునే? మముబోఁటిదౌష్ట్యభా
జనులకుఁగాక యంచు నెకసక్కెము లాడిన లజ్జ నొంది భ
క్తనిచయ మెల్ల నొక్కనుడిగాఁ బలికెన్ గురుభక్తియుక్తమై. 271

ఉ. సంగ! దయాంతరంగ! విలసద్గురుపాదపయోజభృంగ! మా
తంగనిశాటనాహితమతక్రమవర్ధనచంగ! సత్ప్రసా
దాంగ! సభానుషంగ! సమదాదితిభంగ! సమస్తభక్తరా
ట్తుంగ! యశోవినిర్జితవిధుత్రిదశాగభుజంగ! పుంగవా!. 272

క. త్రైకాలికవిజ్ఞప్తియుఁ, బ్రాకటలింగానుయోగపద్ధతి గణని
ష్ఠాకలన మెంచిచూడఁగ, మీకే తగు మిండసంగ! మృదుగుణసంగా!.

ఉ. నీమహిమాంబుధుల్ దెలియనేరక నోరుకొలందిఁ బల్కు మా
తామసవాక్యముల్ సయించి దాపునఁ జేర్చి కృపాబ్ధిఁ దేల్చి వే
కామవికారదూర! యని క్రమ్మినవేడ్క నుతింపఁ దద్గణ
స్తోమముఁ గాంచి భక్తి మదిఁ దొల్కఁగ సంగయ పల్కె మెల్లనన్.

ఉ. పావనులార! మీచరణభక్తుని నన్నిటు పెద్దఁ జేసి మీ
రీవిధిఁ బల్కఁగాఁ దగునె? యెందును భృత్యులు తప్పఁ ద్రొక్కినం

గోవిదు లైనవార లిది కూడనిత్రో వని శిక్ష చేసి త
ద్భావము భక్తికిం జొనిపి దాపుగఁ దీయుట ధర్మమేకదా!. 275

వ. కావున భవదీయపాదసేవకుండ నైననన్నుఁ గరుణాకటాక్షవీక్షణంబు
లంగాంచి కృతార్థుం జేయుం డని నమస్కారపూర్వకంబుగా విభూతి
తాంబూలంబు లొసంగి బసవేశ్వరునిభక్తినిష్ఠల కలరి యతనిం బె
క్కుభంగులం గొనియాడి యంబజపీఠోల్కి తొల్లిటియట్ల యను
పమ విలాసంబున నుండెఁ గావున మండసంగయ్యమహిమం బిట్టి దని
మాచిదేవుండు వినుపించుటయు నచ్చట నున్న శరణపుంగవు ల
త్యంత సంతోషితస్వాంతు లై యతనిం జేర్కొని యగ్గింపుచు
మాచన్నచే ననుజ్ఞాతు లై బసవేశ్వరసహితంబుగా నిజనివాసంబుల
కరిగి యెప్పటియట్ల సుఖం బుండిరి. 276

క. హాలికమారనచరిత త్రి, కాలము పఠియించునట్టిఘనుఁడు దహనదృ
గ్ఫాలునికృప గనుఁ గాలం, గాలునిరూపమున బొమ్మగట్టి ధరిత్రిన్.

కమలవ్వ కథ.

వ. అదియునుంగాక. 278

సీ. కడు నొప్పునీపురిఁ గమలవ్వ యన లింగ
సన్నిహితప్రాణ సదయహృదయ
భవపరాఙ్ముఖ భక్తపాదార్చనాసక్త
సదయ నిర్మలశీల సరసవచన
వేశ్యాకులోద్భవ విజ్ఞాననిధి రూప
లావణ్యసీమ యంహోవిరామ
యనుచు వన్నియ కెక్కు ననిశంబు బసవేశ్వ
రాదులతోఁ బ్రసాదామృతాబ్ధిఁ

తే. దేలుచును దత్త్వగోష్ఠిఁ బ్రార్థించి దినుచుఁ
ద్రివిధలింగార్చనాసక్తిఁ దేజరిలుచు
సతత మంగవికారదూరత వెలయుచు
యుక్తవర్తనఁ జరియించుచుండె నంత. 279

తే. ఆర్యనుత యైనయాయింతిచర్య లెల్ల
నరసి కొంచెదమంచుఁ యవనినాథుఁ

జేరి బిజ్జలభూపాల! చిత్తగింపు
మనుచు నేకాంతమునఁ దెలియంగఁ బలికె. 280

మ. ఒకవేశ్యాంగన బత్తి సెత్తుకొని యాయూరందు లింగాంగియై
యుఁకమీఁదం దనకెవ్వరీ డనుచు దండేశాదిభక్తాలితో
నొకటై యున్నది తద్గణాధిపులు జాత్యూనంబు నావంత యెం
చక యబ్బాలికతోడఁ బంక్తిని భుజించఁగ సాగి రేకాలమున్. 281

ఆ. జాతినీతు లెన్నఁజాల రించుక యెట్టి
జాతులైన లింగసహితులేని
కలయ రోయ రవనిఁ గడు నిందకోడరును
దామె ఘనుల మనుచుఁ దలఁతు రెపుడు. 282

చ. అని తెలుపంగ విభుండు కుపితాత్మకుఁడై బసవేశుఁ బిల్వనం
పినఁ జని యాత్మయోగ్యమణిపీఠి వసించినఁ గాంచి బిజ్జలుం
డనెఁ గను లెఱ్ఱఁజేసి సచివాగ్రణి! తావకభక్తి లోకముల్
ఘనముగ నిండె మిమ్ము ననఁగాఁ బనిలే దిఁక మాటిమాటికిన్. 283

చ. కులము జలంబులం గలిపి కూడినసద్యశ మెల్ల దూరమై
తొలఁగఁగ లజ్జఁ బోవిడిచి తోరపునిందల కాలయంబవై
నలుగురు నవ్వ నొక్క వెలనాతికి లింగము గట్టి దానితోఁ
గలిసి భుజించి మీకు సరిగా బహుమానము సేయఁ బాడియే!. 284

సీ. ఎడపక యావుపా లెంత పోసిన నైన
విడుచునే? సర్పంబు విస మొకింత
పుల్లతేనియ యెంతపోసి నూరిన వేప
నారకుఁ దియ్యఁదనంబు గలదె?
తేటనీరున నెన్ని తెఱఁగుల నుదికిన
నెలుఁగుచర్మమునకుఁ దెలుపు గలదె?
లోఁతుజలంబులలోపల నానిన
బలుగుఱాతికి మెత్తఁ బడుట గలదె?

ఆ. యరయ లింగదేహ యైనంత వెలనాతి
పూతభావ మెట్లు పొందనేర్చు?
తెలసియుండి యిట్లు భ్రమ్మరఁ గూడునె?

యనిన బసవఁ డాగ్రహంబు నొంది. 285

చ. ధరణితలేంద్ర! యిట్టు లన ధర్మమె? శైవమతప్రవర్తనం
బరయక వార్ధిఁ జొచ్చునది లన్నియు వేఱయి యుంట గల్గునే ?
గురుకరజాతులౌ నరుల గోత్రకులంబుల నెంచఁగూడునే?
హరమత ముత్తమంబు సమయంబుల కన్నిటి కం చెఱుంగవే.? 286

ఆ. శూలిభక్తిలేని సోమయాజియు హీన
జనుఁడు గాని చూడ ఘనుఁడుగాఁడు
శూలిభక్తిగల్గు మాలవాఁ డైనను
శూలిసముఁడు గాని మాల గాఁడు. 287

చ. హరపదభక్తియుక్తకమలవ్వ ప్రభావ మెఱుంగ లేక యి
ప్పురుసున దూష్యభావమునఁ బల్కఁగఁగూడునె? తన్మహత్త్వమీ
వరయఁగఁ గోరితేని వెస నారయు మెవ్విధి నైన నన్న నా
ధరణిపుఁ డట్ల కాక యని తామస మించుక మాని యత్తఱిన్. 288

చ. బసవనిఁ బోవఁగాఁ బనిచి పార్థివవల్లభుఁ డొక్కయుక్తి మా
నసమున నెంచి తస్కరజనంబులఁ బిల్వఁగఁ బంచి పల్కె దు
ర్వ్యసనము మీఱ మీరు కమలవ్వగృహంబున కేగి తచ్ఛివుణ్
వెసఁ గొని తెండు పొం డనుచు వీడియముల్ దయచేసి క్రమ్మఱన్.

తే. ఎప్పగిది నైన భ్రమయించి యింతిలింగ
మూర్తిఁ గొని తెండు మీ కతిముద మొసర్తు
ననిన జోహారు లొనరించి యవనిభర్త
యాజ్ఞఁ గైకొని తస్కరు లరిగి రంత. 290

క. హరభక్తులమాహాత్మ్యం, బరయకదుష్కృత మొనర్చె నవనిపుఁ డిఁక నీ
దురితాత్ముఁ జూడఁగాదని, యరిగినగతి నినుఁడు పశ్చిమాద్రి నిజేరెన్.

క. శైవమతద్వేషం డగు, భూవల్లభుఘోరకలుషపుంజము బ్రహ్మాం
డావళి నిండినగతి ధ్వాం, తావృతమై తనరె దశదిశాంతర మంతన్.

వ. ఆసమయంబున. 293

ఉ. కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు నారసంబు ముల్
గత్తియు వాటురాలిసుము గొంకియు నక్షత లొల్కిబ్బూదియుం
గత్తెర కావికప్పడము కాటుకయుణ్ నెలగోల చీరయుం

గుత్తపుటట్ట నంబువులు కుక్కలకట్టును బిండిబల్పమున్. 294

క. మొదలగుసాధనములుగొని, మదిఁగొంకక గాఢతరతమంబునఁ జోరుల్
గుదికొని కమలవ్వమణీ, సదనముఁ జేరంగ నరిగి సైఁగల నంతన్. 295

ఉ. కన్నము ద్రవ్వి క్రోవి నిడి గైకొనివచ్చిన తెక్కపువ్వులక్ష
మున్నుగ దీపమార్చి యొకముచ్చుపదంబులు మున్ను సాఁచి యా
కన్నము చొచ్చి యొయ్యఁ దదగారములోపలి కేగి తెల్విగాఁ
గన్నుల సర్వవస్తువులు గన్పడు కాటుకఁ బూసి యత్తఱిన్. 296

తే. కనకమయసూత్ర పేటికాకలితలింగ
మూర్తి విద్రుమఖట్వాంగమునఁ దగిల్చి
యోగనిద్రాసమాసక్తి నొడలు మఱచి
పవ్వళించిన యాకమలవ్వఁ గాంచి. 297

సీ. దరి కేగి నిల్చి యాతెఱవలింగము గొనఁ
జేతులాడక కొంత సేపు నిలిచి
నరపతియాజ్ఞ నొనర్పక గాదని
నప్పుడు జ్యోతిర్మయంపులింగ
మూర్తి యున్నట్టి తత్కార్తస్వరపుఁ బేటిఁ
గొని తాను జతవారు గూడి పోయి
పృథివీశుచేతిలో నిడి తారు దెచ్చిన
గతి యెల్లఁ దెలుప నద్భుతము నొంది

తే. దొంగలను వీడుకొల్పి యాలింగమూర్తి
జతనముగ డాఁచి యంత బిజ్జలుఁడు దీన
నేమి పుట్టునో యని భీతహృదయుఁ డగుచుఁ
గడపె నారాత్రి నిద్దుర గానలేక. 298

వ. అంత. 299

క. హరపూజాకుసుమంబుల, కరిగెడుభక్తులకుఁ గాలమనుభృత్యుఁడు దాఁ
గరమునఁబట్టినదీపిక, కరణి నపుడు వేగుచుక్క గానఁగ నయ్యెన్. 300

క. కమలవ్వభక్తిగతి లో, కములఁ బ్రకాశంబునొందు క్రమమున నాశా
సముదయమున నెల్లెడలం, గ్రమమున స్వచ్ఛతతనర్చె రాజితలీలన్.

తే. అత్మసఖ్యాభిధానరా జకట! యెంత

చేసె నని కోపమున మోము జేవురింప
వచ్చెనో యన లోహితవర్ణయుక్తుఁ
డగుచు నుదయించె నినుఁడు పూర్వాద్రియందు. 302

ఉ. అంతకమున్న బిజ్జలుఁ డహర్ముఖకృత్యము లెల్లఁ దీర్చి య
భ్యంతరసీమ వెల్వడి నిజాప్తులతో సభఁ జేరఁబోవఁగా
నంతటిలోనఁ జారుఁ డొకఁ డయ్యెడ కల్లన నేగుదెంచి భూ
కాంతుని గాంచి పల్కెఁ గటకంబునఁ బుట్టినవార్త నమ్రుడై. 303

చ. అవనిప! యొక్కవేశ్య కమలాఖ్య యనం గల దిప్పురంబునన్
శివపదభక్తియుక్త యల చేడియ లింగము దొంగబంట్లు త
ద్భవనము కన్నమేసి దురితంబున కోడక కొంచుఁబోవఁ దో
నె విడిచె జీవముల్ సుదతి నిన్నటిరేయి మహత్త్వ మేర్పడన్. 304

ఉ. ఇంత మహాత్మురాలి కిటు లెగ్గొనరించినకర్మి యెవ్వఁడో
యంతకుఁ జూచు వేగ మని యంతట నంతటఁ బ్రోలిలో జనం
బంతయు నాడుచుండె నిది యద్భుతకార్య మటంచుఁ దెల్పినన్
స్వాంతము చంచలింప జనవల్లభుఁ డేమియుఁ దోఁచ కత్తఱిన్.

చ. ఘనుఁ డగుమంత్రివర్యు నొక కంచుకిచేఁ బిలిపించి పల్కె నో
యనఘ! మహాత్మయైన కమలవ్వ దిటం బరయంగఁ గోరి నే
ననియతిఁ జోరులం బనిచి యాసతిలింగము దెమ్మటన్న వా
రు నటుల సేయ బిట్టపుడె గ్రుంకె లతాంగి యిఁకేమి సేయుదున్ ?

తే. కుడిచి కూర్చుండి యిపు డిట్టి బెడద దెచ్చు
కొంటి స్త్రీహత్యయును జనకోటివలన
నిందయును రాజ్యదూరత నొందవలసె
నింత వచ్చుట మున్ను నే నెఱుఁగనైతి. [గంధి

తే. ఇంతకాలంబు గాపాడితిపుడు నన్నుఁ, బాపమొందక యుండ నప్పద్మ
జీవసంగతిఁ జేసి రక్షింపవయ్య, యనినన్నృపుతోడ బసవేశుఁడని యెనిట్లు.

ఉ. అక్కట! యిట్లు సేయఁ దగునయ్య? నసర్వతరప్రయోజనం
బక్కమలవ్వ నిర్మలమహత్త్వముల న్నెఱుఁగంగఁ జెప్పినం
దెక్కలిచాడిమాటలె మదిం బదిలంబుగ నమ్మి మిత్తిచేఁ
జిక్కితి వేమి సేయఁదగుఁ జెందినదుర్దశ మాన్పవచ్చునే?. 309

తే. చోళరాయండు వేగిపసుంధరావి
భుండు నుదయేశుఁ డాదియౌ భూమిపతులు
కొంద ఱీశ్వరభక్తులఁ గొందుపచేసి
తాన చెడుట యెఱుంగవే? ధరణినాథ! 310

క. నీ వెఱుఁగఁగ మీజైనులు, శైవుల కపకారు లగుచు సమసిరి కాదే?
కావున నెంత దిగులొకాఁ, గాఁదలఁచిన కార్య మెల్లఁ గాకతొలఁగు నే?

చ. అనవుడు బిజ్జలుండు బసవాధిప! నే నిను నమ్మియుంట పా
వనునిగఁ జేసి కల్మషముఁ బాపి యశం బొనఁగూర్చి సద్గతిం
గనుపడ సేయువాఁడ వని కాదె? దయానిధి! యట్లు గాన నీ
యనువున మందబుద్ధి నగు నట్టినను\ బుధమాన్యుఁ జేయవే! 312

సీ. అనుచు దీనతదోఁపనాడినబసవండుమోమునఁజిఱునవ్వు మొలకలెత్త
నాలింగమూర్తిఁ దెమ్మని కేల నిడికొని భక్తులు దానును బార్థివుండు
కమలవ్వగారి గేహమునకుఁ జని గతజీవయైపడియున్న చెలియఁ గాంచి
యచ్చెరువందిపూర్వాచార్యచేభక్తపుంగవాజ్ఞఁదదీయలింగమూర్తి

తే. నపుడు ధరియింపఁగాఁ జేయునంతలోన
నిద్ర తెప్పిలెనటు లేచి నిఖిలభక్త
సమితిఁ గని మ్రొక్కి నిలిచిన సచివుఁ డువిద
పాదపద్మములకు మ్రొక్కిఁ బ్రస్తుతించె. 313

క. బిజ్జలుఁ డంతట సాధ్వస, లజ్జాభరభక్తిమార్గలంపటుఁ డగుచున్
దజ్జలదాలకపదముల, పజ్జం ధర జాఁగి మ్రొక్కఁబడివినుతించెన్. 314

క. కమలవ్వా! నీదువిలస, త్కమలాంకకలాపభక్తిగతి యిజ్జగతిన్
గమలాధవ కమలోద్భవ, కమలాధిపముఖుల కైనఁ గానఁగవశమే?

క. నే నజ్ఞానమనస్కుఁడ, నై నీ కెగ్గించినాఁడ నటు గావున నా
హీనగుణంబులు నీమది, నూనకుమని వేఁడుకొనె నృపోత్తముఁ డంతన్.

క. హృత్కమలకర్ణికాస్థిత, సత్కాంతకళావతంసచరణాంబుజయౌ
తత్కాంతకరుణఁ గనిసం, పత్కమనీయాత్మగృహముపటుగతిఁ జెందెన్.

క. తద్భక్తతతియు బసవఁడు, హృత్స్ఫురితానందు లగుచు నేగిరి నిజభా
స్వద్భవనములకు సతి లో, కాద్భుతసద్భక్తిఁ దొంటియట్లు వసించెన్.

## టంగుటూరి మాచయ్యాగారి కథ.

వ. అదియునుంగాక. 319

తే. మఱియుడంగుటూరిమాచయ్యనానొక, భక్తపుంగవుండుపాదదాహి
రాజరాజరాజరాజేష్టసత్ప్రథా, రాజమలక్త్రిరాజితుండు. 320

శా. అద్వంద్వాంబురుహాద్విషచ్ఛకలభూషాంభ్రసమానక్షుడు
ద్వ్యద్వాక్షేపముఖాదితెయసికురుంబాలభవ్యముక్త్యంగనా
హృద్వాంఛాపరిపూర్తిబృద్ధణకటాక్షేక్షాన్వితాంగుండు కృ
ష్ణద్వైపాయనముఖ్యయోగినుతనిష్ఠాహాలి యొప్పున్ భువిన్. 321

క. ఆలింగభక్తవర్యం, డాలియు సుతయుగము దాను నగచాపగుణా
ర్చాలి స్థిరచంచకస్థితి, జాలంగనొనరింపుచునురసాస్థలివెలసెన్. 322

వ. అంత నొక్కనాడు. 333

చ. చిఱుతకుమారుఁ డాటతనిచేఁ దనయాఁ డగువారిఁ గూడి మే
నెఱుఁగక యాడుచుండఁగ మహీస్థలి లింగము జాఱిపడ్డయ
త్తఱిఁ గని బాలుఁ డొక్కఁ డది తాఁ గదిలంబుగ డాఁచి వానిముం
దఱ కరు దెంచి నీగళమునన్ శివుఁ డేఁడి? యటంచుఁ బల్కినన్. 324

చ. కరమున రొమ్ము పుణ్కి శివుఁ గానక తోఁసె గతాసు డై ధరం
దొరఁగిన గాంచి భీతిలుచుఁ దోడికమారకు లెల్ల నొండొరుల్
పరు లెవరైన మీఁదఁబడి పట్టుక కొట్టుట గాన మూరకే
మరణముఁ జెందె నీతఁడు ప్రమాదము దెచ్చెను మూఁకకంతకున్.

మ. తలిదండ్రుల్ విని యీడ నున్నమనపైఁ దప్పెంచి భూమీశుతోఁ
దెలియం జెప్పకపోరు చెప్పినపుడే తెప్పించి చూపంగఁ గొ
ఱ్ఱుల వేయించకపోవఁ డింతఱ నిఁక తోఁత్రోవంచు నాడంగ వా
రలతో లింగము డాఁచువాఁడు వెఱ పూరం బల్కె నప్పట్టునన్.

మ. వినుఁడీ బాలకులార! యాటతనిచే వీఁ డుండుచో లింగ ము
ర్విని జాఱం గని యేను డాఁచి తెలుప న్వీతాసుఁ డై కూలెఁ గా
వునఁ దల్లింగము గ్రమ్మఱం దనువునం బొందింపఁ బ్రాణంబు వ
చ్చునొ యం చంతఱు చోద్య మంద నపు డీశు న్గానిసంధించినన్.

ఉ. తోడనె మేనఁ బ్రాణములు తొల్లిటియట్లన చేరఁ గాంచి తోఁ
గూడి వసించుబాలకులు కోయని యార్చుచు నెంత విర్గతరా

చూడుఁ డటంచు నిందఱినిఁ జుట్టినగండము దప్పె నంచుఁ జె
ల్లాడుచు నాతనిం గదిసి యక్కునఁ జేర్చుచు నుండున_త్తఱిన్. 328

తే. అతనియగ్రజుఁ డరుదెంచి యచటివారి
వలనఁ దద్వృ_త్త మరసి శైవప్రవ_ర్త
నం బెఱుంగునె? వీఁడు లింగంబు జాఱ
నంతనే ప్రాణములు వీడఁ డాయెఁ గాన. 329

చ. శరణులు విన్న నీగతికి నైఁతురె యంచుఁ గ్రుధాత్ముఁ డై నిజా
వరజునిఁ జాలఁ గాఁ బదరి పా పవ మంచుఁ జనంగఁబోవున
ప్పురుసును గాంచి బాలకులు బాపు రె! యీగతిఁబల్కు వీనిపెం
పరయుద మంచు నొక్క_మొగి నందఱుఁ బైఁబడి వానిలింగమున్.

క. బలిమినిదెంచినఁబ్రాణము,దలఁగును వెఱఁగంది మగుడఁ దల్లింగముఁనై
నిలుపుటయుఁదో నెబ్రదికినఁ, జెలరేఁగికుమారకులుకు చేష్టితులగుచున్.

తే. పెక్కువరుస లింగంబులఁ బెరుగఁ దీయు
చును రయంబునఁ గ్రమ్మఱఁ దనువునందు
నొందఁ జేయుచుఁ బ్రాణవియోగయోగ
కలన కద్భుత మందుచుఁ గాంచి యంత. 332

క. చిఱుతలము మీమహ_త్త్వం, బెఱుఁగకయిటు చేసినారమీపనిదయ చే
మఱువదగుస్వామియనున, త్తఱిఁదద్గురుఁడైనమాచధన్యుఁడువచ్చెన్.

ఉ. వచ్చి కుమారులం గని శివాధవభ_క్తిపదం బెఱుంగఁగా
వచ్చె శివుండు దేహ మెడఁబాయుట గల్గునె? భ_క్తకోటి కీ
మొచ్చెము సల్పవచ్చునె?యయో! యని చింత యొనర్చుచున్న భా
స్వచ్చరితాఢ్యుఁ గన్గొని హసన్ముఖు లై గుమిగూడి బాలకున్. 334

ఆ. అంగమందుఁ బాయ దఁట పీసిలింగంబు
చోద్య మిప్పు డిదియుఁ జూత మనుచుఁ
దొంటిపగిదిఁ గదిసె దూసినఁ దల్లింగ
మెద బెనంగి యంటి వదలకున్న. 335

చ. కనుఁగొని బాలు రిట్టిగతి గంటిమె వింటిమె యెందునైన నీ
యనఘులు శంకరాంశజు లటంచు నుతించుచు మ్రొక్కుచున్న యం
త నగరవాసభ_క్తతతి తన్మహిమఁ విని వారిఁ జూచు వే

డ్కొ నరుగఁ గాంచి యాత్మ జయుగంబునుదాను నమస్కరించుచున్.
క. ఉన్నెడ మాచయఁ గనుఁగొని, యన్నాగకలాపభక్తులద్భుతమతులై
యెన్నఁగలవారిలోఁబడి, సన్నుమహామహులువీరె జగతి నయారే!.
ఆ. చెడనిభక్తియుక్తి గొడగూచి తిరునాళ్ల
పోవ నరియమయును బావకాఖు
గర్భవాసు లైరి గాని యీగతి లింగ
మంగమందు విడమి యవఁగలదె?. 338
క. అని వినుతించిన నందొక, యనఘుండిట్లనియెఁదొల్లి యనిమిషుఁడనఁగ
ల్లునతనిచరితము దెల్పెద, వినుమని తెలుపంగదొడఁగె విస్పష్టముగాన్.

అనిమిషుని కథ.

సీ. అతివేడ్కఁజిన్నవయసునాఁడు శ్రీగిరికేగుచో నాతఁడొక్కెడ స్వలింగ
మవనిపైఁ బడి తన కగపడకున్నంత నచ్చోటనిలిచి దేహంబుదొరఁగ
గమకించునెడ దయాకలితాత్ముడై నందికేశ్వరుఁడే తెంచియిటులజీవ
మెడసేయఁగారణం బేమి? నా నమ్ముఁడై యిట్లనునాలింగమెచటఁగాన
ఆ. రాకయుండెఁ గానఁ బ్రాణంబు వీడనే, నన్నఁగఁ జేయవలసె ననిన నంది
నగవుతోడ ననియెఁ దెగువచే నీగతి, దారుణంబు సేఁత ధరణిఁగలదె?
ఉ. ఊరక జీవముల్ విడువ నొప్పునె? యెవ్వరిచేతఁ జిక్కెనో
యారయు మెచ్చుటం బడెనో యంతట నంతటఁ జూడు ప్రాతరా
ర్వ్యారమణార్చనం బెచట నయ్యెనొ యచ్చటఁ గాంచెఁ బంపుమా
దారి విమర్శసేయమను తప్పక లింగము గాన నయ్యెడిన్. 341
వ. అనినఁ దద్భక్తవరుండిట్లను నయ్యా! రేపకడ నొక్క సరోవరతీరంబునఁ
బ్రాతఃకాలశివార్చనం బొనరించి పయనంబు దరలి యొండొకచోట
నిలువక వచ్చివచ్చి యిచ్చట మదియాంగంబున నీశ్వరుండు లేమిఁ
గంటిం గావున నిచ్చట మల్లింగంబు దొరకవలయుఁ గాక యిచ్చోటు
వదలి వేఱె యొక్కచక్కి వెదకం బోవ నిది నానియమంబు నియ
మవర్తనులైనవారల నీశ్వరుండు కరుణించి కృతార్థులం గావించు
నది యెట్లనిన వినుండు. 342

పగల్తాండారి కథ

క. అండజనాయకవాహన, కాండాలయిత్ర్యాత్మహృదయకమలజుఁ డఘువే

దండహారివసుమతీబగ, ల్గాండారియనంగనొక్కధన్యుఁడు వెలయున్.

తే. విశ్వసన్నుతుఁ డతఁ డగస్త్యేశ్వరునకుఁ
ప్రతిదినంబును శతఘటపరిమళోద
కంబు లభిషేక మొనరించి కాని కుడువ
ననుచు వ్రత మూని యట్లు సేయంగ నంత. 344

సీ. విశ్వదిగంతరావృతిరజఃపటలంబు దవహుతాశనదగ్ధతరుచయంబు
ద్వాదశాత్మకరాభితప్తావనితలంబు వారిసరోన్వేషివనమృగంబు
ఛాయాప్రదేశవాంఛాసక్తపథికంబు పానీయవారికాబంధురంబు
శైత్యగంధవహార్థసంచరద్భుజగంబు సలిలమరీచికాసముదయంబు

తే. నిర్జలతటాకవాపికానిర్ఝరంబు, జనభయంకరపశ్చిమస్పర్శనంబు
శాల్మలీతూలకీర్ణనిర్ఝరపథంబు, నగుచుఁ గనుగొనన య్యెగ్రీష్మాగమంబు. 346

వ. ఆసమయంబున.

చ. తనపురి నీరు లేమి ఘనుఁ డాఘరఘమజ్జన మంతరించునో
యని పరిచారవర్గముల నన్యపురంబుల కన్పి వారిఁ దేఁ
బనిచి దినంబు నేమ మెడఁబాయక సల్పుచునుండి యొక్కనాఁ
డనఘుఁడు తొంటియట్ల గిరిజాధిపమజ్జన మాచరింపఁగాన్. 347

క. చేదప్పి నూఱవఘటము, మేదినిఁ బడి భిన్నమగుడు మృగధరభక్తుం
డీదివసవ్రతసాంగము, గాదయ్యె నఁకేమి సేతు గౌరీరమణా! 348

క. చేరువనీరముపుట్టదు, దూరముఁ బంపుటకు నెడము దోఁప దిపుడు నే
నేరీతి వ్రతము గడుపఁగ, నేరుతునని మూర్ఛచే మునింగినయంతన్.

చ. సరసిజవైరిజూటుఁ డొకజంగమరూపము దాల్చి వచ్చి యా
శరణవరేణ్యు కట్టెదుట స్వర్ణఘటంబు జలాభియుక్తముం
దిరముగ నిల్పి నీవ్రతము దీర్పుము సాంగముగాఁగ నంచుఁ దె
ల్పి రయము నిర్గమించె నగుటయు లేచి దిశల్ పరికించి యెచ్చటన్.

చ. ఘటమును జంగమంబుఁ బొడగానక చింతిలి యాత్మ నక్కటా!
యిటు కల గంటిఁ గాక నిజమేని కనుంగవ కబ్బకుండునే
యెటుల చరింతు నాక్రియము మేగతి సాంగముఁ జెందఁ నంచు ను
త్కటపరితాపవేదనల గ్రమ్మఁగఁ గన్నులు మూసి తా వెసన్. 351

ఉ. తొల్లిటిపైఁడికుండ నిజతీర్థభవమునందునఁ జూచి యాల్చి నా

యుల్లముఁ జూడఁ గోరి జలయుక్కలశంబు మదీయగర్భమం
దల్లన నిల్పె మేలిఁక భయంపడ నేల కుఠారధార నే
నెల్లరుఁ జూడ గర్భగతహేమఘటంబు వెగల్చి నిత్తటిన్. 352

క. అని వాఁడిసురియ చేకొని
తనయుదరము చించఁదలఁచుఁ దక్షిణమున హ్రా
ద్వారజమున దయ దలిర్పఁగ
మనసిజహరుఁ డిటుల వలదు మాను మటంచున్. 353

తే. కట్టెదుట నిల్చి యాతనికరము వట్టి
మేలు గణవర్య! నీచర్య మెచ్చువచ్చె
రమ్ము కైలాసమునకు శీఘ్రమ్ము గాఁగ
ననిన శివునకు మ్రొక్కి యి ట్లని నుతించె. 354

పంచచామరము. అంబుజాక్షసాయకా! యుజాండభాండనాయకా!
శంబరారిమారణా! నిషాదవేషధారణా!
కంబువర్ణవిగ్రహా! వికారికాలనిగ్రహా!
శంబరాంకభూషణా! నిశాచరాళిశోషణా! [పిదప

ఆ. అనుచు సన్నుతించి యార్యామనోనాథ, పూనువ్రతముసాంగమైన
రాకయొప్పఁగాక లేకున్న నిచ్చుట, వదలివచ్చు టుచితవర్తనంబె?

వ. అనిన శర్వుం డి ట్లనియె. 357

తే. అంజనఖనిత్రధూపదీపాదికములు
ధరణి సేవధి దొరకు నంతకునుగాదె ?
తద్ధనం బబ్బు పిదప సాధనచయంబు
లెన్ని యేనియుఁ బనిగొను నే? తలంప. 358

ఉ. కాన మదీయదర్శనము గల్గెడునంతకుఁ గాదె? నీ విటుల్
పూని యొనర్చునట్టివ్రతపుంజము భక్తసమూహిలోనఁ బెం
పూనితి వింక సంశయము నొందకు నీనియమంబు నిండె నీ
సూనవిమాన మెక్కు పద శోభనరౌప్యధరంబుఁ జేరఁగాన్. 359

సీ. అనఁ బగల్త్రాండారి యనియెఁ గ్రమ్మఱ మ్రొక్కి
స్వామి! మీ రనుమాటయే మదిష్ట
ముగుఁగాని వ్రతలోప మగుటకు సమ్మతిం

పదు మది యావెల్తిఁ బాపవలయు
నావుడుఁ గరుణించి యావారిసంభ మా
తనిచేతి కొసఁగ మోదంబు నొంచి
హారమజ్జన మొనర్చి యయ్యా! యీలింగాల
యములతో నను నీపురమునఁ జేర్చు

తే. మనిన నాతఁడు కోరినయటుల నిజని
వాసమునఁ జేర్చె నపు డద్రివాసుఁ డట్టు
లగుట పట్టిననియమంబు దిగువఁ దగునె?
యని మఱియు నిట్టు లనియె నయ్యనిమిషుండు. 360

మ. అతిభక్తిం దనయెత్తుగుగ్గులను నిత్యం బిశుధర్మాపహా
ర్పితముం జేయఁగఁ గౌళకూట మది దుర్వృత్తాత్ములై యొక్కనాఁ
డతనిం గానఁగ నీక డాఁచ నిజదేహం బగ్గిలో గుగ్గులా
యితమై యొప్ప నొనర్చి హీనత నరుం డీశాను నొప్పింపఁడే?. 361

చ. జడధిశయానబాణునకు సంతతముక్ వేయి దీపముల్ వెలుం
గిడుచుఁ బదార్థ మెల్ల నదె హేతువుగా వ్యయ మొంద ధీరుఁడై
జడముడి విచ్చి దీపములచందమునక్ వెలిగించి తోడనే
కడమలనంబి శంకరునికాయముఁ జెందఁడె బొందితోడఁ తన్. 362

తే. ఎండ వెన్నెలఁ దనుపంటనీనివ్రతముఁ
బూని గుహనుండి రవిదనుపుంజ మాత్మ
గాత్రమునఁ జొన్ప నాతనిఁ గని శపించి
యీశుదయుఁ గనెఁ దొల్లిసురేశ్వరుండు. 363

తే. చందనము మూఁడుసందెల శర్వమూర్తి
కిచ్చువ్రత మూని నిజధన మెల్ల సమయఁ
జెయ్యి గంధముగాఁ దీసి శివునికరుణ
వలన నణుమూర్తి కైలాసవాసి గాఁడె?. 364

తే. మఱియు నడిభర్త గుగ్గుల మాచిదేవుఁ
డాది యగుభక్తవర్యులు సాంగనియమ
కలనచేఁ గాదె శివుకృప గాంచి రట్టు
లగుట వ్రత మరయఁగ నిట నగునె? యనఘ!. 365

వ. అనిన నందికేశ్వరుం డనిమిషునిష్ఠాగరిష్ఠత్వంబున కచ్చెరువందుచు దరహాసితాననుండై యిదె కొమ్మని తల్లింగం బతనిచేతి కొసంగి లిం గాంగైక్యమార్గం బుపదేశించి నేటంగోలె నీమూర్తి నీదేహంబున నంటు వదలకుండు నని యనుగ్రహించి దండప్రణామయుతుండగు నతని హితవాక్యంబుల గారవించి ప్రమథాధ్యక్షుండు నిజేచ్ఛం జనియె నాటంగోలె నయ్యనిమిషుండు నిజకరతలన్యస్తలింగలీనదృష్టా తత్పరత్వంబున నిరంతరంబు తన్ను మఱచి చిదానందాబ్ధి నోలలాడు చుండె నని తొల్లిటిభక్తవర్యుల చర్యల విందుము నేఁడు మహాత్ములఁ గన్నులం గంటి మని సన్నుతించు నవసరంబున నమ్మాచిదేవు భార్య యేతెంచి యచ్చటిభక్తులకు మ్రొక్కి నిజపతిసుతులం గన్గొని గాఢతరయగు మనభక్తి నేటికి నిచ్చ కెక్కె నింక మర్త్యంబు చాలు రండురండు పోద మని కుమారుల నిరువురఁ జంకల నిడికొని ప్రాణే శ్వరు మూఁపుపై నెక్కించుకొని సకలజనంబులు ఘే యని జయ వెట్ట వైహాయసగమనంబునఁ గైలాసకుధరంబున కరిగె నంత నచ్చటి భక్తులు నత్యాశ్చర్యంబు నొంది తమలోన. 366

సీ. విలసితచతురంగబలసమేతుండయి చెన్నయాఖ్యుఁడు శర్వుఁజేరనరిగె
సకలతంత్రముదానుశమనారిసతిచేరఁగుమారపాలకూర్జరుఁడుచనియెఁ
దొమ్మిదిపురములతోఁగూడ శివపురి డాయంగ నేగె హలాయుధుండు
గురునకై దొమ్మరకులమెల్లఁగొనితారహృక్షేశ్వరముఁజేరెబిల్లమాఖ్యుఁ
తే. డనుచు విందుమాద్యోక్తులయందుదొల్లి, కంటి మిత్తఱిగన్నులకఱవుదీఱ
దేహములతోడఁ గైలాసదేశమునకు, దారుణీజనులందఱువీర లెసఁగ.
ఆ. పలికినట్లు నడచు భక్తులు వీర కా, కవనిలోన నెవ్వరైనఁ గలరె?
యనిన నొక్కజంగమయ్య యిట్లనిపల్కె, వినరె తొంటిభక్తవితతిలోన.

ఘటాలయ్య కథ.

శా. కామక్రోధమదాదిశత్రుబలపద్గర్వాపహుం డింద్రియ
స్తోమోద్దామవికారదూరుఁడు విసద్ధూతాఖిలాఘుండు దీ
నామర్త్యక్షితిజంబు భక్తసుపాదాంభోజసత్యార్చన
స్థేమాత్ముండు వనర్చు నివ్వసుమతీసీమన్ ఘటాలయ్య నాన్. 369

ఉ. ఆయనఘాత్ముభార్య విమలాంగి యనంగ విలాసవిభ్రమ

ప్రియకళాభిరామ సితపంకజపత్రవిశాలనేత్ర స్వ
శ్రాయకరత్నవేణి యుడురాజనిభానన భద్రకుంభికుం
భాయతసత్పయోధర మృగాధిపమధ్య తనర్చు నెంతయున్. 370

సీ. ఆయింతి పతి మెచ్చఁ బాయక నిత్యంబు కేవలభక్తి గల్గినదివారెలె
నుచితోపచారంబు లొనరఁజేయుచునన్య థాయత్తమానసయైవిటాలిఁ
గూడిచరింప నక్కోవిదుఁడెఱిఁగియు లెక్కసేయక లింగలీల ధరణిఁ
దిరుగుచు భక్తమందిరములకేగి తదంగణరజము పోసంగ నూడ్చి

తే. తెచ్చి యొకభాండ మొనరించి గృహిణి నూత్న
లబ్ధభక్తుల కొసఁగి తల్లబ్ధి జంగ
మార్చ లొనరించుచు దురంత రాజవంజ
వభ్రమాతీతమార్గుఁడై వఱలుచుండె. 371

వ. అంత నొక్కనాఁడు. 372

చ. శరణులు కొంద ఱాఘనునిసద్మముఁ జేరఁగ నేగి వానిచేఁ
జిరతరపూజనావిధులు చేకొని మున్న తదంగనాగుణం
బరయుటచే స్వమానసములందు నసహ్యత దోఁపఁ గిన్కమై
హరగణు లెల్ల ని ట్లనిరి యాతనితో దుత నేకవాక్యులై. 373

తే. జ్ఞానవైరాగ్యనిష్ఠల త్యాగలమున
వన్నె కెక్కిన యోభక్తవర్య! నీదు
తరుణి కొఱగాని త్రిమ్మట దిరుగఁబొచ్చెఁ
జక్కఁగాఁ దీర్చు మనుటయుఁ జాఁగి మ్రొక్కి. 374

క. తనకాంతఁ బిలిచి యీభక్తని కాయము నీవు చక్కఁగాదిరుగఁగ లే
దని యె నటుగాన వీరల కనుఁగవకట్టెదుట మెచ్చఁ గ్రమ్మఱుమనినన్.

తే. అంతఁ బతిమాట జనదాఁట కజ్జలాట
లాతఁ మడమలు భువి మోపి యపుడు కుంభ
కారచక్రంబు దిరిగెడుతీరు దోఁపఁ
దిరుగఁ గని భక్తు లిటుల పల్కిరి హసించి. 376

తే. మేలు మే లుగ్ధ! నీచర్య మెచ్చవచ్చెఁ
దిరుగుటలు నాఁగ నిటు గాదు దెలియ వినుము
కొంత నడవడి చక్కన గా దటన్న

నతివపైఁ గోపగించి యిట్లనియె నతఁడు. 377

క. నీనడక చక్కఁగాదఁట, యీనాగకలాపభక్తు లెల్లను మెచ్చన్
బూని నడు మనినసగ్గజ,యాన విలాసముగహంసయటులనడచినన్.

క. కని తద్భక్తనికాయము, వినుము ఘటాలయ్య! యెంత వెఱ్ఱివి మేమా
డినమాటఁ దెలియ నేరవు,ఘనకచ సేఁతలు పొసంగుగాసివనుటయున్.

క. కొఱఁగాని సేఁతలవి యీ, తెఱఁగయనుచునాకు నెపుడు తెలియదు నేనె
త్తెఱఁగునఁ జెప్పిన నట్టుల,యరసేయక సేయు నిట్టివాఁడం బగునే?

చ. అను డితఁ డింత తెల్పఁ దెలియం డని యందొకభక్తపుంగవుం
డనియె రహస్యవృత్తి సదయాత్మక! నీప్రియ కామచారయై
తనకులశీలవర్తనలు తప్పి చనం గడుమిండగీలతో
నెనసి చరించు నీ కిటుల యేటికి నూరక చూచుచుండఁగాన్. 381

వ. అనిన దరహసితాననుం డై ఘటాలయ్య యిట్లనియె. 382

చ. హరగణవర్య! మీ రిటుల యాడుట ధర్మమె! యన్యనిందచే
దురితము వచ్చునంచు మఱఁ దోఁపదె? పామరవృత్తిఁ జెందినన్
గిరిశుఁడు వానిఁ జేకొనునె? కేవలభక్తిపదానువర్తులౌ
శరణులు మెత్తురే? యెఱుఁగఁజాలక మాయలఁ జిక్కువారలన్. 383

చ. ధరణిపరాన్యనాయకులతర్జనమున్ జనకోటినిందయున్
బరమునఁ గాలుచేఁ బడెడుబాధలమున్ భయమంది కొంద ఱా
స్మరకువికారవర్తనలు మాని వసింతురు కొంద ఱిచ్చమైఁ
బరగుదు రంగనామణులు వారలఁ బేర్కొన నేల? మాటికిన్. 384

క. ఒకయేటినీరు వాడరు, సకలమహీజనము లొక్కసరణి నడువరే
ప్రకటముగఁ బెక్కుమానవు, లొకరొక్కరిసొమ్మటంట యోగ్యంబగునే.

తే. సకలఫలములలో బీజసమితి యట్లు, మునిగియుండిరి సంసారమునను గొంద
ఱాజవంశమునం గొంద ఱంటియంట, నరయ భల్లాతకీబీజమట్ల ధరణి.

వ. కావున నెవ్వరెవ్వరిప్రకృతివిశేషంబు లెట్లట్ల వారలు చరియింతురు తద్గుణంబులు లెక్కింపం బనియేమి? సమస్తధర్మాభిజ్ఞుల రగు మిము బోఁటిమహాత్ములన్యగుణదోషనిరూపణం బొనర్చుట కత్యాశ్చర్యంబయ్యె నొకఁడుచనుతో శివవేషొకంఁడుచనునే? సకలజనంబులకు భక్తియె ముక్తిదైయె యుండుఁ దద్భక్తియుక్తులు కొందఱు స్వశరీరంబు

లతోఁ గైలాసంబునొందెదరు మఱికొందఱు తనుత్యాగులై చనియె
దరు కొంద ఱాత్మలింగవిలీనత్వంబు నొందెద రవి యెల్ల నాశాస్పదం
బులైన మార్గంబుల యనినఁ దద్భక్తవరు లొండొరుల యాననంబు
లాలోకించుచు నితం డాత్మప్రియానుసక్తుండై మనల నొడంబఱుప
నిట్లాడుటయో లేక యితనిమార్గం బిట్టిదియో యదియునుంగాక
యీశ్వరుం గలయు తెఱంగులు కొన్ని యుగ్గడించి యివి యెల్ల నాశా
స్పదంబు లనియె నిమ్మార్గంబులుఁ దప్ప నితం డెప్పగిది నంబికాధీశుఁ
గలయునో యెఱుఁగవలయు నని ఘంటాలయ్య నుద్దేశించి యందఱు
నేకకంఠంబుగా ని ట్లనిరి. 387

ఉ. లోకములోన భక్తులు త్రిలోచనుఁ గూడెడునట్టిమార్గముల్
చేకొన కాడి తీ వెటుల చెందెదవో పరమేశుఁ దెల్పుమా
మా కిపు డన్నఁ దద్గణసమాజవచశ్శ్రవణానుమోదుఁ డై
యాకరుణాకరుండు వినయంబున నిట్లని పల్కె మ్రొక్కుచున్. 388

చ. అనఘతరాత్ములార! జగదంతరవర్తన లెల్ల నెమ్మదిం
గనుఁగొనఁజాలు జ్ఞానగుణగణ్యులు నామది మీ రెఱుంగరే?
ఘనదయ లోకసన్నుతుని గా నొనరించుట గాక నాపయిం
గినియుట గా దయారె! ధరణిం జెన రిట్టుల యుండఁ జెల్లదే 389

న. అయిన మీ రిట్లాన తిచ్చినపు డే నూరకుండుట చన దస్మద్వర్తనంబు
దెల్పెద వినుం డని యి ట్లనియె. 390

క. కాయం బిది దగ్ధపటా, న్యాయంబుగఁ జంద్రధరునియందునఁ గూర్తు
న్నాయునిబల్కుటతద్గతి, సేయుట యొక్కొక్కనాఁడు చెల్లు నెతలఁపన్.

క. అని యంతఁ బ్రోక తద్భక్తనికాయంబునకు మ్రొక్కి కడువడిపద్మా
సనమున నాసీనుండై, ధనదాప్తుం గలయఁదలఁచితత్క్షణమాత్రిన్.

సీ. తనరునాధారపద్మము మెట్టి దిగనాడి కనుదృష్టియిష్టలింగమునఁ గూర్చి
తలవంపుతమ్ము లూర్ధ్వముఖంబులుగఁ జేసి వెస జీవవల్లికవేరు పెఱికి
తఱిదశానిలబంధతతులూడఁగాఁ దన్ని తగుపంచభూతపద్మములుమూసి
విలసితాంతర్జ్యోతి వెలిఁగించి తనువెల్లఁ గలయలోఁగాల్చి చిత్కళ వెలిఁగించి

తే. బ్రహ్మరంధ్రంబు భేదింపఁ బ్రణవనాద
మెల్లదిక్కులఁ గడుఁ బిక్కటిల్ల సకల

జనులు చూడ్కులు మిఱుమిట్లు గొనఁగఁజేసి
తత్క్షణంబున శ్రీపరంధాముఁ గలయ. 393

ఉ. ధారుణి దిర్దిరం దిరిగెఁ దారలు డుల్లె నభంబు వ్రీలె ది
గ్వారము గ్రుంగె సప్తకులపర్వతముల్ చలనంబు నొందెఁ జం
ద్రారుణకాంతు లింకె సకలాంబుధివర్గము దొంకె నాదిభూ
దారము బొబ్బరించె బెడిదంబగు తత్ప్రళయారవంబునన్. 394

వ. తదనంతరంబ. 395

క. కురిసెఁ బువ్వులసోనలు, మొరసెఁ సురదుందుభులతిముదమునరంభా
దిరమణు లాడిరి చల్లని,మరుదంకురపంక్తి వీచె మాంగల్యముగాన్.

ఉ. అట్టిమహాద్భుతంబు గని యచ్చటిశాంభవు లెల్ల లేచి మే
మిట్టివిచిత్ర మిప్వసుధ నెన్నఁడుఁ జూడఁగ లే దటంచు లోఁ
దొట్టినమోదసంపద నుతు ల్పచరింప నితండు రూఢిగా
గట్టులవేలు పే యటుల గానియెడన్ వడి నిట్లు సేయునే?. 397

ఉ. ఎంతమహాత్ముఁ డెంతఘనుఁ డెంతతపోధనచక్రవర్తి వీఁ
డెంతకృతార్థుఁ డెంతగుణి యెంతసమస్తసమానవర్తనుం
డెంతవిరక్తుఁ! డంచు వచియించుచు డగ్గఱి తద్గణాధిపుల్
స్వాంతములన్ బ్రమోద మొదవం గనుచున్న తఱిన్ రయంబునన్.

ఉ. అం దొకభక్తుఁ డీతనిక్రియాపరిపూర్తి యొనర్త మంచు బా
లేందుకిరీటభావుఁ డయి నొచ్చినయాతనిఫాలపట్టికం
బొందుగ భూతిపుండ్ర మిడఁబోవఁ దదంగము భస్మమైన నా
చందము సర్వశర్వగణసంతతి గన్గొ నియద్భుతాత్ములై. 399

తే. ఒండొరుల మీఱి యేమియు నుండనీక
యవ్విభూతి నిజాంగములందు నలఁది
కొని మహాముక్తి చేకొంటి మనుచుఁ జనిరి
సంతసము నందుచును నిజసదనములకు. 400

క. కావునఁ బలికినగతి శివ, దేవు ఘటాలయ్య గలసె ధృతి నిత్తఱి మ
ర్త్యావళియద్భుత మొంపను,మావల్లభుఁడంగుటూరిమాచయకలసెన్.

వ. అని తెల్పిన జంగమవర్యువాక్యమ్ములకుఁ బ్రమోదమానచేతస్కులై
సమస్తభక్తజనులు యథేచ్ఛం జనిరి. 402

తే. ధీరుఁ డైనట్టి శ్రీటంగుటూరిమాచ
యాఖ్యచరితంబు చదివిన నర్థి వినిన
నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధిఁ
జెంది తుది మోక్షసామ్రాజ్య మొందు నరుఁడు. 403

వ. అని తెల్పి సిద్ధరామునితోఁ జెన్నబసవేశ్వరుండు మఱియు నిట్లని చెప్పందొడంగె. 404

క. శంబరభవజాతశ్రీ, కంబుగ్రీవాధిపాదిఖచరార్చితపా
దాంబుజభవకనదాత్మం,డంబికచౌడయ్యయనమహామహుఁడొప్పున్.

**అంబిక చౌడయ్య కథ.**

సీ. అతఁడు భక్తానీక మానసభక్తిఁ బాయక సూపకారకాయకము పూని
సలుపుచుఁ దల్లబ్ధి జంగమార్చనము లొనర్చుచు నిరుపమానందలీల
నిష్టలింగార్చల నేపార్దుఁ జేయుచు నిష్టలింగులమైత్రియే దలఁచుచు
నిష్టలింగాధిక్య మిలఁ బ్రతిష్ఠించుచు నిష్టపూజావిధు లెఱుఁగ నట్టి
తే. నరుల నెమ్మది మెచ్చక తిరుగుచుండు
నంత నొకనాఁడు గుమిగూడి కంతుదళన
భక్తు లొకకొంద ఱొకయెడ భాసురేష్ట
గోష్ఠిమై సమ్మదంబునఁ గూరుచుండి. 406

చ. ఘనతరవేదవేద్య త్రిజగజ్జనసేవ్య సమస్తదేవతా
వినుతమహత్త్వ పాపపదవీహరణాద్భుతశీల మానసం
జనన ధరిత్రి ఘోరభవసాగరతారిణి యోగవిద్యఁ బో
ల నొకఁడు గల్గునే యమృతలక్ష్మిని గైకొనుమార్గ మేరికిన్. 407

తే. హృత్కమలకర్ణికామధ్య నీశు నిల్పి
మానసార్చన లొనరించు మానవులకుఁ
గరతలామలకము మోక్షసరణి యనుచు
నొండొరులతోఁ బ్రసంగించు చుండువేళ. 408

ఉ. అక్కడి కేగి చౌడయ గణావళిఁ గన్గొని మ్రొక్కి నిల్చి యా
ముచ్చట లాలకించి యిది మొక్కల మిష్టసమర్చనాధ్వ మి
ట్లొచ్చెము చేసి యోగవిధి యోగ్య మటంచు వచింత్రు రయ్య యో
మెచ్చునె కాఁక కంధరుఁడు మేలిమి చెందునె? యివ్విధంబునన్. 409

క. ధారాధరంబులోపలి, నీరము మది నమ్మకుండ నీ రెడలించే
వీరిఁడిగతి నన్యపథము, గోరి కరస్థలశివార్చ గూడునె? విడుమన్. 410
సీ. కరమున జ్యోతిరాకారలింగము గల్గ నణుమాత్రకళ గనన్లఁతయేల?
ఖ్యాతపురాతనగీతారవము గల్గ దశరవశ్రుతిచింత దవుల నేల?
యక్షయంబైన పంచాక్షరి యుండంగ షట్చక్రచింతనశ్రమ మదేల?
సారమౌ త్రివిధప్రసాదామృతము గల్గ నమృతకుంభేక్షణాయాస మేల?
తే. కలితసద్భక్తి యనియెడు కన్య గలుగఁ
బాపకన్నియ మేల్కొల్పు బాధ యేల?
సులభముగ ముక్తి గాంచెడుచొప్పు గలుగఁ
జాల వెత నొంద నేటికి? శరణతతికి. 411
క. అనియిటులయతఁడువల్కిన, వినియన్నొకశరణుఁడనియె వెలుపలిపూజల్
తనువలయ నెన్ని చేసిన, ఘనమానసపూజఁ బోలఁగలవే? యెందున్.
తే. మహితచిద్బ్రహ్మమునఁ దనమానసంబు
లీయ మగుదాఁకఁ జను నిష్టలింగపూజ
సలుప నారూఢుఁ డైనచో సాధనముల
వలనఁ బని యేమి గలుగు? భూతలమునందు. 413
క. వేదాంతవేద్యమార్గము, గా దనఁగా నీకుఁ దగునె? కలితాత్మజ్ఞా
నాదరులగు బుధవర్యులు, మోదంబునఁ దొల్లి నిత్యముక్తిం గనరే.

ఆత్మదేవుని కథ.

ఉ. ధారుణి నాత్మదేవుఁ డనుధన్యుఁ డొకండు త్రికాల మంబికా
ధారుని మానసార్చన ముదం బొనరించుచుఁ గొంతకాల మీ
తీరునఁ బుచ్చి సానులు నుతింపఁగఁ దా నొకనాఁడు కూలికై
దూరము వోయి తోడిప్రజతో వరి గోయుచు నుండ నత్తఱిన్. 415
చ. జలజసఖుండు మింటినడుచక్కికి రాఁ గని భర్గపూజనల్
సలుపఁగ వేళ యయ్యె నని సయ్యన నచ్చట గూరుచుండి కన్
గలువ లొకింత మూసి వెలి గన్గొనఁబోక తదేకనిష్ఠుఁడై
యలరినఁ దోడికూలిజను లాతనిచందము గాంచి నవ్వుచున్. 416
ఉ. కూలికి వచ్చి యీడ వరిగోయుచుఁ గూరుకు చెందవచ్చునే?
మూల్గుఁబోఁతు వీని కనుమానము లే దిఁకఁ జేసి పెద్దచేఁ

దోలుఁడి యీదినంబు మనతో సరిగాఁ బడి ముట్టఁబోదు వే
యేల వినుండు వీఁడు బని కెవ్వరుఁ బిల్వరు నేఁటినుండియున్. 417

ఉ. కూటికి లేకొ యాఁకటనొ కూలి యొనర్చి గడించుకాసు లే
చాటున నైన డాఁచి కనఁజాలకయో కుదువంగఁ గట్ట లే
కాటిది వీనితోడఁ గలహం బొనరించెనొ రాత్రి యిప్పు డి
ప్పా టొనరించుచుం గుసికిపాటును జెందెడు నిద్ర చాలమిన్. 418

వ. అని కేరుచు. 419

క. కనుమూసెదేమి? లేరా!, యని వారలలోన నొక్కఁడాతనిప్రక్కం
దనవ్రేలఁ బొడువ బిట్టుగఁ,దనువల్కఁగ లేచివానిఁదార్కొనియలుకన్.

క. ఓరీ మూఢ! దురాత్మక!, గౌరీశున కర్పితంబు గాఁ జేయునెడన్
దోరంబగుదధిభాండం, జేరా పడద్రోచితంచు హెచ్చినకినుకన్.

క. చేతికొడవంటఁ గొంకక,భూతలమున వానిశిర మపుడ యేయఁగఁనే
భీతి గొని తోడిపనివాం,డ్రాతఁడేఁబరు గెత్తినృపునకంతయుఁదెలుపన్.

మ. విని కోపంబున నమ్మహాత్ము నిపుడే పిల్పించి యోరా! మను
ష్యుని నిష్కారణ మేల? చంపితివి నీచుండైన నీరీతి ని
ప్పని గావించునె? నిన్నుఁ గొట్టునఁ బడం బాల్పెట్టినం గిన్క వొ
పునె? యున్నట్లు నిజంబు పల్కు మనినన్ భూభర్తతో ని ట్లనున్.

క. పుడమిదొర! సర్వమిత్త్రం,బడఁచఁగ నే వెట్టినయ్య? యాకర్ముఁడు నా
యెడనడిచినదడువడియే,ర్పడఁదెల్పెదవినుమటంచుఁబలికెనభయుఁడై.

క. జీవేశార్పితదధిఘట, మీావంచకుఁ డొరఁగఁద్రోయ నేఁ జంపితి నే
నీవిధము దెలియ కూరక,నావలనం దప్పు లెన్న న్యాయమె?యధిపా!

వ. అని యమ్మహాత్ముని నేరంబు దెల్పిన వారలదిక్కుమొగం బై నృప
వరుండు. 426

క. ఊరకఁ జంపె నితం డని, మీా రంటిరి చంద్రధరసమీాపదధిఘటం
బారయకతొలఁగఁద్రోయఁగఁ, గారణ మేమనుచు వారిగద్దించుటయున్.

తే. ఈతఁ డనెడుమాట లెల్లబూటకములు
కూలిసేయుచుండి కునుకుఁ జెందె
నింతె కాని పూజ లేమియు మే మటఁ
గానలేదు పమరె యాన యనిన. 428

చ. విని నృపవర్యుఁ డా గడుసువే కద! ధాత్రియె దాపులింగమో!
మును మిడి కోయునట్టి పరిమోపులె పూజ యొనర్పఁ గోరి తె
చ్చినకుసుమాదివస్తువులా! చెంగటిదాహపునీలముంత క
మ్మనిదధిభాండమో! తెలుపుమా విన వేడుక యయ్యె నిత్తఱిన్.

ఉ. నాపుడు నమ్మహాత్ముఁ డను నాహృదయాంతరవాసియౌ మహా
దేవుని మానసార్చనగతిన్ భజియించితిఁ గాని బాహ్యపూ
జావిధి గాదు హేళనము సల్పఁగఁ గూడ దటన్న నవ్వుచున్
భూవరుఁ డౌర! పొంకముగ బొంకితి విట్టుల నేర రెవ్వరున్. 430

తే. కోలభాతి భూమిఁ గొలిచి కొం డిదె నడు
మనెడుమాటవోలె నహహా! నీదు
పలుకుమార్గ మెంచఁ బ్రౌఢుఁడ విమ్మాట
వలన నీకు నింద దలఁగఁబోదు. 431

చ. అనినన్ భూపతిదిక్కు గాంచి జనవర్యా! నీదుచిత్తంబులో
ననుమానం బఱఁ జూడు నాహృదయమధ్యస్థాద్రిజాతేశ్వరా
ర్చన లంచున్ గొడవంట నాతనిసువక్షం బప్పుడే చీల్చి యొ
య్యన హస్తంబుల రెండుపాయలుగఁ జేయం దోఁచె నాలోపలన్.

శా. శ్రీరమ్యం బగురత్నపీఠముపయిం జెల్వొందు జ్యోతిర్మయా
కారం బౌ శివలింగ మాశివునికై కావించు పూజావళుల్
భూరిభ్రాజితభాజనాంతరమునన్ బొల్పారునైవేద్యముల్
సాగంబౌ దధిభాండ మాపెరుఁగు పెల్చుం జెందుతీ రత్తఱిన్, 433

మ. కనుపట్టన్ సభవారలున్ వసుమతీకాంతుఁడు వీక్షించి హృ
ద్వనజాతంబుల భీతి సమ్మదము చిత్రంబున్ ద్రపాభక్తిభా
వన లొక్కుమ్మడిఁ దోఁపఁ గేల్గమి శిరోభాగంబులం దాల్చి ని
ల్చి 'నమో నీలగళాయ తే' యనుచు హాళి న్మ్రొక్కి రి ట్లందఱున్.

ఉ. మ్రొక్కి మహీతలేశుఁడు ప్రమోదముఁ జెందితి నిమ్మహాత్ము పెం
పెక్కినమానసం బెఱుఁగ కీతఱిఁ బ్రేలరిమాట లాడి తిం
కెక్కడి సత్య? మేటి బ్రదు? కెక్కడి సత్పథ? మేటి కీర్తి? నా
కక్కట! పాపభంజన! శివా! దురితాత్ముల నెట్లు బ్రోచెదో. 434

ఆ. కొడవ లనెడుకుంచెకోలచే వత్సుఁ గ్ర
వాట మివుడు తెఱచి వామదేవు
గర్భగేహమందుఁ గానంగఁ జేసితి
వౌర! యెంతఘనుఁడ వాత్మదేవ!. 436

చ. అని వినుతించుచున్న సమయంబున నద్భుత మొప్ప నంతలో
మునుపటిరీతి పక్షి మఱుమూసుకపోయె ధరావరుండు వేఁ
డినఁ దనచే మృతుం డయినయర్భకుఁ గ్రమ్మఱ జీవయుక్తుఁగా
నొనరిచి యాత్మదేవుఁడు మహోన్నతుఁడై చని మెన్ని జేష్ఫలన్.

వ. అదియునుంగాక. [బూ

క. తొలియట్టులహృదయంబున,మలహరుఁబూజించిముక్తిమార్గముగనెఁ
సలనయనారటుగావున, నిలమానసపూజసాటి యేదియునగునే. 439

చ. అనవుడు మానసార్చనమహత్త్వము యెక్కుడటంచుఁ బల్మరుణ్
వినుతి యొనర్చి పల్కెదరు విశ్వమునణ్ సత తేష్టలింగపూ
జన లొనరించువారిఘనసత్త్వము వర్ణనసేయ శక్యమే?
వనజభవాద్రిభిన్ముఖసుపర్వులకైన నటన్న నుగ్రులై. 440

ఉ. గర్భము చించి శూలిఁ బొడగానఁగఁ జేసి గతాసుఁ డైనయా
యర్భకుఁ గ్రమ్మఱణ్ బ్రదుకున ట్లొనరించి బుధు ల్నుతింపఁగా
స్వర్భుజగాలమానసుల సారయశోవిభవంబు నిల్పె నా
నిర్భపదుగ్రుఁడై యతఁడు వేటొకఁ డిట్టుల సేయ నేర్చునే? 441

క. నావుడుఁ జొడయ నవ్వుచుఁ, గోవిదవరులార! గర్భగోళము వలెఁగా
దీవిద్యాభృతఘనభూ, యావస్త్రముచించిమింటహరుఁ జూపింతున్.

తే. అనుచు మొలనున్న దర్వి చే నంబరంబుఁ
జిమ్మునంతనె కోటిరాజీవమిత్ర
తేజమునఁ దోఁచెఁ దత్ప్రభాస్థలి సమస్త
జనులకన్నులు మిఱుమిట్లుగొనఁగ నపుడు. 443

శా. కైలాసంబును దానిమీఁదఁ గనకాగారంబు నం దొప్పు ర
త్నాలీఢోన్నతపీఠ మూపయి సముద్యజ్జ్యోతిరాకారుఁ డౌ
బాలాబ్జాహితమౌళి యాశివుదరిణ్ భాసిల్లుశీతాద్రిరా
డ్బాలారత్నము తత్ప్రభం బ్రమథతండం బాదితేయావళుల్. 444

వ. మఱియును. 445

ఉ. మానస్తోత్రవచోవిలాసములు రంభానాట్యసంరంభముల్
నానాగాయకగానముల్ పటహవీణావేణుభేరీముఖ
ధ్వానంబుల్ వరవందిమాగధుల కైవారంబులుఁ నేత్రహ
స్తానూనార్భటులుఁ సమస్తజనహృద్యంబై దిశల్నిండఁగాన్. 446

శా. మింటం దోఁచినఁ దత్సభాజనులు పేర్మిం గాంచి వే లేచి కే
ల్జంట ల్ఫాలములందు నిల్పి నతపాలా! దేవచూడామణీ!
కంటిం గంగ తరింపఁజేయుగతి మాకుం గోర్కెలీఁగోరి యీ
వెంటం గన్పడి తీవు మానుకృత మిర్వీం జెప్పఁగా శక్యమే? 447

క. అని సన్నుతించుసమయంబునఁజౌడాచార్యవిభుఁడుపూర్వపురీతిన్
ఘనమాయాంబరమాచ్ఛాదన మొనరించుటయు రజతధరణీధరమున్. 448

వ. అందున్నయశేషవిశేషంబులు నాతఁడంబ. 449

చ. కొలువున నున్న వారల కగోచరమై చనఁ జౌడరాయప
జ్జలజయుగప్రదేశమునఁ జాఁగిలి వందన మాచరించి వా
రలు వినుతించి రిట్లనుచు రాజకళాధరభక్తవర్య! నీ
వలన మదాత్మసంజనితవాంఛలు నేఁడు ఫలించె మించుగన్. 450

ఆ. హృదయములను దావ కేష్టలింగార్చన
మహిమ లెఱుఁగలేక మందమతుల
మైన మమ్ము శివునియాకృతిఁ జూపించి
మనిచి తీవు కరుణ పెనఁగొనంగ. 451

వ. అని యతనిం గొనియాడి తద్భక్తు లందఱు తమతమనివాసంబులకరిగి రమ్మహాత్ముండు తొంటిచందంబున యథేచ్ఛ విహరించుచుండెం గావున నిష్టలింగపదార్థం బిట్టి దని యానతిచ్చి చెన్నబసవేశ్వరుని యడుగుల కెఱఁగి సిద్ధరామయ్యండు దేవా! భవదీయకరుణాకటాక్ష వీక్షణమ్మువలనఁ గృతార్థుండ నైతి నని పెక్కుభంగులం గొనియాడి యద్దేశికసార్వభౌమానుజ్ఞాతుండై నిజపురంబున కరిగి నిరంతరేష్టలిం గార్చనం బొనరించుచు నిర్వంచకంబుగా జంగమారాధనం బొనరిం చుచు సుఖంబున విహరించుచుండె. 452

క. ఈసిద్ధరాముచరితము, భాసురముగ జనులు వినినఁబఠియించిన ది

గ్వాసునిక్రపఘూరాఘుని, రాసంబొనరించిము క్తిరమఁగాంతురొగిన్.

వ. అని యిట్లానతిచ్చి రేణుకునితో లోపాముద్రావరుండు తదనంతర వృత్తాంతం బెట్లయ్యె నని యడిగిన. 454

మ. ఘనకీర్తిద్యుతిసర్జితాహిపమరుత్కాండాంబుభూభూజ భూ
జననేత్రోత్పలరాజ! రాజవరపూజాయుక్పదాంభోజ! భో
జనరాధీశసమానకావ్యరచనాసంతోషితాత్యంతపా
వనశాస్త్రజ్ఞసమాజ! మాజనకభాస్వత్తూణభక్తావనా!. 455

క. సత్యజితహరిశ్చంద్రా!, సత్యాలలనేశసదృశసాత్త్వికగుణ! నా
సత్యజయంతాకారా!, సత్యాత్మేశ్వరతనూజసమశౌర్యనిధీ!. 456

ఉత్సాహ. పుండరీకవైరిఖండభూపభక్తపోషణా!
కాండసంచయప్రపూరితాచ్ఛకీర్తిభూషణా!
మండలేశమంత్రివర్యమానితోరుభాషణా!
భండనస్థలాఖిలారిపంక్తిచిత్తభీషణా!. 457

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.



## కూకదమారయ్య కథ.



లోలదృగ్వారాగ్రభ
వైలబిలసభార్కచంద్రహరిహరివాణీ
లోలజసమాఖ్య! వాగ్జిత
లేలీహానముఖ్య! యమృతలింగసమాఖ్యా!. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తరువాతికథ యిట్లని చెప్పందొడంగె. 2

క. ఒకనాఁడు చెన్నబసవం, డకలంకగణాలితోడ నాస్థానమునన్
సుకరేష్టగోష్ఠి సలుపుచుఁ, బ్రకటితగతి నున్నయవసరంబున నెలమిన్.

మ. సుదతీరత్నముఁ దాను చెన్నబసవేశుం జూడఁగాఁ గోరి కూ
కదమారాఖ్యగణాధినాథుఁ డరుదేఁ గొల్వున్న భక్తాలితో
నెదురై మ్రొక్కుచుఁ దోడితెచ్చి సభలో హేమాసనాఖ్యాదిదీ
వ్యదనూనార్చనకృత్యముల్ సలిపి నాగాంబాత్మజుం డత్తఱిన్. 4

శా. స్వామీ! యెచ్చటనుండి వచ్చితిరొకో సంపత్ప్రభం జెందె మ
ద్ధామం బిప్పుడు తావకాంఘ్రిజలజాతద్వంద్వసంస్పృష్టిచే
నామోదంబు వహించె నీనిఖిలభక్తానీకచిత్తంబు లా
హా! మాభాగ్యవిశేష మింత యని శక్యంబౌనె? వాక్రుచ్చఁగన్. 5

క. అని సన్నుతించుచెన్న,య్యనుఁ గన్గొని మాదిరాజు హర్షముతో ని
ట్లనియెవినుమీమహాత్ముని, యనఘచరిత్రంబు దెలుపుదంతయువరుసన్.

తే. ఆత్మశృంగారకలనచే నలకనలకఁ, జేసి శ్రీనాగులూరు ప్రసిద్ధిగాంచె
నప్పురంబునకధిపతియైయితండు, పెంపుమీఱఁగభూమిపాలించుచుండి,

క. అష్టోత్తరశతభార్యా
హృష్టుండై తన్ను భక్తు లేమడిగిన సం
తుష్టిగ నొసఁగెడు నియమము
కష్టతరం బనక యితఁడు గైకొనియుండెన్. 8

వ. ఇట్లుండి. 9

చ. ఎడనెడ జంగమోత్కరము లెంతయు వేఁడిన నూటయేడ్వురం
బడఁతుల నివ్వఁ జిక్కె నొకభామిని దానిని గూడ నిచ్చునో
పుడమిమగం డటంచు హితపుంజము రాజు నెఱుంగనీక యొ
ల్లెడ ధర భూమిభర్తకిఁక నింతులు లే రనిపించె నంతటన్. 10

క. నారదుఁడు గానశాస్త్రవి
శారదుఁడు సమస్తవిబుధజాలశిఖాభృ
న్నీరదుఁ డీశ్వరచింతా
పారదుఁ డొకనాఁడు శర్వభజనోత్సుకుఁడై. 11

శా. కైలాసంబున కేగి పారిషద వాక్కాంతాచ్యుతాదిత్య ది
క్పాలాంభోజహితామృతాంశు ఖగరా డ్గంధర్వ విద్యాధర
వ్యాళాధీశ్వర సిద్ధ సాధ్య నిగమవ్రాతంబులుం గొల్వఁగా
బ్రాలేయాచలకన్యకాసహితుఁడై భాసిల్లు సర్వేశ్వరున్. 12

ఉ. చూచి నమస్కరించి శ్రుతిసూక్తుల సన్నుతిసేయ వానితో
బూచులఱేఁడు పల్కె మునిపుంగవ! లోకములోనిచర్య లె
ట్లై చనుచున్న వే! భువన మారసి వచ్చితి విప్ప డన్న నో
మేచకకంఠ! యొక్కగతి మేదిని గాంచితిఁ జిత్తగింపవే. 13

ఉ. రాజితనాగలూరినగరంబునఁ గూకద మారయాఖ్య గో
త్రాజనపాలుఁ డాత్మవనితాతిలకంబుల నూటయేడ్వురన్
వ్యాజము లేక భక్తనివహంబుల కిచ్చినఁ జిక్కె నొక్కయం
భోజదళాక్షి వేఁడుగణపుంజము రాకయె రాజుకూర్మినో. 14

క. అని యిట్లు దెలిపి కలహా
శనముని యొకకొంతవడికిఁ జంద్రార్ధకిరీ
టుని వీడుకొని నిజేచ్ఛం
జనియెం దదనంతరమున సర్వంసహపై. 15

సీ. కలకంఠములు నోరుకాయకఁగ వడిఁ గుయ్యఁ
బమ్మినయిలమీఁది తెమ్మ దియ్యఁ
బరిమళసుమఫలభరముచేఁ దరు లొప్పఁ
దేఁటుదాఁటులమ్రోఁత దెసలఁ గప్పఁ
గుసుమాయుధుఁడు పుష్పకోదండము ధరింప
వలిగాడ్పుపుప్పొడి వసుధ నింప
శారికాశుకహంససంచారములు మీఱఁ
బూఁదేనెసోనలు పొంగిజాఱ
తే. జాతి గడుఁ గుందఁ బాంథులు ఖేతి నొంద
జీర్ణపర్ణాళి రాల లేఁజిగురు గ్రాల
మంచు తెఱవీడ శృంగారమహిమతోడ
జగతిఁ దగెఁ గాంతవాసంతసమయ మంత. 16

వ. అట్టి మధుమాసదివసంబులయం దొక్కనాఁడు. 17

క. ఆరాజు భక్తిఁ జూడఁగఁ, గోరి మహావృద్ధభక్తకుంజరతనుఁడై
శ్రీరమ్యంబగుతత్పురిఁ, జేరఁగ నేతెంచి రాజశేఖరుఁ డంతన్. 18

సీ. చని యప్పురముఁ జొచ్చి తనముది మేర్పడఁ
గోల చేబిగఁ బూని తూలికొనుచు
గోడనీడలఁ జేరి కూర్చుండఁ గోరుచు
నకట! మహాదేవ! యని పలుకుచు
బారెఁడు చనువెను బడలికచే వంగి
మోఁకాళ్లపైఁ గేలు మోపికొనుచుఁ
బిఱిదెస నెవ్వరైనఁ బిలిచిరో యని నిల్చి
బయ లాలకించి విభ్రాంతి గొనుచుఁ
తే. జుట్టుకొని నవ్వుచిఱుతలఁ దిట్టుకొనుచు
నెండ కడ్డముగాఁ దాళవృంత మిడుచుఁ
బనికిమాలినజీవితమునకు విసిగి
నృపునిసభఁ జేర నరిగి తన్నికటమునను. 19

చ. దలముగ వేఁడియూర్పు లెగఁదట్టఁగఁ జెమ్మట లూర భూమిపై
నలసతఁ గూరుచున్న శరణాగ్రణిఁ గన్గొని రాజమౌళి బె

గ్గిలి భయ మంది లేచి చని కేవలభక్తి నమస్కరించి యా
యలఘుఁడు చాల డస్సెఁ గద నా!యని నెమ్మదినార్తి నొందుచున్.

సీ. ఆతపహరణార్థమప్పుడప్పటువితానము లేయఁబంచి వెంట నెసుమాంబు
వులు పైనఁ జిలికి కప్పురముపీనులనూఁది మేలిచందన మెకమెగి తాళ
వృంతంబు చేఁ బూని విసరి జంబీరనాగరమిశ్రతక్రంబు హరసమర్ప
ణము చేసి యింతింత నాలుక ద్రవ మూరఁ బట్టినకొంత సేపటకి సేద

తే. దేఱి చరమూర్తి కన్నులు దెఱచి వినయ
భరితుఁ డగు రాజుఁ గనుఁగొని భళిర! పార్థి
వేంద్ర! నీభక్తి వన్నియ కెక్క మమ్ముఁ
బోలుబడుగులఁ బ్రోవంగఁ బుట్టి తౌర!. 21

తే. బాపురే! యార! విమలసద్భక్తిపూర!
నిన్నుఁ బోలంగఁ గలరె? యేనృపతులైన
సకలజగములు నిండెఁ దావకసమాఖ్య
యనినఁ గ్రమ్మఱ మ్రొక్కి యయ్యవనివిభుఁడు. 22

చ. చపలుఁడ దుష్టవర్తనుఁడ శౌర్యగతాత్ముఁడ దుర్మదాంధుఁడన్
గుపితుఁడ లోభదూషితుఁడఁ గ్రూరుఁడ దంభుఁడ భక్తిహీనుఁడన్
వ్యపగతసత్యవాక్యుఁడ దయారహితాత్ముఁడ నైననన్ను నీ
విపు డిటు సన్నుతింప నగునే? శరణాగ్రణి! యన్న నవ్వుచున్. 23

ఉ. నూకదమార! యాత్మనుతి గూడదు భక్తుల కన్న నీతిచే
నీకరణి న్వచించి తిపు డింతియె కాని భవత్సమానుఁ డే
లోకమునందు నెంచినఁ గలుంగఁగ నేర్చునె? దీనలోకర
క్షాకర! నిన్నుఁ గాంచితి హృదబ్జము సంతస మందె నెంతయున్.

ఉ. మారవిరోధిభక్తులకు మాటున దాఁచక యగ్నిసాక్షిగాఁ
గోరి వరించుభామినులఁ గొంకక కొమ్మని యిచ్చువార లీ
ధారుణి లేరు నీ వొకఁడు దప్ప నహా! యిటు లుండఁ జెల్లదే!
సారవివేకధైర్యగుణసాహసముల్ శివభక్తకోటికిన్. 25

ఉ. ఇంతుల నిచ్చుమారఁ డని యే మును చాలఁగ విన్నవాఁడనై
సంతస మంది వృద్ధవశ సంభవ మైనది గాన నిట్టిచోఁ
జెంతల సేవసేయుటకుఁ జేడియ యొక్కతె యొప్పు నంచు నే

నెంతయుఁ గోరి వచ్చి తిట నింతులు లేరని వింటి నీ కిఁకన్. 26

క. వినియును భక్తిగుణాఢ్యుఁడ
వని నినుఁ గనువాంఛ నిచటి కరుదెంచితి నా
కనుఁదమ్ము లలరె నే నిఁకఁ
బనివిని యెద నన్న జడిసి పార్థివుఁ డనియెన్. 27

తే. అనఘ! జంగమవర్య! మదాలయమున
కరుగుదెంచి శివార్చన మాచరింప
కెటులఁ బోవచ్చు నీవేళ నిందు నిలువుఁ
డన్నిపనులు విచారింత మవల ననిన. 28

క. భార్యారహితుఁడు సేయుస,పర్యానివహంబు గొనఁగవలదని ధరలో
నార్యులుపలుకఁగవినియును,మర్యాదయెపూజగొనఁగమాకిటనీచేన్.

వ. అనిన భూవరుం డిట్లనియె. 30

క. స్వామీ! యున్నది యింకొక
కామిని మీదాసి కరుణఁ గాంచి సపర్యా
స్తోమము గైకొని మామక
ధామము పూతంబు సేయ ధన్యుఁడ నగుదున్. 31

క. నావుడు మును భక్తాలికి, నీవెలఁదుల నిచ్చియుండ నెలఁతుక గలదం
చీవనిన నెట్లు నమ్ముదు, భూవర!మిథ్యోక్తులాడఁబొసఁగు నెయనినన్.

ఉ. శరణవరేణ్యా! నాపలుకు సత్యముగా నొకయింతిమాత్రమే
యొరు లడుగంగ రాకునికి నున్నది కామిని లేనియట్టియా
పురుషుఁడు చేయునట్టి చరపూజ యనర్హమటంచుఁ జిత్తమం
దరయక రమ్ము మామకగృహాంతరసీమకు వేగ నావుడున్. 33

ఉ. పక్కున నవ్వి యాకపటభక్తవరుండును నీదుభక్తి పెం
పెక్కు జగంబు మెచ్చఁ జరియించితి వింతియె కాని లోపలం
జిక్కినయాసపెంపు విడిచేయఁగఁజాలవు లోభవృత్తి నీ
కెక్కడ సంభవించెఁ బరమేశ్వరుఁ డీగతి కిచ్చు మెచ్చునే?. 34

ఆ. అసిమిలోనిదొకటి యమ్మెడుదొక్కటి,యనినచందమయ్యె నవనినాథ!
భార్యదాఁచి యింకఁ బడఁతులు లేరని,చాటఁబనిచితౌర జగతియందు.

క. గుఱియిడి పరువెత్తుదు నని, పఱిఁజేరఁగ వ్రేలెడంత తక్కువ యైనం

గొఱఁతయకా దేయించుక, తఱిఁగిననియమంబు మోక్షదంబగునె? నృపా!

క. భూమిని మును న్నాటలువడి, నోములునోకరంబువలనస్న్యానంబగు సో
మోమాన్వయదీపక! నీ, భార్యమిక మీకుఁ దెలిసె వేయుఁ బలుకఁగ నేలా?

వ. అనిన మానవేంద్రుం డయ్యా! తొయ్యలిం డాఁచియుంచితినని పెక్కు
భంగు లాసతిచ్చితి రీవాక్యంబు లస్మద్బుద్ధిసంపాదనహేతుకంబులు
గాని నన్ను నిరాకరించుట గాదు భవత్సన్నిధానంబున నాగుణదో
షంబు లున్నట్లు విన్నవించెద మన్ననచే నవధరింపవలయు నాకుఁ గల
లలనాజనంబు లందఱు మహేశ్వరాధీను లైనకతంబున నియ్యింతి
యుండు టెఱుంగక లోకంబునజనంబులు రాజునకిఁక భార్యలు లేరను
కొని రింతియె కాని గణాధీశ్వరు లరుదెంచి చంచలాక్షి నర్థించుటయు
నేను నాయెడ లేదని యసిచిప్పుచ్చుటయు లేదిప్పుడు మీ రేగుదెంచి
కాంక్షించితిరి గావున సమర్పించెద దానిం గైకొని నన్నుఁ గృతా
ర్థునిం జేయు మనిన నమ్మహానాజంగముం డిట్లనియె. 38

సీ. అను వైనసతు లెల్ల నయ్యలపాలుగాఁ
గొఱమాలి చిక్కినకుటిలమతియొ
మాటసూ టెఱుఁగదో నోటిగయ్యాళియో
యాచారహీనయో యేఁస్థురాలొ
పనివంజయో యింటిబానిసబిడ్డయో
వెఱ్ఱిచెద్దినులదో చిఱ్ఱగొట్టొ
తెవులు గొట్టియొ వైసుదీఱినమేసిదో
యోజమాలినదియో బీజుగొట్టొ

తే. యెవ్వరికి నక్కఱకురాని యిగురుఁబోఁడి
బోర మల్లన్న పాలన్న పోల్కి మా కొ
సంగఁ దలఁచితివొఁ జాలుఁ జాలు నీప్ర
సంగ మటు లుండనిమ్ము రసాతలేశ! 39

ఉ. నావుడు స్వామి! యీయవగుణంబులలో నొకటైన లేదు త
జ్జీవనదాభవేణియెడ శ్రీకర సర్వగుణాభిరామ దీ
నావనశీల జంగమపదాంబుజభక్తివినిశ్చలాత్మ దే
వావలి కైన దానిఁ గొనియాడఁ దరంబె? యటండ్రు లోకముల్. 40

క. జంగముఁ డిట్లను వర్తకుఁ, డంగడి నమ్మంగఁ జిక్కినది యిద్దేపో
రంగైనవస్తు వన్న, ట్లంగన బల్మంచిదనుట కక్కజ మయ్యెన్. 41

క. నెలఁతుక యిలఁ గల చెలువల,తలసొమ్మని మమ్ముదలఁదగిలింపకు మీ
పలుకులుఫలవలివేణుల,కులమెక్కడభక్తియెచటఁ?గువలయనాథా.

వ. అనిన రా జిట్లనియె. 43

ఉ. ఏల నిరాకరించెద? రహీనగుణాకర మైనబాలికా
మౌళిని వేఁడునట్టిచరమాన్యున కాత్మశరీరకృత్తికిఁ
వాలున నొల్చి తీసి చెలువంబుగఁ జెప్పులు మల్చి యిత్తునో
కాలగళస్వరూప! సముఖంబున నేటికి? రాయబారముల్. 44

చ. అటు గొనిపోయి యొక్కమణిహర్మ్యతలంబున హీరరత్నసం
ఘటితసువర్ణపీఠమునఁ గాయజసంహరుమూర్తి నుంచి హృ
త్పుటగతసమ్మదంబు వెలిఁ బొంగఁగ నాత్మసతీలలామ న
చ్చటి కొకచేడెచేతను వెసం బిలిపించెను దత్క్షణంబునన్. 45

ఉ. అందెలు మ్రోయ లేఁతనగ వచ్చుపువెన్నెల గాయ మోముడాల్
చందురు నింద సేయ బిగిచన్గవ యద్రులతోడ రాయ మై
కుందనమింపు రోయ జడకూఁకటి చీఁకటిచాయ మూయ నా
చందనగంధి వచ్చె విభుచక్కికి సిబ్బితి యాముతింపఁగాన్. 45

క. చనుదెంచి విభునిభావము, కనుసన్నం దెలిసి శరణకంఠీరవన
ద్వనజాతములకు వందన,మొనరిచి భయభక్తులమర నుగ్మలిపలికెన్.

ఉ. ఓమహితప్రభావగుణ! యోకరుణాజలరాశి! యోగురు
స్వామి! యజాదిదేవతలు సన్నుతి సేయఁగలేనియట్టి మీ
కోమలపాదపద్మము లకుంఠితభక్తి నుతింపఁగాఁ దరం
బే? మముఁబోలువారి కని భీతమృగాయతనేత్ర క్రమ్మఱన్. 48

తే. మీకువెలుఁగుబొక్కి చెఱకునఁ గలరుచి
మూఁగ శబ్దవిధము గ్రహింప
లేనిపగిదిఁ దావకీనపదాంభోజ
భక్తి దెలియ నాకు శక్తి గలదె?. 49

చ. సిరుఁ బొందగంటి హృత్ప్రియు నీకడఁ [illegible] గంటిఁ క్రమ్మఱన్
జననము వీడఁ గంటి సరసంబుగ ముక్తికిఁ ద్రోవఁ గంటిఁ బా

వనతరజంగమావలికృపాపరిపూర్ణతఁ గంటిఁ దొల్లి చే
సినసుకృతంబు లీయెడలఁ జేకుఱఁ గంటిని మంటి నెంతయున్. 50

వ. అనిన జంగమవర్యుం డి ట్లనియె. 51

ఉ. పోయెడివాని నన్ను నట పోవఁగనీక భవద్వరుండు తాఁ
దీయనిమాట లొప్ప ననుఁ దెచ్చె మదంబుజపాణి వేడినం
గాయజవైరిభక్తునకుఁ గాయము చర్మము నొల్చి సంబవుల్
సేయఁగఁ జాలుదయ్య యిఁకఁ జెచ్చెర రమ్మనియంచుఁ జెప్పుచున్.

చ. జనవరుఁ డాత్మమోహవివశత్వమునందున భార్య నింతగా
ఘనతరఁ జేసి గాక మును గంటిమె? వింటిమె? యిట్టిధైర్యవ
ర్తనల నటంచు నెంచియును దక్ష్యము గాంచఁ దలంచి వచ్చితిన్
వనరుహపాణి! నీవినయవైఖరిఁ జూడఁగఁ జాలు దంతకున్. 53

వ. అనిన సవ్వధూవతంసం బి ట్లనియె. 54

సీ. వాదించి గురువింట వైచునారిదె కాక కలుగునే? యమ్మున కలుషశక్తి
సూటిగానాడించుసూత్రధారిదె కాక జంత్రంబునకు నాట్యశక్తిగలదె?
త్రిప్పుకులాలునిదే కాక దారుచక్రమునకుఁ గలుగునే? భ్రమణశక్తి
గిరిదరిఁ బల్కఁ బల్కించువారిదె కాక గుహలకుఁ గల్గునే? కూయుశక్తి

తే. యటులఁ దావకకరుణ నాయందు నిలిచి
త్రిప్పినట్టివిధంబునఁ దిరుగుదానఁ
గాన సద్భక్తి నడుచుమార్గం బెలుంగఁ
బరమశరణాగ్రగణ్య! యోగురువరేణ్య!. 55

వ. అని మఱియును. 56

చ. కటకట! యిట్టివేసవిని గాల్నడఁ గంటకశర్కరావృతో
త్కటపథదూరభూమిఁ దిరుగం బని యంతటి దేమి వచ్చె? మి
క్కటముగఁ గానుపించె నరకాళ్లను బొబ్బలు బాదరక్ష లే
మిటికిఁ దొడంగరైతి? రని మానవిలోచన పల్కెఁ బల్కినన్. 57

చ. అలికులనీలవేణి! భవి నంటని నేమము మాకు భూమిలో
పలిపశుజాల మెల్ల భవివర్గము కానఁ దదీయకృత్తిచే
మలచినయట్టిసంబవులు మెట్టుదు మే సరణిన్? శ్రమంబు మె
క్కలముగ నెంత దోఁచినను గాయసుఖంబున కంతమున్నదే!. 58

ఉ. చిక్కినవారికే వగలఁ జెందుదు నింతియె కాని మున్ను మా
కెక్కడ నెవ్వరు న్నగవ రెన్నఁడు నీ విపు డార్తి నొంది మా
పొక్కులు గాంచి పొక్కెదవు భూతదయారస వేమి చెప్ప నో
చక్కెరబొమ్మ! నీపలుకుచందము డెందముకుందుఁ బాపెడున్. 59

తే. పలికితివి చాల చల్లనిభాషణములు
వింటి మిప్పుడ చెవులకు విందు లయ్యెఁ
బలికినట్లన యుండునో భావశుద్ధి
కలన వేఱయి యుండునో తెలియదయ్యె. 60

వ. అనిన నయ్యతివ యి ట్లనియె. 61

సీ. నిర్వంచకస్థితి శర్వభక్తాళికిఁ దనుమనోధనములు దాఁచఁబోక
యొసఁగుచు సద్భక్తి నుండెడువారికి శీతలకరమౌళి చిక్కుఁగాక
తక్కులు విద్దెలుదంభంబుపామరత్వముకామకపటవర్తనము లాదవు
వారిచేఁ జిక్కకవాఙ్మనఃకాయకర్మములు వేఱుగఁజేసి యమృతపదముఁ

తే. బాయఁజాలుదు నయ్య! యిప్పట్టునందుఁ
దెలిసి యుండియు నాడంగవలసి యిట్టు
లాడితిరి నామది పరీక్షఁ జూడవలయు
నని తలంచినఁ జూడుఁ డోయకలుషాత్మ!. 62

చ. అనవుడతండు పల్కె 'వనితా! ఘనరూపముఁ గాంచి యెంత లోఁ?
తన దగుదానిలో నడిగి యందలిమ న్నొకముద్దఁ జైనఁ దేఁ
జనఁ' డనుమాడ్కి భార్తికవచస్సముదాయముఁ జూపవచ్చుఁ గా
ని నడువ శక్యమే? యనిన నీరజలోచన ధీరచిత్త యై. 63

క. తనపతిఁ గని యీఘనుప,ద్వనజాతములకు మదీయతనుచర్మము గొ
బ్బున నొల్చిమల్చి సంబవుఁలొనరిచి యిమ్మనిన నమ్మదోన్నతమతియై.

గీ. సాహసము మీఱ సతిపై,మోహంబించుకయు లేక ముఖమునధైర్యో
త్సాహములుదోఁపఖడ్గము,బాహువునమర్పశరణవల్లభుఁ డనియెన్.

ఉ. మందున కాకు దెమ్మనిన మ్రానిమొదల్ దెగఁజూచి నట్లు గో
రం దగఁ జీరుదాసిని గరంబున గొడ్డలి గొన్న యట్లు నీ
వందితి కత్తి సంబవులకై సతిఁ జంపఁ దలంచినాఁడవో!
యెందున దుర్మదాంధులు మహీపతు లన్న విధంబు గన్పడెన్. 66

తే. ఇంతద్రోహుల మైతిమే యింతిఁ జంపఁ
బంపఁ బెండ్లికుమారుఁడు వఱదపోవ
గౌరికళ్యాణములు పాడుకరణి యయ్యె
మేము సుఖ మంద దలఁచుట మేదినీశ!. 67

చ. జనవర! మాకు సంబవు లొసంగెడువాఁడవ యేని నీగతిన్
ఘనముగ రద్ది గానియక కామినిఁ జేరఁగనీక మమ్ములం
గనుఁగొననీక చాటునకుఁ గైకొనిపోయి తదంగకృత్తి మె
ల్లన వదలించి మల్చి యకలంకమతిం గొనితెమ్ము పూనెదన్. 68

మ. అనినన్ భూపతి మ్రొక్కి దేవ! భవదీయాభీష్ట మెట్లైన నే
నొనరం జేయుదు యామమాత్ర మిట మీ రుండుండు పూనెజ్జపై
నని య ట్లాతని నుంచి కాంతయును దా నభ్యంతరావాస మొ
య్యనఁ జేరం జని హస్తకల్పితకృపాణాగ్రంబున న్నేర్పునన్. 69

క. అక్కాంతవీఁపుచర్మము, గ్రక్కున నాజంగమయ్య కాళ్లాదికి రా
నొక్కింత దిగిచి సంబవు, లక్కజముగఁ గూర్చిపైఁడిహరివారణమున్.

క. జతనముగ నుంచి భస్మస, హితతాంబూలంబుగొనుచు నెంతయుభక్తిం
గుతలపతిమాళినిడియది, యతిరయమున దెచ్చియుంచె నాతని యెదుటన్.

మ. ఉనిచినఁ గాంచి యోనృపకులోత్తమ! మా కనుమానమయ్యె నీ
పనిజనుఁ డైన నింతవడిఁ బన్నఁగ నేర్చునె? మున్ను నీగృహం
బున నివి యున్న వేమొ మసిబూసివి నేఁ డెఱుకాయ లన్న భూ
జనములు మెత్తురే? కొనుము సంబవు లే లిఁకఁ బోయివచ్చెదన్. 72

ఉ. నావుడు భీతి నొంది నరనాథుఁడు పల్కు మహాత్మ! నేఁడు నీ
సేవకురాలిచర్మమునఁ జేసితి నింతియె కాని మున్ను మా
తావున మీ కొసంగుటకుఁ దాఁచినవాఁడను గాను సర్వభూ
తావలి సాక్షి నమ్ము విడనాడకు సన్ననినాతఁ డుగ్రుఁడై. 73

చ. పుడమిమగండ నీనుడువు పొందయిన న్నిజకాంతచర్మ మే
కడఁ దెగఁగోసినావొ యది కన్గొనెదం దరుణీలలామ యు
న్నెడ కిటు రమ్ము పోద మని యెంతయు సత్వరవృత్తిఁ బల్కినం
దడయక యయ్యెఁ దోడికొని తాఁ జని మూర్ఛమునుంగు కామినిన్.

సీ.అతనికిజూపియోయంగన! చరమూర్తియరుదెంచినాఁడు లెమ్మనినయంత
గనువిచ్చి తెప్పిటి కరములు మోఁకాళ్ళపై నూనితనుభరమూని వెన్ను
వెనుకకు విటిచి యా ఘనునిగటాక్షవీక్షణముననునుపటికరణిఁజర్మ
మలరిపొంపెక్కు దేహముగల్గిలేచియాత్మాంఘ్రిలకెఱఁగినయతివఁగాంచి
తే. పార్థివునితోడననియెనీపద్మగంధి, మేనుగోసినజాడయేమియునుగాన
రాకయున్నదినీమాటమాకుఁదెలిసె, నెన్నివిధములనీనైజమేలమాను?
క. కోకిలతో సరి యగునే? కాకము? వజ్రంబుసాటి గనునే పటికం
బాకరణి భక్తవర్యా, నీకముతో నీవు పోలఁ నేర్తువె? యధిపా!.
చ. పొలఁతులమిన్న సర్వగుణపూర్ణ యటం చనురక్తి నొంది నీ
జలజదళాక్షి నయ్యల కొసంగక డాఁచినవాఁడ విప్ప డె
ట్టులఁ దదనూనచర్మము కటుక్కునఁ గోసెద వింతమాత్రముం
దెలియనివాఁడఁగాఁ దలఁచితే ననుఁ జాలు మహీశ! నావుడున్. 77
ఉ. నాతిని డాఁచినాఁడ వని నాయెడ నేరము పూన్పఁబోకుఁడీ
యాతటి నీవు చూడ రచియించెదఁ జర్మముఁ గోసి సంబవుల్
భూతపతిస్వరూప యని బోటిని డగ్గఱి కృత్తి యొల్వఁగాఁ
జేత నిశాతహేతి నతిశీఘ్రముగాఁ గొనినంతలోపలన్. 78
వ. ఆజంగమరూపంబు విడనాడి మహాదేవుండు. 79
సీ. ఒకకేల మొనవాలు సికపట్టి వినుజాలు
మొలతోలు నెమ్మేనఁ దెలుపుడాలు
చేతఁ గంకటితుండు చెంప జాబిలిచెండు
గొడల జేజేపిండు జడలదిండు
గుదిగొన్న మెడఁ గప్పు నుదుట ప్రేలెడునిప్పు
కనికరంబుననొప్పు కనుల మెప్పు
చెలువైనసామేన నలరెడుగనుచాన
పలుకు తేనియసోన నలువులీన
తే. వెండికొండఁ బోలువెలగిత్తపై నెక్కి, బాసవాలుగములుబలసికొలువ
నాకసంబుపుడమి నలమిన వెలుఁగునఁ, గాన నయ్యె దేసికంటివేల్పు.
తే. ఇట్లుప్రత్యక్షమైనసర్వేశ్వరునకు, బుడమిసాష్టాఙ్గమెరగియాభూమిభర్త
ఫాలతలమునఁ గెంగేలుగీలుకొల్పి, యధికసద్భక్తియుక్తినిట్లనినుతించె.

ద్విపదగర్భసీసము.—

శ్రీపార్వతీలోల! శ్రీజనపాల పాపాబ్ధివాతూల! భక్తానుకూల!
పన్నగాధిపహార! పాండుశరీర! సన్నుతసురవార! జననవిదూర!
నందీశకంఠాణ! నాట్యధురీణ! వందారుసంత్రాణ! వసనిధితూణ!
భర్మాద్రికోదండ! పాలితాజాండ! నిర్మలగుణకాండ! నిర్భావదండ!

తే. యక్షనాయకమిత్ర! హవ్యాసినేత్ర!, శిక్షితాసురగోత్ర! ఓన్మోక్షసత్ర!
మేశసంభవభంగ! పృథ్వీశతాంగ!, పాశమోచనచెంగ! పద్మేశసంగ!

వ. అని యిట్లు సన్నుతించు భూవల్లభుం గనుగొని దయారసభరితాం
తరంగుం డై యాలతాకుంతాంతకుం డిట్లనియె. 83

ఉ. రాజకులావతంస! యపురా! దృఢచిత్తుఁడ వీవె యెన్నఁగా
నీజగమందు నీకు సరి యెవ్వరు? నీరమణీలలామ యా
నీజలజాక్షిధైర్యగతి యేమని చెప్పఁగ వచ్చు? మాహృదం
భోజము విప్పునం దనరె భూనుత! తావకభక్తి కెంతయున్. 84

తే. ఐన నొకమాట దెలిపెద నవనినాథ!
కామభోగానుభవములఁ గాంత నీవు
పేర్మిఁ గొన్నాళ్లువర్తించి పిదప నాగ
మాంబికాసుతుఁ డుండుకళ్యాణమునకు. 85

మ. చని యా శైవధురీణుఁ గాంచి సకలాశాంతతాయాతభ
క్తనికాయాభవతత్త్వగోష్ఠి మది నుత్సాహంబుతో నెప్పుడున్
వినుచుం దద్విమలప్రసాద మచట న్వేమారు సంతృప్తిగాఁ
గొనుచుం గొండొకకాల ముండి తుది న న్గూడంగ రమ్మా వెసన్. 86

శా. ఆరీతి న్గిరిజాధినాథుఁడు నదృశ్యాకారుఁ డై నంతటన్
నారీరత్నముతోడ నద్భుతమనోనాళీకుఁడై స్వామిసా
కారుండై పొడచూపి మోక్ష మెడఁ గాఁగం గొంతకాలంబు సం
సారభ్రాంతి దగిల్చెఁగా యని జుగుప్సం జెందె రా జత్తఱిన్. 87

చ. నిజగురుమూర్తి కేవలవినీలగళాపరమూర్తి చక్రిపం
కజభవముఖ్యనిర్జరనికాయనుతామలకీర్తి సేవక
వ్రజహృదయానువర్తి ఘనభక్తసముచ్చయచక్రవర్తి శి
ష్యజనమనుప్రబోధవిలసద్గుణపూర్తి విలాస మొప్పఁగన్. 88

మ. చనుదేరం బొడగాంచి భక్తి నెదురై సర్వంసహానాథుఁ డం
గనయుం దాను నమస్కరించి కడువేడ్కం బ్రేమఁ దోడ్తెచ్చి యొ
య్యన రత్నోన్నతపీఠిపై నునిచి యర్ఘ్యాదిప్రపూజావిధుల్
దనరం జేయుచు స్వాగతం బరసి చిత్తం బూనఁగా నిట్లనున్. 89

ఉ. దేవ! మహానుభావ! భవదీయమహామహిమం బదెట్టిదో
భావజవైరివృద్ధతరభక్తవరాకృతి దాల్చి వచ్చి మ
ద్భావపరీక్ష చేసి పరివారముతోఁ దనరూపు చూపి సౌ
ఖ్యావహయాత్మావనంబు ద్వీపదంతకఖడ్గము నిచ్చె మెచ్చుగాన్. 90

తే. ఇచ్చి నిజపథసంప్రాప్తి కెడము పెట్టి
చనియె గురుసార్వభౌమ! యీచంద్రవదన
ధైర్యవిస్ఫూర్తివలన నహార్యచాప
దర్శనం బయ్యె నేఁడు నాతపము పండె. [రుదా?

క.అనవుడు గురుఁడనునది యొక, ఘనమా? భక్తులను శివుఁడుగనుపడుట
మునుకుమ్మరగుండయ్యకు, తనరూపము చూపివయసునయ సేయఁడొకో?

క మానినిధైర్యము పెద్దగఁ, బూని వచించెదవుతొంటిపాలఁతులలోని
చానసరియగునె భక్తిని, ధానంబున కనిన జడిసిధరణీపుఁడనియెన్.23

క. ఎఱుఁగక యిటుగొనియాడితిఁ, దెఱపనునాతప్పుసైఁచి దేహమ్మును బెం
పఱముగఁ దరుణులుభక్తిం, జఱపినవిధమానతిమ్ము సంశయ మెడలన్.

వ. అనినఁ దద్దేశికశ్రేష్ఠుం డిట్లనియె. 95

ఉ. శంబరవైరివైరిపదసారసభక్తగణార్చనక్రమా
లంబనితాంతకల్మషకలాపమహోన్నతభూతధాత్రిభృ
చ్ఛంబ సమస్తలోకనుతసత్యవచోనికురంబ వీరసం
గాంబ యనంగ నొక్కసతి యంచితవృత్తిఁ దనర్చు నంతయున్.96

ఉ. ఆతరుణీలలామ పతి యంబరకేశునిఁ జెందుపిమ్మటన్
బాతకదూరసద్గురుకృపాకలనంబున భక్తిచిత్తయై
ఖ్యాతి జనింపఁగా కదురు కాయక మూని తదీయలబ్ధిచేఁ
బ్రీతిగ నేవురయ్యలకుఁ బెట్టు నిరంతర మిష్టితాన్నముల్. 97

వీరసంగాంబ కథ.

చ. ఇది వ్రత మూని సల్పుతరలేక్షణభావవివేచనార్థమై

మదనవిరోధి యామగువమందిరసీమకు జంగమాకృతిం
గదిసినఁ గాంచి మ్రొక్కి కుతుకంబునఁ బూజ లొనర్చి షడ్రసా
స్పదమగుభోజనం బిడిన సంతస మొప్ప భుజించి యంతటన్. 98

చ. పడఁతిరో! నిత్య మైదుగురుభక్తుల కన్న మొసంగి కాని వే
కుడువవు నీగృహంబునను గుమ్ములు గాదెలు లేవు నీకడం
గొడుకులు లేరు తెచ్చియిడఁ గూలి యొనర్చిన నీదుపొట్ట కే
గడుచుట దుర్లభంబు దిసకాయక మెట్టిదొ మాకుఁ దెల్పుమా. 99

వ. అనిన నాసతి యి ట్లనియె. 100

క. కలిమికిఁ గారణంబు బలుగాదెలుగుమ్ములు గావు నీదుస
జ్జలరుహాభక్తి గాని యిది చాలఁగఁ గల్గినఁ గల్మి లేనిచోఁ
బలితపు లేనిచూడ క్షణభంగురమై చను మేటిభాగ్యముం
దలఁతు రె దొడ్డుగా జగతిఁ దావకభక్తులు మానసంబునన్. 101

వ. అని మఱియును. 102

చ. అనుపమమైన మద్గురునియానతి భక్తిగణార్చనార్థమై
ఘనతరభక్తి నీకదురు కాయక మొక్కటి పూని దీనిచే
ననుదిన మస్మదీయనియమాచరణం బొనఁగూడఁ జేతు నో
యనఘతరాత్మ! యంచు వినయంబునఁ బల్కిన నాతఁడిట్లనున్. 103

క. కాయకము దలఁపఁ గొంచెము, పాయకనీసేయుచున్న భక్తార్చలకా
దాయము చాలదు దినగతి, యేయనవునజరుగునసిననింతియతనితోన్.

చ. ఉరుతరపుణ్య! మీ రెఱిఁగియుండియుఁ బల్కుటచోద్యమయ్యెము
న్నరణులు కొద్దికాయకమున న్బహుజంగమపూజ సల్పరే?
ధరణి నటన్న నప్పగిదిఁ దప్పక చేసినవార లెవ్వరో
తరుణి వచింపుమా యనినఁ దచ్చరణాగ్రణి కాపె యి ట్లనున్. 105

చక్కిమాచయ్య కథ.

శా. ము న్నొక్కండు పయోజగర్భబలభిన్ముఖ్యామరానీకను
త్యానన్తాశ్రయపాదచంద్రధరగేహస్వాంతపద్ముండు వి
చ్ఛిన్నాఘుండు సమస్తలోకజనతాసేవ్యుండు నా చక్కిమా
దన్నాఖ్యుండు గలండు జంగమపదార్చాసక్తుఁ డిద్ధారుణిన్. 106

ఉ. ఆతఁడు భక్తి నిత్యము గణాలయసీమలి కేగి తత్సతీ

జాతము దంప ఱోల్లకడ జాతినబియ్యము చేరెం డేరి సం
ప్రీతి దలిర్పం దెచ్చి తనప్రేయసి కిచ్చిన నాపె వానిపై
భూతి వినల్చి మొక్క-బలుపుట్టికలో నిడి యాక్షణంబునన్. 107

క. గురుకృపచే నక్షయమై, పరగినబియ్యంబు వండి భవభక్తసము
త్కరమునకు నన్న మొసంగుచు,వరతరకల్యాణపురిని భాసిలునంతన్.

చ. బసవండు తత్క్రమం బెఱింగి భక్తుల నంపఱిం బిల్వ బంచి మీ
బసలకు వచ్చి మొక్క-శివభక్తుం డులూఖల మున్న భూస్థలి
న్ముసలవికీర్ణ ధాన్యకణము ల్గొనిపోవు నతండు రాకము
న్నె సకలమందిరస్థలులు నింపుండు దంపెడుచోట బియ్యముల్. 109

ఉ. ఆపెనుపేదభక్తునకు నంపఱు ముంగలభంగి నీగతిం
బ్రాపానరింప మే లనుచుం బల్కి-న వారలు సమ్మతించి త
ద్రూపిత మట్ల సేయ భవదూరుండు మారండు తొంటిశీతనా
రేపకడం బిరానం జని శ్రీవళుకొత్తం దదంగణంబులన్. 110

క. మెండుగ నుండిన సన్నపు, దండులములు గాంచి బసవదండాధీశా
ఖండకృపామతి నేండిటు, పండువుగా దొరికె ననుచు భావంబలరన్.

ఆ.అచటనున్న జాచియాతండులంబులు,మోయుకొలం దిపెద్దమూటగట్టి
మోంచితెచ్చియింటిముంగిటనిలిచిని,జాంబుజాక్షిబిలువనతిరయమున.

చ. ఎదురుగ వచ్చి బోటి హృదయేశ్వరుమూంపున మూట గాంచి లో
నొదవినభూతిమై ననియె నోగుణభూషణ! నిత్యచర్య చే
వదలితి వేల? చూచి గణసర్గము నవ్వరె? బియ్య మట్ల నేం
డొదులుగ నబ్బె నంచుంగొనుటొప్పునే?తప్పనిదోంచదా యెనే?113

క. జీవము శీలము రెండును, గావటిలోం గుండలట్లు గావున ధరపై
జీవము గలుగక శీలముం, బోవిడంతురె?యింతయాసపొందుట మేలే?

వ. అనిన నతం డి ట్లనియె. 115

ఉ. కామిని నిత్యమై పరగు కాయకలబ్ధియె కాని వారి నే
నేమియు వేండి తెచ్చు టొకయింతయు లేదు శివుం డెఱుంగు నా
నేమము ఱోల్ల చుట్టు కడు నిండుగ నుండంగ శాలితండుల
స్తోమము దండనాథుకృప దొర్లుటగాయని జంగమార్చనై. 116

క. కొనితెచ్చినాండ ననవుడు, వనితామణివలికె వారివసతులలోన

స్మను పెన్నఁడిట్లు చిలికి నె, యనుకొనఁ గావలదె? బియ్యమధికముగ ననినన్.

చ. చిఱుతలు దంప ఱోళ్లకడఁ జిందెనె చూ డిది యేమి వింత యి
త్తెఱఁగున నొల్కఁబోసిరి గదే యని తల్లులఁ బిల్చి వారితో
నెఱుఁగఁగఁ జెప్పఁగావలదె? యేటికిఁ దెచ్చితి విట్టి సేఁతకుఁ
గఱ మెడ వేల్పు తాఁ గరుణ గాంచునొ కాంచఁడొ నీవ యెంచుమా.

మ. అనవుడు నేమియుం బలుక కాతఁడు క్రమ్మఱ వేగ నేగి తా
మునుకొని తెచ్చుచోటుల సమూలముగా నవి చల్లి త్రొంటిలా
గునఁ దనచారెఁ దేరికొని గొబ్బునఁ దే నవి గాంచి మెచ్చి చే
కొని సతి వండి భక్తవరకోటికిఁ బెట్టె మనోహరాన్నముల్. 119

వ. అంత. 120

క. చారునివలనం బసవఁడు, మారనిసతి వల్కినట్టిమాటలు విని నే
నేరనిపని చేసితి నేఁ, డీగతిమై వారిమహిమ మెఱుఁగక యకటా!.

చ. అని మదిలోన నెంచి రయమార గణావలితోడ మారయా
ఖ్యునిగృహ సీమ కేగి వినయోన్నతి మారనిఁ గాంచి మ్రొక్కినం
త నతఁడు భీతిమై సతియుఁ దానునుఁ జాఁగిలి మ్రొక్కి వేనవే
ల్వినతు లొనర్ప భక్తిసమవేశుఁడు శ్రీబసవేశుఁ డిట్లనన్. 122

చ. అనుపమమైన మీవ్రతమహత్త్వ మెఱుంగక పేద లంచుఁ జే
సినయపరాధ మొక్కటి వచించెద భక్తులయిండ్లఱోళ్లదా
పున మునుపంటికంటెఁ బరిపూర్తిగ బియ్యము లబ్బునట్లుగా
నొనరిచినాఁడ మీకరుణ కొయ్యనఁ బాత్రునిఁ జేసి కావరే. 123

చ. అని యిటు వల్కుచున్న బసవాధిపువాక్యము లాలకించి మా
రనిసతి విన్నవించెఁ బ్రభురాయ! దయామతి మీరు మమ్ము సాఁ
క నెనరు పుట్టి చేసితిరి గాని తలంపఁగ నట్లు మేము చే
కొనుటకుఁ జాలువారమె? యకుంఠితమన్నియమంబు దక్కఁగాన్.

ఆ. సద్గతిప్రదాత మద్గురుఁ డిచ్చిన, నియమవృత్తి దప్ప నేఁడు చాల
దొరకె నంచు కొనిన ధూర్జటి మెచ్చునే? పరగ కేగి రాశిఁ బట్టఁజనునె.

క. మీ రెఱుఁగని దేమున్నది, సారదయాహృదయ! దేవసంగన బసవే
శారాధననిరతుం డై, వా రనుపఁగ బసవఁ డాత్మవాసముఁ జెందెన్.

క. ఎప్పటియట్టుల మారఁడు, గప్పురగంధియును దాను గాయకవృత్తిం

దప్పక జంగమపూజన,లొప్పఁగఁ గావించుచుండె నొడయలు మెచ్చన్.

వ. అది గావునఁ గాయకంబు లధికంబు లని స్వల్పం బని యెన్నం బని లేదు సద్గురుకటాక్షంబునఁ గొంచెంబైన నధికం బవు ననిన దరహసిత వదనుండై యతం డవ్వా! నీగురుఁ డిచ్చినకదురు గనుంగొన వేడు కయ్యెడు నది యెట్టిదియొ చూతము తె మ్మనుటయు నట్లు కాక యని యాసంగమాంబ సత్వరంబునం జని రాట్నంబున ధార మా ధారంబుగా నున్న కదురు దివియునంతలోనె పెళక్కున నడిమికిం దునకలైయుండినం గని గుండియ ఝల్లు రన బెండుపడి మూర్ఛ మునింగి కొంతసేపటికిఁ దెలిసి తత్ఖండంబులు హస్తతలంబున నిడి కొని శోకవ్యాకులితచిత్తయై బాష్పజలంబు లురుల నిట్లని విలపించె.

ఆ. ఎదురు లేనిభక్తి చిదురుప గానీక
యదరు బెదరు మదిని గుదురనీక
ముదురకరుణ నన్ను చదురుగాఁ బెసిచెడు
గదుర మద్వ్రతంబు గాచు కుదుర. 129

ఉ. హా! సుగుణాఢ్యదేశికవరాంచితహస్తపయోజదత్త! యా
హా! సతతాంబికావరపదార్చనబృందసమర్చనాకరా!
హా! సుతమిత్రబాంధవధరాధిపదాత్మజనోపమేయ యా
హా! సురభూజకల్ప వృథయైతివి యే నిఁక నేమిసేయుదున్. 130

క. అని నగలమిగులఁ బొగిలెడు,వనితామణిఁ గాంచి కపటభక్తుండను నో
వినుతార్ఘతశీలా నీ, ఘనమోహభ్రాంతి నేడుఁ గానఁగనయ్యెన్. 131

చ. మునుకొని పెక్కుగా నినుపముక్కుసు పెక్కుచు నేడ్చువారి నెం
దున గన నిట్టి భ్రామికము త్రోవయె భక్తికి నాసమాలి చే
సిన గణపూజ బాలశశిశేఖరుఁ డెంతయు మెచ్చుఁ గాక యీ
యనవున నాజవంజవమహార్ణవమగ్నతఁ జెందవచ్చునే, 132

తే. కదురుమీఁద నెంతకాంక్ష నీకుండిన
దెరవ రెండు మూఁడు దెచ్చి యిత్తు
వగవ కుండు మనిన వనిత యాతనిఁ గాంచి
యెలుఁగు మంద మొంద నిట్టు లనియె. 133

చ. శరణవరేణ్య నాప్రియుఁడు శర్వపథంబునఁ జెందుఁ బిమ్మట

కరుణ దలిర్ప మద్గురుఁ డఖండితజంగమవర్యపూజనో
త్కరము లొనర్ప మీకదురు కాయకలబ్ధి నటంచు నిచ్చె నా
కరుదుగఁ దీనిభక్తి నది యాదిగ తత్క్రమ మొప్ప జర్పితిన్. 134

తే. ఇపుడు నాజీవ మగునది యిట్టు లయ్యె
నయ్య ? నావ్రత మీడేర నానతిండు
గురుపథంబునఁ జెందెదఁ గొదువపడక
యనిన దరహాసవదనుఁ డై యతఁడు పలికె. 135

ఉ. కాయము వీడదే కదురు కాడకుఁగా మది నాసపడఁగాఁ
జేయవు బాగురే? యినుపసీలకు సౌధము గాల్పఁ గూడునే
మాయలఁ బెల్లియంత పెనుమక్కువఁగల్గిన వెండిపైఁడులం
జేయఁగ బంచి యిచ్చెదము చేకొను మీకదు రట్లు గాసిచోన్.

క. యావజ్జీవోపాధికి, నేవెర వొనరింతు కొమ్ము నెలఁత కదురుకై
చావకు మని తనజోలిం, దేవి పసిఁడిజాతి యొకటిదిగిచి రయమునన్.

క. ముందరవైచినసతియది, యందకనామదిగ్రహింప కయ్యయొమాయం
జెందంజేయఁగఁ దగదే, కందర్పారాతిమూర్తి కరుణింపు మిఁకన్.

తే. ఇంక నిమ్మాటకుఁ బలికితివేని దేవ !
నీకు నీయాన సెలవిమ్ము నీలగళుని
గూడ నరిగెద నను మదిఁ గొంకులేక
తతశివార్చనవేదికా స్థలమునందు. 139

క. భావం బలరఁగ యొకగుహ, గావింపఁగఁ బంచికదురు ఖండంబులతో
నావివరముజొరఁబోవఁగ, భావజహరుఁడింత మెచ్చిప్రమథులతోడన్.

క. ప్రత్యక్షంబై నిలిచిన, నత్యంతకుతూహలమున నయ్యంగన స
న్నుత్యభినుతు లొనరించిన, కాత్యాయనివిభుఁడు కరుణ గడలుకొనంగన్.

తే. కామినీమణిఁ గైకొని కమలసంభ
వామరాధిపనుతిపాత్ర మైనరౌప్య
ధారుణీధరరాజ్యంబుఁ జేరి ప్రమథ
కాండలీలావినోదుఁ డై యుండె నంత. 142

వ. అదియునుం గాక. 143

క. అజనిరథనిబలశరద, వ్రజగిరిరుచిసింహాసమధురాస్ఫురనదపో

రుజకూఁద్రకరిరథాశ్వభటజనాలయ మొప్పెఁబురి పుడమిఁజంబురనన్.
వ. అప్పురంబునందు. 145

## రౌద్రసత్తక్క కథ.

ఉ. చొక్కపుసూనృతో క్తపురిసూదనపాదపయోజభక్తి పెం
పెక్కఁగుణానుశక్తి గిరిశేఖరనామవిరక్తి సేవక
ప్రాక్కరినాథునంచయవిపాటనశక్తి వహించి రౌద్రస
త్తక్క ధరాతలంబున మహామహిమాయతి నొప్పె నెంతయున్.
ఉ. పంచశిలీముఖారిపదభక్తుల కెప్పుడు తద్గుణాఢ్య ని
ర్వంచకవృత్తిఁబూజ లనురాగముతో నొనరింపుచుం జగం
బెంచక నన్యదైవముల నెప్పుడు పల్కక మ్రొక్కల నెవ్వరం
కించి పచించిన న్వినినకేవలనిష్ఠఁ జరించుచుండఁగన్. [ద్వై
క. తరుణిదృఢభక్తిధైర్యము, లరయఁగధరకెల్లఁదెలుపహరుఁడొకచరుఁ
యరుదెంచి తద్గృహాంగణ, పరిసరమున నిల్చిఘంటవాయించి వెసన్.
క. భిక్షాందేహియనఁగ విని,యాక్షణమునదర్వివేఁడియన్నముగొని యా
ప్రక్షాళితకల్మష చని, భిక్షుకునకుఁ బట్టు మనుచుఁబెట్టం బోవన్.149
క. మెతుకొకటి క్రిందజాఱిన, నతఁడక్కటికంబునొందిహరిహరియనదాఁ
నితఁ డేటి జంగమని సతి,యతికుపితమనస్కయగుచు నడచెం దర్విన్.
చ. అడచిన క్షితినొంది యతఁ డక్షులనీరము నించి తూలుచుం
బుడిమిని వ్రాలి కోలఁ బిగఁబూని హరీ యని లేవఁబోవ నీ
నుడు విఁకమాను మంచు మది నూల్కొను నాగ్రహవృత్తిఁగ్రమ్మఱం
బెడతలవ్రేయ సొమ్మసిలి పెక్కగ దుఃఖము పిక్కటిల్లఁగాన్. 151
చ. తగిలిన దిక్కుఁ జేనడిమి తామసి రక్కసి దోసకారి న
న్నగపడనీక క్రింగు క్షణమైన నిలం దగ దీడ నన్నుఁ గా
వగ నిఁక నెవ్వరో గరుడవాహన యంచుఁ జనంగ వెంబడిం
దెగఁబరువెత్తి చేకోలఁది తెడ్డున వెన్నదరంట మోదినన్. 152
చ. పెనుదెసఁ జూడఁబోక తలవీడఁ గటిచ్ఛదమూడ గంట మే
పనిఁ బడవ్రేయ మోము కళదియ్యనియూర్పులు మీఱ బొంతజా
నధర మెండఁబెట్టుగ నురమ్మున జెమ్మట నిండ నొక్కప
ద్యానఁ జనె తత్పురిశరణపుంగవకోటి వసించుచక్కికిన్. 153

చ. చని గణకోటిఁ గాంచి మదిసాధ్వస మందఁగ నిల్చి వారితో
ననియె మహాత్ములార! యొకయంగన యిప్పురి దుర్మదాంధవ
ర్తన బలుస త్తజంగమవిదారణశీల యటంచు మున్ను నే
వినినికతంబున న్మది వివేకవిహీనత భిక్ష కేఁగితిన్. 154

గీ. ఏఁగి దేహి యన్న నింతి చిట్టడచూచు, లెడ్డుతోడ కూడుఁదెచ్చి పెట్టి
దానితోన వీఁపుతాటయె త్తఁగమోదె, నన్నలారమిన్న కనుచుఁజూపి.

గీ. దిక్కులేనివాఁడు తిరిపెమె త్తెడువాఁడు, వీఁ డటంచు జారవిడువఁబోక
పాడి నెఱపవలయు భక్తాభిమానులై, కావరయ్య నన్ను గరుణతోడ.

క. పాడి విచారించిరియె ము,న్నోడధరానాథుఁ డాత్మసూనునియసువుల్
దూడకయిదోలఁగఁ జేయఁడె, వేడుకవినుఁడా క్రమంబువివరింతుఁ బగన్.

చోడరాజు కథ.

చ. వసుమతి సింగరానగరవల్లభుఁడై చను చోడఁ డన్యభూ
పసమితినొంచుచున్ హితులఁ బాలనసేయుచు వీరశైవగో
ష్ఠిసలుపుచున్ శివాధవునిసేవయొనర్చుచు సత్యసంధుఁడై
దెసలయశంబునిల్పి జగతీతలమేలుచునుండు నంతటన్. 158

ఉత్సాహము. ఆరసాధినాథసూనుఁ డంత నొక్కనాఁడు ర
త్నారమైతనర్చుస్యందనాధిరాజ మెక్కిస
ద్భేరికాహళారవాళి పెంపు సొంపు నింపఁ ద
త్పౌరవీథి నేగుచుండ దైవయోగ మొందుటన్. 159

చ. గురుగృహధేనుతర్ణకము గొబ్బున నడ్డమువచ్చి భీతిచే
నరుగఁగ లేక తద్రథసమాయతచక్రవిఘట్టనంబున
న్మరణము నొందఁ గాంచి నృపనందనుఁ డెంతయుఁ జింతనొంది హా
హరహర! యంచు నేగె నగరాంతికపుష్పవనీధరిత్రికిన్. 160

సీ. అంతటఁ దద్ధేను వటవీస్థలంబున
గోపు మేయుచుఁ బాలు చేపువచ్చి
వత్సంబుఁ దలఁచి యంభారవం బిచ్చుచు
రయమునఁ జనుదెంచి రథ్యఁజొచ్చి
పడియున్న పృథుకంబుఁ బొడగాంచి మోము మో
మునదువ్వుచును జన్ను మొనలు మూలి

పై నంటఁ జేయుచు మేను నాఁకుచుఁ జుట్టుఁ
దిరుగుచు గన్నీరుఁ దెచ్చుకొనుచుఁ
తే. దోఁకనీగలువిసరుచుదుమ్మునోరఁ,గరచియెత్తుచునిలచినల్లడలుగనుచు
బండ్లుకాళ్లువిదల్చుచుఁబంచితంబు,నొయ్యనొయ్యనవిడుచుచునున్న

ఉ. పట్టఁగరానిదుఃఖమున బజ్జజనంబులు విస్మయాత్ములై [రనుచు.
చుట్టును రాఁగ నేగి మొరసుద్దివినన్ నృపతోరణంబునం
గట్టినగంట గొమ్మునను ఖంగనఁ జిమ్మిన నాలకించి యా
బెట్టగునాద మేమనుచుఁ బృథ్వివరుం డరుదెంచి యచ్చటన్. 162

చ. కన్నులనీరుజార మనుగ్రమ్మిననోరను జొంగలూర వా
ల్జన్నులఁబాలు గార మొగసాల రవం బొనరించు నైచికి
న్విన్నదనంబుదోఁపఁ బృథివీపతి డగ్గరిచూచి యేటికో
సన్నయొనర్చి కూయిడుట శంకర యంచు విచారమగ్నుఁడై. 163

క. ఉన్నెడను నాత్మతనయుఁడు, చెన్నుగ రథమెక్కి పురవిశిఖ నేగఁగ నా
సన్నమటుగురునివత్సం,బున్నతరథచక్రనిహతి నొందుటఁ దనతోన్.

చ. పురజనులెల్లఁ జెప్ప విని పుత్రునిశత్రునిరీతిఁ జూచి స
త్వరమునఁ జంపఁగావలయుఁదర్ణకసూదను నంచు పౌరపా
మరగురుబంధుమిత్రబుధమంత్రిసమాజముఁగాంచి ధైర్యవి
స్ఫురణఁదలిర్పఁ బల్కె నృపపుంగవుఁ డుత్తరి మధ్యవర్తియై. 165

క. తనయేలుభూమిలోపలి, జనములు గావించుపాపసంచయ మెల్లం
దనుఁజెందుననఁగ తనయుం,డొనరించినపాపఫలము లొందకచనునే.

క. కొంచెము గాదిది యెంచఁగఁ, బంచమహాపాతకములపాటి దఖలు నే
వంచనచే సుతమోహం, బుంచిన నిందాఘఫలము లొందకచనునే.

క. నామదిఁ దోఁచినచందం,బీమెయిమీకెటులఁదోఁచు నేర్పడఁ జెపుడా
మోమహితులార! యనవుం,డామాటలకేమిదోఁచ కందఱునొకటై.

ఉ. సన్నుతకీర్తిసంభరిత సర్వదిగంతరసత్యసంధ్యలో
కోన్నత! ధర్మశాస్త్రవిధు లొప్పఁగ మీరె వచించినారు మే
మెన్నడిదేమిగల్గు పరమేశ్వరుఁ డీగతిఁ దెచ్చె నింక మీ
కన్నదికాను పంచు తముఁగ్రమ్మినదుఃఖము నాఁగిపల్కినన్. 169

క. విని నృపుఁ డదియే వారల, యనుమతిగా నిశ్చయించి యావత్సముపైఁ

దన తనయునిఁ జెగవ్రేయుం,డని తలవరిజనులతోడ నాజ్ఞాపించెన్.

వ. ఇట్లాజ్ఞనొసంగిన. 171

ఉ. అంతకముస్నె వచ్చి భవనాంతరమందుపసించి యయ్యయో!
యెంతటికర్మినైతి పరమేశ్వరద్రోహము సంభవించె నీ
చింతదొలంగుమార్గ మిఁక చెందదు వేఱొకరీతి నాత్మదే
హాంతముదప్ప దంచు వివశాకృతినున్ననృపాలనందనున్. 172

చ. కని తలవర్లు మ్రొక్కులిడి కన్నుల నీరొలుకంగ దేవ! మీ
జనకుఁడు సాహసించి నినుఁ జంపు మటంచు ననుజ్ఞ నిచ్చె న
ప్పని మెయి వచ్చినార మని పల్కిన సంతసమంది యౌర? నా
తనువుకృతార్థతం దనరె తప్పె మహాఘము లోకనిందయున్. 173

చ. జనకుఁ డనుజ్ఞనిచ్చుగతి సల్పుఁడు మీరలు సత్వరంబ యా
ఘనుఁడు జలాభిషేచనముఁ గైకొని చల్వలు గట్టి పల్చగాఁ
దనువున భూతిఁబూసి యలుత నృదురాకసరంబులేసి వ్యా
ద్వానజమునందు దేశికపదంబులునిల్పి విలాసధుర్యుఁడై. 174

క. ఇలువెడలి ఖడ్గకరులగు, తలవరులును దాను నేగుతనుజన్ముని ని
శ్చలధైర్యకలనవిని భూ,తలనాథుఁడు మెచ్చి చూచుతలపుననంతన్.

చ. వరకవిబంధుమిత్రనృపవర్గము మున్నుఁగదత్సభాగృహాం
తరజనులెల్లఁ దో నడువఁ దర్జకమీాల్గినచక్కిఁ కేగి ని
బ్బరముగ మున్నెవచ్చి యట భాసిలుపుత్రుని గాంచునంత న
వ్వరగుణశాలి తండ్రి కనివారితభక్తిని మ్రొక్కి నిల్చినన్. 176

వ. అయ్యెడఁ బౌరజనంబు లత్తెఱంగంతయుం గనుంగొని యత్యంతదుః
ఖాక్రాంతులై యొండొరులతో నక్కటక్కటా! యీభూపాలుం డను
పమానశౌర్యధైర్యగాంభీర్యచాతుర్యసత్కార్యౌదార్యసౌందర్యసౌ
కుమార్యాదివిశేషంబులు గొనియాడం దగుప్రోడలదూడకై తెగం
జూడఁ దలంచెనే యనువారును గట్టడితనంబున కోడక కడుపునఁ
బుట్టినపట్టి నిట్టు చేసె నింక నీపట్టణంబున నెవ్వరి నెట్టుసేయఁ డను
వారును మోహంబులలోఁ బుత్రమోహం బధికం బని యూహిం
చక సాహసంబున నితని దేహంబు దునుమం బంచె నాహా! యనువా
రును నొక్కండె సుతుఁ డిఁక షైక్కు లేరని యిక్కుమారుని వక్కాణించు

కోలేక మీఁద దుఃఖంబునం జిక్కి ననువారును నంగడివీథి తురంగం బులు శతాంగంబు నీడ్చికొనిపోవ ముంగిలికివచ్చి మగుడిపోవం గా ళ్లాడక యావత్సం బడం గెంగాక యిక్కుమారపుంగవుండు చేజేత ఘాతయొనర్చెనే యనువారును నిత్యలోకస్తుత్యసత్యసంధుండు గావున నీభూవరుండు నావారు లాతివా రనుమాటఁ దక్కి యిట్లుగా వించి నిందాహత్య లెడఁబాపికొని కీర్తిమంతుం డయ్యె నింతవాఁ డేలోకంబుననైనఁ గలఁడే యనువారును ధర్మంబుదప్పక నిర్మలాంతఃక రణుండై పుత్రుని శత్రునిగా విచారించిన దైవం బాదుకొనవలదే యను వారును బ్రాణంబుమీఁదవచ్చిన నాత్మప్రాణపరాయణుండై తొలం గిపోవక జనకాజ్ఞోల్లంఘనంబు సేయక యొప్పె యీతం డెంత సుపు త్రుం డనువారును మాకుం జూడ నిట్టిసాహసుల కిత్తరి నీశ్వరుండు ప్రత్యక్షుండై శాశ్వతైశ్వర్యంబు లొసంగి దయసేయకపోఁడని తోఁ చుచున్న దనువారును నై గుంపులుగూడి చూచుచున్న సమయంబున.

చ. శరణులకెల్లమ్రొక్కి యతిసాహసమాత్మ నలంకరింప భూ
వరతనయుండు మేటితలవర్లను గన్గొని జాగుమాని మ
ద్గురుఁ డెటులానతిచ్చె నటు గొబ్బునసేయుఁ డటన్న వారు భీ
కరగతి నాతనిం దునుమ ఖడ్గమొర న్వెడలించి వ్రేయఁగాన్. 178

తే. వాలు పువుమాలయై ధరానరునిపట్టి
యఱుతఁదవిలిన దలవరు లధికవిస్మ
యాత్ములై యేమి దోఁచక యాగి రప్పుఁ
డాకనిమొగ మొక్కఁడీక్షింపు చున్న నంత. 179

చ. నిరుపముఁడైనగోపతి ఫణిల్లనిరావ మొనర్ప మేదినీ
వరునకుఁ దత్కుమారునకు భక్తసమూహికి గాఢసమ్మదో
త్కరముదలిర్పఁ బారిషదతండవిలాసముఁ బ్రీతిఁగూర్ప స
త్వరగతివచ్చినిల్చె వసుధాధరచాపుఁ డుమాసమేతుఁడై. 180

క. నిలిచినఁ గాంచి యాధరణి నేత వినూతనకౌతుకంబునం
జలిమలతేనియల్లునకు జాగిలి వందన మాచరించి ని
శ్చల నిరుపాయ నిర్గుణ నిశాకరశేఖర నీలకంఠ ని
ర్దళితపలాశి నిత్యశుభదాయక నీరధితూణ నిర్మలా. 181

చ. అని వినుతించు రాజుఁ గని యబ్జధరుండును నీదుసాహసం
బునకు భవత్తనూజునియపూర్వపుభక్తికి మెచ్చువచ్చు నేఁ
డని తరలభ్యమోక్షపద మందఁగ రం డని వానితద్గురుం
దనయుని ధేనువత్సములఁ దారకనగేంద్రముఁ జేర్చెఁ గావునన్. 182

ఉ. నా మొఱ నాలకించి కరుణామతిఁ జోళనృపాలురీతి న
* మృముడుతంత్రులార విని యూరకయుండకురయ్య యన్న నా
సాములు చెప్పి రా వెలఁది శాంతిదయాసభక్తు లిట్టిదం
చేముగణింపఁ జాలము మహేశ్వరుఁ డైన శివుండు దక్కఁగాన్. 183

ఉ. ఇత్తరి నన్ను మోదె నని యీవు వచించితిగాని యాపె దు
శ్చిత్తయటంచు నెవ్వరును జెప్పఁగ మున్వినలేదుగాన నీ
యుత్తలపాటుఁ జూచిన మృదోక్తుల నంగన రాదు గాన న
య్యుత్తమశీలఁ బిల్వవలయు న్మరి యిచ్చుట కెల్ల నారయన్. 184

చ. అనవిని భిక్షుకుం డనియె నక్కట! యిక్కడి కేలఁ బిల్వఁగాఁ
బనిచెదవ? రాపె పేరువలఁప న్మది తల్లడిలంగఁ జొచ్చె మీ
మనమునఁ గ్రమ్మఱంగ నను మోదఁగఁ జూచెదు వేడ్క పుట్టినం
దనువునఁ గాసఁ జెంద విహితంబని తోఁచినఁ బిల్వనంపరే. 185

క. నావుడు భిక్షుక! యూరక, నీవేటికి బెదరె దిట్లు నిలు విచ్చుట నిక్
గావఁగ మాభారం బని, పావనుతో సారె నమ్మపలుకుచు వారల్.

చ. అనుపమ భక్తిశీలయగు నంగన నీడకుఁ బిల్వఁ బంపఁగాఁ
జనదు తదాలయంబునకు జాగున నందఱు మేగి యిమ్మహా
త్మునివచనంబు లెల్ల నిజమో మృషయో పరికించి వత్తమం
చనఘతరాత్ము లేగి రపు డయ్యను దోడ్కొని యాపె యింటికిన్.

మ. చని యమ్మానిని బూజలంది యని రో సాధ్వీనతంనంబ నీ
ఘనసద్భక్తికి నీయుదారతకు నీకారుణ్యసంశీలవ
ర్తనకుం బాడియె భిక్షుకుం డయిన నేతద్భక్తుని న్మోద నీ
వినయంబెల్లను గానుపించె శరణు ల్విన్నఁ భళీ యందురే. 188

189

వ. అనిన నయ్యంగన యిట్లనియె.

ఉ. ఒప్పున నన్ను మీ రెఱిఁగియుండియు నిట్లు వచింప నెందు నా
తప్పులు వల్కు వారలకు దండము దప్పునె నాదు మ్రోల నే

చొప్పునఁ బల్కెనో యడిగిచూడుఁడు ము న్నిట నీతఁ డన్న వా
రప్పుడు భిక్షుఁ గాంచి యని రందఱు మోములఁ గిన్క దోఁపఁగాన్.
ఆ. అడచె నిర్నిమిత్త మంగన యని సభా,మధ్యమందు కల్లమాటలాడఁ
దగునె మించ నాదుతప్పు నీయెడఁగల్గి,యెంతకైన దగుదు వెన్న ననిన.
క. నారాయణనారాయణ, నేరం బేమియును లేదు నెలఁతుక నాపై
నూరక నాడె ననంగా, నేర మని మహాగ్రహంబు నిగుడఁగ నడచెన్.
చ. అడచిన శ్రీహరీయనుచు నయ్యలదిక్కుఁ గనంగ నంతలో
నుడువను మన్న శబ్దమని నూల్కొని క్రమ్మఱ నంత యాతఁడ
ప్పడతుక మ్రోల నిల్చె జరభావముమాని వృషేంద్రవాహుఁడై
జడలు కపాలమాలికలు చంద్రకిరీటము శూల మొప్పఁగాన్. 193
తే. ఇట్లు సన్నిధిచేసి సర్వేశ్వరుండు
మెలఁత! నీభక్తికెంతయు మెచ్చువచ్చె
రమ్మనుచుఁ బుష్పమయవిమానమ్మునందు
నునిచికొని పోయెఁ గైలాసమునకు నంత. 194
ఉ. అచ్చట నున్నభక్తవరులందఱు నంచలు విస్మితాత్ములై
యెచ్చటనైన జూచితిమె యిట్టిమహత్త్వము కాంతదర్శిచే
చిచ్చులకంటి దేవరను జేకొలదిం బ్రహరించి లోకముల్
మెచ్చఁగఁ జెందెఁ దత్కృప నుమేశశుభాకరతారశైలమున్. 195
క. అనిపలుకుచున్నవారలఁ,గనుగొని యొకభక్తుఁడనియెఁగమలాంధకరుం
దనువలయమోదిక నెనొక,యనఘుఁడు తత్పదము తొల్లి యది యెట్టిద [నన్.
మ. అనమానోత్తరశైవతత్త్వనిధి సిద్ధాచారుఁ డీశానభ
క్తిసముత్సాహుఁడు నిత్యభక్తగణతీర్థప్రసాదోపభో
గి సమస్తేంద్రియనిగ్రహుండు విలసత్కీర్తి ప్రభావుండు ర
క్కసిబ్రహ్మయ్య యనంగ భక్తవరుఁ డొక్కండు డొప్పు నిద్ధారుణిన్.

+ రక్కసి బ్రహ్మయ కథ. +

సీ. అతనిమహత్త్వ మత్యద్భుతం బెట్లన్న నింటికి చరమూర్తు లేగుదేర
నైదుదినములుంచియనుపువారుండెద మనిన నెన్నండింటికఱుగనీను
సమ్మతించి రేనిసరసాన్నపానము ల్గొనుచునుండుండనియునుచుగొంత
కాలంబు చనె నని చాలయపేక్షులై పోవంగఁ దలఁచినఁ బోవ నీక

తే. బలిమి చెరఁబట్టియప్పటిపగిది వారిఁ, బూజసల్పుచునుండుము పూ్వటలిట్టు
లతఁడు వ్రతమూనిచరియింపనవనిజనము, లందఱావిధ మారసియచట

తే. సంతతము వీరి యింటికిఁ జనిన నంబి [నచట.
కామనోహర భక్తలోకంబులోన
నయ్యె లోకకొండదఱే మొకో యాగ్రహంబు
వెడలి క్రమ్మఱిపోవ రేవిధము దల్పన. 199

తే. బొమ్మరక్కసి యొక్కటి భూతలమున
శరణతతిమ్రింగ భక్తవేష మనిపేరు
తిరుగావించుకొను వారిఁ దినుచునుండఁ
బోలుగాకున్న నిట్టియద్భుతము గలదె. 200

క. అనిసంశయించుధరణీ, జనముల యనుమాన మెల్ల నడలించుటకై
మనసిజ సంహారుఁడపుడ, త్యనుపమ సంతోషపూరితాత్ముం డగుచున్.

సీ. చలిపోరువాసిక మెఱయంగఁ బైఁగట్టి భసిత త్రిపుండ్రంబు నొసలఁ బెట్టి
పృథుసూత్రగతలింగ పేటిప్రక్కకు ద్రిప్పి చెంగుజార హొరంగు చేలగప్పి
నీలిచల్లాడంబు మేలికాసెబిగించి వాలుము మ్మొనవాలు కేలనుంచి
సన్నపురుదురాక సరములు మెడఁబూని గండపెండెర మొకకాలనాని

తే. వంకి మొలఁజెక్కి దంతపుపావ లెక్కి
తమ్ములము వేసి మేన గంధంబుఁబూసి
వితతయౌవనసౌందర్యవిభ్రమంబు
లలర నొకచరమూర్తియై యద్భుతముగ. 202

తే. రక్కసి బ్రహ్మవరమందిరమున కప్పు
డరుగుదేఁగాంచి యతఁడు సాష్టాంగ మెరఁగి
కలితరాజవదుపచార కలనఁబూన్చి
వినయమున నున్నబ్రహ్మయ్యఁ గని యతండు. 203

మ. భళిరా! రక్కసి బ్రహ్మ యివ్వసుమతీభారస్థభక్తావళిం
గలయం జూచితిగాని నీదువిలసత్కారుణ్యగాంభీర్య ని
శ్చలభక్తార్చనశీలదానగుణముల్ చర్చింపలే దెందు నే
డెలమిం జెందె మదీయమానసము నిన్నీక్షింప శైవోత్తమా! 204

ఉ. ఎప్పుడు నిన్నుఁగూడి చరియింపఁగ వేడుకపుట్టె మాకు నీ

విప్పని కియ్యకొమ్మనిన నెంతయు సంతసమంది దేవ! నే
నొప్పితి నట్లు మీరిచటనుండుడు పల్కినమాటఁ గ్రమ్మఱం
దప్పినఁ బోవనీయ నని దాని కొడంబడి నిశ్చయార్థమై. 205

తే. తా నతం డిచ్చు భూతిహస్తమునఁ బట్టి
యతని నుదుట ధరించి నీవనిన యట్ల
నిలుతు మని పల్కి మఱియొక్కనిమిషమునకు
మాకు పనియున్న దిఁక పోదుమా యటన్న! 206

చ. గడుసుడనంబొ! కోడిగమొ! కల్మియొ! చూడఁగ నీస్వభావమో!
గడెగడెకొక్కమాట పలుకం దగవె? మును నీకు నీవ యి
క్కడ వసియింప భూతిఁగొని క్రమ్మఱఁబోయెద నన్న నిన్ను నే
విడుతునె యేల నీభ్రమలు విశ్వము మెచ్చునె బాసదప్పినన్. 207

తే. ఇటకు రానేది పోనేది యింతవింత
గలుగునే లగ్నమపుడె 'నాగబలి' యనెడు
సాక్షిత నిబద్ధియయ్యె నీజాడఁజూడ
ననిన దరహాసవదనుఁడై యతఁడు పల్కె. 208

ఉ. మాగుణముల్ దలంప బహుమార్గము లెన్నఁగనేల? నీకు నే
చ్చాగతుఁడైనజంగముఁడు స్థావరమై యొకచోటనిల్చునే
సాగి చనంగ నీకఁ జెరసాలను నన్నిడఁజూచినాఁడ లో
నాగముఁబట్టిలో నిముడునా యిదె పోయెద నడ్డగింపుమా! 209

చ. అనవు డతండు పల్కె శరణాగ్రణి మీర లెఱుంగనట్టి శా
స్త్రనిగమచోదితంబు లగుధర్మము లెందున నైనఁ గల్గునే
మునుపొనరించునా నియమము న్విడి యిచ్చటనుండి నేఁడు నా
తనువునఁ బ్రాణముల్ దలఁగ తర్లగసిత్తునె నిన్ను నావ్రుడున్. 210

ఉ. ధారుణి వేదచోదితఫలంబుల భక్తసపర్యసల్పువా
రారయ వారియిష్టమటు లాగి యొనర్చిరి గాని నీక్రియం
గారియఁబెట్టి బూన్చుటలు గానము బాలిక నీసపర్య యే
తీరున నీడనుండుటకుఁ దీరదు పోయెద నన్న నుగ్రుడై. 211

క. వలఁజిక్కి తెక్కలార్చినఁ, బులు దెగనిచనంగఁగలదె పొమ్మెటుబోవం
గలవే యని చెట్టిడముగఁ, బలికినచరమూర్తి తీవ్రభయదాకృతియై.

ఉ. బెబ్బులియాఁగునే చెవులబిల్లిలఁ బత్త్రిక వ్రాసి మున్ను నీ
యబ్బకు నీకు నేమయిన నిచ్చితినే చన నీకపట్టు నీ
బొబ్బల కేమి పేరు సరిపో? నటియించితికాక తొల్లి నీ
రబ్బినఁ బోలె జంగములయందరితో నను సాటిచేసితే. 213

ఉ. వచ్చినభక్తకోటి దలవాకిలి వెళ్ళఁగనీకపట్టి నీ
యిచ్చగ బందినుంచు ఫలమెల్లఁ గనంబడఁజేతు నన్ను నీ
విచ్చట నడ్డగించ కిఁక నేటికిచూచెదు రమ్ము పట్టుమం
చచ్చటఁబాసి పోఁగ నతఁ డడ్డముగా నదలించి తెచ్చెదన్. 214

క. మొలసురియఁ దినగఁబోవఁగఁ
దొలఁగక బ్రహ్మయ్య యతనిఁ ద్రోచి యటకు పోఁ
గలవో పొమ్మని డగ్గరి
కలయంబడి పట్టిమోది కలకలనగుచున్. 215

ఉ. పట్టినపట్టువీడనన పౌరుషమా యిఁక నెట్లుపట్టెదో
పట్టుము నీవటంచతఁడు వైలగుడు స్మదినేమిదోచ క
ప్పట్టునఁ జింతనొంది వ్రతపద్ధతిమానుము వచ్చె నింక న
న్నెట్టుల మెచ్చు శంకరుఁ డహో యని భక్తులు నవ్వఁగుందరే. 216

క. శీలముదొరగినపిమ్మట, నేలా కాయంబు దీని నెడసేయుటయే
మేలని హృదయాబ్జంబున, కాలాంతకునిల్ప గండగత్తెఱఁగొనఁగాన్.

ఉ. అంతటిలోన నీశుఁడు దయామతి సన్నిధిచేసి బ్రహ్మ నీ
యంతటి శీలవంతుఁ డిఁక నారయఁగల్గునె పల్లవించె మ
త్స్వాంతము నేఁడు నీదయినవాంఛిత మిచ్చెద నన్న నాతఁ డ
త్యంతకుతూహలంబున దదంఘ్రిలకుం బ్రణమిల్లి వేడుకన్. 218

చతుర్విధకందము:—
గౌరీశ వరఘృణారస, పూరా కామారిశ్లేష భూషణసోమా!
వారాశి సుజనసోమా, ధీరా హేమాద్రిచాప తారకరామా.

వ. అని ఇట్లు సన్నుతించి దేవా! భవదీయదర్శనంబుకంటె వాంఛితం
బొం డెద్దియైన నొక్కటి వేఁడెద మదీయనికేతనస్థానేకభక్తసహి
తంబుగా నన్ను భవత్సదనంబుఁ జేర్పవలయు నని విన్నవించిన నట్లె
కాక యని శంకరుం డందఱఁ బుష్పకారూఢులం గావించి నిజధామం

బునకుం గొంపోయె నట్లు గావున నిప్పడతియు నారక్కసి బ్రహ్మ యయ్యవిధంబున నీశ్వరునకుఁ దిరుగంబడి తత్ప్రదంబు గాంచె నని చెప్పిన నచ్చటిభక్తవరులందఱు నత్యాశ్చర్యంబు నొంది రౌద్రసత్తక్కం జెక్కువిధంబులం గొనియాడి నిజనివాసంబులకుం జని రదియునుం గాక. 220

## శాంతసత్తక్క కథ.

తే. సంతతాత్మీయభక్తినిశాంతకుసుమ
మంతమాయాపహారణవిక్రాంతశర్వ
చింతనామృతపూరిత స్వాంతయగుచు
శాంత సత్తక్క వెలయును సంతతంబు. 221

సీ. ఆయింతి యొక్కనాఁ డాత్మవల్లభునకుఁ దలయంటినలుగిడిజలకమార్చు
వేళదో సెడునీరు వెలిఁజల్ల నాతఁడు గని యిదియేమినిష్కారణంబ
నీరుఁజల్లితి వన నెలఁతుక వినియును విననట్లయుండిన విభుఁడు గినిసి
నామాట నీచెవి నాటదో గర్వమో యన నెమ్మొగమ్మున నల్లనల్ల

తే. చిఱునగవుతొంగలింప నోజీవితేశ!
మీమదికిఁ దోచియుండియు నాముఖమున
వినఁగ వేడుకయైన దద్విధము తాన
మాడు పిమ్మటఁ దెలిపెద ననిన నతఁడు. 222

చ. అటులగునంచు వే జలకమాడి మడుంగులుగట్టి భూమిపె
న్నిటలముఖాంగదేశముల నిల్పి శివాక్షమణుల్ ధరించి భూ
ర్జటిభజనాంతమందునఁ బ్రసాదము భక్తులతోడఁగూడి యా
దట భుజియించి లేచి ప్రమదం బెసఁగంగ సుఖోపవిష్టుఁడై. 223

మ. తనభార్యామణి దగ్గఱం బిలిచి కాంతా! నింగికై నీరుచ
ల్లినవృత్తాంతము దెల్పుమా! యనిన వల్లేయంచుఁ గేల్మోడ్చి యి
ట్లను మత్స్వామి శర్వునాత్మవశుఁ జేయంజాలు యోగసత్తక్కనా
వనితామౌళి మహాటవిందపము దుర్వారంబుగాఁ జేయఁగాన్. 224

ఆ. తత్తపోగ్ని వెడలి ధరణిఁ గ్రమ్ముచు నిటు
రాఁగఁ గాంచి డాసి రాకయుండ
జలముఁ జల్లి దాని చల్లఁగఁజేసితి నన

నింతితోడ నాథుఁ డిట్టులనియె. 225

ఉ. ఎక్కడిచెల్లె లేటితప మెక్కడి కానన మేటిమంట లే
దిక్కునఁ బుట్టెఁ గాంచి తెటు తేకువనార్చితి వెట్టివింతయుం
బుక్కిటఁ బట్టినావొ ననబోఁడిరొ బొంకులు చాలు నన్నఁ బెం
పెక్కిన భక్తితోననియె నిందునిభానన తాల్మి మీఱఁగన్. 226

తే. ఎచటనోయున్న దాని నీవిటులఁ గాంచి
తనఁగ నేటికి భూతలమందు నెందుఁ
దెలియ దూరశ్రవణదూరదృష్టు లీశ్వ
రార్చకుల కబ్బుటరుదె యెట్లనిన వినుము. 227

క. శ్రీదసఖపాదభక్తుఁడు! వేదాగమకథితనియమవిశ్రుతుఁ డఘవి
చ్ఛేదుఁడు కళ్యాణమున, న్మేదర కేతాఖ్యుఁడొక్క మేదరి యొప్పున్.

కేతయ్య కథ.

ఉ. ఆతఁడు సంతతంబు గగనాంతరసీమల కేఁగి వేణుసం
పాతమొనర్చి తెచ్చి నిజపత్నియుఁ దానును జీరి వావిచేఁ
జేతికొలంది జల్లెడలు సిబ్బులు చేటలు చూచువారికిం
బ్రీతి జనింప నల్లి పురవీథుల నమ్మి తదీయలబ్ధిచేన్. 229

చ. శరణవరేణ్యా! బూజనలు సల్పుచుఁ దానొకనాఁడు వేకువం
బురహరుమాన్చి కత్తిఁగొని భూరికురంటకకోవిదారకే
సరపిచుమందచూతఘనసారకపిత్థశిరీషశింశుపా
గరుముఖభూజరాజిగలకాననసీమల కేగి యచ్చటన్. 230

చ. అరిమురివంశగుల్మముల నారసి యందొక గట్టిబొంగులే
నఱుకుచు నుండఁగాఁ బ్రమథనాథుఁడు కేతనసమ్మనంబుఁ దా
నెఱుఁగ సువర్ణబీజతతి యేర్పడ దానిఘటింపఁ గాంచి తో
తెరపిసిపుప్పిపుట్టె నిది తెంచిన నేమనిరోసియవ్వలన్. 231

క. మఱియొక్క కట్టఁ గ్రమ్మఱ, నఱకిన నారీతినే కనంబడఁగానే
నెఱుఁగకవచ్చితినిటకని, తెరచోటికిఁబోయి యొక్కపృథుగుల్మమునన్.

చ. చొరఁబడ నొక్క గట్టివెనుసొక గనుంగొని వాఁడికత్తిచే
ధరఁబడ దానినేయ నడిదంబు కరంబున జారి యిర్లఁ జేఁ
బరఁగిన కుంజమధ్యమున భవ్యతపంబొనరించు తాపసిం

భగముగ దాఁకి యొక్కఁబరిప్రయ్యగఁజేసిన నంతలోపలన్. 233

తే. హరసమర్పితమాయయటంచు నాతఁడుగూల, కేతఁడదరియతనికేలఁబట్టి
తెచ్చిపైటనుంచి తెగినచంకముఁబరీక్షించి శోకతప్తచిత్తుఁడగుచు.

ఉ. అక్కట! యెంతపాపమున కాస్పదమైతి? ప్రభాతవేళనే
నిక్కడికేలవచ్చితి? మునీశ్వరుఁ డిపాదనుంటగానకే
యెక్కన మైలకృత్యమున మోసముఁజెందితి నెట్లుబాయు నీ
మిక్కటమైన హత్య ఘనమేచకకంధర! యంచు నుండఁగన్. 235

ఉ. అచ్చట కేతనార్యసతి యత్తరి భక్తగణార్చనాలయం
బిచ్చ నలంకరింపఁగ మునీశ్వరునార్తరవంబు వీనులం
జొచ్చ స్వదేశికప్రవరశుద్ధరయం బెనుపొందు జ్ఞప్తిచే
నచ్చటి పల్కులైన దనకేర్పడఁ దెల్లమియామచునుండుటన్. 236

చ. అటు విని మానిచచ్చుటయు నాతనికై పతిదుఃఖమొందుటల్
పటుమతిగాంచి మందిరకవాటము తాళముపైచి చెచ్చెరం
జటులభుజంగపతీమృగశైలముల న్వెఱ వింత లేక య
య్యటవికి నీలకుంతల యకుంఠితధైర్యము వెంటఁదోడుగాన్. 237

చ. విపినముఁ జొచ్చి యొక్కయెడ విచ్చ నజీవితుఁడైన మానికై
విపులవిషాదవేదనల వేగెడునాథునిగాంచి మ్రొక్కినఁ
వ్యపగతదుఃఖుఁడై యతఁ డహో! యిట కేగతివచ్చితోంటినీ
విపు డిట రాఁబనేమి మదికెంతయు నద్భుతమయ్యె మానినీ! 238

ఉ. కానుగుచెట్లవంటి పలుగాకులు నిన్నొరులెవ్వరేని యే
మైనను మించనాడిరో గణార్చనకాలము దప్పునంచునో
కానక సేయు నాదయినకర్మము చెప్పిరొ యెవ్వరైననో
మానిని! నీదురాక కనుమానముఁజెందెదు మాకుఁజెప్పుమా!. 239

చ. అనవుడు కేలుమోడ్చి వినయంబున నిట్లనుమించ మీరల
వ్వనతలమందు శోకమున వందురుచుండఁగ నిన్నుఁబాసి నే
ననుచిత మింటనుండు టని యారయవచ్చితిఁ గాని యొండులే
దనిన లతాంగి నాదయిన యాపద నీకెటుదోఁచె చెప్పుమా. 240

ఉ. నాపుడు మీయనుగ్రహము నాయెడఁగల్గుట మానినీపల్గుచో
వావిరిఁబల్కఁగా వినియు వచ్చితి నెమ్మదిఁగాంచి యిట్లహా

దైవము తప్పఁజూచె నని తాలిమివీడఁగఁబుచ్చి యేమియు
న్భావమునందుఁ దోఁచక విపన్నతవచ్చితి నిన్నుఁజూడఁగాన్. 251

వ. అని పల్కిన నిజప్రేయసిదారశ్రవణజ్ఞానంబుల కత్యాశ్చర్యంబు నొంది సద్గురుకటాక్షపాత్రం బగునిప్పయోజానన బుద్ధివలన మేలం గుట యిహపరసాధనం బని తలంచి యాపెతో నిట్లనియె. 252

చ. కమలదళాక్షి! యీయెడలఁ గానక నే నొనరించుహత్య యే
క్రమములఁబాయు దైవత ధరాధిపబాపుఁడు మెచ్చునట్లు లో
కము సరిదీరు సెప్పగిదిఁ గ్రక్కున నొక్క యుపాయమెంచి న
న్విమలునిఁజేయుమీ? యనిన నీలపయోధరవేణి యిట్లనున్. 253

తే. ఇలప్రమాదవశంబున నెనయుహత్య
లైన దేహాంతముఖవిధులందుఁ బాయు
ననుచు నార్యులచే నీవు వినుచునుండి
నన్నడుగనేల యనినఁ గేతన్న యనియె. 254

మ. మునిసంస్తుత్య తపోధనుండగు మహాత్ముం జంపి వేఱొక్కతీ
రున దత్పాపనివృత్తిఁజేసికొన నారూఢంబుగా బుద్ధి నా
ల్కొన దిప్పట్టున నియ్యతిప్రవరుతోఁగూడ న్మదీయాసువుల్
చనఁగాఁజేసెద నెంతగాలమునకుం జాపండ జీవింతునే. 255

తే. అనిన సతి దృఢనిశ్చయం బాత్మ నెఱిఁగి
సతి యతనికన్న మున్నుగాఁ జనఁగవలయు
ననుచు మునిఁద్రుంచు కత్తిఁచేఁగొని గళంబు
ద్రుంచికొనఁబోవ నంతలో నంచితముగ. 256

సీ. ఉంచినాఁడేదేవుఁ డుర్వీధరేశ్వరాత్మజనర్ధదేహంబు నందు నెలమి
మించినాడే వేల్పు పంచభూతాదివ్యచంద్రాత్మమూర్తియై జగములందు
త్రుంచినాఁడేస్వామితో యజాసనవర ప్రబల దైతేయపురత్రయంబు
కాంచినాడే దైవమంచితసాదరేక్షణమున నాత్మభక్తవ్రజంబు

తే. నించి నాఁ డేమహాత్ముండు కాంచనోద
రాండ భాండంబు లెల్ల గర్భాంతరమున
నట్టి పరమేశ్వరుండు కళ్యాణమూర్తి
యమరమునిపంక్తి గొలువ ప్రత్యక్షమయ్యె. 257

క. ఆరీతి నెదుటనిలిచిన, గౌరీశ్వరు మోదమలరఁ గన్గొని కేతం
డారూఢ భక్తితత్పర, సారసములకెఱఁగి యిటులసన్నుతిఁ జేసెన్.
సీ. ప్రాలేయశైలేంద్ర బాలికా ధీశాయ మదనాంతకాయ నమశ్శివాయ
శారద నీరద చారుదేహాయ శమనహరణాయ నమశ్శివాయ
ద్వాదశాత్మాగ్ని సుధాధామనేత్రాయ మలవిదూరాయనమశ్శివాయ
గంగాతరంగసంగత జటాభాగాయ త్ర్యాశతాంగాయనమశ్శివాయ
తే. యంబుజాతాసనత్రిదివాది నాథ
ముఖ్యదైతేయ విద్విట్సు మూహమకుట
ఘటితకాంచన నవరత్న కాంతిపూర
మహితపాదాయ తుభ్యం నమశ్శివాయ. 259
వ. అని యిట్లు సన్నుతించు కేతనార్యుం గనుంగొని మందస్మితాననుండ
గుచు, సర్వేశ్వరుండు భక్తవర! మీదృఢ భక్తిజ్ఞానంబులకు మెచ్చి
వచ్చి రండని వారినిరువుర పుష్పకారూఢులం గావించి తత్తపస్విం
బునర్జీవితుఁ గావించి, యాతనితో వారలనిజధామంబునకుఁ గొని
పోయెం గావున దూరశ్రవణంబునంగలయంగన మహిమం బిట్టి
దింక దూరదృష్టిపదంబు దెల్పెద నని కాంతసత్తక్క నిజనాథునితో
ని ట్లనియె. 260

## నారదబ్రహ్మయ్య కథ.

సీ. కలఁడొకభక్తుండు కళ్యాణపురమున నారదబ్రహ్మాసమాహ్వయుండు
నలజయంత వసంతనలకూబరాకారుఁ డతులితశైవరహస్యవేది
సంగీతసాహిత్య సరసకళాస్ఫూర్తి సత్యవ్రతుఁడు గణార్చనవినోది
యాతనికాయకం బద్భుతం బెట్లన్నఁ దనపోయగంబు గన్గొనిన జార
తే. కామినీతిలకులు రతిఁగలయఁగోరి
పిలిచినసువర్ణటంకమే నెలఁత యొసఁగు
దానితోఁగూడి యస్ఖలితప్రభావ
మునసె వాంఛిత మీడేర్చు మోదమంది. 261
క. ఈసరణిఁదెచ్చుద్రవ్యము, వాసుకి యజ్ఞోపవీతభక్తార్చలకై
కాసైననుమఱునాటికి, మూసియిడకవ్యయ మొనర్చు మోదంబలరన్.
వ. అట్లుండి యొక్కనాఁడు, 262

సీ. బొట్టుకస్తురినీటు పట్టుబల్వెలెవాటు
దొట్టి గంధపుగాటి దొంగలింప
గోరమీసముతీరు నోరవీడెపుకారు
నోరుచూపులసౌరు నొరపుఁదనర
సికతాయతలకాంతి యొకకేలఁబూబంతి
నికటనగశ్రాంతి నీటుమెఱయ
నగవువెన్నెలజాలు మొగరాలపిడివాలు
సొగసుసొమ్ములడాలు సొలపువెలయ [కొనుచు
తే. నేలఁబాడుచు నంసంపనీలలిడుచు,నంగమెగదిగఁజూచి యుప్పొంగి
సిందుబింబాస్య లచ్చెరువందికనఁగ, రాజవీథిని నేగె నారసికవరుఁడు.

ఉ. అత్తరి నొక్కభర్మ మణిహర్మ్యతలంబునఁ గ్రీడసల్పుచుం
బిత్తరిమోర్తు బల్ ఘనికుచ్రేయసి సోరణగండ్ల వెంటఁ ద
చ్చిత్తజపన్నిభుంగని విచేష్టితమై తమకంబుపర్వ ము
న్నెత్తినతెప్పవాల్పక తదేకమతిం దలపోసె నాత్మలోన్ 265

ఉ. ఈనవమోహనాంగుఁ డిపు డిచ్చటి కెచ్చటనుండివచ్చెనో
సూనశరాసనాబ్జబలసూదనజాతరసంతయక్షరా
ట్సూనులఁ గేరు నీఘనునిఁ బోయగముంగని దేవతాపురీ
మానినులైనఁ జిత్తముల మాటికి నువ్విళులూరరే! తగన్. 266

సీ. చిక్కలిపుల్దిండిరాలకు నుప్పుసికకప్పు
తొగరేనినగనొప్పు మొగముచొప్పు
తీయ్యవిల్కానిగదియ నొంపునెదనింపు
జడమెకంబదలింపు నడుముసొంపు
చిందమంపముఁగోరు జీరకంఠముతీరు
తోవలనుమీరు కందోయిసౌరు
యేనికకేల్పసనెలయించు దొడసంచు
తలిరులనొంచు పాదములమించు [యొయార
ఆ. నౌర ? యీమనోహరాకార రేఖయీ, కాయసౌకుమార్య? మీ
మెందునై నగలదెయితనికొలికేళి, నయుసుదతిభాగ్యమెన్నదరమె.
చ. ఎదుట గనుంగొనంగడవ యీరసికాగ్రణియుండుదజిక్కునా

మదియిఁక నెట్టులోర్తు నను మన్ననసాతఁడు గాంచు టెట్లు లోఁ
బొదలిన మోహతాపశిఖిపొంగిఁక నేగతి నారు నక్కటా!
చెదరని చింతలంనునుగఁ జేసెగదా విధియేమిసేయుదున్!. 268

ఉ. గ్రక్కున నేగి యాసొగసుకానికి నావెత లెల్లఁదెల్పి యీ
చక్కికిదోడితెచ్చి మది సంతసమంపఁగఁ గూర్చువారు నా
కిక్కడ నెవ్వరిప్పగది యిక్షుశరాసనసాయకవ్యథం
జిక్కకయుండుదాననని చేడియ చింతమునింగియుండఁగన్. 269

ఉ. ఆతరుణీలలామసఖ యత్తరి నచ్చటి కేగుదెంచి మో
హాతికృశాంగియైన జలజాననఁగన్గొని డాయనేగి యో
భీతకురంగనేత్ర! యిటు బెగ్గిలి నెమ్మది లోన నింత యే
లాతపియింప? నీదగుతలం పెరిగింపుము దాఁచ కంతయున్. 270

క. చెప్పిన నెప్పనియేనియు, నిప్పుడు సమకూర్తుచెలిమి కెయ్యెడలను నే
దప్పమ తెవ్వరు నమ్మిన, కప్పురగంధు లిఁక నీకు కమలదళాక్షీ. 271

చ. అనవుడు తత్సతీతిలక మాత్మముఖంబున నొంద సిగ్గు పెం
పున దనవాంఛితంబు వెలిఁబుచ్చఁగలేక యొకింత సేపు న
మ్రనవముఖాబ్జయై యితరమానినులచ్చట లేకయుండుటల్
గనుఁగొని యెట్టకేలకు మొగంబొకయించుక యెత్తి యత్తరిన్. 272

ఉ. నెచ్చెలిఁ జూచిపల్కెఁ దరుణీ! వినవమ్మ మనోహరాకృతిం
బచ్చనివింటిజోదు గెలువంగల యొక్కవయోవిలాసునిం
ఇచ్చగ రాజవీథి జరియింపఁగఁ గాంచితి నంతనుండి లోఁ
గచ్చుగనంగజొచ్చె దమకంబిఁక నేగతిఁ దాళియుండుదున్. 273

ఉ. ఎక్కడఁబోవ నైప దిఁక యేమియుఁదోఁచక మోహవార్ధిలోఁ
జిక్కిన దాని కిట్టితరిఁ జేడియ నీవొక తెప్పకై వడిన్
గ్రక్కున గానుపించితివి గావున నాతనిదోడితెచ్చి నా
మక్కువఁదీర్పుమంచుఁ బలిమాలిన యాసఖి నవ్వి యిట్లనున్. 274

ఉ. ఈతరి నీకుగానిగుణ మెట్టిది నెమ్మది సంభవించెఁ బ్ర
ఖ్యాతిగ బొట్టుఁగట్టువిభుకంటె విటాకృతిఁ జూడగంటికిన్
బ్రీతివహించెనే మనసునిల్పఁగలేక పరానుకూలవై
పాతకమేలచేసెదవు బంధుజనంబులు విన్న మెత్తురె?. 275

ఉ. ఉత్తమమైనవంశమున నుద్భవమందితి వింతదాఁకస
ద్వృత్తయనంగనొప్పితివి యేకతసిత్తరి నన్యపూరుషా
యత్తమనోంబుజాత వగుటర్హమె? నీసరికామినీమణుల్
పొత్తువహింతురే సుగతిఁబొందఁగనేర్తువె వారిజాననా!. 276

ఉ. అత్తగయాళి మామకపటాత్ముఁడు చెంత సపత్ని నీవయిం
గుత్తుకబంటి బావప్రతికూలుఁడు నాథుఁడు కోపధారి ని
న్నత్తినతోడికోడలు మహాశసి యేమిట నెంచిచూచినం
గత్తులబోను కాపురము కామిని! నీతలఁ బొప్ప దియ్యెడన్. 277

మ. అనినం జిత్తములోన నతిలి వయస్యా! నీవు నాతోడఁ జె
ప్పినసాంసారికధర్మమంతయు నిజంబే కాని నాదేహమా
తనితోఁ గూడక నిల్వ దెట్టులయినం దాక్షిణ్యాభావంబునం
జని తో డ్తెమ్మిట వానిసత్వరగతిం జాతుర్య మేపారఁగన్. 278

క. వ్యామోహము దీరినతుడి, నేమైనను లెన్నయింక నేమియునన కో
కామినీ! నన్నుఁబ్రసికింపుము, కాముఁడుమననీడటంచుఁగరములుమోడ్పన్.

చ. చెలి గని యింత యేలవగఁ జెందుదు? లోకముపాడి యెంచి యే
దెలిపితిఁగాని నీకిటుల చెప్పరమాటకు నేసహింతునే!
వెలఁది! యనుజ్ఞ యిమ్ము చని వేగమ తోడ్కొని వాని నిప్పుడు
న్గలపెదనన్న మోదమునఁ గౌఁగిటఁజేర్చి లతాంగి యత్తటిన్. 280

ఆ. వీథి మెలఁగుచున్న విటశిఖామణిప్రేలి, సన్నజాలకమున సతికిఁజూపి
వానిఁ దెచ్చినాదు పనటఁదీర్పుము వేగ, పడతి యనుచుఁ బం పెఁబంపుటయు

సీ. ఆయళికచరత్నహర్మ్యాపతీర్ణయై పురవీథికేగతిఁ బోదుననుచు [ను,
ద్వారబంధంబున దిడ్డివాకిటనిలిచి దైవయోగంబున నవ్విలాసి
యచటికిరాఁగనియాడఁబోయినతీర్థ మెదురైనగతి నితఁ డేగుదెంచె
నిచ్చట కనిచేర నేగిరహస్యసం గతిఁదదంభోజాక్షి క్రమముఁ దెలుప

తే. వినియతం డాదిబూనినతెనవ్రతంబు, దెలిపెనమురత్న టంకమే దెచ్చియిత్తు
సంశయింపకరమ్మనిజనము లెవ్వ, లెఱుఁగఁగారాని యొకదారి నెలమి

చ. కొని చని చంద్రకాంతమణిదివ్యసువర్ణకవాటమేఘహా [మీఁటి.
హానమణికట్టిమప్రకటితాంబుజరాగనిబద్ధవేదికా
ఘనతరమౌక్తికస్తబకకాంతవితాననిలింపకామినీ

జనసమసాలభంజికలసంగతినొప్పెడు మేడలోపలన్. 283

చ. శిల్పికళాఢ్య నిర్మిత విచిత్రతరా స్తరణోపరిప్రభా
నల్పసుగంధబంధురలతాంతము భాసురరత్నకాంచనో
త్కల్పితకాయమానరుచికాంతము నై తగుహంసతూలికా
తల్పమునందు నాతని ముదంబుననుంచి లతాంగియంతటన్. 284

ఉ. నచ్చినకూర్మి పెంపెసఁగ నాయిక యున్నెడ కేఁగి లేమ! నేఁ
దెచ్చితి తద్వ్రతంబుపగిదిం ధనమొప్పి విలాసి నాపుడుం
బొచ్చెములేనికూర్మిఁగల పోటివినీఁయటంచుఁ దత్సతి
మెచ్చి సరోరుహానన యమేయముదాప్తి నొసంగి యత్తఱిన్. 285

చ. నడుము చలింప వేణి జఘనంబు పయిన్నటియింపఁ గావిపా
వడరుచిజాళువాజిలుగువన్నియచీరపయింజనింప సొం
పడరిన రత్నహారనివహంబు గుచంబులఁ జొకళింప న
ప్పడతుకవచ్చె ప్రాణసఖిపంపున నారదబ్రహ్మపాలికిన్. 286

క. చనుదెంచి చెలియచెప్పిన,యనువునఁబదియారుమాడలాతనియెదుటం
గనకపుపాత్రంబున నుం, చినఁ గైకొని హర్షభరిత చిత్తుండగుచున్.

చ. తరుణికరంబువట్టి సుమతల్పముమీఁదికిఁ జేరఁదీయుచుకా
సరసిజనేత్ర వాకిలిదెసం గనుభావ మెఱింగి లేచి స
త్వరమున తన్మణీగృహకవాటము గొళ్లెము వెట్టి మళ్లినకా
సురుచిరమందహాసమున సుందరి మోముఅవాంచి సిల్చినన్. 288

ఉ. కామినిడాసి నిండు బిగికౌఁగిటఁబట్టి లతాంతశయ్యపైఁ
జేర్చిమదలిర్పఁజేర్చి తమిపెంపునఁ గామునిభంగిఁ దద్విట
గ్రామణి కేళిదేలునెడఁ గ్రక్కునదానిసపత్ని యొక్కభా
మామణిదెల్పఁ దత్క్రియము మాటుగఁదా విని క్రోధచిత్తయై.

చ. ప్రమదమెలర్పఁ దద్గృహకవాటము డగ్గఱఁజూచి బైటగొ
ళ్లెమువవిలించి యాత్మబలలేశముగొంకక ప్రాణభర్తకు
క్రమమెఱిఁగించి చూపిడుదుఁగాకనితొల్లిటి క్రోధవృత్తి పెం
పమరగఁగాపువెట్టె నల నారదబ్రహ్మయదేవి యంతటన్. 290

చ. తనపతి రాకజాగయినఁ దత్క్రియమంతయు జ్ఞానదృష్టిచేఁ
గన్గొని చింతలేక మిహికాకరమౌళి కృపాకటాక్ష మీా

యనువునసుండె శాంభవగణార్చనమానుటఁగూడ దెట్టు లా
ఘనవ్రతమార్గమే నిపుడు గైకొని యీదినచర్యఁ దీర్చెదన్. 291

వ. అని విచారించి. 292

చ. కలుకులొయారి గబ్బిచనుగుబ్బలపై నజజారుపైఁటచె
న్నలరెడు జారుకొప్పుగలనాతులు డాపలికేలలీలగా
వలపలికేల మొల్లవిరిబంతివిటాళివశీకరైకవృ
గ్వలనముఁ గల్గినిల్చి దలవాఁకిలిచెంత విటీవిధంబునన్. 293

ఉ. ఆగతినిల్చినం బురజనావళి తత్స్థితిఁ గాంచి యిమ్మహా
భాగ యిదేమొకో? యితరపద్ధతి నేఁడు వహించియుండెఁ దా
నేగతినుండుఁగాక! మనకేమిటి కీమె గుణంబులెంచ రా
హ్యాగనివాసుఁడే యెఱుఁగునంచుఁ బదానతులొచు నేగఁగాన్. 294

మ. జలజాతాయతనేత్ర భావమరయం జంద్రార్ధకోటీరుఁ డ
య్యెడభాస్వద్విటవేషియై యొకవ్రుఁగా నేతెంచి యొయ్యారి! మే
ర్పడఁగానిల్చిన దానిగాంచి దరిఁజేరంబోయి యోకాంత! యె
క్కడ నేఁగన్గొనలేదు నీవిలసదాకారాభిలీలాగతుల్. 295

చ. అలికులవేణి! నిన్గనినయప్పటినుండి మదీయచిత్త మ
గ్గలముగ నిన్నుఁజెందె నదిగావున నిత్తరి నీకుఁ దగ్గరో
వెలయిఁడలేచు గాని కలవిత్తముదాఁచక యిత్తుగొమ్ము మా
డలువదియాఱటన్న మగుడంబలికెన్ సతిసమ్మతాత్మయై. 296

చ. అనఘతరాత్మ! నేఁగొనుపదార్థ మదంతియకాని యెక్కుఁడా
ధనమునకాససేయ ప్రమదంబున లోపలికేగుదెంచి చెం
దినభవదీయవాంఛితము దీర్చికొనం దగు సత్వరంబుగా
ననిన దరస్మితాంచితముఖాంబురుహంబున నాఁతఁ డిట్లనున్. 297

ఉ. ఒక్కెడ మాకుచాలపనియున్నది మే మటపోయి క్రమ్మఱం
గ్రక్కున వత్తుమీముడుపు గైకొనుమంచు నొసంగఁబోవ మీ
యక్కఱఁ దీర్చుపిమ్మట పదార్థముఁ జేకొనఁ జెల్లుఁగాక మున్
దక్కనటంచుఁ బుచ్చికొనధర్మమె యంచు లతాంగివల్కినన్. 298

ఉ. ఇచ్చిన ముల్లెగైకొనుట కేటికి గొంకెద విప్పఁ జైన న
న్నచ్చుగనేల నట్టి తుదనైన నొసంగెదువాఁడ నేను యే

వెచ్చము క్రిందనైన నివివీడునపిమ్మట దెమ్మటన్న నే
నిచ్చునదేమి గాన కొను మిందునిభానన యన్న నిట్లనున్!. 299

ఉ. మాయలమాట లేమిటికి మన్నియమంబు వినుండు తెల్పెద
న్నాయక యీగతిం దివసనాథుఁడు గ్రుంకిన దాఁకయుండి త
త్కాయకలబ్ధి రాత్రిగణకాండసమర్చ లొనర్చుసారము
త్యాయతసిక్తభానుఁ డపరాంబుధిఁ జేరుచు నుండెగావునన్. 300

ఆ. సమ్మతించి తేని యిమ్ముల్లెయొసఁగునీ
కోర్కె యిపుడె తీర్చి కొనఁగవలయు
కానియెడలధనము కై కొనమాటల
ప్రొద్దుఁగడపవ్రతము పోవుననిన. 301

ఉ. కామినియట్టెపోయి తిరుగం జనుదెంతు నటన్న మాత్రనీ
నేమముపోవునే తెలియ నేరని దానవుగాన నింతికిం
గాముకుఁ డర్థమిచ్చి తన కార్యముఁ దీరిచికోకపోవఁ డిం
కేమిటికింత చేర్చుకొను మిచ్చెదద్రవ్యము వేగవచ్చెదన్. 302

చ. అని బహుభంగుల న్జలరుహాక్షికి నమ్మికపుట్టబల్కి నో
య్యననోడపాటొనర్చి పనియాలువ రాల్ సతిచేతి కిచ్చి యా
ఘనుఁడటఁ బాసిపోయెఁ గలకంఠి యొకించుక సేపుచూచియా
తనిపునరాగతక్రమము దప్పిన నంతవిచార చిత్తయై. 303

చ. కటకట! మోసపోతి దినకాయక మేగతిఁదీర్తుఁ బద్మినీ
విటుఁ డపరాద్రిఁ జేరె నలవేడుకకాఁ డిట రాకయుండె న
క్కుటిలునిమాట దబ్బరనికోకధనంబవుడేల కొంటి నే
డెటువలెఁదొంటికై నడి గణేశ్వరపూజలు చెల్లుదైవమా!. 304

ఉ. కాయకలబ్ధికై యరిగి కాంతుఁడుబందిని జిక్కెఁ దత్క్రియం
బీయెడ నేవహించి దినకృత్యము దీర్తునటంచుఁ బూనినన్
*మాయవిటుండు నను మాటల నేభ్రమయించిపోయి రాఁ
డాయె ధనవ్యయంబు కొఱయారెనె తదీప్సితసిద్ధిగాకమున్. 305

ఉ. ఇంతటికేమి మన్నియమమిద్దివసంబున గానియట్లు గా
స్వాంతము నందుఁదోఁచె నిఁక పంచనయేటికి చింతఁదక్కి దే
హాంతమొనర్తునంచు నిశితాసియురంబున నాను నంతలో

గంతువిరోధిప్రేమ్రోలఁ బొడకట్టెనహోరానలకంచుఁ జెచ్చెలున్. 306

తే. అతుల సన్నిధిసేయఁ దదంబుజాక్షి
విస్మయానందములు మది వెల్లిగొనఁగ
మ్రొక్కి నిల్చిన శర్వుఁడో ముదితె యడుగు
మిత్తు వర మనిపల్కిన నెలమిమీరి. 307

క. గిరిజేశ! మీరొసంగిన, వరముగొన న్నాకుఁదగునె వల్లభుఁ డొకచో
వెఱవరియుండఁగ నాతని, కరుణంబిలుపించియుండు కామితఫలముల్.

తే. అనినపరహాసవదనుఁడై యద్రిసంభ
వాధినాయకుఁ డట్లె యగా ననుచు నసఘ
భావుఁడైనట్టి యాదర బ్రహ్మునాత్మ
ముదమునఁదలంచె నంతకమున్న యచట. 309

సీ. అలధనికునిపిన్నయాలుసపత్నికా పరభవవీక్షణ వాంఛదవిలి
రమణుండు రాజకార్యపుతమి నంతఁగిపురమునకు సరగునరాకయున్న
నెప్పుడువచ్చెదల్వెప్పుడుతీసిచూపుదునంచు కోరికనెదురుచూచు
చుండెనాలో బ్రహ్మఁ డొక్కింతసేపుండి మగుడ రానేరకమానసమున

తే. వ్రతముజరుపుటకై వచ్చి బందిపడితి
ప్రొద్దుగ్రుంకుచు నున్నది పోవరాదు
నేఁడు గణపూజసాగ దెన్నిటగణింప
ననుపరిత్యాగనర్హ మా ననుచునుండి. 310

క. తనువించుకపరవశమై, కనుదెఱచిన యంతలోన గఱకంఠుకృపం
దనమందిరమున నిల్చిన, గనితత్క్షముదాక్షి మోదకమలధి దేలెన్.

ఉ. అత్తరినాఘనుండు హృదయంబున విస్మయ మావహిల్లన
త్రైత్తి గణేశసర్వదిగధీశ వృషేశమునీశ యుక్తుఁడౌ
చిత్తజవైరిగాంచి కలఁజెంచితినో యదిగాక నిక్కమో
యిత్తెఱఁగౌటకేమికత మియ్యెడనంచుఁ దలంచుచుండఁగన్. 312

ఉ. బాలశశాంకశేఖరుఁడు భక్తవరా! యిటురమ్ము! నీదుజం
బాలరుహాక్షినీవచట బందిని జిక్కభవద్వ్రతంబుఁ దా
నాలరిగాఁగనీక వెలయాలివిధంబు వహించె నోయగం
బాలితామలాంగి యహాహాయనిమానసమందు మెచ్చఁగన్. 313

చ. అట్లు వహించి ద్వారముల కంతట నింతట సంచరించి నీ
క్కట్టకజనంబు లెల్ల నెడగాజననొల్లక పల్లవుండనై
యిటకరుదెంచి బల్మి ముడుపిచ్చెద వచ్చెదనంచు నేగె నం
తటమఱికొంత సేపు గని తన్విశరీరము వీడఁజూడఁగాన్. 314

గీ. అంతలో నేను ప్రత్యక్షమై వరంబు
వేఁడు మనవుడు నిన్ను రప్పించి యొసఁగు
మనియెఁ గావున నిటకు రాఁబనిచినాఁడ
నడుగు వాంఛితమనిన బ్రహ్మయ్య దెలసి. 315

క. ప్రమదమనోపహరుండగు, ప్రమథేశ్వరుదివ్యపాదపద్మంబులకుం
ప్రమదారత్నముతానును, ప్రమదంబున మ్రొక్కి యిటుల బ్రస్తుతి చేసెన్.

సీ. దరసమదేహమందరధరాధరగేహ పన్నగభూషయాపన్నపోష
కాండధితూణ ప్రకాండశైశవబాణ రాజకిరీటఘోరాజఘోట
సురనుతపాత్ర భాసురతమోహాననేత్ర నతమునిజాల దీనతతిపాల
కరధృతశూల శ్రీకరపార్వతీలోల నవకృత్తివాస దానవనిరాస
తే. వనజమ్మృదుపాదసేవకావనవినోద
కల్పవిధిదీక్షయాశ్రితకల్పవృక్ష
పరభయదవేష ఘనదయాపరమనీష
కాలముఖశాస్త్రఘాతకంకాళహస్త. 317

చ. అనియిటుసన్నుతించి ప్రమథాధిపతావకమూర్తి దర్శనం
బొనరుటకంటె వేరె మఱియున్నదె వాంఛితమైన వేడెద
న్ననురతిగూడినట్టి లలనావళితోడుత నన్ను నీపదం
బున దయఁజేర్పవే యనిన భోగివిభూషణుఁ డావరంబునన్. 318

తే. అట్లయగాక! యనుచు బ్రహ్మయ్య సతని
కామినీమణి నాతనిఁ గలసినట్టి
మందయానలఁ బుష్పవిమానపంక్తిఁ
గూర్చి కొనిపోయెఁ గైలాసకుధరమునకు. 319

వ. అంతతద్ధనికాంగనయు బ్రహ్మయ్యసాంగత్యవిశేషంబున తేజోమయ
స్వరూపయై కైలాసంబున కేగుచు నాస్థానంబున నున్న నిజనాథు
నకు తనమోక్షపదప్రాప్తివిధం బెఱింగించి యతండు చూడ

నంతర్ధానంబు నొందిన నచ్చెరువంది వేగంబ యభ్యంతరమందిరం బునకుం జనిన యాతనికిన్న యాలెదురువచ్చి సవతి నేరం బెంచుచు నత నింగొని చని యదె చూడుమని తలుపుగొళ్లెంబుదీయ తద్గృహంబు శూన్యంబైయున్న యాసుదతి లజ్జనొందియుండె నతండొక్కింత సేపు చింతాక్రాంతుండై నిజసతీలలామభాగ్యం బగ్గించుచుం దనవారిక త్తెఱంగు నెఱింగింపుచు నంజలినూని యెప్పటియట్ల వర్తిల్లె గావున దూరదృష్టిగలసతీవతంసంబు మాహాత్మ్యం బిట్టిదని నిజనాథునితోఁ గ్రమ్మఱ దద్వృత్తాంతంబు సత్వరంగాఁ జెప్పందలంచి శాంతసత్త ర్కా యిట్లనియె. 320

ఉ. అత్తరి నచ్చటం గలగణాధిపులెల్లఱు విస్మయాత్ములై
యిత్తెఱఁ గెందునుంగలదె యింతియుభర్తయు నేకచిత్తులై
బత్తియొనర్చి రంచు బహుభంగుల సన్నుతిసేయు నందులో
నుత్తముఁ డొక్కరుండనియె నుక్తిసుధారస ముప్పతిల్లఁగన్. 321

సీ. శ్రీకాళహస్తిపురీస్థలి నైనరుండన నొక్కభక్తుఁ డంగనయుఁ దాను
నయ్యాలేమడిగిన నడుగిడ కిచ్చుచు నుండంగ వారల యుల్లమలర
కట్టుబట్టయ తప్ప గడులేమిఁబుట్టించి శర్వుఁడు భక్తుఁడై చలివచ్చి
బట్టవేఁడినవాని పడతికట్టినదియ్య కొనఁగ నేగిన నొంటికొకతనకు

తే. చాల దంచేఁగెనో యని నైనరాఖ్యుఁ
డాత్మవస్త్రమొసంగఁ బో నంతలోన
నచటప్రత్యక్షమై తన్మహాత్ముఁ డెలమి
వారిఁ గొనిపోయె నాత్మనివాసమునకు. 322

## ఘ్రాణదబ్రహ్మయ్య కథ.

వ. మఱియును. 323

తే. ఘ్రాణదబ్రహ్మయాఖ్యుఁడు గలఁ డొకండు
జంగమారాధనవినోది సత్యవాది
యఖిలవేదాంతవేదనిత్యాను మోది
యమృతసంపాది పరిజనితాన్యవాది. 324

ఉ. ఘ్రాణవిరోధిబాణ పదభక్తుఁ డతండు మహిష్ఠభక్తిక
ళ్యాణమున న్వసించి యనయంబును గాలము గోలజాలెసూం

పాణితలంబునం బడి ప్రభాతమునందు గభీరవాహినీ
వేణుల నేగి యందు మదివేడుక మీనులఁబట్టి వానిలోన్. 325
తే. తొలుతఁ దగులు చేప తుహినాంశుధరునకు
నవలఁదగులు మీన మద్రిసుతకు
మఱియుఁ దగులునట్టి మత్స్యంబు గురునికై
తలగవిడచి పిదపఁ దగులువాని. 326
ఉ. బుంగసమర్చి తెచ్చు మదిపొంగకవేగమ తత్క్రియార్హమా
నంగడివీథిలోన నవియన్నియునమ్మి తదీయలబ్ధిచే
జంగమకోటి కర్చనలుసల్పుచు నుండెను నొక్కనాఁడు హృ
త్సంగతహర్షయై యతనితామరసాయతనేత్ర నమ్రతన్. 327
చ. వరునకు మ్రొక్కి యిట్లనియె వల్లభ! శ్రీబసవప్రధానుమం
దిరమున నేఁడు నాఁడనక తృప్తిగ లక్షయు దొంబదారు వేల్
శరణులు పద్రసాన్నము మెసంగుసురాగణకోటి నొక్కనాఁ
డరయగ మద్గృహంబున శిలార్చన సేయ వదేమి దెల్పుమా. 28
ఉ. పొందుగ వారిఁబిల్చుటకు బుద్ధిజనింపదొ శక్తిచాలదో
యొందులకేగకుండ బసవేశ్వరు డందఱ నడ్డగించెనో
యిందునకేలరారు మదికెంతయుఁ గోరికపుట్టె నిప్పు డా
నందముగాఁ దదీయభజనం బొనరింపఁగ నన్నుఁ బ్రీతుఁడై. 329
మ. బాలా! నీకిటువంటివాంఛితములోఁబాటిల్లె మేలయ్యె నే
నేలీలం జని మ్రొక్కి వేఁడికొని నీయిష్టంబు చేకూర త
త్కాలాత్మాంఘ్రిసరోజభక్తిలికవాక్యంబు దోడ్తెచ్చి నేఁ
డేలింగార్చన సల్పఁజేయుదుఁ జుమీ డెందంబునం దింపుఁగన్. 330
క. అనిపలికి నతిరయమ్మునఁ, బని విని యాశరణవరుఁడు బసవేశనికే
తనమునకొయ్యనఁజనియట, ననుభవమంటపమునందు నద్భుతలీలన్.
సీ. ఘనపురాతనభక్త గణకాద్యులగువారు
శీలమార్గవిమర్శ సేయువారు
కర్మఫలత్యాగధర్మమె న్నెడువారు
నపవర్గమిట్టిది యనెడువారు
శైవాగమగ్రంథ సంధానులగువారు

వేదాంతసూక్తుల వెలయువారు
మంత్రమంత్రార్థము ల్మహిమఁ జెప్పెడువారు
త్రివిధార్చనోన్నతిఁ దెలుపువారు
తే. నగుచు యెడ్డోలగంబున్న నబ్జమాళి
భక్తతతిఁజేరి సాష్టాంగవందనంబు
సలిపి వీడ్యంబు భూతి తత్సన్నిధాన
మందు నిడి భక్తిఁ దొలుక బ్రహ్మయ్య యనియె. 332
చ. సదమల చిత్తులార! తమసన్నిధి నేనొక విన్నపంబుచే
సెద దయ చిత్తమం దునిచి సేవకునింట శివార్చనంబు మే
ల్గదుర నొనర్పఁగా వలయుఁ గన్నడ సేయక మీరలన్న నె
మ్మది వెలిగంది వా రనిరి మందదరస్మితవక్త్రపద్ములై. 333
ఉ. ఎన్నఁడు నిన్నెఱుంగము నీకెక్కడ నెయ్యది పేరులింగసం
పన్నుఁ డనం బ్రసిద్ధి గనుబండరికేగెడుఁ గాక భూమిపై
నెన్నఁగ వేఱొకండు గలఁడే మమునందఱఁ బిల్చిపెట్ట నీ
వన్నసదుక్తి కీట్టులన నాయితుగాదన నాతఁ డిట్లనున్. 334
ఆ. ఘనగుణాఢ్యులార! ఘ్రాణదబ్రహ్మయ్య
నామ మిప్పురంబు ననవసించు
మీకృపాసమృద్ధి నేకొఱఁతయుగల్గ
దరుగుదెండు సంశయంబుమాని. 335
చ. అన విని సమ్మతించి శరణావళిభూతి గ్రహింపఁబొంది య
య్యనఘుఁడు వేగ నేగి ప్రియకఁతయుఁ దప్పకచెప్పి తొంటిలా
గునఁ దనకాయకంబు కొఱకుం జని చాల గలుంగమీలఁగై
కొనిచని యొక్కవీథి వెలకుం దగనమ్ముచు నున్న నత్తఱిన్. 336
క. ఒకభక్తుఁడుగనిచనిగణ,నికరమునకుఁ దద్విధంబునిజముగఁదెలుపఁగా
నిక్కమొమ్మృషయోయనివేఱొకనినసుపనేగియాతఁడుల్లంబెరియన్.
చ. కనుగొని వేగవచ్చి గణకాండముగన్గొని స్వాములార! నేఁ
బని విని గాంచి వచ్చితలవాఁ డొకయంగడి హేయ మెంచక
మ్మునమున నొక్కమీనమిడి మూగిన నీగలఁజేతిరెమ్మ బోఁ
జొనుపుచు దీసిగొండు వెలసా మ్మనియమ్ముచు నున్నవాఁ డనన్. 338

మ. విని వాఁ డందఱు మోసపుచ్చె నిఁక నే వెంటం జన న్వచ్చు నే
మని వైసారిణవాసవాన్వితకుటీరాన్నంబు నేసెట్లు గై
కొనవచ్చున్ సనిచప్పె నీదినము కన్యాకర్తింబడం జెల్ల ది
ప్పనికై యాతఁడురా వెసంగదిమి కంపం జెల్లునం చాఘనుల్. 33)

క. ఒక్కమతినున్న బ్రహ్మం, డక్కడమీఁ లమ్మి తెచ్చు నర్థముచేఁ బెం
పెక్క మతిబోక యత్నం, బక్కజముగఁ జేయఁ బనిచెనక్షయలీలన్.

వ. తదనంతరంబ యతండు. 341

చ. అరిగి గణాళిఁ గాంచి శరణార్థిశివార్చన వేళయయ్యె స
త్వరముగ రండు మీర లిట తద్గుణపుంజములోన ధూర్తు లా
శరణులు కొంద ఱౌర! యెకసక్కెములాడఁగ వచ్చి నాఁడ పో
విరసులగాఁగ నెంచితివె వీరలనందఱ నీమనంబునన్. 342

చ. అసమసుగంధబంధురములై చెలువొందెడు షడ్రసాన్నముల్
బసవనియింట నిత్యము నపారముగా భుజియింపుచుండు నీ
కుసుమశరారిభక్తులను గూరిచి పెట్టఁదలంచినాఁడ పో
మసలిడి మత్స్యమాంస మనుమానము లేక భవద్గృహంబునన్. 343

ఉ. ఇచ్చటనుండఁగూడ దిఁక నేగుదు ఓవనసాములార! మీ
యిచ్చకొలంది చేకురెడు హీనపువస్తువు లేల యన్న న
న్మచ్చికగాంచి రమ్మనెడు మాత్రనె పైఁబడి మొత్తిత్రోఁచిన
న్మచ్చమునింగివచ్చి తనముద్దియకంతయుఁ జెప్పెఁ జెప్పినన్. 344

చ. తనమదిలోన కొంతపడి తామరసేక్షణ చింతనొంది యేఁ
జని వినయంబునన్ శరణసంతతికిం బ్రణమిల్లి వేగదో
డ్కొని యిటువత్తునంచు గణకూటముఁ జేరఁగ నేఁగి మ్రొక్కి యో
యనఘతరాత్ములార! పదరయ్య శివార్చనవేళ మించెడిన్. 345

మ. అనినన్ మీగృహసీమభోజనము సేయన్ సమ్మతిం జెంద రీ
యనఘాత్ముల్ చనుమింక నిప్పలుకు మారాడంగ నూహించి తే
ని నిజాధీశునకాపరాభవము తప్పీ నిన్నుఁ జెందుం జుమీ
యన ఖిన్నాననయై వెసంజనియె నాత్మావాసముం దేరఁగన్. 346

మ. చనిప్రాణేశ్వరుతోడఁ బద్ధతి సవిస్తారంబుగాఁ దెల్పి యో
యనఘాత్మా! శరణాళికై నలుపు నీయత్నం బయో! వ్యర్థమై

చనునట్లుండె నీకేమి యీశ్వరకటాక్షం బెట్లుగానున్న దో
యని యాతండును దాను నెంతయును చింతాక్రాంతులై రచ్చటన్.

తే. అంత వృత్తాంతమును ఫణిహారివలన
విని యమాత్యాగ్రగణ్యుండు విస్మితాంత
రంగుఁడై వేగగణనికరంబు దరియ
నరిగి సాష్టాంగమెరఁగి యిట్లనియె యిపుడు. 348

సీ. ఘనులార యూరకే ఘ్రాణదబ్రహ్మయ్యగారి గారియఁ బెట్టఁగార్యమేమి?
హింసాపరుండని యెంచితిరేని జొమ్మయ్యాదిభక్తుల ఖ్యాతివినరె?
యతినీచకాయకంబనిగణించితిరేని యిదిభక్తకాయకంబది యెకాదె?
కులమె ముఖ్యంబని తలఁచితిరేని కక్కయ్యమున్న గుశరణాళిగనరె?

తే. కర్దమమున తమ్మి కాష్ఠంబులోనగ్ని
పలలమందుపాలు శిలలపసిడి
గలిగి వెలుఁగునట్లు ఘనులెట్టు లుండిరి
కొఱఁతగనమి మీర లెఱుఁగరయ్య. 349

మ. జడధివ్రాతపరీతభూతలమునన్ సాక్షాన్మృగవ్యాధరు
ద్రుఁడుగాఁడే ఘనుఁ డామహాత్ముఁ డన నిందోపింపఁగాఁ బాడియే
మృడుభక్తావళిభూతియం దిడుట బత్మేలందురే కావునన్
గడువేడ్కం జని యారగింపవలయుం గాకన్న వారంచటున్. 350

ఉ. దిగ్గునలేచి యాబసవధీమణి నీమదిఁదోచుమార్గమే
యొగ్గగు గాన బోదమని ముందఱ చారుని బంప వారలం
డగ్గఱఁజేరి యాతఁ డెదురన్ ధరజాగిలిమ్రొక్కఁ గాంచి వే
యగ్గలమైన ప్రేమ దొలుకాడఁగ లేవఁగనెత్తి యిద్దఱున్. 351

క. ఓయయ్య యేమివచ్చితి, వీయెడ కని యడుగ నాతఁ డిదె బసవనితో
మీయాలయమున మాధవ,సాయకభక్తాళిగుడుప జను దెంచెననన్.

చ. అమృతము వీనులం జిలుకునట్లుగఁ దద్వచనానుభూతి మో
దము మదిఁ బొంగి పర్వ విని తండ్రి! దయాపరమూర్తి శోకవా
ర్ధి మునిఁగియున్న మాకడకుఁ దెప్పవిధంబున వచ్చినాఁడ విం
క మఱుతుమయ్య యుష్మదుపకారమటంచు నుతించుచుండఁగాన్.

చ. గొడుగులు నాలవట్టములు గుంచెలు చామరతాళవృంతముల్

పడగలుశోభిలంగఁ బసపాయుఁ డహో! యని కంచుసువ్రజం
బెడ నెడ నెచ్చరింప బసవేశ పురస్సరులై ముదంబునం
బుడమి చలింపవచ్చె గణపుంజము తద్గృహసీమకత్తరిన్. 354

సీ. ఎదురేగిముదమునముదితయుఁదానుసాష్టాంగంబుచేసిపాద్యాదులిచ్చి
తోడ్తెచ్చి నిర్మధితోయమజ్జనములు గావించి మడుగులు గట్ట నిచ్చి
వరుసదీర్చిన రంగవల్లులవెంబడి బంతులు సాగించి పత్త్రపుష్ప
గంధాక్షతాదిలింగసమర్చనద్రవ్యములుగూర్చి తత్క్రియల్ జరుపు [నంత
తే. భాసురాచ్ఛిద్రకదలికాపత్త్రభాజ
నములు మెల్లన ప్రక్షాళనం బొనర్చి
తానె కొనివచ్చి వారికందఱికి వైచి
స్వర్ణరచితపుభపకముల్ సరసనుంచె. 355

క. అంతటఁ దద్గజగామిని, సంతోష మెలర్ప భక్తసంఘంబునకుం
స్వాంతములుపల్లవింపఁగ, వింతఁగవడ్డింపఁదొడఁ రెవిభునాజ్ఞ మెయిన్.

చ. కలమపువంటకం బిగురుకాయలుగూరలు గందిపప్పు ద
ప్పళములు చారు రావయిడు పచ్చడు లామ్రరసంబు దేనె య
ప్పళములు బొల్లిమూలములు బాయసముల్ పులఖండ మూరుగా
యలు వరుగుల్ ఫలంబు లొడియంబులు గమ్మని నెయ్యి వెన్నయున్.

తే. గారె లరిసెలు బొబ్బట్లు గరిజెకాయ
లట్లు బూరెలు జంతికెచుట్లు మణుగు
బూలు వెన్నప్పములు జటుబూరె లిడ్డె
నలు మనోహరములు వంట చలిమిడియును. 358

తే పరఁగ నమృతంబుతో సరిపాలు పాలు
పేర్మిమంచున నిరసించు పెరుఁగు పెరుఁగు
చాల వెన్నెలరుచి వెదచల్లు చల్ల
మేటిరుచిజాలములలోని తేట తేట. 359

క. ఎవ్వరికెవ్విధి యిష్టం, బవ్విధి వడ్డింప శివుని నర్పించి రుచుల్
నివ్వటిల భక్తులందఱు, నవ్వేళ నారోగిణంబొనర్చిరి తమిచేన్.

తే. అంతఁ గర్పూరతాంబూల మర్పణంబు
చేసి యొకయెడ నంద ఆసీనులైన

యవసరంబున నెదుట బ్రహ్మయ్య కేలు
మొగిచి నిలిచినబసవండు ముదమెలర్ప 361

చ. అతనిప్రభావ మెల్ల శరణావళికిం గనుపింపఁ బూనియో
యతులగుణాఢ్యు నీవహరహంబొనరించెడు వేఁట మెట్టిదో
కుతుకముతోఁ గనుంగొనఁగఁ గోరిరి భక్తులు గాన వీరి యీ
ప్సితము నెఱుఁగూర్పుమా యనిన వేగమ బ్రహ్మయ సంతసంబునన్. 362

మ. సకలార్యావరభక్తకోటికడు మెచ్చం జెంత తన్మజ్జనో
దకకుండాంతికమందు నిల్చి కరయుగ్మంబునం జట్టు జా
రెకబంధారకమందు నిల్పి తివనక్షలేఖాళి బ్రహ్మాచ్యుతేం
ద్రకకుప్పాలకరుద్రగోపగిరిజాతాశ్వమూర్తుల్ వ్రాసెన్. 363

క. అమ్మెయి ననొక్కపరి గ్రామ్మునరాశిఁ బులఁది చెలంగుచు దసిచి
త్రమ్ములఁ గడు విస్మయమో, దమ్ములు బెనఁగొనఁగ లేచి ధరణిరథునకున్.

క. సాష్టాంగ మెఱఁగి శంకర, దుష్టగజాసురవిదూర తోయోద్భవనే
త్రేష్టఫణినాయకాంగద, యష్టాపదశైలచాపహర త్రిపురారీ. 365

చ. అనివినుతించుచున్నసమయంబున ధూర్జటి బ్రహ్మచర్యుఁడ
వ్వనరుహనేత్ర గాంచి చెలువంబగు తావకభక్తికాత్మ మె
చ్చొనరపదండఁ బోదమని యజ్జ్వలపుష్పవిమానమెక్కఁగా
బనిచి నిజాలయంబులకు వారలఁ దోడ్కొని పోయె నత్తరిన్. 366

చ. బసవఁడుమున్ను గాఁగలుగు భక్తులు హాయిటు లెన్నఁ డెవ్వర
వ్వాపుమతి గాన లేదితఁడు పట్టినకాయకమెంత యిప్పుడీ
యసదృశజంగమార్చన మహామహిమంబది యెంతబాపురే
ప్రసవశరారి మెచ్చుగను భక్తుఁడితండె మదిం దలంచఁగాన్. 367

క. అనియిటు తద్దంపతులును, గొనియాడుచు భోజనమునకు న్మెచ్చుచు భ
క్తసికాయమునై జనికే, తనములకుంజని యె మంత్రితనయులు చేరన్.

వ. అనిచెప్పి యాజంగమార్యుండిట్లనియె నెదుటనున్న వారలెల్లనేక మన
స్కులై యాపత్సమయంబునయైనను భక్తిఁ వదలక సీవ్వరుకరుణవడ
సిన శరణులురు గలరు తత్క్రమం బెట్టిదనిన వినుండని యిట్లనియె.

ఉ. శంకరపాదభక్తుఁ డఘశాసనుఁ డాంతవైవర్ణనా
శంకరుఁడార్యసన్నుతుఁడు శాశ్వతకీర్తియుతుండు ఖండితా

హంకరణుండు పావకగుణాఢ్యుఁడు మారట శంభుమూర్తిని
శ్శంకసమాహ్వయుండు గణసత్తముఁడొప్పు ధరాతలంబునన్. 370

మారటశంభుమూర్తి యను నిశ్శంకుని కథ.

ఉ. అతఁడుగురూపదేశమున హాలికుఁడౌచు తదీయలబ్ధిచే
సతతముజంగమార్చనము సల్పుచునుండఁగ నొక్కనాఁడుత
న్మతిఁబరికింప శర్వుఁడు కుమారుఁడు నాతఁడు చేనుదున్నఁగా
ధృతిగతినొక్కఘోరవిషకృష్ణభుజంగముఁ బంపెనంపినన్. 371

శా. తత్కుంభీనసమాత్మ దంతగరళోద్యత్పావకజ్వాలికా
ఘూత్కారంబులు పర్వ నాతనిసుతుల్ బొల్పార మూర్ఛన్న చో
హృత్కంపంబున బొందడత్తులజలం బేతేరసీవిప్పఁడా
పత్కాలం బరుదెంచె నంచు వడిఁజెప్పంజేరి కించిద్వ్యథన్. 372

క. జననీజనకులఁదలఁపఁడు, వనితామణినడువడాప్తవర్గముఁబిలువం
డనుమానపడఁడుమాంత్రిక,జనముం బేర్కొనఁడు కాలుజాడింపఁడొగిన్.

క. చెడుపురుపని నెమ్మదిలో, దడవఁడునిజకాయకంబుదప్పఁడు పెదవుల్
దడపఁడుదైవముదూరఁడు,బుడుతనిధైర్యముఁగణింపఁబోలు నెజగతిన్.

క. అటులుండికొంతవడిక, క్కుటిలోరగవిషము రోమకూపంబులమి
క్కుటమైపర్వుచుదలకెక్కుటయుంగతజీవుఁడగుచుఁ గూలెన్నేలన్.

క. అక్కరణిఁబడినసుతుఁగని, యొక్కింతయువగవకాతఁ డూరకవానిం
గ్రక్కునసీడిచితనదగు, దుక్కిపనుల్ సేయుచున్న ధూర్జటియంతన్.

తే. అప్పటప్పటికప్పురికరిగిభిక్షు,గొనుచుదమునద్దరినిమున్ను గురుతెలుఁగ్గు
శరణుకై వడినొక్కవేషంబుదాల్చి, యలసితనచేనిచెంగటనిలచి యు[న్న.

తే. జంగమాకృతిగాంచి నిశ్శంకుఁ డేరు
నిలిపివందన మొనరింప సిటలమందు
భూతిధరియించి యోపుణ్యపురుష యింత
వంటకము వెట్టు మా. కొన్న వారమనిన. 378

చ. గరళగళాభ యొక్క ఘటికాద్వయమీడ సిలుండు తెత్తురో
గిరములుమీకు యోగ్యముగఁ గీల్కొనునాఁకట నంతదాఁకనో
ర్వరయుతి రేనిమామకనివాసముఁజేరి భుజింపుఁడేనస
త్వరమునవత్తుఁగాని ధ్యటవచ్చిననిచ్చట గాయకంబరున్. 379

చ. ఇదియును మీవిధించుపని యే యటుగావున పాండు వేగ మ
ల్లదె తెరువన్నమల్లి శరణాగ్రణిపోవఁగ చెంతగాలఁబెఁ
గుధిగొను కాలసర్పమునఁ గూలినయర్భకు గాంచి బిట్టు గా
నదరిపడంకుచుం దిరిగి యక్షులు మూయుచు భీతుకైవడిన్. 380

క. తనపైఁబడనిశ్శంకుఁడు, పెనుచేతులఁజఱచి యింత వెఱవఁగ నో హో
యననాతఁడిట్టులను మీ, తనయుండట్లనికి కనలె తలకవు మదిలోన్.

సీ. పాపనివధియించెఁ బాఁపపురుషని, దానిఁజంపవదేమి దలఁచినావు
పరులయాపదకైనబరితపింతురుబుధు,ల్లాఁడుకుసికడమీఁదుపుడముఁగలదె
యింతనిర్మోహిని యెందుఁజూడఁగ లేదు, నీయంతకఠినుని నిన్నెకాని
పుత్రలాభంబెంత పుణ్యవంతునకబ్బు,గతిఁజేర్పనేరిక సుతుఁడుకాఁడె

తే. యనిన నిశ్శంకుఁడనియె ఋణానుబంధ
మునను సమకూడుఁదురుసతి కెనయముఖ్యు
లవనినది దీరఁబోవుదు రంతమంత్ర
మునను వగఁజెంద నేటికో యనఘమూర్తి. 382

తే. పాండుసుతుఁ డర్జునుం డంత పరితపించి
మరలదేనో పెనే యభిమన్యుఁడొల్లి
యెచటితలిదండ్రు లయ్యాయో యెచటిసుతులు
చిక్కనేమాయనీపద సేవకుండు. 383

సీ. అనిన మృపాజంగమార్యుండుగినిసి నీ విపరీతవైరాగ్య మిపుడుమాని
భక్తులకెఱిగింపు బ్రతికింతురీతని నెట్లన్ననొక్కమహీంతలేశుఁ
బెలిదేవి వేమయ్యప్రీతిచేబ్రదికించె మునుపిళ్లనైనారు మనిచెవెలమ
నటుగాన వేగ భక్తాళికీగతిఁదెల్ప పదనీకు నేజతపత్తుఁగాని

తే. యనిన నిశ్శంకుఁడనియె నోయయ్యసకల
మెఱిఁగియుండియు మీరిటు లేలపల్క
జిక్కిమాదన్న యీశ్వరుఁ జెందువిధము
దెలిపెనాభక్తులకువాని తీగఁబోణి. 384

క. కావున ననిత్యతనువుల, కేవగఁజెందంగఁ జెల్లునే యన మది త
ద్దేవుండచ్చెరువందుచు, నావలికరుగంగవానియన్న మును మునన్.

క. కనుపించినవానికి త, మ్మునిగతివినుపింపనవ్వుమోమున యనెనో

యనఘాత్మ మీరలెఱుఁగని, ఘనతరసద్భక్తిపథము గలదే జగతిన్.

శా. సాయంకాలమునందు పక్షులు ధరాజాతంబునం దన్నియుం
దోయం బై వసియించి వేగవిడియం దుంబోవ కొండొంటితోఁ
బాయంజాలక నిల్చెనే యటులనో భవ్యాత్మ యీ సోదర
న్యాయం బిట్టిద వానికై వగవఁగా నర్హంబె నాకిత్తఱిన్. 387

చ. అనవుడు నీరపోజగతి నందఱికంటె విరాగి వెన్నము
న్నినకులుఁడై నరామధరణీశుఁడు తమ్ముని పాటుఁ గాంచి లో
గనివగనాపథావళులఁ గ్రమ్మఱ జీవము నిల్పి కొంటితో
చనిపసి చేసెనో యెఱుకచాలదో యాతని కివ్వ్యథంబునన్. 388

తే. భక్తి విజ్ఞానములుగల్గు ఫలము భాౘిత్య
మోహమెడబాయుటయె చాలుగూహకంబు
లెన్ని జన్మములకుఁ గల్గునిట్టి తమ్ము
డక్కటా యెంతకఠినుఁడవయ్య నీవు. 389

వ. అనిన నతం డిట్లనియె. 390

తే. చనిన దేశికవర కరస్థలి జనకుఁడు
జంగమము దాదిసద్భక్తి సాగమూర్తి
సోదరుఁడ పత్యమగుశీల మొనరుముక్తి
తరుణియటుగాక వేఱె బాంధవులు గలరె?. 391

క. అనవుడు నాటసిమదిమె, త్తనగానక యవలఁ జనుచు దర్వీకరద [న్.
ష్టునివడిగాంచియు తద్గతి, వినుపించిన నిటులఁ బల్కె వెలఁదియతనితో

తే. అంతనొకచోటగూడినజనులువచ్చ్వి, పనులుదీరినతుదివిడిచనరెమగుడ
వగచిరే యొకరొక్కరు వారలట్లు, కాఁడె యీబంధకంబనిగడచిచనఁగ.

ఉ. అచ్చెరువంది శూలిచను చవ్వల నాతని భార్యగాంచి యా
ముచ్చటలెల్లఁ దెల్ప విని మోమున దీనత లేకపల్కెనో
సచ్చరితాగ్రగణ్యజనసంతతి ధారుణియందుఁ బుట్టుటల్
చచ్చుటలబ్బురంబె సువిచారులు మెచ్చనిమాట లేటికిన్. 394

చ. అతులనదీప్రవాహమున నాడదియాడది రెండుకాష్ఠముల్
జతపడి కొంతదవ్వరిగి ఒంకతటాలున నడ్డమైనయా
జతవిడి యొక్కటేగునటు సాగరమొక్కటి నిల్చుగావున

న్వేత కుడువంగనేల ననువీడె నతం డని నెమ్మనంబునన్. 395

క. నాపుడుగుహనాశరణుం, డావెల్లదుకతోడ ననియె నబలా ధర నీ
భావంబువంటి కఠినపు, భావం బెయ్యెడలఁ గానఁబడ దెటులన్నన్.

క. పెనిమిటికర్ధాంగం బగు, వనజేక్షణ యనెడునుడిలవంబును నీయం
దునఁ గాన మర్ధ దేహాంగ నినుం జెందంగ నెట్లు గాంచం గలవో.

మ. పతిదైవంబు గురుండు ప్రాణమనుచుం భావంబులో నిల్పి యం
చితభక్తిం జరియించి యాతఁడు మృతిం జెందఁగఁ గేహార్థనా
తృతసూజన్మపితృప్రియాప్రముఖులందే భ్రాంతియుక్తి లేక యూ
ర్జితబుద్ధిన్ సహయానకాసతులు నర్చింపంగ నజ్ఞానులే. 398

చ. అన విని యాలతాంగి వినయంబున నిట్లను దేవ నాథుతో
ననుగమనంబు చేడియల కర్తమె కాని తలంప వీరశై
వనికరమార్గమం దదిధ్రువంబుగఁ జెల్లదు మీరెఱుంగరే?
యనుపమవేదశాస్త్రనివహంబులఁ దెల్పెడురీతు లన్నియున్. 399

క. కావున తనలింగంబే, దైవంబు గురుండు తల్లి దండ్రియుఁ బతియుం
జీవంబు గతియు మతియును, భావింపఁగ వేఱెకలదె భక్తాధీనా.

చ. అనవుడు నేమియుం బలుక కవ్వలికేగి దదీయమాతతోఁ
దనయునివార్తఁ దెల్ప వనితామణి నెమ్మదిఁ గొంకులేక యి
ట్లనెను సమస్తయోనిజనరాగతనీచఘటాలిభిన్నమై
చనుటయె కాక నిల్చునె రసాస్థలి నోబుధవర్య! తెల్పుమా. 401

క. తనయుండనదల్లి యనక, ఘననాట్యపుఁ బొమ్మ లింతె కాక సతములో
ధనదాప్తమాయజిపురంటినఁబడుదురు జనులు కడువడిని పక్షిగతిన్.

క. అనియు నృపాశరణుఁడవో, వనితాతిలకంబ సర్వవసుధాస్థలి నేఁ
గనుగొంటిగాన నీతో, నెనయదు కఠినాత్మఁ జూడ నెచ్చట నైనన్.

తే. తల్లిఁ బోలినదైవంబు దయితసాటిఁ
బంధు వాత్మజమోహంబువంటి మోహ
మవని లేదని యనఁగ నీ యట్టితనయుఁ
డట్టులైయున్న గన్నుల నైనఁగనవు. 404

ఉ. ఆమయదేహి వెఱ్ఱి వికలాంగకుఁ డైనను దల్లి సూనుపైఁ
బ్రేమవిడంగఁ జాలదు ధరిత్రిపయిం గణియింప రోగి గాఁ

డేమిట వెట్టిగాఁడు రుచిరేతరగాత్రుఁడుగాఁడు నీసుత
గ్రామణి యిట్టివాఁ డదటుగాఁ బడఁజొ లెటులేదు నీమదిన్. 405

ఉ. ఇంతటికేమి నీతనయు నిట్టిపదంబును జెందఁజేసె నా
కంతుమదాపహారి కిలకాలము నేమఱఁబోక నెమ్మదిం
భ్రాంతి వహించి యాత్మపదపద్మము నమ్మినఁ జూవె యింతపె
న్వంత ఘటించె వెల్తిడిసె నాసతి యాశివుఁ గొల్చుభాగ్యముల్.

చ. అన విని యాలతాంగి శరణాగ్రణి! న న్నిటులేని భ్రాంతి జొ
న్పినఫలమేమి? యీశ్వరుని నింద యొనర్పఁగ నేల? దేహముల్
వనరుహబుద్బుదంబు లటునంటివి నిత్యములంచు వెఱ్ఱులై
చనుదురె? తావకీనపదసారసభక్తులు ధారుణీస్థలిన్. 407

క. చల్లన గంధవహాశన, మొల్లక ఫణి మన్ను దినఁగ నోపునె మీపద
త్పల్లవదాస్యం బేమఱి, యెల్లెడ భక్తుండు మోహ మెదలో నిడునే.

చ. అన విని చెచ్చెర న్మఱలి యచ్చట శూలధరుండు వారిదా
సిని గని తత్క్రియం బెఱుఁగఁ జేసిన నిట్లనుఁ దండ్రి! యమ్మచూ
పిన జనయిత్రి పెన్విసముఁ బెట్టిన నీశుఁడు చంపఁజూచినం
జనదన మాన్ప నెవ్వరికి శక్యము? దుర్క్రియ లేల? నావుడున్. 409

సీ. అటుబాసి పడియున్న యక్కుమారుని దెస
కేతెంచి సర్పంబు నెడచివైచి
చెవిదండ మంత్రించి చేమెయి నిమిరి భ
స్మముఁ జల్లి లెమ్మనుమాత్ర నతఁడు
కనుదెప్ప లెత్తి నిట్టున నీల్గి యూరుపు
లావిర్భవింపఁగా నావులించి
పరమేశ్వరా! యని పల్కుచు లేచి చెం
గట నిల్చి యున్న దన్గాంచి మ్రొక్క

తే. నాఁత డోరికుమార! ని న్నహి నధింప
నించుకేనియుఁ గనికర ముంచఁబోక
యూర కున్నారు మీవార లౌర! యెంత
కఠినులో యిట్టిజనులను గాన మెచట, [లం

క. మం దనరు మంత్ర మన రీ, చందముఁ గని జనకమాతృజాయాగ్రజు

డెందమున విశ్వసించుట, యందంబని మాకుఁదోఁచ వదిమెట్లన్నన్.

తే. చీమనైతము తన్నింటజిట్టవాడచి
దంశ మొనరించునప్పుడు దానిపాటి
కినుకయును లేదు నీయెడఁ గనికరంబు
లేక చరియించువారిపై లేశ మనిన. 412

సీ. స్వామినాపై వారుజాలినొందరటంచు, వచించుంపమీవంటివారికనుఁగ
యుర్విపై బోరలుటలుత్తమాంగోదర, తాడనములుబొబ్బ లేడుపులును
మేరఱుంగకయున్కి కానసావెనలుండుఁ, గనితలఁపోఁతలుతనువిరక్తి
యివి మొదలగుచేష్టల వసిసాంసారిక, భ్రాంతులెయగాకాక భవదుదార

తే. పత్పయోరుహచింతనాపరుల కెందుఁ
గలుగనేర్చునె యాప్తవర్గంబులెల్ల
సర్వసాధనములు గల్గి సర్వనిహతి
కాపరీక్షిన్మహారాజు నాగికొనిరె.? 413

క. అనవిని వారల నందఱు, ఘననిశ్చలశీలభక్తికలనకు మదినె
క్కొనుసమ్మదమునమునిగణ వనజోదరవక్త్రముఖసుపర్వులుగొలువఁ.

ఉ. శంకరుఁ డక్షయుం డపుడు సన్నిధిచేసినఁగాంచి యంత ని
శ్శంకుఁడు దుక్కినిల్పి యతిసత్వరుఁడై చనుదెంచి యీశప
త్పంకరుహద్వయంబు తనఫాలముసోకి నమస్కరించి స
ద్వంకషగాంగభంగరవవైఖరి సన్నుతిచేసె నేగతిన్. 415

సీ. శ్రీవికచోత్పలాక్షీమనోహరబాణ, బాణవందిత పాదపంకజాత
జాతరూపధరాధరాతతకోదండ, దండధరోద్దర్పదళనదక్ష
దక్షకృతోరువితాననాశీకకరతలన్యస్తభాసురకురంగ
రంగదుత్తుంగతరంగగంగాధర, ధరజామనస్సరస్థాయిహంస

తే. హంసకైరవమిత్ర హవ్యాశనాక్ష, యక్షజిన్మానివినుతమహాప్రభావ
భావసంభవదుర్మదభావహరణ, రణనిహతసింధురాట్సుతప్రముఖదైత్య.

వ. అని సన్నుతించుచున్న నిశ్శంకుని శంకరుండు నిజకరుణాకటాక్షవీక్ష
ణామృతధారాపరిషిక్తాంగుంజేసి భక్తపరాత్పరాకీనచర్యావిశేషంబు
లకు మెచ్చువచ్చె భవదీప్సితం బొసంగెద వేఁడు మనిన నతండు పు
నఃపునఃప్రణామంబు లొనరించి దేవా! భగవద్దర్శనంబుకంటెవాంఛి

తం బొం డెద్దియని నిరుపమానందంబున నున్న నతనికత్పుత్రస్నుషా
పరిచారికాసమేతునింగాఁ గైలాసంబునకుం గొనిపోయె నని చెప్పిన
తత్సభాసదులైన భక్తు లాశరణపుంగవుంగాంచి మీరానతిచ్చిన
మహాత్ములచరితంబులు వినుటంజేసి కృతార్థుల మైతిమని యతనిం
గొనియాడి యందఱు నిజనివాసంబుల కరిగి రట్లుగావునఁ బ్రాణే
శ్వరా! భక్తప్రభావం బిట్టిదని వర్ణన సేయ బ్రహ్మాదుల కశక్యంబే
నెంతదాన నని శాంతసత్తి పలికిన వన్మనోహరుం డాశ్చర్యంబు
నొంది యిట్లనియె భవత్స్వచరితపోనివాసం బెచ్చుట నమ్మహాభాగం
గనుంగొన వేడుకపుట్టెనని తత్సతీవతంసంబు భవదభిప్రాయం బెట్లు
ట్లరమ్మని యతనిం దోడ్కొని. 417

ఉ. శైలములుత్తరించి ఘనసాలవనంబులు మించి వాహినీ
జాలము లెల్ల దాఁటి మృగసర్పవిహంగమయామినీచరా
భీలవిహారదేశమయి పెంపగుశైలవరింగ జానుహృ
న్మాళిపదావలగ్న నిజమానసరై వచియించు సోదరిన్. 418

తే. పతికిఁ జూపిన నతఁడు విభ్రాంతుఁడగుచు
నింతతపమొనరించెదు వింతి కేల
హరుఁడు ప్రత్యక్షమై నీకుఁ బబల యనిన
వినయమున శాంతసత్తి యనియె నిటుల. 419

మ. గురువర్యుం డొకలింగమిచ్చి యిది నీకు న్వేల్పు తత్పూజనా
చరణంబే సకలంబు సుమ్మనిన నాచార్యాజ్ఞ లంఘించి సుం
దరి యోగంబె ఘనం బటంచు నెప్పుడుం దన్నిష్ఠ చేసుండి గా
నరసాన్యం దసుఁడాదరంబున బ్రసన్నుం బోట లేదీ సెకున్. 420

వ. అనిన నతండాచార్యాజ్ఞ మీఱినకతంబునఁ గాదె యెంతయోగంబైన
ను బనిగొనదయ్యె నీక దీనిం గృతార్థం జేయవలయు నని తలంచిన
నిజపత్నిం గనుంగొని యిట్లనియె. 421

ఉ. సజ్జను లెంతయుం బరవిషాదముఁ గాంచి సహించ రన్న చో
నిజ్జలజాక్షి నీకు గణియింపఁగ సోదరి యేగతి న్మహా
సజ్జలరాశి మున్నగవాకనియుం దరిజేర్పకుంట యో
షిజ్జనతావతంస దయఁ జేకొని దీని కృతార్థఁ జేయవే. 422

తే. అనిన ముదమంది పతిశిక్షఁజోహారుసల్పి,కలితపద్మాసనస్థుఁడైయేకరతలమున
లింగమూర్తిని నిల్పి సల్లీలదృష్టి,నొండుభావమెఱుంగక యుండునంత.
తే. హస్తమున జ్యోతిరాకారుఁడైనలింగ
మూర్తి యవయవసహితుఁడై ముదితయెదుట
సన్నిధియొనర్పఁ గాంచి తత్సాధ్వి వినయ
భరితయై మ్రొక్కి యిట్టులఁ బ్రస్తుతించె. 424
ఉత్సాహము. తారహార హీరతుల్యధాళధళ్యవిగ్రహా
శూరమారమారశౌరిసూదనా విషాదనా
సారధీరవారవంద్య సర్వమంగళాధిపా
భారభూరధారమేశ బాణబాణపోషణా. 425
చ. అని వినుతింప శంభుఁడు దయామతి వేఁడుము వాంఛితంబు నా
ఘనకచమారకు ముప్పురకుఁ గల్గఁగఁజేయుము నీపదంబనఁగా
అనవుడు నట్లుగాక యని యప్పుడు దివ్యవిమానపంక్తిచేఁ
గొని చనె రౌప్యశైలమునకున్ సురలద్భుతమందిచూడఁగాన్.
వ. కావున పావనసతీవతంస మాహాత్మ్యం బిట్టిదని నిజచ్ఛాత్రుండైన
యీ కూకదమారనితోఁ దెల్ప నితండు విస్మయాక్రాన్తుండై
పునఃపునః ప్రణామంబు లొనరించి వధూసహితంబుగాఁ గరకమలం
బులు మొగిచి నిలిచినఁ గరుణార్ద్రదృష్టిం గనుంగొని చెన్నబస
వేశ్వరుసన్నిధికిఁ బొమ్మని యనుజ్ఞయిచ్చి నిజేచ్ఛం జనియెం గావున
వీరలమాహాత్మ్యం బిట్టిదని మాదిరాజయ్య దెల్పిన సభాసదుఁలోఁ
జెన్నబసవేశ్వరుం డత్యంతప్రమోదంబు నొంది యతని నిరంతరరాజ
వదుపచారంబులఁ బూజింపుచుండె. 427
క. కూకదమారనిచరితము, ప్రాకటసద్భక్తివినినఁ బఠియించిన ద
ర్వీకరభూషణుకృప నస్తోకశుభావళులు బరఁగుదురు నరు లెపుడున్.
వ. అనిచెప్పిన నగస్త్యుండు తరువాతవృత్తాంతం బేమని యడిగిన. 429
శా. షట్కాలాబ్జధరార్చనా నియమభాస్వచ్చిత్త సంజాత గో
రాట్కాంసారికు బేరపుత్ర సుకుమార శ్రీసమాశ్వాస గో
రాట్కాంతిరవశారదాబ్జశశభృద్రాజద్యశశ్ఖ్యాత వి
ద్విట్కాండాద్భుతబాహుశౌర్యజిత కుంతీవ్యోమ గంగాసుతా. 430

క. శరజాతజన్మమృదుపద, శరజాతవిలగ్నహృదయ సడ్డింభక శ్రీ
శరణసమాగతదేశిక, శరణసపర్యావిధాన సంతుష్టమతీ. 431

మాలినీ. సరసగుణనివాసా శంభుపూజావిలాసా
నిరుపమశుభమూర్తీ నిర్మలాచారవర్తీ
దురితతిమిరసూరా తోషితాప్తార్యవారా
పరహృదయవిభేదీ బంధులోకప్రమోదీ. 432

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జున కరుణాకటాక్షలబ్ధకవితామాధురీ
ధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యపాపయామాత్య ప్రణీతం
బైన చెన్నబసవపురాణం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థా
శ్వాసము.



# పంచమాశ్వాసము.



## మల్లయ్య బ్రహ్మయ్యల కథ.




విబుధావనకృత్యా
కేవలతరనియమముదితగిరివరభృత్యా
పావనజనతాస్తుత్యా
జావర్ధితనిత్యసత్య యమృతామాత్యా. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుం డవ్వలికథ యిట్లని చెప్పం
దొడంగె. [మంత్రి

తే, అంతనొకనాఁడు మల్లబ్రహ్మయ్యనాఁగ, భక్తులిరువురు శ్రీచెన్నబసవ
పజ్జవింతగదివిటీలుబట్టువిధము, దెలిసిదుర్మంత్రి యొకఁడుబిజ్జలునిఁజేరి.

చ. నరవర! వింటివేబసవనాథునియల్లుని సన్నిధానమం
దిరువురు పూరుషోత్తము లహీనబలాఢ్యులు దివ్వటీల వా
రరుదుగనున్న వారలు మహాద్భుతమయ్యెడు వారిచర్య గో
చర మొనరింప నెట్లనిన సర్వముఁదెల్పెద చిత్తగింపుమా!. 4

తే. వారుచేఁబట్టి దివిటీలు వహ్నిఁ గూర్ప
కయిరగుల్కొను దైలసంగతముగాక
యేవెలుఁగు తేజ మెడలక నెప్పు డచటఁ
గానఁబడునంతదవ్వు సౌగంధ్య మొసఁగు. 5

చ. అన విని రాజు చెన్నబసవాధిపు నప్పుడె పిల్వఁబంచి యో
యనఘ! భవత్సమీపగతులై తగుదివ్వెలవారి సిద్ధఱ
న్ననుఁ గొలువంగఁ బంపు మనినం బరమేశ్వరుఁ డెంత దెచ్చె నా
ఘనులు దురాగతుం గొలువఁ దా నెటుపంపుదునేమిసేయుదున్.6

ఉ. పంపఁగరాదు వారి నటఁబంపకయుండిన మామమీఁద నే
తెంపు వహించునో యితఁడు దెప్పరమయ్యె నటంచు చింత త

న్నుంప నొకింతసేపు తనమో మఱవాలిచియుండి యట్టులం
బంపఁగఁ దీర దవ్వలఁ గనంబడు దీనికి తన్మహత్త్వముల్. 7

చ. అని మదినిశ్చయించి ఫణిహారిముఖంబున వారిఁ బిల్వఁగాఁ
బనిచి మహీతలేశ్వరుని భావము దెల్పఁగఁ బూని జంకి న
మ్రనిజముఖాంబుజాతుఁడయి మౌనము దాల్చి తన్మనోగతం
బనఘులుగాంచి మ మ్మితని కిప్పనసేయుముకొంకనేటికిన్.? 8

క. నాపుడువారలయనుమతి, భూవరునకుఁగానుపించిపో యెదమనిస్వీ
యావాసము చింతాకుల, భావమునం జెందెఁ జెన్నబసవండంతన్.

క. బండారుబసవధీమణి, మండలపతి నడిచినట్టిమార్గము విని యీ
తం డింతకొత్తుకొనె నిఁక, నొండేగతిసంభవించునో యనియుండెన్.

చ. మనుజవరుండు దుర్మతిని మల్లయ బ్రహ్మయగార్ల నిద్దఱిన్
దనయెడదిక్కేటీలిడఁగఁదక్షిణమాసమయంబునందు రాఁ
బనిచినఁ దేటగాఁ దమప్రభావముఁ జూపుదు మంచు నేగి య
య్యనఘులు వానికట్టెదుట నందఱుఁజూడఁగ నిల్చి చెచ్చెఱన్. 11

తే. పయిడిపిడిదివ్విటీలు చేఁబట్టికగులు
కొలువునంతటిలోన నక్కోటిదివ్వి
టీలుగూడినమాడ్కిఁగడిందిమంట
లాత్మతనుతాప మొనరింప నవనివిభుఁడు. 12

ఉ. తాళఁగలేక తాల్మిచెడి తల్లడమందుచులేచి నేలపైఁ
ప్రాలుచుఁ బొర్లుచున్ విహితవర్గముఁ జీరుచుఁ బెద్దదిండుపైఁ
సోలుచు నల్లడల్ బెగడిచూచుచుఁ గ్రమ్మఱఁగన్నుమూయుచున్
గో లెదఁజేర్చుచున్ జలువక్రేవలకేగుచు నీరుఁద్రావుచున్. 13

క. వా యెత్తియఱచుచుండఁగ, నా యెడబసవేశుఁడసి యో నవనీశ్వర! నీ
కాయపరితాపవేదన, బాయువిధం బొకటిదోఁచె పరికింపంగన్. 14

చ. అదియెటులన్న మాధవశరాపరమూర్తులు శొంభవేందిరాం
బుదపవనుల్ మహాత్ములని బుద్ధిఁదలంపక దుష్టబోధ నీ
మదిఁగనిదివ్విటీలిడఁగ మల్లయ బ్రహ్మయగార్లనిత్తరి
న్మదమునఁ బంచుహేతువున మంటలు నీకుదయించె మించుగన్. 15

క. కావున నప్పనియెడ నిపు, డాపీరుల మాన్ప నీకు నారోగ్యమగున్.

నాపుడు పతిదోఁచనిమది, చేవిస రెక్క బొమ్మటంచుఁ జెప్పినమాడ్కిన్.

సీ. ఆసైగఁగని తెలియకభూవగునకుకోపమువచ్చె ననుచు బెత్తములవారు
వారలఁగడిసియవ్వల కేగుమని బెట్టుగదిమిన చిఱునవ్వుఁగదుర నిండ్ల
దరికేగి కచ్చట ధరణీశుతాపంబు మంత్రించినట్టులమానుటయును
బసపని గని యతం డసమానుతుల్యనీ కతన నేటికిఁ బ్రతికితి నటంచు

తే. వేయువిధములఁ గొనియాడి వీడుకొల్పి
చచ్చి పుట్టినయట్టుల సంతసిలుచుఁ
గొలువుచాలించి నగరిలోపలికి నరిగె
రాజమంత్రియు నిజమందిరమున కరిగె. 17

సీ. ఆమటునాఁడు రసాధిపవర్యుండు నేరములేకయే నిష్కళంకత
మల్లయ్యమధుపయ్యయనుభక్తవర్యులఁబిలిపించికన్నులఁ బెఱుకఁ జేయ
విసిబసవఁడు కోపవివశుఁడై బిజ్జలుండక్కటా! చెడచూచెననుచువారి
రప్పించి యతులనెప్పటి యట్లన బడసి భక్తాళి కప్పట్టణమున

తే. నింకనుండుటతప్పనేఁడిట్టులయ్యెనిన్న నట్టులయ్యెననితనయున్న కడకు
వేగజగదేకమంత్రి రావించియతని, కెల్ల భక్తులువినుచుండ నిట్టులనియె.

మల్లయ్య మధుపయ్యల కథ.

సీ. జగదీశ! నీవుముక్క జంగమేతరకృత్య మొనరించి వారల కినుకకోర్వఁ
జాలక వేగతచ్చరణంబు నొందిన నిచట శివద్రోహి యింకఁగొంత
గాలంబునకుఁ బుట్టగలఁడు తద్ద్రోహి గీటణచుమప్పుడుదీనికని యెతగిన
యట్టిప్రాయశ్చిత్తమనిరిగావున నిపు డవనీశుఁ డిట్టి ద్రోహంబొనర్చె

తే. అట్టులగుట జంగమాజ్ఞఁదప్పక నేఁడ, ఖలునివాని బట్టిపిలుకుమార్చి
సకలభక్తవితతి సన్నుతింపఁగ సుమ, కార్యకాపహారి కరుణఁగనుము.

క. అని తెలిపి యతనిఁబోవం, బనిచి యమాత్యేశ్వరుండు భగినీతనుజ
న్మని కెఱుఁగఁ జేసియాతని యనుమతిఁబురి వెడలనడిచియాక్షణమాత్రన్.

సీ. మడివాలు మాచయ్య మసణయ్య మాదిరాజయ్య యేకాంతరామ
య్యమిండ, సంగయ్యవనిపురశంకర దేవయ్య యచ్చయ్య మధుపయ్య
యనిమిషయ్య, కలికేతబ్రహ్మయ్య కక్కయ్య తెలుఁగు జొమ్మయ్యబ
ల్లేశమల్లయ్యవీర, బ్రహ్మయ్య కన్నడ బ్రహ్మయ్య కిన్నర బ్రహ్మయ్య
ప్రేవులబ్రబ్బతయ్య.

తే. ఆత్మదేవయ్య సురియచోడయ్య భాస్క-
రయ్య కొట్టురుబాచిదేవయ్య హిల్ల
హాళబ్రహ్మయ్య ముసిడిచౌడయ్య నాగు
మయ్య పదమరసయ్య శూలాయుధయ్య. 21

చ. మొదలగుభక్తరాజి కడుమోదముతోఁ జనుదేఱ నచ్చటన్
గదిలి సమస్తశైవశుభకారణ కప్పడి సంగమేశ్వరం
బదె యిదె యంచు నేగి బసవాధిపుఁ డచ్చట దేశికాగభి
త్సదనముఁ జెంది యాతనిప్రసన్నునిఁ జేయ గణాలిచూడఁగన్. 22

చ. గురుఁడు వరంబువిచ్చి కడుగ్రుచ్చియుఁ గౌఁగిటఁ జేర్చు చాట్ప్రన
స్వరగుణధుర్యుఁడైన బసవప్రభులోపలఁ జేసికొంచు వే
నరిగె గృహంబులోపలికి నంతట మ్రోసె సుపర్వదుందుభుల్
గురిసె లతాంతవృష్టి సుమకోమలు లాడిరి మింట జంటలై. 23

తే. అంతయునుగాంచి యచటిభక్తాళి యాత్మ
భరితచింతల శ్రీచెన్నబసవవిభునిఁ
గాంచి మీమామ యిటులయ్యెఁ గాన నింక
భారకుండవు నీవె మాపాలికనిన. 24

క. నేనెంతవాఁడ మీరలు, పూని నడుపు డనిన నెట్లుపోయెదనని లో
నూనినభక్తింబచ్చుర, తానుతుఁడై యపుడెవారియందఱితోడన్. 25

తే. అచటఁబాసి వచ్చి యతిరమ్యమగునొక్క-
వనముఁజేరి బసవపర్యాచర్య
లుగ్గడించుకొనుచు నుండిరచ్చటబస
వండు వెడలఁదడవ పట్టణమున. 26

సీ. ధరణిపణంకె మాతంగమదములింకె
తారలురాలె సౌధములుగూలె
వనతతులెండె సర్పములతోఁకలు మండె
వరదులుగూసె దిక్పాళిమాసె
రవియుగ్మ ముదయించె రాజంతకునిఁగాంచె
పిడుగులువడి యిరాగుడులు పడియె
సస్యముల్ మాడె శీర్షముల కాకములాడె

కండలు గురిసె చీఁకటులు బెరసె

తే. కవణముల్ పుచ్చె మృత్యువుఁ గాన వచ్చె
యగ్నిచల్లారె నిండ్లదయ్యములు చేరె
ధూళిమినుగప్పె వడిసుడిగాలిరొప్పె
ప్రజలకళయెల్లఁదప్పె నప్పట్టునందు. 27

వ. మఱియు నీదృశ్యంబులగు ననేకదుర్నిమిత్తంబులు పుట్టిన. 28

చ. అటు చని యింకుకీడుగని యందఱుఁ దెలిచింతనొందిరం
తట జగదేవమంత్రి క్షణదా శివపూజయొనర్చి వేగని
క్కటకపతిం వధింపఁ జనగావలె నంచు నిజాలయంబుఁ జే
రుటఁ గని తల్లి తత్క్రమము రూఢిగము న్వినియుండుటన్ గృపన్.

మ. శరణద్రోహము విన్నయంతటనె యాచండాలు మర్దింపకీ
రరుదేరం జనునే? గణాజ్ఞఁగొని మీఁదాలస్యముం జేతురే
హరుఁ డిబ్బంగిని మెచ్చునే పిరికిపందా చెండెబల్కిందవ యే
కరణిం బాయునటంచుఁ బెక్కుగతులం గర్జించి తర్జించినన్. 30

చ. శిర మఱవంచి తప్పితము చెందెఁ గదా యని లజ్జనొంది స
త్వరమున నీకుఁ బూన్చి తనతల్లి యొసంగిన భంగి వేగ మో
గిరము భుజించుచుండఁగ నకిల్బిషచిత్తులు మల్లబ్రహ్మగా
రిరువురువచ్చికూడి భుజయించిరి యాతనితోడ వేడుకన్. 31

ఉ. ఆగతి నారగించి పరమాద్భుతవీరరసాతిరేక సం!
యోగమనస్కులై ముపురు నుర్విని గూల్పఁగ నిశ్చయించి ర
క్తాగరుచందనాంబరసుమాదులు దాల్చి యమాత్యమాతకుం
జాగిలి యాపె దీవన లొసంగినఁ గైకొని లేచి చెచ్చెఱన్. 32

చ. కరములు మండలాగ్రములు గ్రాలఁగ గేహమునిర్గమించి భూ
వరుసభ చేరఁగా నరిగి వాంశికపైణికనర్తకాదిబం
ధురతరలీల లెంచుచు కుతూహలియై కరదీపికాసము
త్కరరుచిపర్వమానికపు గద్దియపైఁ గొలువున్న బిజ్జలున్. 33

చ. తటుకునఁగాంచి కన్గవలదారుణవహ్నికణంబు లొల్కను
త్కటతరసింహనాదముల తారలు మేరలు మీరి ధారుణిం
గోటతోటరాల పర్వడులుఁ ద్రొక్కుచు నందఱిమీఁద నొక్కటన్

బటపటపండ్లుగీటుచు సభాజనముల్ వెఱగంది చూడఁగాన్. 34

మ. ప్రళయాభీలకపాలిపాలికల తద్రాజాధముణ్ జేరిని
శ్చలులై యేసిరి ముప్పురొక్క-మొగి పంచచ్ఛాత ఖడ్గంబులం
బలవత్సింహకిశోరమర్దితమహానాగంబు చండంబుగా
నిలపైఁగూలె నతండు బెగ్గిలి జనంబెల్ల న్వడింబారఁగన్. 35

వ. ఇట్లు బిజ్జలుంబరిమార్చి ముప్పురు రాజమందిరంబు వెడలి రప్పుడు జగదేవుండు మల్లయ్యబ్రహ్మయ్యగారలఁ దత్సమయసముచితాలాపంబుల వీడ్కొలిపి నిజసదనంబులకుం జని నమస్కారపూర్వకంబుగా నంతవృత్తాంతంబు తల్లి కెఱింగించి తదనుగ్రహంబు వడసి రాజసేవాపరాధం బొనరించుట విన్నయంతనే వానిం జంపక జాగుచేసిన తప్పున కాత్మతనుత్యాగంబె ప్రాయశ్చిత్తంబని గండకత్తెఱ గళంబున దవిలించుకొను నంతటలోన సర్వేశ్వరుం డగుపార్వతీశ్వరుండు ప్రత్యక్షంబై యతని తన్మాతృపుత్రమిత్రకళత్రాదులను స్వశరీరంబుతో కైలాసంబునకుఁ గొనిపోయె మల్లయ్యబ్రహ్మయ్య లపుడే కళ్యాణపురంబు వెడలి చెన్నబసవేశ్వరనివాసం బరయుచుం జని యతనింగాంచి గణప్రకారం బంతయుం దెల్పి వారు నచ్చటనేయుండి రంత నిచ్చట సూర్యోదయంబగుటయు పట్టణంబున. 36

చ ధరణిపుచావు తెల్లముగఁ దత్ప్రియబాంధవులెల్ల గాంచి హృద్భరితవిషాదవేదనలఁ దల్లడమందుచు వానికగ్నిసంస్కారమొనర్చి యింత బలుగాఁవపసుల్ బసవుం డొనర్చెగా కొరులకు శక్యమే మనకు కొప్పదు వీని నుపేక్షసేయఁగన్. 37

తే. ఇంత పనికొప్పుకొను బసవేశ్వరుని
దాప్తులను వానియల్లుని నవనివిడి
త్రోటివారిగఁ జేయుటె సూటియనుచు
నంద ఱాలోచనలొనర్చి రంత మీఁద. 38

వ. కొన్నిదినంబులు చన్నపిదప. 39

చ. అరిబలభంగగంగ చతురంగబలంబులతోడ నాచమూ
వరులను బంచి తన్నృపతి బంధువు లాప్తులు భేరికాహళా
ధిరవములు లొక్కపెట్ట దివిదీటుకొనన్ సమర్థానుకూలభా

సర్వతరవేషులై పురమవాస్యబలోద్ధతి నిర్గమింపఁగన్. 40

సీ. స్యందనధ్వజపటాంచలజాతవాతముల్ తోయదపంక్తులదూలఁజేయ
పటుతరసింధురపదఘట్టనంబుల ధరమోయు శేషాహి శిరముగంచ
తురగరింఖోద్ధూతధరణీపరాగంబు సాగరబాంధవ సరణిగప్పు
భటసింహనిస్వనార్భటులుమదావహ దిగ్గజంబుల నిలుకొల్పఁజేయ

తే. నడచె నత్తరిబలవితానంబు బాణ, ముంజలాగ్రపరశ్వథభిండివాల
పట్టిసకుఠారముద్గరప్రాసముఖ్య, సాధనప్రభలాభీలసంతతి వెలుఁగ. 41

వ. మఱియు నవ్వాహినివాహినియుంబోలెబహుళఘోరీవిరాజమానం
బై పుష్పితోద్యానంబునుంబోలె మదభ్రమరసారంగవిలసితంబై ధరా
ధరగహ్వరంబునుంబోలె నుద్భటసింహనాదంబై వైకుంఠంబునుం
బోలె చక్రిసంచారస్థానంబై సత్యలోకంబునుంబోలె లోకేశ్వరభా
షావిశేషోత్సాహసహితంబై కైలాసంబునుంబోలె నభంగధర్మవా
హంబై భాగవతంబునుంబోలె సింహబలారికర్ణశల్యోట్టహాసంబై భా
రతంబునుంబోలె ససమాస్త్రనిరుద్ధంబై రామాయణంబునుంబోలె
విశ్వామిత్రవితానవాసనంబై యాకాశంబునుంబోలె రాజహంసవి
లాసభాసురంబై ప్రావృట్కాలంబునుంబోలె శరధారాప్రకృష్టంబై
ఘోరకాంతారంబునుంబోలె ఖడ్గాచ్ఛభల్లపుండరీకాధిష్ఠితంబై పెం
పుమిగిలి నడతెంచుసమయంబున నవ్వనంబున నున్నశరణపుంగవు
లకోలాహలంబాలించి సమున్నతవృషారోహులై తమమీఁద
దాడిపెట్టవచ్చిరని సముద్దీపితకోపాటోపంబున. 42

సీ. గట్టుతునకలు సేయఁజెట్టదేవయ్య మదకరివిదళించుమాచవిభుఁడు
గిరిజేరఁబల్కించుకిన్నరబ్రహ్మయ్యభవునిప్రేపులఁబొన్చుబ్రహ్మతయ్య
విశ్వబౌద్ధులనొంచువేమనారాధ్యుండునాల్కలీసనకిచ్చునాగవరుఁడు
గిలకపుత్తడిరాల్చుకలకేతబ్రహ్మయ్య మహిచిరంజీవియామాదిరాజు

తే. వీరు మొదలుగాఁగలుగు నేణ్బాఱుపీరు
నవబలవ్రిత స్థితులును నవసహాస్రి
మఱియు నొకలక్షతొంబదియాఱువేల
చరులు పంక్తిరెంకువే ల్మిండజంగమములు. 43

క. మఱియునసంఖ్యాతములగు, కఱకంఠపదాబ్జభక్తగణసింహంబుల్
దరిలేనిశౌర్యకలపం, బిరుతివియకశత్రుసైన్యభీకరతనులై. 44

చ. నడుములుగట్టుచుం బెలుచ నవ్వుచుఁ బండులుగీటుచుం బొమ
ల్ముడుచుచు మండలాగ్రణయముల్ జళిపించుచు గూఢవర్మముల్
దొడుగుచు గోఱమీసములు దువ్వుచు బాహువు లప్పళించుచుఁ
గడువడిమిన్నుఁదాఁకుచు నకంపితవృత్తిఁ జెలంగియార్వఁగన్. 45

తే. అట్టి కోలాహలం బప్పుడరసి చెన్న
బసవఁ డరుదెంచి తద్భక్తపత్పయోజ
ములకు సాష్టాంగమెఱఁగి కేల్మోడ్చి నిలచి
వినతిపూర్వకముగ నిట్లు విన్నవించె. 46

మ. తగునే మీరలు కోపగించ ఘనశాంతంబారడింబుచ్చి యీ
పగిదిం శైవమహత్త్వము ల్మదిఁ దలంపంబోకవర్తించుదు
ష్టగుణుల్ దామె నశింతు రె ట్లసిన భస్మస్వర్గగేహారిప
న్నగహారున్మడియింపఁబాల్పడితనంతం దానకీడొందఁడే. 47

తే. అరిమదేభములకు సింహమహితకాన
నమున కగ్నియ మిత్రమేఘముల కలన
సఖమురిపుశైలములకు వజ్రంబుమీఁదు
జ్ఞానభక్తివైరాగ్యనిష్ఠలు దలంప. 48

క. అటుగాన మీరలిత్తరి, కుటిలాత్ములమీఁదజనఁగఁగూడదు నిలువుం
డిటులఁ వారికి నీఁకమీఁ,దటనగుఫలమనిన సమ్మదంబునశరణుల్. 49

ఉ. వైరులమీఁదఁబోక నిలువంబడు నంతటిలోన దుష్టచే
ష్టారిబలంబులోన నిబిడాంధతమంబు విధిప్రయుక్తమై
ధారుణిమిన్ను మోసె బెడిదంబుగఁ బట్టినవాన తచ్చమూ
వారము విస్మయంబును వివర్ణతదోఁపఁగ నత్తరిఁ వెసన్. 50

మ. ప్రళయాంభోధరనిస్వనంబుపగిదిం బ్రహ్మాండభాండంబు భీ
తిల నొక్కుమ్మడినార్చి తమ్మొరులు మర్దింపంగ నేతెంచు ద
ట్టులఁ దోపందము దామెయొండొరులఁ బట్టండీయటంచుఁ భయా
కులులై పైఁబడి రుగ్రఖడ్గశరశక్తుల్ పూని భీమాకృతిన్. 51

వ. ఇట్లు. 52

చ. భటనికరంబుఁ దెంచుచు ద్విపప్రకరంబులఁ గూల్చుచున్ హయ
చ్ఛటల నడంచుచు న్నెఱయు స్యందనవర్గముఁ జక్కు సేయుచున్
జటులధనుర్విప్రకాండహతి సల్పుచు వర్మచయంబుఁ జించుచుం
బటుధవళాతపత్రముల పంక్తులు భూమిదొరంగఁ జేయుచున్. 53

వ. మఱియును. 54

సీ. మణికేతనోద్దండఘృణి కొంత దవ్వేగి
యవిబడ చనలేక నడలురథులు
ప్రచురముక్తాచ్ఛత్రరుచి కొంత వడి నేగి
యవిగూలతడఁబడి నొవ్వులు కరులు
పటువజ్రనఖరప్రభలకొంత మెడమేగి
యదిజార నిలఁబడునట్టి హరులు
జళిపించు ఖడ్గప్రభలు కొండఁ దడవేగి
యవిపోవ నలుదిక్కు లరయు భటులు

తే. నగుచు నగ్గాఢతమమున నంతకంత, కగ్గలంబైన వీరరసాతిరేక
కలననందఱుయదువుల కరణిపోరు, సలిపి సమసిరినిర్విశేషంబుగాఁగ.

క. అంతటనగ్గాఢతమం, బంతయువిరియంగజైనులందఱుహాతులై [చెన్.
యెంతయు వేడ్కఁగనుగొని, యంతక హరుభక్తవితతియార్చిరిపెలుఁ

ఉ. అత్తరి మ్రొక్కి చెన్నబసవార్యుఁడు వారలతోడ నోశర
ణ్యోత్తములార! మీరలు మహోన్నతు లేమని చెప్పవచ్చు మై
మత్తిలి మిమ్మెఱుంగక సమస్తరిపుప్రకరంబువచ్చి యు
వ్వెత్తుగఁగూలె పాపమతు లెవ్వఁడలం జయమంద నేర్తురే. 57

తే. శరధిచే సీత సీదుట జ్వాలదరణ్య
పావకజ్వాలకరమునఁ బట్టుకొనుట
తూగిపారెడు నది కేల నాఁగికొనుటఁ
గాదె మిముజైను లణపఁగఁ గడఁగుటెల్ల. 58

చ. అని యిటు సన్నుతించి మదహర్షముతోడుత వారు దాను నా
దినమటుపుచ్చి రేపకడ తేజమెలర్పఁగ నందు వాసికాం
చనసవరత్న సంఘటితసౌధవిరాజితమై తనర్చి పే
ర్చిన హుళికాఖ్యపట్టణముచేరఁగఁ దద్ధరణీపుఁ డత్తఱిన్. 59

క. చారుల ముఖమున విని సంఘన, భేరీముఖరవములదరఁ బ్రియబంధు చమూ
వారముతో నెదురుగఁ జని, దూరంబున భక్త సంతతులు గాంచి వేసన్.

చ. కరిదిగి పాదచారియయి గ్రక్కునఁ జేరఁగ నేగి సన్నొసల్
ధరపయి సోఁక జాఁగఁబడి తద్గణకోటికి మ్రొక్కు నంతలో
వరగుణుఁడైన చెన్నబసవ ప్రభువర్యుఁడు వచ్చి యాతనిం
గరములఁ గ్రుచ్చి వేగ బిగికౌగిటఁ జేరిచి సమ్మదంబునన్. 61

ఉ. చెప్పఁగ విందు నిన్ను నృపశేఖర! భక్తవరేణ్యుఁ డంచు నే
నిప్పుడు గంటి మోదము వహించె మదీయహృదిం బలింపఁగా
ముప్పిరిగొన్న భక్తి కరము ల్ముకుళించి యతండు వల్కె ని
ట్లొప్పునె నన్ను మీరొకగణోన్నతుఁ డంచు గణింప ధీమణీ. 62

చ. అని వచియించి క్రమ్మఱ మహావినయంబునఁ బల్కె వీరభ
ద్రనృపతి యో మహాత్మ! శరదంబునకుం భుజగారి శంబరాం
కునకు చకోరమధ్యమునకు న్వలి జిక్కవగాఁచి యుండు లా
గున భవదంఘ్రిదర్శనముఁ గోరి వసించితి నింతకాలమున్. 63

క. దీనుఁడు పెన్నిధి గనుగతి, నే నినుఁ జూడంగఁ గంటి నేటికి నాదౌ
నేనఘపటలము విరిసెను, భాసురగతిఁ జెందితిం గృతార్థుఁడ నైతిన్.

చ. శ్రితజనపోష మచ్ఛవనశీమను మీరరు దే మదీయవాం
ఛిత మొనగూడునట్లు దయ సేయుఁ డటంచును నాగకోశసం
తతి నొడబాటొనర్చి ప్రమదంబున నాత్మపురాధివాసుల
ద్భుతమతులై కనుంగొనఁగఁ దోడ్కొనిపోయి మణీగృహంబునన్.

తే. వారి నందఱిని నిచి యపారభక్తి
సేవలొనరించి వేడ్క భుజింపఁ జేసి
పిదప నొక్క మనోహరసదనమందు
శివకథాగోష్ఠి నున్నట్టి యవసరమున. 66

క. చెన్నబసవేశుఁ గనుగొని, సన్నుతగుణధుర్యుఁడగు రసాతలపతి కే
లున్నదురుగదియఁ జేరిచి, విన్నపమొనరించె నిట్లు వినయమ్మెలర్పన్.

చ. ధరణిపునీతఁ జేయ గిరిధన్విసుతాంశముదాల్చి నాగమో
దరమున ద్వాదశాబ్దములు తా వొనరించి రసాతలేశకుం

జరుసభమాత్రకర్ణమున సంభవమై ఖలజైన బౌద్ధసం
హారణ మొనర్చి శైవసమయం బచటం బ్రబలంగఁ జేయవే. 68

చ. నినుఁ గొనియాడ వాగ్ధవఫణిప్రవరాదులకైన శక్తిలే
దన మముబోంటి కెట్టు లగు నాశ్రమజంగమకల్పవృక్షసం
జనిత దయాకటాక్షహతశైవవిపక్షవిశుద్ధభావ స
జ్జనపరిరక్షయంచుఁ దను సన్నుతి సేయుచు నున్న భూవిభున్. 69

తే. ఎలమిఁ గని చెన్నబసవేశుఁ డిట్టు లనియె
నధికముగ స్తోత్రమున కర్హు లయిన యిమ్మ
హాత్ములఁ నుతింప దగుఁ గాక నగునె వీరి
దాసుఁడగు నన్నుఁ గొనియాడ ధరణినాథ!. 70

సీ. కమలబాంధవునితోఁ గదలు మెర్వుడుపుర్వు
దేవతాకుజముతోఁ దెల్లదుమ్మ
చామీకరాద్రితోఁ జౌటబెర్గినదిబ్బ
సింహడింభకముతోఁ జెవ్రులపిల్లి
వాహినీనాథుతో వరిమళ్లకాలువ
వ్యాళనాయకునితో వానికట్టె
వైనతేయఖగంబుతో నూరఁబిచ్చుక
రాజరత్నంబుతో గాజుపూస

తే. సాటి కానట్టి పగిది నీశరణకోటి
తోటి సరి రాని నన్ను సంస్తుతులు సేయ
నగునె వీరిమాహాత్మ్య మె ట్లనిన వినుము
పార్థివేశ్వర యనుచుఁ జెప్పంగఁ దొడఁగె. 71

క. భావపవిత్రిద్భవసంసర
పావనతరపాదపద్మభజనామోద
ప్రావృతమతి యీ పెట్టిద
దేవరసయమహిమ మొదటఁ దెల్పెద వినుమా. 72

సీ. ఒకనాఁడు బిజ్జలుండోలగంబుండి బసవయ్యఁ గనుఁగొని కలికొనిటుల
మాభక్తులనుపమమహిమాధ్యులని యెప్పు డెప్పుడుఁ బలుకుదు రీవు పట్టి
బూటకంబులు వినఁబోల దు నీమాట లందఱికం టె వారధికు లెట్లు

లెక్క-జెక్క-డవార లేమేమిచేసి విఖ్యాతిఁబొందిరి త్రిజగంబు మెచ్చ

తే. నరయ నాల్గుయుగంబుల బరఁగుమాన
వాధిపుల నడవడులు విన్నట్టులయిన
నిట్టుపల్కు-పు తద్విధ మెట్టిదనిన
సావధానత విను మమాత్యాగ్రగణ్య!. [రాముఁ

సీ. మహిపులము య్యేడు మాఱులువధియించి ధరకశ్యపున కిచ్చెపరశు
డబ్ధిబంధించి దశాస్యునిఖండించి ప్రబలె శ్రీదశరథరామ విభుఁడు
కలకంఠుమెప్పించి కాలకేయాదులనొక్క-ఁడుబరిమార్చెనింద్రతనయుఁ
డరులఁజెండాడి దేహంబునహరిగద్దెనుండఁ జేవిక్రమార్కుండు మొన్న

తే. నరయ వీరలుగాక మహాప్రతాప
గరిమఁ దగురాజు లిప్పుడు గలరు ధరణి
నిట్లు మీవారు నడిచిరే యెన్నఁడైన
నని యుపాలంభనము దోఁప నాడుటయును. 74

చ. విని బసవేశ్వరుండు పృథివీవర! యెన్నటనుండి నీమదిం
జననమునొందె నింతటివిచారము మాతృవిధారు సత్క్రియా
ఘనతరదుఃఖనిస్స్వకులఘస్మరు నస్థిరభోగభాగ్యులఁ
వినతి యొనర్చితీవు గణవీరమహత్త్వమెఱుంగ కిట్టులన్. 75

వ. అని పల్కి- జంగమప్రభావం బొక్కటి దెల్పెద విను మని దండనా
యకుండు. 76

సీ. ఆకారరేఖచే నాదరబ్రహ్మయ్య ప్రథితకళాస్ఫూర్తి పండితయ్య
గురుభక్తి బిల్లమ ధరణీతలేశ్వరుం డురుగానవిద్యచే నొడయ నంబి
భూరిశౌర్యంబుచేఁ జేరమభూభర్త యంగలింగజ్ఞత ననిమిషుండు
పటుతరసత్త్వసంపద యిర్యదాండారి కలిమికి బళ్లాణగహ్వరీశుఁ

తే. డిమ్మహాభక్తుఁ డని జనులెల్లఁ దన్ను
బ్రస్తుతింపంగ సెగడె ధరాతలమున
భవ్యజంగమసందోహ పాదపద్మ
చంచరీకుండు శ్రీవీరసంగమయ్య. 77

## వీరసంగమయ్య కథ.

చ. అతని వయోవిలాస సుషమాకృతులం గని పెద్దతండ్రి యీ

సుతునకుఁ బెండ్లి చేయఁ దగుచో టరయన్ వలె నంచు తత్పురో
హిత గురుయుక్తుఁడై వెడలి హేమమణీమయగోపురాంతరాం
చితపటచిత్రసుప్రకటసింహాభయాకులవాసవైభవమై. 78

క. తనరిన ఓంకారపురం
బున కేగి తదిందిరావిభూషణమై యొ
ప్పిన తన మేనమరఁది గృహ
మున కరిగినవాఁడు గడుప్రమోదముతోడన్. 79

చ. కనుఁగొని కౌఁగిలించుకొని గద్దియలందగువారితోడ నా
తని వసియింపఁజేసి యుచితం బగుపూజ లొనర్చి సేమముల్
విని కుడుపంగఁబెట్టి యటుపిమ్మట నిష్టవినోదలీలలన్
దనియుచు మీదురాక సుఖదంబగు మా కని పల్కఁబల్కఁసన్. 80

వ. తద్గురుభక్తాఖ్యుండు. 81

క. నీపల్కినపల్కులు నిజ,మాపగిదిని శుభముఁ జెందునన నవ్వాలయన్
దాపగ నేటికి వచ్చిన, మీపని యెఱిఁగింపు బావ! మేలము చాలున్.

తే. అనిన మావీరసంగయ్య కనఘ! నీదు
పట్టియగు చంద్రిణీదేవిపరిణయంబు
సలుప నూహించి మీతోడఁ దెలుప వచ్చి
నార మనపుడు నాతఁ డానంద మొందె. 83

క. మీరుస్వతంత్రులు మీమదిఁ,గోరిన పని యడ్డగించు కొనువారికి నె
వ్వా రచ్చటి కిచ్చటికిం, భారకులై మమ్మునడుగఁ బనియేమిటికిన్?.

చ. అని వచియింపఁ దత్సభికులందఱు సంతసమందె బాపురే!
వననిధిమేఖలావలయ వాసజనంబులయందు బంధుభా
వనఁ దిలకింప వీరి సరివారలఁగాంచితిమే యటంచు పె
క్కనుతులొనర్చి రత్తఱినకుంఠితకౌతుక మానసిల్లఁగన్. 85

క. మున్నేఁ గైసేసియుంచిన, కన్నియ రప్పించి తండ్రి కాంచనమణిపీ
ఠిన్నిలిపిన దీవెన లిడి, యెన్నికలగ్నంబు నిశ్చయించిరి విప్రుల్. 86

క. అంతటఁ దత్కన్యామణి,నంతిపురంబునకుఁ బనిచి యాగృహపతి దా
సంతోషంబున నంబర, సంతతి గట్టంగ నిచ్చి సమ్మతినసుపన్. 87

ఉ. వారు ముదంబునం దిరిగివచ్చి సుహృజ్జనకోటితో సవి

స్తారముగాఁగఁ దత్క్రమము సర్వము చెప్పి వివాహయోగ్యసం
భారము లెల్లఁ గూర్చుచును బంధులకుం శుభలేఖ లంపుచుఁ
దోరపువేడ్కనుండిరి ఘనుండగు సంగయకుత్సనంబునన్. 88

వ. అంత నచ్చట నోంకారపురాధినాథుం డగుభాస్కరావనిపాలుం
డొక్కనాఁడు బాహ్యాళివెడలు సమయంబున నత్యంతరూపవిలాస
భాసురయగు చంద్రిణీదేవిం గనుంగొని తత్సౌందర్యంబున కచ్చెరు
వంది మారవికారపూరితమానసుండై తనలోన. 89

చ. సురగరుడోరగప్రముఖసుందరులం బ్రకటింపవింటి ని
ద్ధరణిని నేకకోమలలతానిభగాత్రులఁ గంటిఁ గాని యా
సరసిజనేత్రవంటి నెరజవ్వనిఁ జూచి యెఱుంగ దీని నే
పరిణయమైనగాక సుమబాణునిబారికి నోర్వశక్యమే. 90

తే. శైవలాండజ విద్రుమశంఖగరిత, రంగస్థితినాగపులినకూర్మక చలోచ
నాధరగళ స్తనవళిరోమాళిజఘన, చరణయీయింతిసౌందర్యజలధి గాదె.

సీ. యువిదలమిన్నభూరియుగ్మంబుగానదా పోడిమచెఱకు విల్బూన నేల?
పడతుక నెఱివేణి పరికింపఁదావిడి పోవు తుమ్మెదనారిఁ బూన నేల
నెలనాగవాల్చూపు లెఱుఁగడా? ధరగూలు పుష్పబాణంబులు పూన నేల?
కలకంఠిజంఘలఁ దెలియఁడా యెదుగంటి నానునక్రాంకంబు పూన నేల?
తే. తలపనఖిలజగద్వస్తుతారతమ్య, వేదియగుమాధవునకుద్భవించి యెంత
తప్పుపని యొనరించె కందర్పుఁ డిట్టి, జెలగాకున్న శివుని చే నేల మడియు.

సీ. కనకాంగి నెఱివేణిఁ గనుగొన్నయంత నే విరిపైన నాలజ్జ విరియఁజొచ్చె
విద్రుమాధరిమోము వీక్షించునంత నే తలపనాధైర్యంబు దొరగఁజొచ్చె
కామిని నేత్రముల్ గాంచినయంత నె యంచనామది చంచలింపఁజొచ్చె
సుందరిజఘనంబుఁ జూచినయంత నె యొప్పైవనాబుద్ధి చుఱలఁజొచ్చె
తే. నలిన చిత్రాంగముల పాటి నెనయవచ్చు, పోలఁ జాలని వార్షికనీలమేఘ
శర్వరీనాథచంచలాసైకతముల, సరణి నేనింక నేజాడ? నైనువాఁడ.

తే. ఒక్క సన్నిధిపాల ద్విపేంద్రయాన
త్రివళిచతురాస్యపంచమ శ్రీనినాద
షట్పదాలక యగుదీని సప్తపదము
లేను ద్రొక్కింపఁ గలుగుట యెన్నఁడొక్కొ?. 94

సీ. శర దిందుముఖియయానగరిమ త్తేభంబు పీనపయోధరపిఱుదుపృథ్వి
రంభోరు వీక్షణరాజి యుత్పలమాల శాతోదరీనాస చంపకంబు
శష్కులికాంచిత శ్రవణ మేనసుగంధి తరుణిపాదయుగంబుసరసిజంబు
రమణి మాధుర్యస్వరము మత్తకోకిల కార్ముకభ్రువు నీలకచముకుంద
తే. మబల కాంతి విద్యున్మాల యబ్జసదృశ
కంఠి రోమాళి పరభుజంగప్రయాత
మౌర! యీయింతి శుభలక్షణాంగయాట
నిఖిల సత్కవివరవర్ణ నీయగాదె. 95
చ. అని మదిలోనఁ దన్నుఁ గొనియాడుచుఁ బోవక నిల్చుభూపతిం
గని యిదియేమొకో యనుచుఁ గన్నియ తత్తరమంది లోనికిం
జన ధరణీశ్వరుం డవల సాగి చన న్వలె నన్ననిచ్చలే
క నిజగృహంబుఁజేరి యెడగానియటుల్ బిలిపించిమంత్రులన్. 96
చ. తనతెఱఁగెల్లఁ జెప్పి వనితామణి తన్వరియించు నట్ల త
జ్జనకుని మందలించి యట జా గొనరింపక రండు పొం డనం
బనివిని వారలాతనికిఁ బార్థివువాంఛ నెఱుంగఁజెప్పిన
న్విని మదిలోఁ గలంగి గృహనేతయమాత్యులతోడ ని ట్లనున్. 97
తే. అంత భూభర్త జామాత యగుటకంటె
మాకు వేఱొక సంతోషమహిమ గలదె
యైన నొకవిన్నపంబును నవధరింపుఁ
డెటుల కీమాట మించినదేమి సేతు?. 98
తే. ఎన్నదగు వీరసంగయ్య కే లతాంగి
నిత్తు మని మున్నె విబుధులయెడల నిశ్చ
యించినారము పలువదికేమి పలుక
ననినఁ జని వారు నృపునితో నట్లతెలుప. 99
చ. కువలయభర్త వారిపలుకుల్ విని సంతసె కిక్క నెమ్మదిం
దవిలిన నాఁగి యాప్తవిబుధవ్రజమందఱఁ జేరఁ బిల్చి యా
ప్రవిమలగాత్రి తండ్రినొడబా టొనరించి మదీయభావసం
భవపరితాపవేదనలు బాపుడు పొం డనినక్ రయంబునన్. 100
ఉ. వా రరుదెంచితచ్చరణ వల్లభుఁగన్గొని యోమహాత్మ! నీ

సారవివేకదానగుణ సాహసకీర్తి కళాప్రపూర్ణతల్
వారిధిమేఖలావలయ వాసజనప్రచయంబునందు నె
వ్వారికి లేదు నీమహిమ వర్ణనసేయఁగ మాకుశక్యమే!. 101

చ. అని కొనియాడి రాజహృదయస్పృహముల్ సచివాననంబులన్
గని పరదేశవాసివలె వేఱొకభంగిని నాడవచ్చునే
జనపతి పేదమానవులసాటిగ నెంచకు తత్కృపారసం
బెనసిన మేరువౌ తృణ మహీనబలుం డతఁ డెన్నిభంగులన్. 102

ఉ. ఆడినమాట తప్పననునాగ్రహముంచకు కన్నెయన్న చోఁ
జూడరె వేఁడరే యెవరు శోభనవేళల తగ్గుమొగ్గుగా
జాడలెఱుంగఁగావలదె సారసనేత్రమణీమయంబులౌ
మేడలసంచరించుటకు మీమదికిన్ బ్రియమౌనదయ్యొనే. 103

క. కావున మామాటలు నీ, భావంబునఁ బాదుకొల్పి పార్థివునకు సౌ
ఖ్యావహముగ నిక్కన్నియ, నీవలయు నటన్న నాతఁ డిట్లనిపలికెన్.

ఉ. పావనులార! మీరనెడు పల్కులె సత్యముగాని యింక నా
భావము వేఱెయొక్క లఘుపద్ధతికిం జొర దట్టులౌట ధా
త్రీవరు నిప్పు డెప్పగిదిఁ జెప్పఁగవచ్చునొ తెల్పి తన్మనో
వ్యావృతవాంఛఁబుచ్చి శమితాగ్రహుఁజేయుఁడు వేయునేటికిన్.

క. తొల్లి హరిశ్చంద్రమహీ, వల్లభ తల్లజుఁడు సత్యవాక్యధరము పైఁ
జెల్లింపఁబడిన భాషలు, తెల్లముగా వినరె యపుడు ధీయుతులారా!

క. అటులగుట దీననగు ఫల, మెటులైనను లెస్సమీర లెఱుఁగని పదమే
నిటులనుచును దెల్పంగన, ఘటనాఘటనాఢ్యులార్యగణనుతచరితుల్.

చ. అన విని వారలందఱు తదానతిఁగైకొని సత్యనిష్ఠనీ
యనువుననుండఁ గావలదె యంచు మహాద్భుత మందిక్రమ్మఱం
జని తగువేళ భాస్కరరసాతలనాథునిగాంచి తా మునున్
బనివిని వారితో ననిన పల్కులు సర్వము దెల్పిక్రమ్మఱన్. 108

ఉ. రాజకులావతంస! రిపురాజవితానతమిస్రహంసమీ
యోజన కాతఁడాత్మముద మొందుచు మున్నుగమాటమించుటన్
భాజనమయ్యె చింతలకుఁ బ్రాజ్ఞులపద్ధతు లిట్టివేకదా!
యీజగమందె మీరలు గ్రహింపని ధర్మము లెందు గల్గెడిన్. 109

క. మీరే లెడు రాజ్యంబున, సారమతిఁ సత్యనిష్ఠ సలుపుచునుండే
వారలు గలుగుట మీకే, తోరపుసత్కీర్తి కాదె దుష్టవిదూరా. 110

ఉ. కావలెనన్న నీవెలఁదికంటె మనోజ్ఞవిలాసరూపరే
ఖావిమలాంగులై తనరు కన్నియ లెందఱు లేరు? నీకు త
త్పావనశీలుమాట యథుర్యవంబుగఁ జేయ ననుగ్రహింపు పృ
థ్వీవర! నేఁడు మామనవిదప్పకనన్న ధరస్మితాస్యుఁ డై. 111

క. మంచిది పొందనివారలఁ, బంచి ధరావరుఁడు పంచబాణవశుం డై
యించుక నిలువఁగఁ జాలక, పంచాననమధ్యయున్న భవనంబునకున్.

క. ఏకతమయేగ నాతని
రాకను తలిదండ్రులరసి పరిచలితతనులై
వ్యాకులము నొందఁ గనుగొని
యాకన్నియ ధైర్యమూది యపుఁ డిట్లనియెన్. 113

ఉ. ఏమిటి కింతభీతి? ధరణీశ్వరుచే నగునట్టి దేమి నా
స్వామియనుగ్రహంబున వెసం జని వానికి లోకులీకమ
ద్ధీమహితోక్తుల న్మనసుఁ ద్రిప్పి బిరానన సాగఁబంపి మీ
కోమలపాదపద్మములకుఁ బ్రణమిల్లఁగ నేగుదెంచెదన్. 114

చ. అని యిటు లూరడంబలికి యప్పుడు చంద్రిణిదేవి భూపతిఁ
గనుగొని చెల్లెలుం గనెడు కాంతుమెయిఁ జనుదెంచినారొ ర
మ్మని మణిపీఠమిచ్చిన నిజాస్యము నక్కళిదప్ప నాతఁ డో
య్యన వసియించియున్నఁ గమలాయతలోచన పల్కె క్రమ్మఱన్. 115

తే. అన్న నాపై నిప్రేమచే నరుగుదెంచి
నారొ? మేలయ్యె నాయంతవారుతోడఁ
బుట్టుటొట మదీయమహా పుణ్యమహిమ
గాదె? యేభాగ్యములకైన కడమగలదె? 116

చ. అన విని యాతఁ డిట్లనియె నంబుజపత్రాయతనేత్ర! నీవయిఁ
ఘనతరవాంఛ నేనిపుడు గన్గొనవచ్చిన నిట్టులాడఁగా
జనునె? కఠోరవాక్యములు సర్వములున్నె యెఱింగి నన్ను వం
చన యొనరింపఁజూచుటకుఁ జాలఁగ నద్భుతమయ్యె నెమ్మదిన్. 117

చ. వనధరవేణి! నాదయిన వైభవరూపవిలాసవైఖరుల్

గని తముదారె వారిరుహాగంధులు కొందఱు నన్వరించి రా
యనువునఁగాదు నేన భవదాకృతికిఁ భ్రమఁజెంది వేడ్కఁ గ
న్గొన నరుదేర నామనసునొవ్వఁగ నాడఁగ నీకు నాయమే? 118

చ. అలయిక లేక యెంతపనియైనఁ దలంచినమాత్రఁ గూర్చుకో
గలుగు బలంబునా యెడలఁ గల్గియు నీమదినొచ్చునంచు ని
ట్టుల నొకరుండవచ్చితి కడుం బ్రియమందఁగఁ గారవించి నా
పలుకుగ్రహించి నన్ను మరుబారినిద్రోయక యేలు కోమలీ? 119

చ. నిరుపమభోగభాగ్యములు నీవశమౌనటు సేయువాఁడ నా
తరుణుల నీవు బంచె దెటు తప్పకయట్టుల సేయువాఁడ భా
సురతరతావకీయకృపఁ జొప్పడురీతి మెలంగువాఁడ న
న్వరిణయమై సుఖింపు మని నం జలజానన వాని కిట్లనున్. 120

క. పరిణయమొందిన సతులం, గరిమం బెండ్లాడువారు గలరె? ధరఁ బ
ద్గురులనను మున్నె యొసఁగిరి, సరసాగ్రణియైనవీరసంగయ కెలమిన్.

ఉ. రాజవు సర్వధర్మపరిరక్షణదక్షుఁడ విట్టు లన్యనీ
రేజదళేక్షణాతతివరింపఁగ నెమ్మది వాంఛసేయు టే
యోజ దశాస్య కీచకముఖ్యాగ్రబలాధికు లిట్టికోరిక
న్తేజముద్రుంగి కీర్తిచెడి నీఱయిపోవుట నీవెఱుంగవే ? 122

తే. పరసతీసంగమంబునఁ బరిణవిల్లు
సౌఖ్యమిల నణుమాత్రమై పరఁగు దాన
నొదవు పాపంబు భూమిధరోపమాన
మై నిలచు నేటి? కిట్టి తుచ్ఛానుభవము?. 123

క. సరసాన్న పానములుమం, దిరమునగలిగియును తిరియ దివిరెడుగతి భా
సురకులకామినులుండఁగ, ధరణీశ్వర! యన్యవాంఛదవులంజను నే?

వ. అనిన నతండచ్చోటిమాటలుగీటునం బుచ్చుచు క్రమ్మఱ ని ట్లనియె.

సీ. బాల! నీవీక్షణబాణముల్ నామీఁదవ్రాలి దేహంబుదూరకయమున్నె
తరుణి! నీమధ్య కేసరినామనోగుహా నెనసిప్రాణంబులు గొనకమున్న
తరలాక్షి! నీయానదంతినామోహిలను* యట్టాడికాలరాయకయమున్న
పడతి! నీమాగారుపాము నాయెదుటఁగన్పట్టిప్రాణముగ్రసింపకయమున్న

* 'మట్టాడి' యని పాఠాన్తరము.

తే. ధర నహింసకు మిక్కిలి ధర్మపథము
లేదనెడుమాట నీమదిఁ బాదుకొల్పి
ప్రేమ దొలుకాడ స్మరతాపపీడఁబీడ
నన్ను దయనేలుకొనఁగదే? సన్నుతాంగి. 126

వ. అనినఁ దదగ్రభూపావతంసం బిట్లనియె. 127

ఉ. నాలుక నంటినంతనె ఘనంబుగఁ జేదగు వేము మీఁదటన్
గ్గాలినడంపదేహమున కంచితసౌఖ్యమొసంగు మెక్కఁ జో
మేలగు మాధురింబరఁగు మీఁదట ప్రాణమెడల్చు నాభిఁ యా
పోలిక తెల్లమౌ పిదప పుణ్యము పాపము సేయువారికిన్. 128

వ. కావునఁ బ్రస్తుతసుఖంబు నభిలషించి ఘోరదుఃఖంబు నొందకుమనినఁ
దద్ధారుణీవల్లభుం డిట్లనియె. 129

సీ. సుదతి! నీజంకెన చూపున బెదరించు నతిగంధపాడిబూడి జల్లువేన
తెరవ! నీకొనగోళ్ల చురుకులంటఁగఁ జేయుతరళాక్షి! నెఱివేణిత్రాటమోదు
చతురాస్య! నీబాహులతికలఁ బంధించుసరిగళరవమంత్రసరణి నెఱపు
కోమలి! వరకుచకుంభముల్గాన్పింపు చెలి! యధరామృతసింధువానఁగ
తే. నాతి! నీదేహవిద్యుతిజ్యోతి నిలుపు, పడతి! నీనెఱగాలిచేఁ బాఁజమ్ము
పంకజానన! ననుఁబట్టి బాధపెట్టు, గడుసువలరాచభూతంబు విడుచుదాఁక.

క. వేత్రయొక సరణినామది, మీఱిన తాపంబు చెడదు మీనేక్షణ! నం
దేఱికృపంగను గొనుమిఁక, మాటాడకుమనినఁ గుపితమానసయగుచున్.

క. నోటికి వచ్చినగతి యిటు, మాటికి దుర్భాషలాడ మనుజేశ్వర! నీ
కేటికి? ధర్మము చెడి మముఁ, బోటులఁ గాసింపనీదు పోఁడిమి చెడదే!

చ. అనవుఁడు తోకద్రొక్కిన మహాహివిధంబునఁ గోఁకఁ బెట్టు దా
కిన పులిరీతి బిట్టదరి కిన్కమనంబున నుప్పతిల్ల లో
చనములు నెఱ్ఱదోఁప పెలుచం దనుగన్గొను రాజుఁ గాంచి ఱ
ల్మి నిఁ తనుబట్టునో యనుచు మీనవిలోచన జంకె నెమ్మదిన్. 133

క. దుర్మార్గుఁడు కామాంధుఁడు, ధర్మవిహీనుండు వీఁడు తలఁచినతలఁపుల్
నిర్మూలము చేసి కృపా, భర్మాచలధన్వి నన్ను భావింపఁడొకో. 134

క. పులిబారిఁ జిక్కి ధేనువు, మెలగంగా లేనికరణి మీఁదెఱుఁగని యా
పలుగాకి బారిఁ జిక్కితి, తలఁగిచనం జాలనింక పరి మాయ్యదియో!.

సీ. వీని నెట్టులయిన విడఁజిమ్మిపోయెద నంటినాయబలను న్యాయసహిత
ధర్మమార్గముల బోధ యొనర్చితలఁగెద నంటినాముున్ను నేనాడినట్టి
పలుకులన్నియునునిష్ఫలములై చనురద్ది చేసియెవ్వరికైనఁ జెప్పికొందు
నంటినామఱివీనికంటెనిక్కడనెక్కుడగువాఁడు లేఁడుకోపాగ్ని శిఖల
తే. మడియఁ జేయుదు నంటినా పుడమిఁ జేనిఁ
గూల్చుట మహాసుపర్వునిఁగూల్చుకంటె
నెక్కుడగుపాపమని యందు రెల్లబుధులు
గాన యెద్దియుపాయంబు గానఁబడదు. [దో॥

క. అని చింతనొందుసమయంబుననొక్కయుపాయమురగభూషణకృపఁ
చిన నబ్బాలారత్నముఁ, జనపతి కనుకూలమైన చందముదోఁపన్.
ఆ. కాలయాపనంబు గావించిభూపతి, సాగనంపి తండ్రి సంధిదప్ప
నింక నిలువుదాన నేనంచు మదినిశ్చయించి యతనితోడ నిట్టులని యె.
ఉ. ఎన్నివిధంబులన్ వలవదేమిటి కీతమకంబటన్న నా
విన్నప మొక్కటైన నృప! వీనులఁజొన్పవు నీకుఁ గట్టిగా
నన్ను పరిగ్రహించెడి మనంబిఁక నింగిని మాన్పువార లీ
యున్న జనంబులోఁగలరె? యుక్తమయుక్తము నెన్న నేటికిన్. 139
మ. ననుసంతోషము నొందఁ జేయుటయె మిన్నాయంచు నూహించితే
ని నరాధీశ్వర! యేడునాఁడు లెడమీయంగావలెన్ నేటికిన్
జనఁగా భువనగధీశ! పూజసలుపన్ నాయంబు మాసంగడం
బున నేనట్లయొనర్పఁగావలయు ముప్పూటలన్ వివాహార్థమై. 140
ఉ. నావుడు సమ్మతించి జననాయకుఁ డింటికిఁబోయెఁ బోవ త
త్పావనశీల యంత తలిదండ్రులకాగతిఁ జెల్ప వారు ధా
త్రీవరు దుండగంబు సుమతీమణి పూనికయంత వ్రాసి స
ద్భావుఁడు వీరసంగయకుఁ బంపినఁగాంచి యతండు నెమ్మదిన్. 141
చ. హరహర! యెంతపాపమున కొస్పనవృత్తి వహించె నేఁడు భా
స్కరధరణీతలేశ్వరుఁడు చంద్రిణి నేక్రియవాంఛఁదీర నే
పరిణయమాడు? నాకుటిలభావుని నేక్రియ దెప్పరింతు? నే
నరణిఘటించునో శరభ సాంబసమూర్తి యటంచు నర్తతఁజేన్. 142
వ. చింతాక్రాంతుం డై యున్నతరి తజ్జనకాదు లతని యొద్ది కరుదెంచి

తన్ముఖంబున నావృత్తాంతంబు విని బలవద్విరోధంబు చెందుట భా
వ్యంబుగాదు కళ్యాణోత్సవంబు సమకూడదు రహస్యంబుగాఁ జని
వివాహంబొనర్చుకొనివచ్చుట మే లని నిశ్చయించి యాస్థితి సంగ
య్యతోఁ దెలిపి యతనిం దోడంబఱచి పెండ్లికొడుకుం గావించి
యొకయుత్తమాశ్వంబుపై నెక్కఁబనిచి యుచితపరివారంబుతోఁ

తే. తారు వేడుక వెడలి యోంకారపురముఁ [నేగి.
జేరఁ బోవుచుఁ దమవార్త వారి కెఱుక
పఱుపఁ దగువారిముందటఁ బంపి తోనె
నాఁటిరాత్రియె యేగి రన్నగరమునకు. 144

చ. సిరి దళుకొత్త నిప్పగిదిఁ జేర నిగూఢత విద్యపిల్లు స
త్వరమునఁ జొచ్చి యప్పుడె వివాహము నేర్పునఁ జేసి తద్వధూ
వరులహయంబుపై నునిచి బంధులతో నరుదేరి యప్పురం
బురువడి నిర్గమించిరి మహోత్సుకతం విభవంబు మీఱఁగన్. 145

ఉ. భూరిగుణాఢ్యుఁ డిప్పగిదిఁ బోవుచునుండఁగ నంతలోపలన్
జారుఁ డొకండువచ్చి ధర జాగిలిమ్రొక్కి మహీశ! నీమదిన్
గోరిన చంద్రికీమణిని గొంకక నొక్కఁడు బెండ్లియాడ పెం
పొ రహినేగె దానవరసాధిపవర్యుఁ డుదగ్రకోపుఁడై. 146

మ. అపురా! యెంతకువచ్చె నాసుమతి నూర్యన్గొల్చి నిన్నాంతు మూ
ఢవనాఁడొం డొక మాయఁబన్నినను పీడంజేసి లోలోపలన్
ధవునిం బిల్వఁగఁ బంచి తోన గనియెన్ నమ్మంగరా దెయ్యెడం
జివురుంబోడులఁ జేలనై విడిచితిన్ జేఁజిక్కు కాంతామణిన్. 147

చ. భువి పులినోటికండఁగొనుపోలిక వేడుక నేవరింపఁగో
రు వనజనేత్రిఁదోడ్కొని యొరుల్ గనకుండ వివాహుఁడై సుభాం
ధవుఁడయి యేగె వానిపటుదర్పము గీటణగించి యిప్పుడా
యువిదమరల్చి తెత్తు నని యుగ్రదవానలరేఖ మండుచున్. 148

శా. సేనానాథులఁ బిల్వఁగాఁ బనిచి యక్షీణోద్ధతి స్మేరలా
హీనాత్ము న్మడియించి తత్సుదతిఁ దెం డేగుండు మీవెంట నే
నేను న్వచ్చెదనంచుఁ బంప భటదంతిస్యందనాద్యాదిసే
నానీకాభియుతంబుగాఁ గదలి రుద్యద్బాహుదర్పంబులన్. 149

శా. ఆరీతిన్ జని వారలందఱు వివాహాయాతమర్త్యావళిం
దూరం బోఁగఁగనీకఁ జుట్టుకొన నిర్దోషాత్ముఁడా వీరసం
గాగాధ్యుండు హయంబుసిల్పి రిపుసేనాళి న్విలోకించి యిం
కేరీతిన్ జనవచ్చు శత్రువులనే నెబ్భంగి నిర్జించెదన్. 150

చ. పటుతరదర్పమొప్ప పరిపంథులఁగూల్పఁగ శక్తిచాల దే
నట నిటఁ దప్పరించిచన నాయితుగాదు లతాంగిఁ జేకొనం
గుటిలమహాధవుం డిటుల కొంకక నాపయి దాడివెట్టె హా!
కటకట! కాంతనిచ్చి చనుకంటె శరీరము వీడ మేలగున్. 151

ఉ. కాంత నెపంబువెట్టి నను కత్తులపాలుగఁజేయఁ బూనినేఁ
డింతకు దెచ్చినాఁడు హృదయేశ్వరుఁడా శరభావతారుఁడా
వంతయునైన బ్రాణమున కాసయొనర్ప సతీలలామకై
చింతయొనర్తు సేనగలిసెన్ వెరవెద్దియొకో తలంపఁగన్. 152

వ. అని యొక్కింతసేపువిచారించి యంతలోననే తెలివొంది యారా! పాంచభూతికవికారంబున కెంతతలంపుపుట్టె సకలజగత్సంహారకారణం బైనత్రిపురారింగొలుచువారల కసాధ్యంబులుం గలవే? యని నిశ్చలచిత్తంబున నిమీలితనేత్రుఁడై యీశ్వరపదధ్యానంబుసేయు నంతలోన. 153

శా. కాళీదుర్గలుపక్షముల్ రవిశశిగ్లౌనేత్రముల్ తీవ్రదం
భోళిప్రాయనఖంబు లష్టచరణంబుల్ వ్యాధిమృత్యూరు లు
త్తాలజ్యోతిశిరద్వయంబు తటిదుద్యజ్జిహ్వ లౌర్వానల
జ్వాలాభైరవకుక్షిపక్షములు దీవ్యద్బాహుసాహస్రమున్. 154

చ. తనరఁగఁ గానుపించి మది తల్లడమందకు వత్స! శారభం
బననగు మూర్తి నే సిటదయామతిఁదావకవాంఛఁదీర్పఁగాఁ
బనిగొని వచ్చినాఁడ నవపద్మదళాయతనేత్ర! వేగఁ జే
కొని పరిపంథిసంతతులఁ గూల్పఁగఁజాలుదు వంచుఁ బల్కుచున్.

తే. పావకాస్త్రస్వరూపమై పరఁగుమండ
లాగ్ర మొకటిచ్చి యాయుజ్జ్వలాయుధంబు
శత్రువులమీఁదఁ జళిపింప జ్వలనశిఖలు
దీనఁ జనియించి తచ్చమూహానిఁజేయు. 156

చ. అనుచుఁ దిరోహితుం డిటులఁ జెప్పఁగఁ జెప్పిరి యద్భుతంబుగాఁ
దనకరమందు వాఁడియడిదంబుఁ గనుంగొని మోదమంది సం
గన తనతల్లిదండ్రులకు ఖడ్గముఁ జూపి ప్రసన్నుఁడై వచిం
చిన శరభేశభాషితవిశేషము సర్వము దెల్పి యంతటన్. 157

ఆ. సంతసంబెసంగ సకలబంధువులకు,జడువువాసియపుడు వృషపవసకెఁ
గడలుప్రీలలీలగర్జోపమాన మా,సింహనాద మెలమి సేయుటయును.

వ. అమ్మహాధ్వని వినువంతనె పరిపంథివరూధినీసముచ్చయం బెల్ల బెదరు
గదుర డిల్లపడిచూచుచున్న సమయంబున వారిపిలుంవ నరుగుదెంచు
మానవపతి దానును భయకంపితతనుండై డాయనోడి తత్ప్రాం
తోన్నతశైలారోహణం బొనరించి కనుంగొనుచుండె నంత నబ్బ
లంబులు నిజసేనానాయకప్రేరితంబులై ధైర్యంబు నవలంబించి
యసిముసలముద్గరప్రాసాదిసాధనంబులతో సమరాభిముఖు లై
యొక్కపెట్టుకవిసిన నవ్వీరసంగమేశ్వరుం డత్యంతభక్తితాత్పర్యం
బున శరభసాళువమూర్తిం దలంచి పావకాస్త్రస్వరూపంబైన నిస్త్రిం
శంబొఱ వెఱికి ప్రావృట్కాంచలోపమానంబుగా జళిపించిన దత్ఖ
డ్గంబువలన సంవర్తసమయతాండవధురీణత్రిపురహాలఫాలాంబకో
ద్భూతతేజోమాలికాభీలం బై యొక్కయనలం బావిర్భవించి త
ద్వైరులంజుట్టుముట్టి దహించి పంచత్వంబునొందించిన నంతొక్క
శరణపుంగవుప్రాణంబుల బ్రహ్మరంధ్రంబులవ్రచ్చుకొని తేజోరూపం
బునశివంబున కేగునవసరంబునఁ దత్కళేబరంబా యోధనబహిఃప్రదే
శంబునఁబడిన వీరసంగయ గనుంగొని. 159

ఉ. అక్కట! మోసమయ్యె శరణాగ్రణిజీవముఁ గొంటి నింక నా
కెక్కడి మోక్షమేడ యశమే టిది భక్తి? మదిష్టమూర్తి నేఁ
డిక్కడ భక్తహింస ఘటియింపఁగఁ బోలును వాడి ఖడ్గమే
నెక్కరణిన్ సహింతు తనకీపగయున్నెటనుండి యుండెనో. 160

చ. అనుచు విషాదమగ్నహృదయాంబుజుఁడై గణవర్యుతోడఁ దా
నును మృతిఁజెందఁగాఁదలఁచి యాల్కను ధైర్యమునన్ గటారిచే
కొని యద నూనునంతనె యొకో యని తచ్ఛరణుండు లేచి యో!
యనఘ! యిటేలచేసెదని హస్తమునట్టి మరల్చె నంతటన్. 161

శా. శైలాగ్రంబున నున్న రాజవరుఁ డాచందంబు వీక్షించి స
చ్ఛీలుం డీతఁడు శర్వభక్తతతి వంచింపండు నేనిప్పుడా
లీలంబోయి మదీయపద్మినరుఁ డై లేవంగఁబో నంతలో
గూలం జేయుదు మత్ప్రహారవిహతిం గొంచింపఁగా సంగయున్.

వ. అని తలంచి. 163

చ. గళహృదయాంశశీర తలకాయములక్ శశిహారనాయ కో
జ్వలమణిశాటికామకుటచర్చలెడల్చియు గొప్పశక్తిచే
వెలయు శివాక్షముల్ గిరిశపేటిక కావిపటంబునుక్ జటా
వళిభసితంబు దాల్చి గణవర్యుని చందముదోఁప నత్తఱిన్. 164

క. చనుదెంచి యెదుటనిలచిన, జననాయకుఁ గాంచివీరసంగయ్య ముదం
బునఁ గేవలశరణాగ్రణి, యని యెదురుగ నేగి మ్రొక్కునంతటిలోనన్.

క. కేల నున్నట్టి శితకర, వాలంబున నతనిశిరము వ్రైఁగ నదిపూ
మాలికయై కంఠంబున, వ్రేలె ధరావల్లభుండు వ్రీడం జెందన్. 166

క. ఆక్షణమున గిరిజేశ్వరుఁ, డీక్షేంద్రము నెక్కి నిర్జరోత్కరయుతుఁడై
సాక్షాత్కరింప సంగయ, యక్షీణముదంబుతోడ నతనికి నతుఁడై. 167

మాలిని. శమనమదవిభంగా! చంద్రఖండోత్తమాంగా!
కమలనిధినిషంగా! కాళికాత్మాబ్జభృంగా!
యమృతనిజనిభాంగా! హస్తసంభక్తరంగా!
దమిసుతగుణసంగా! దైవవేశ్యాభుజంగా!. 168

తే. అనుచు వినుతించు నాతనిఁ గని శివుండు
వాంఛితం బెద్ది వేడు మోవత్స! యనినఁ
బెండ్లివారికి మాకు నీపృథివిపతికిఁ
దావకీనపదం బిమ్ము ధర్మవాహ. 169

వ. అనిని శర్వుం డిట్లనియె. 170

క. శ్రీవీరసంగసంతత, కోవిదనుతసుగుణసంగకువలయపతి దు
ర్భావుఁడు వీనికి మోక్షం, బెవిధి నివ్వంగవచ్చు నెఱుఁగ వె యనినన్.

శా. స్వామీ! యిట్టుల నానతీయతగ దీసర్వంసహాభర్తచే
నే మీపాదముఁ జూడగంటిఁ గడు వర్ణింపంగ నీచిహ్నముల్
దా మైఁ దాలిచి మిమ్ముఁ గన్గొనియె నీతం డెన్ని చందంబులక్

సామాన్యం డని యెంచఁబోక దయమోక్షం బిచ్చి రక్షింపవే!. 172

చ. అనిన దరస్మితాంచితముఖాంబుజుఁడై పరమేశ్వరుండు త
జ్జనవరుఁ బెండ్లివారలను సంగయ నాతని యంగనామణిం
గొని చనె రౌప్యశైలమునకుణ్ సుర లచ్చెరువంద నట్లుగా
వున శరణప్రభావము లపూర్వము లాత్మ గణింప భూవరా!. 173

## బెట్టిదదేవరసు కథ.

వ. అనిన బసవేశ్వరునితో బిజ్జలుం డిట్లనియె. 174

ఉ. తొల్లిటివట్టిముచ్చటలు దొడ్డగఁ జెప్పిన నెట్లు నమ్ముదుణ్
గల్లయొ నిక్కమో? యపుడు గన్గొనవారలలోన నేరికిం
జెల్లవు తత్ప్రభావములు చెప్పినయట్టుల నీగణాళిలోఁ
దెల్లము చేయుమా యొకని దివ్యమహత్త్వము చూడ నిత్తఱిన్.

క. అన బసవేశ్వరుఁ డిట్లను, జననాయక! యెవ్వరైన శరణావళి చే
కొనవ్రేలిగోరఁబోలరు,మును పే?మిపు డేమి?తథ్యముగఁగనుమనుచున్.

క. కట్టెదుట నిల్వఁబడ నీ, బెట్టిదదేవరసుగారి పృథువిక్రమ మా
పట్టణభర్తకుఁ జూపఁగఁ,దొట్టిన సంతోషమాత్మఁదొలుకఁగఁబలికెన్.

క. నృపుఁ డన్నమాటవింటివె,యపరిమితమహాప్రభావ యనునంతనె తాఁ
గుపితాంతరంగుఁడై కా, శ్యపి గగనంబంటఁ బెరిగె సభ తల్లడిలన్.

వ. ఇట్లు పెరిగి బసవేశ్వరు నుద్దేశించి. 179

సీ. సరసిజాతాబ్జ నక్షత్ర గ్రహంబులు బారనూదునొ యోప్రపన్నపోష!
మలజాదిసుకలఁ బొమ్మలరీతికరములఁ బట్టి యాడింతు నో భానుతేజ!
యేడుసముద్రంబులిలవసంతంబుగాఁజల్లునాఁ డుదునో ప్రసన్నహృదయ!
యుర్విధరంబులొన్డొంటితోఁడాకించియురుము సేతునుమామనోవసంత!

తే. యేమిగూనతి యనిబసవేశ్వరాఖ్య, సంజ్ఞనొకగట్టు పెకలించిశయకనిష్ఠి
కాంగుళిపునర్భవంబు చేనాకసమున, కెగరఁజిమ్మిననదిబంతిపగిది నెగసె.

క. ఆరీతి నెగయు గిరిఁ గని
యేరిపయింబడునొ యనుచు నెంతయు సభలో
వారెల్ల బెదరి గనుఁగొన
బోరున నది పుడమిదొరగి పొడిపొడియయ్యెన్. 181

ఉ. అత్తరి లేచి బిజ్జలధరాధిపుఁ డంగముకంప మొంద న
త్యుత్తముఁడైన దేవరసు నొయ్యనఁ జేరి నమస్కరింపుచు
న్మత్తుఁడ క్రోధచిత్తుఁడ క్షమాగుణహీనుఁడ నైననాను నీ
విత్తరి కూర్మిచే నభయ మీయఁగదే శరణాగతావనా!.

సీ. భీరహితపురాముర రారివీరానీక మారకుండగు నాగహారిరూపు
ఘోరపరాక్రమ తారకదైత్య సంహారుఁడైనట్టి కుమారురూపు
పారమేశ్వరభక్తిదూరదక్షవినాశ కారుఁడౌ వీరావతారురూపు
నీరేజభవశిరో దారణుండగు కాల భైరవమూర్త్యాఖ్య పేరురు

తే. బోలు నీరూపు శమియించి పూర్వసరణిఁ
దనరి జనలోచనానంద మొనరఁ జేయు
మని నుతించిన నెప్పటితనువుఁ దాల్చె
బసవముఖభక్తతతికి సంతస మెలర్ప.

క. వరగుణుఁడగు బెట్టిపదే, వరసు చరిత్రంబు వినినఁ బఠియించిన
నరుఁ డరితరిఁ బొరిగొని సు, స్థిరతరశుభసంతతులను జేకొను ధర

క. కావున ఘనుఁడీ బెట్టిప, దేవరసయమహిమ లిట్టి తెఱఁగగు మఱిఁ
భూవిదితంబుగఁ జిత్రము, పావనగుణవీరభద్ర పార్థివ వినుమా

క. కలిదుర్మాయారహితుఁడు, సలలితజంగమపదాబ్జజాతామిళితుం
డలఘుతరకీర్తియుతుఁడీ, గిలకదమారయ్య యితనిసత్కృత మెఱిగింత

## గిలకదమారయ్య కథ.

సీ. తనువున భస్మలేపన మొప్ప నొనరించి గండపెండెర మొక్క కాలిఁ
కరకచల్లాణంబు కాసెతో బిగియించి, కటికంపుపోగు లేర్పడ ధరి
గళమున పాలకాయలసంకుసరు లేసి ఘనమైన మేనయోగములు దో
ఫాలభాగమునందుఁ బ్రాణలింగము సిల్వపసిమి మీరెడు శాల్వపైని

తే. కన్మొనల కజ్జలము దిద్ది కావిబొట్టు
ఫలకమునఁ బెట్టి నాభితలమున ఘంట
నునిచి యొకకేల గిలకయు నొక్కకేల
బొమ్మయును బట్టి కళ్యాణపురమునందు.

ఉ. వంచన యేమిలేక గణవర్యగృహంబుల కేగి గిల్కవా
యించుచుఁ గేలిబొమ్మ నటియింపఁగఁ జేయఁగఁ జూచి వారు వ

న్నించి యొసంగు కాంచనమణిప్రచయాంబరవస్తుజాలముల్
గొం చెరువెంచి భక్తవరకోటిసమర్చ లొనర్పుచున్నెడన్. 188

తే. ఆవిధము జనులంతట నాడుకొనఁగ
విని గణాచారి సంగయ్య యనెడు భక్త
పుంగవుఁడు తీవ్రకోపవిస్ఫూర్తితోడ
మారయాఖ్యునిబిలిపించి తూలిపలికె. 189

ఉ. మాయలబొమ్మ వట్టి పలుమారు నటింపఁగఁజేసి దాన నా
దాయముగూర్చి శైవగణతండసమర్చ లొనర్పుచున్న లే
దాయనె వేఱెయొక్కసనయంబగు కాయక మిట్లు సేతయే
నాయము మానసూనదగు నాధరణిస్థలి భక్తకోటికిన్. 190

క. మేదిని శరణులు లింగవి, నోదంబులు సితరమగు వినోదానుభవం
బెదిక్కున నొనరించిరి, సీదగు చరితంబుదలఁప సింద్యం బయ్యెన్.

తే. కుండచరపుర కుమ్మరగుండవిభుఁడు
చప్పటలు వేసి చారమచక్రవర్తి
హరుని నాడించి రాగతి యవలఁబుచ్చి
మాయచేఁబట్టి యాడింప నాయమగునె. 192

చ అనవు డతండు మ్రొక్కి వినయంబున నిట్లను సంగమేశ! నీ
యనుమతి యట్లుగాఁగ ననయంబుఁ జరించెదఁ బొమ్మ యింకఁ జే
కొన నని పల్కి గేహమునకుం జని యెప్పటిరీతికాయకం
బునకయి యొక్కమేటిగణపుంగవునింటికిఁబోయి యచ్చటన్. 193

చ. అలరకరస్థలింగమవు డాత్మకరంబున నిల్పి వింతగాఁ
గిలగిలనాగ గిల్క యొకకేలఁ గదల్పఁగ హస్తపద్మసం
కలితభవుండు షట్పదముకై వడి గంతులువేయఁజొచ్చె వి
చ్చలవిడి చూచువారు మది సంతసమందఁగ నంతలోపలన్. 184

ఉ. శైవగళోత్తమాంగకరసారసకక్షముఖాంగదేశయు
క్పావనలింగముల్ ప్రథితకాంచనపీఠనియుక్తలింగముల్
స్థావరలింగముల్ గదలి తాండవమాగతినాడఁజొచ్చినం
భావములందు నద్భుతము పర్వఁగ భక్తవరేణ్యు లొండొరుల్.

తే. మేటికలలోన వస్త్రంబు మూటలందు

కరతలంబున నున్నలింగములు గంతు
లేయఁగాఁజొచ్చె యిదియేమి మాయ మొక్కొ?
యనుచు నంపఱు బసవాలయమున కరిగి. 196

ఉ. ఆతనిఁగాంచి తన్నటనమంతయుఁ దెల్ప స్వలింగమూర్తి ము
న్నాతెఱఁగొటఁజిత్తమున నద్భుతమందగ శంకరధ్వజ
వ్రాతము పూర్వశైవనికరంబులు స్థావరపీఠలింగసం
ఘాతము నాట్యమట్లనె భయం బెదనొందఁగ వచ్చిచెప్పినన్. 197

మ. పరిశీలింత మటంచు నున్నయెడ నొప్పం బట్టణోదంతముల్
నిరతంబు న్వినుపించుచారుఁ డొకఁ డోలిన్వచ్చి సేవించి యో
వరమంత్రీశ్వర! యిప్పురాంతరమున న్వాక్రువ్వఁగా రాని చి
త్రరసంబొక్కటిఁ గాంచివచ్చితిని దథ్యంబెట్లనఁ దెల్పెదన్. 198

వ. గిల్కదమారయాఖ్యుం డొక్కభక్తసత్తముండు. 199

తే. బొమ్మనాడించి తల్లబ్ధి పూటపూట
నయ్యలనుబూన్ప సంగయ్య యనెడిభక్తుఁ
డీసరణిగూడదన బొమ్మ నెడమకేల
లింగమూర్తి నాడించె భక్తాంగణముల. 200

తే. మాదఁ డింతటి భక్తుఁడో? మదనవైరి
తనకుఁ దా నాట్యమాడె నాతండు చెప్పి
నటుల నీచిత్ర మెచ్చుటనైన గంటి
మే? యనిన దండనాథుండు మెచ్చి యపుడు. 201

క. వారందఱితో సంగయ, గారి శుభాగారమునకు గ్రక్కునఁ జని జో
హారుతగలింగనర్తన, కారణమునఁ జోద్యమంద ఘనపదములకున్.

క. జోహారుసేయ నాతం,డాహా! యిదియేమి వింత? యధికులు మీ రి
ట్లూహింతురె? యనిక్రమ్మఱ,నాహారభక్తార్యవితతియడుగులకొరగెన్.

వ. తదనంతరంబ. 204

చ. బసవఁడు సంగమేశుఁ గని పల్కెను గిల్కదమారశూరి కీ
వసదృశబోధసల్పమము నందఱ నిత్తఱి లింగమూర్తిచేఁ
బసచెడి మోదచేసితివి బాపురె యాతనిచర్య లెన్నఁగా
బిసరుహగర్భ శేషగిరిభిద్గురుముఖ్యుల కైనశక్యమే. 205

జాయనసప్రవర్తి సుకృతాత్ముఁడు సూనృతవాక్యుఁ డిమ్మహిన్. 214

ఉ. ఈతఁడు మోగులూరఁ జరియింపుచుఁ దా నొకనాఁడు పుష్కరో
ద్భూతమరందపానపటుతుందిలషట్పదమేచకప్రభా
కైతవకందదర్శనవికస్వరహృచ్ఛిఖిభాసితప్రభూ
జాతకుడుంగమానసరసి సైకతదేశమునందు నొక్కచోన్. 215

తే. కలితపద్మాసనస్థుఁడై కనులుమూసి
జపమొనర్చెడి జంగమ సార్వభౌము
ధీరు నురులింగ మనియెడు దివ్యపురుషుఁ
గాంచి యల్లంతనుండి జాఁగఁబడి మ్రొక్కి. 216

చ. నిలిచిన కొంతసేపటికి నీలగళాపరమూర్తియైన య
య్యనఘుఁడు మానవృత్తి నిడి యక్షులువిప్పి కనంగనంతలోఁ
పలఁ దిరుగంగ మ్రొక్కి వెలివాఁడ మనుష్యుఁడ నెద్దయాఖ్యుఁడన్
ఖలుఁడను నన్ను శిష్యునిగఁ గైకొని వేగ కృతార్థుఁ జేయవే!. 217

క. జననియుజనకుఁడు దాతయు,ఘనదైవముగురుఁడునీవగతియును నీవే
యని నమ్మి నిన్నుఁ జేరితి, ననుకరుణాదృష్టిఁగనుము నతజనపాలా! 218

చ. అనవు డతండొనర్చు వినయంబున కెంతయు బ్రీతిజాగి హీ
నున కెటులియ్యగాఁదగు మను ప్రభులింగము నన్నఁగొంకులోఁ
బెనఁగొన కొంతసేపతనిఁ జేర్కొనకూరకయుండి వానితో
నినుమును వెన్నఁడేనెఱుఁగ నీగుణమెట్టిదొ యెడనుందువో? 219

వ. అనిన నతం డిట్లనియె. 220

క. ఇప్పురి నెప్పుడు యుండుదు, చెప్పంబనియేమి కరుణఁజేపట్టిన మీ
కప్పుడె నాగుణమగపడు,నప్పాయనిజాగి మ్రొక్కియతఁడిట్లనియెన్.

క. గురుశుశ్రూష యొనర్చుచుఁ, జిరకాలంబునకుఁ గాక చేకూరునె నీ
యురువాంఛయనినమితియే,ర్పఱచినన నెటసేయువాఁడపావనచరితా!

తే. అనిన ద్వాదశవర్షంబు లధికభక్తి
భూతిరుద్రాక్షధారివై భూతనాథ
భక్తు లెదురైన మొక్కుచుఁ బరిచరింపు
మనిన నవుగాక! యనిపోయి యనుదినంబు. 223

క. ఉరులింగము బోధించిన, కరణిన్ గ్రమ్మరుచు వంటగట్టియ లొక మో

పరుదున వారల గేహావరణములో బయలనుండి వైచుచునుండెన్.

ఉ. ఈగతి మూఁడునాలుగయిదేఁడులు పుచ్చి యితండు వేడ్కచే
నాగురువర్యభవ్యకరుణాగతిచే ఫలియించు నంచు వే
వేగ ప్రభాతవేళ నిలు వెల్వడి నాఁటిదినంబునందు స
ర్వాగమవేది యాగురునియంగణమందుఁ జరించుచుండఁగన్. 225

ఉ. నిద్దుర లేచి యాఘనుఁడు నీలగళున్ స్మరియించువేళ నా
పెద్దయ సంచరించుసడి వీనుల సోఁకిన నావుదూడయో
యెద్దో యటంచుఁ వాశియని యేడ్తెర ముమ్మరుఁబల్క నాతఁ డీ
ప్రొద్దునకబ్బె నాకు గురుబోధితమంత్ర మటంచు నాత్మలోన్. 226

తే. కంటిభాగ్యంబు భక్తినిగంటిఁగీర్తిఁ, గంటిఁ బెన్నిధిగంటి మోక్షంబుగంటిఁ
గంటి జ్ఞానంబునింక నేఁగడమ లేక, యుంటి నిత్తఱినీగురుమహిమవలన.

చ. అని యిటుల న్నుతించుసమయంబునఁ దద్గురుఁ డేగుదేర నా
తని కతిభక్తి మ్రొక్కి యమృతప్రదమంత్రరహస్య మబ్బె మీ
ఘనకృప నంచు బల్కిన మొగంబున నివ్వెఱ దోఁప వాశి యం
చని మును తాను దల్చుమహితాక్షరము ల్మను వయ్యె వీనికిన్. 228

చ. పలుమరుఁ బల్క మంత్రమయి పాటిలె నౌర! తపక్షరద్వయం
బిల సితదర్పుఁడౌ కతన నీశ్వరుఁ డీగతి సంఘటించె నం
చలమినప్రేమఁ బెద్దయ! కృతార్థుఁడవైతివి పొమ్మటన్నఁ జాఁ
గిలిపడి మ్రొక్కి యేగె వడి గేరుచు బొంగుచు నంతు లేయుచున్.

క. ఆరీతి నరిగి సద్గురు, భూరికృప స్మంత్రసిద్ధిఁ బొందినవాఁడై
ధారుణి జానెంజెత్తున, ధీరుఁడు పెద్దయ్య మెఱసి తిరుగుచునుండెన్

ఉ. అంతటఁ దత్పురాధిపతి యాత్మముదంబున నొక్కబావి ద్ర
వ్వింత మటంచు నుప్పరులఁ బిల్వఁగఁబంచి యనుజ్ఞయీయ వా
రెంతయుఁ ద్రవ్వినన్ జలము లేమియు నూరక చట్టు వడ్డ దాఁ
జింతిలి రాయి దొల్చు ఘనశిల్పికులన్ నియమింప వారలున్. 231

తే. చేతనయినంతయాచట్టు చెండిచెండి, యించుకైనను దానిభేదించలేక
విసివిభూపతికాగతివిన్నవింప, మదినివేఁటొందుదోఁచకమంత్రిఁ జూచి.

క. నీ కేమిఁ దోఁచు నాశిల, యేకై వడిఁ దెగు జలంబు లేగతి నూరున్
మాకేమిదెలియకున్నది, యాకూపము పనికివచ్చునను వుం జెపుమా.

ఉ. నావు డతండు మ్రొక్కి నరనాయక! యొక్కటి దోఁచె నామదిం
బావకపట్టణాంతరమున న్వసియించుమహాజనంబు లీ
బావి జనించు చట్టుపయిఁ బాదము లుంచిరయేని దీనిలోఁ
బావనసీర మూరు నిది భావ్యమయేని యొనర్పు మీ వనన్. 234

ఉ. పెద్దల వారిఁ గన్గొని పురంబున నారసి సుప్రసిద్ధులౌ
పెద్దల నెల్ల నిచ్చటికిఁ బిల్వఁడు పొం డన వార లేగి యా
శుద్ధి యెఱుంగఁ జెప్ప విని చోటులనుండియె వారు వచ్చినన్
గద్దియ డిగ్గి మ్రొక్కి నరనాథుఁడు నద్భుతవారయుక్తుఁ డై. 235

ఉ. తవ్వినబావి డగ్గఱి బుధప్రకరంబున కర్థి మ్రొక్కి మీ
రివ్వల కూపమందు దిగి యిద్ధభవత్పదపద్మపాంశువుల్
నివ్వటిలంగఁ ద్రొక్కుఁడవలీలగ నీరము పుట్టు నన్న వా
రవ్విధి సల్పినన్ సలిలమందు జనింపమి రాజు ఖిన్నుఁ డై. 236

క. ఉన్న యెడఁ జారుఁ డొక్కరు, డన్నరపతి గాంచి దేవ యంత్యజుఁ డొకరుం
డున్నాఁడు ధరకు జానెడు, మిన్న గజరియించు పదము మెట్టఁడు భూమిన్.

ఆ. తన్మహత్త్వ మెన్నఁ దరముగా దెరికిఁ, గాన వానిచేత నానాయే మొ
వారిఁ దీనిలోన నూరఁ జేయఁగ నన్న, బిలువఁ బనిచె నృపతి పెద్దయాఖ్యు.

చ. పిలిచిన వేగ వచ్చి తనపెంపు గనంబడ భూమి కెత్తుగా
నిలిచినవానిఁ గాంచి ధరణీపతి యద్భుత మంది వీనిచే
సలిలము నూరు చట్టరు నసంశయ మంచుఁ దలంచి నూతిలో
పలిశిల వీడఁ జేయుట యుపాయము దోఁచిన సేయుమీ వనన్. 239

ఆ. అతఁ డట్లు సేతు నది యెంత పని యని, గురునిపదము లాత్మఁ గుదురుకొల్పి
వాశియనిఁ బట్టు వదలి యా చట్టుబి, ట్టెగసి బయలు వడియె జగతి వణఁక.

ఉ. వెంటనె తియ్యనీరు ప్రభవించినఁ గన్గొని భూమిభర్త మి
న్నంటఁగఁ బొంగి సంతసము నద్భుతము న్మది బర్వ నేఁడు ము
క్కంటియె కాక యన్యులనఁగాఁ జన దిప్డు మదీప్సితంబ నే
పంట ఫలింపఁ జేసె నసపాయముగా నని యెంచి వానితోన్. 241

క. అద్దంద శోకహారున, కుద్ది యన న్వచ్చు నిన్న హో! గుణగణకా!
పెద్దలకుఁ బెద్దవైతివి, పెద్దయ్యా! నీకు సాటి పృథివిం గలరే?. 242

వ. అని సన్నుతించుసమయంబున. 243

సీ. ఇదియద్భుతం బని మదిగణించెడివారు పోఁడిమిఁ జెడిచిన్నవోవువారు
నెవరితోఁ జెప్పక యిండ్లకేగుడువారు నొకరిచాటుననొకరుండువారు
తలవంచి యేమియుఁబలుకకుండెడువారు వెచ్చనినిట్టూర్పులిచ్చువారు
కాలియంగుళులతో నేలవ్రాచెడువారు వెతలఁ జేనాత్మలవిసుగువారు
తే. నగుచు నందలిపెద్దలు వగచుచుండు
సమయమున వచ్చి యురులింగసద్గురుండు
తనకు మ్రొక్కిన శిష్యుని నెనరు దొలుక
గ్రుచ్చి కౌఁగిటఁ జేరిచి మెచ్చుఁ దనర. 244
క. శైవాగమోక్తసరణి, న్నావనతరలింగ మొసఁగ భక్తవరేణ్యా!
నీవే నేనే నేనే, నీవే యిద్దఱికి భేద మించుక గలదే? 245
క. జాతీశుఁడు బిల్లముచే, ఖ్యాతిఁ గనినపగిది భక్తగణములలో నీ
చేతఁగడు వన్నె కెక్కితి, మాతంగ్రీ! నీవు శిష్యమాత్రుఁడవగుదే?.
తే. అనఘ! నీమామ పూర్వమై యస్మదీయ
నామధేయంబు గలుగంగ నాకుఁ గోర్కె
పెరిఁగెనటుగాన నురులింగ! పెద్దయాఖ్యఁ
దాల్చు మని పల్క నాతఁడు దాల్చి వెలసె. 247
క. ఉరులింగపెద్దినిర్మల, చరితము సద్భక్తి సభలఁ జదివిన వినినన్
గురుకారుణ్యంబున సుస్థిరవాంఛాఫలసమృద్ధిఁ జెందునరుఁడిలన్. 248

## ఈండ్రఁగ మారయ్య కథ.

వ. అదియునుంగాక. 249
క. వేంద్రపుఁగినుకరనాదు, త్తంద్రిపయింబొడము వాని తలయిలగాలం
గండ్రించువేల్పుపగతుం, డీండ్రఁగమారయ్యయితని నెన్నఁగదరమే.
వ. ఇతండు కల్యాణపురంబుననుండుచు ననుదినంబున. 251
చ. మొలచుట్టు న్వడిగోలుదాన నగుబల్మోలాపయిం గీతక
త్తులు నూలున్ మునలంబు వామభుజమందున్ దాని కిర్వంకలన్
కలులొట్లుండిడ కట్లనిచ్చెనపెలుందర గొమ్ము కాల్చిందమున్
దలకోరా ముడిగుడ్డయున్ దనరఁబాగ్రితళికాలమం దెప్పుడున్. 252
క. నిజకాయకమునకై యం, గజరిపుపదపూజనములు గావించి మనోం
బుజమలర నేగినుర దెచ్చిజనులకమ్మియు ధనంబుఁ జేకొని మెలమిన్.

చ. తనయులు సేరి వాఁడియడిదంబున నాత్మకరద్వయంబు ఖం
డన మొనరించి శర్వనికరంబులు మ్రొక్కఁగఁ దారకాద్రికిం
బనిచి భజించివచ్చి మునుపంటివిధంబున నంటికొన్న పా
వనశయవారిజాతముల భావగణార్చ లొనర్చు నిత్యమున్. 254

క. ఈరీతి వ్రతము సలుపుచు, మారయ నొకనాఁడు నగరమార్గంబున రా
ధారుణిపతి సభ కేగుచొ, దారిన బసవండుఁగాంచి దండ మొనర్పన్.

తే. మగుడ నతి యొనరించు నమ్మహితుఁ డేగు
పిదప బసవండు సభ కేగి వేగ మఱలి
తత్ప్రసాదేచ్ఛ మారని ధామమునకుఁ
జనియె ముదమున మూఁడవజాముతఱిని. 256

క. చని దంపతులకు వందన, మొనరింపఁగ నుల్కి వారు దండేశుని గ
న్గొనియట్లుగొల్లనలుపుచు, వినయంబుననిట్లు లనిరి వికసితముఖులై.

ఉ. పావన మయ్యె మాగృహము పాపము లెల్ల నణంగెఁ బుణ్యముల్
ప్రోవుగఁజేరె ముక్తిసతిఁబొందుటగూడె ఫలించెఁ గోరికల్
దేవరదార లిందు నరుదేరఁగ జా గొనరింప కీశ్వరా
ర్చనవిధి సల్పఁగా వలయు జంగమవర్యులతోడ నీ వనన్. [మ

ఆ. అట్లుగాక యనుచు నమ్మంత్రిశేఖరుం, డపుడె వారలిడిన యమృతమయ
మహాప్రసాదతృప్తుఁడై తదనుజ్ఞచే, నెలమి నిజగృహమున కేగె నంత.

క. కొండెదమాచయ ధరణీ, మండలపతిఁజేరి యింద్రమారనియింటం
బండారిగుడిచెననిబలు, కొండెముగా దెలుపనతఁడు కోపోద్ధతుఁడై.

క. అప్పుడె బసవామాత్యుని, రప్పించిటువల్కె మొగము రాజగమికే
తప్పులు లేవనితలఁచితొ, చెప్పఁగవినరానిపనులు సేయందగునే? 261

మ. కులశీలంబులు నీటఁబుచ్చి విభుధోక్తుల్ గాలిఁ బోఁజేసి పూ
ర్వులచర్య ల్విడనాడి శాస్త్రనియమంబుల్ ద్రోసి కల్లమ్ము వా
రలయిండ్లం గుడువంగ నెంచితివె సర్వజ్ఞుండవే యైనఁ ద
త్కులముంజూడక నీవు మిన్నకయె కక్కుర్తిఁ బడం జెల్లునే? 262

సీ. చేతులుఁగోసి యీశ్వరునిచెంతకు నిత్యముఁ బంచుచున్న వి
ఖ్యాతి గణించి తేమొ యది గారుడమౌ చెలు గంగలేక నీ
వాతని పెంపు మాకు ఘనమై కనుపట్టెద వన్న నవ్వి మో

భూతలనాథ! తన్మహిమ పొల్లుననాడుట నీకుఁబాడియే? 263

క. మారయ మదవిదళుని, మారయయనివినుతికెక్కు మహిమ నెల్లెడనా
మారయమహిమౌన్నత్యము, నారయఁగాఁగలమె భూవరాధిప యనినన్.

ఉ. మాటల కేమి యీశ్వరసమానుఁడు వాఁ డనునంత నమ్ము న
న్నాఁటి యతండు ప్రత్యయముఁ జూపఁగ నోపినవాఁడయేని న
ప్పాటున సమ్మతింతు మని పల్కినఁ దద్బసవేశ్వరుండు మో
మోటమి లేక వాని మహిమోన్నతఁ జూపెద రమ్ము భూవరా!

క. అని పరివారముతోన, జ్జనపతిదోడుకొని వానిసదనంబునకుం
జనఁగనియ్యాతఁ డెదుర్కొని, వినయంబున మ్రొక్కి బసవవిభుఁ డిట్లనియెన్.

చ. అకుటిలతావకవ్రతమహత్త్వముఁ జూచుట కిన్నరాధినా
యకుఁ డరుదెంచెఁ గావున రయంబున నీతని కోర్కె దీర్పవే
సకలజనాక్షిపర్వముగ శంకరతుల్య! యటన్న నాతఁ డిం
చుక మదిఁ గొంకు లేక దనసుందరి దానును భక్తినమ్రులై. 267

క. చెలకులు నటేకినచాడ్పున, కలుకుకలుక్కున నగనాత్మకరములు నాల్గుం
దలేఁగి కొనునంతలోనన్, గరకంఠునిపురికిఁ జనియె గగనతలమునన్.

చ. అటు చని పార్వతీశుల పదాంతికమందున వ్రాలె నయ్యెడం
బటుగతి సిద్ధరాముఁ డనుభక్తవరేణ్యుఁడు గాంచి వచ్చి మా
కిటు నటనైనభూధరను తేశవివాదముఁ దెల్ప నేను వి
న్నటులను వీరభద్రవసుధాధిప! నీకెఱిఁగింతు నంతయున్. 269

క. ఆరీతిఁ దనదుపదములు, మారాంతకచరణముల క్రమంబునఁ బడు నీ
రేరుహవదనప్పూరుష, చారుకరాబ్జములుగాంచి శైలజ మదిలోన్.

తే. అద్భుతం బంది విభుఁ గాంచి యనియె నీశ!
సంతతము రెండుపురుషహస్తములు వచ్చు
చుండు నేఁ డిది యేమొకో యువిదకరయు
గంబు నరుదెంచెఁ దెలుపు నిజంబు గాఁగ. 271

చ. అన విని శంకరుండు గిరిజాత్మజ కిట్లను నింద్రమారదా
త్మసిరుపవ ప్రభావము తమకన్ బసవానుమతింధరాధినా
థున కెఱిఁగింప బూని తనతోయరుహాననహస్తపద్మముల్
నినుఁ గొలువంగఁ బంచె నన నెమ్మదిఁ బార్వతి సంతసింపుచున్. 272

ఉ. దీనజనానురాగ భవదీయపదార్చకసన్మహత్వముల్
వూనినుతింప ధాతృఫణిపుంగవజీవులకైన శక్యమే?
మానితసత్యసంధులసమానతరోరతులద్రిధైర్యులం
హానిచయాపహారులసమున్నతి తేజులునీతికోవిదుల్. 273

చ. అని కొనియాడుచుణ్ గిరిజయాత్మలిసీలకచోమృతంబులో
కనికర సన్నుతాద్భుత సుగంధము బంధురపాండురప్రభా
వినికృతహంసమైనసురవృతకుసుమన్ని మహాదామమప్పుడా
ఘనకర యుగ్మయుగ్మమున గట్టిగఁజుట్టి ప్రియుండు నవ్వఁగణ్. 274

ఉ. అంతటఁ దత్కరంబులు శివాంఘ్రులు సన్నిధినుండి ధాత్రికిణ్
వింతగవచ్చె నభ్రపదపం బరివేష్టితపారిజాత పు
ష్పాంతర సింధుపారణసమాగతషట్పద బృందఝాంక్రియా
కాంతదిగంతరంబులైవరాజముఖ్యు ల్వోఅగందిచూడఁగణ్. 275

క. ఆరీతి వచ్చి తత్కర, వారిజయుగయుగము పూర్వవైఖరియపుడా
మారవిక నతనిసాధ్విక, ధారుణిజను లెల్లఁజూడ దవిలివెలింగెణ్.

చ. అది గని బిజ్జలావనితలాధిపుఁడద్భుతసాధ్వసత్రముల్
హృదయములోనముప్పిరి వహింపఁగ శ్రీబసవేశుఁగాంచి యీ
సదమలచిత్తుసన్మహిమ స్వాంతమునణ్ దెలియంగలేకనే
బదరితి కొన్నిమాటలవి పాటియొనర్పక నన్నుబ్రోవరే. 277

చ. అని వినుతించి మొ్రొక్కుచు ధరాధిపుఁ డాత్మగృహంబుఁజేరునం
త నచటిభక్తవర్యులుముదంబునమారసిగాంచిబాగురే
ఘనతరభక్తినిష్ఠలనుగాయజుసంహరసత్కృపారతిం
గనుటకు నీవె మేటి వికగల్గుదురే నినుఁబోలువారిలణ్. 278

చ. బసవనిదారనాఁడుజనవర్యుఁడులజ్జవహింపలోకము
ల్విసువకసన్నుతింపనిజవిశ్రుతకీర్తిలతావితానము
ల్దిసలనలంకరింప గణధీరులకెల్లనుసంతసంబుమా
నసములనింపనిత్తఱిగనంబడచేసితి నీమహత్వముల్. 279

వ. అని పెక్కువిధంబులఁ బ్రస్తుతింపుచు బసవేశ్వరప్రముఖభక్తులాత్మ
నివాసంబులం జెంది రట్లుగావున వీరభద్రావనీపాలా! యితని మహి
మం బెట్టిదనిన, 280

క. ఈయాంధ్రమారయ చరిత, మాయకసద్భక్తి వినిన బఠియించిన కి
ఖ్యాయువునారోగ్యశ్రీ, శ్రేయస్సంతానవృద్ధి జెందు నరుఁ డెలన్. 281

వ. అదియునుంగాక. 282

చ. సుజనహితంబు సద్వ్రతము సూనృతవాక్యము శాంతవృత్తి భా
వజరిపు పాదభక్తి గణవల్లభ దాస్యము దివ్యబోధ స
ర్వజనవశీకరంబు గతరాగత నైజగుణంబు లౌటచే
నిజగుణ ధాముఁ డయ్యె ధరణీస్థలి నీతఁడు మానవేశ్వరా!. 283

## గుణేంద్రుని కథ.

వ. ఇమ్మహాత్ముండు కల్యాణగుణంబునం దనుదినంబు. 284

క. రేవణకప్పెంకతఁడా, జీవంబునఁ దాల్చి భక్తసింహుల యిండ్లం
బావనభిక్షముఁ గొని నై, జావాసము జెంది దానసక్షయలీలన్. 285

ఉ. వచ్చినజంగమావళి కవారితభక్తి భుజింపఁ బెట్టుచున్
సచ్చరితుం డితం డనుచు సర్వజనంబులు సన్నుతింపఁగా
తెచ్చిన ఖ్యాత వర్తిక గణేతరులెవ్వరు వేలసంఖ్యలై
వచ్చిన నిష్టభోజనముల వారలదన్పుచు నుండు నంతటన్. 286

చ. జనపతి తత్క్రమంబు విని నైపకదుర్మతి నా గుణాఢ్యవం
చన మొనరింపఁ బూని యొకసక్కముగా బసవేశుతోడ ని
ట్లనియె మహాత్మ! యిప్పురము నందొక భక్తుఁడు వేలసంఖ్యవ
చ్చిన మనుజాళి కీప్సితము చేకుర నట్టు మనోహరాన్నమున్. 287

క. అసివింటినది యొనిక్కమొ, యన్నృతమో? బసవఁడనియె నవనీశ్వర నీ
వినినంత మట్టు సత్యం, బనఘాత్ముండతని మహిమయఁ విమొతఁపన్.

చ. కరమునఁ బట్టి భిక్షుగొను కప్పెర గొప్పదిగాదు మానడా
టరు దది నిండ తండులము లవ్వల నెవ్వరి వేడ కింటికిం
బరువున వచ్చి సద్గురుకృపాగతి యక్షయమైనవాటిచే
గురుతుగ కోటిసంఖ్యజనకోటుల కాతఁడు బెట్టు నన్నమున్. 289

వ. అనిన నమ్మహీశ్వరుం డి ట్లనియె.

తే. అట్టులయినసంతతాన్నదానవ్రత, నిష్ఠఁ బై చరించు నిజగుణేంద్రు
మందిరమున గుడవ మాకిష్టమైనది, నేడు పోదమనిన నృపతిఁ గాంచి.

చ. బండరిపల్కెనో మనుజవల్లభ! నీ కెటు దోచె నట్లపో

వండరుదెండిపాగ మది దార్కొనుకూహకు మీర లేయు దం
దండరథాశ్వవీరభటదానసుహృజ్జనబంధుయుక్తుఁడై
దండిగ నేగుదెంచె వసుధావరుఁడాబసవండుతోడరాన్. 292

తే. అటుల తనయింటికేతెంచు నవనిజాని
బసవనామాత్యుఁ గనుఁగొని ప్రమదమాత్మ
నలరెనెదురేగి నిజగుణి యచటభక్తి
నికరములకెల్ల కేల్మోడ్చినిలుచు నంత. 293

ఉ. ఆతనిగాంచిపల్కె బసవన్నమహాత్మధరావరుండు నీ
ఖ్యాతికి బ్రీతిజెంది భవదాలయమందుభుజించువేడ్కచే
నీతరివచ్చినాఁ డితని యీప్సితముల్ ఫలియింపఁజేయవే
పాతకజాతదుర్విపినపావకతావకభావమేర్పడన్. 294

చ. అనిన మహాప్రసాద మని యందరిఁదోడ్కొనిపోయి మున్నుగా
ఘనతరభక్తిచే శరణకాండసమర్చ్యలొనర్చి పిమ్మటన్
వననిధిగాంచి భక్తపరివారముతోడను భాసనంబులం
దొనరఁగఁజేసి దివ్యమహిమోన్నతిసద్గురు సంస్మరింపుచున్. 295

మ. కదళీరాజనరాజపంక్తు లమరంగా వైచి యంతర్భుతం
బొదవన్శాకశలాటిసూపరసభక్ష్యాఖాద్యహయ్యంగవీ
న దధిక్షీరసమేతపాండుకలమాన్నం బల్లు వడ్డింపనే
మెదలిర్పన్ భుజియింపముల్ కొనిరి భూమీపాలకుండాదిగన్. 296

దండకము· యీరీతి తజ్జైను లారోగణంబొప్పగాఁ జేయుచుం దారు వ
ర్మ్యాక్తులిం బొంధఁగా నొంపొరుల్ సారె నీభక్తవర్యప్రధానంబు
లెక్కింప వాక్కామినీనాథ ముఖ్యావరుల్ శక్తులేపూని తాజేయు
చున్నట్టియాకాయకం బెంత యీవచ్చికూర్చున్న సంఘంబు సంఖ్య
న్విచారింపఁగా నెంతయెవ్వారి కెవ్వారి నేతీరుగానిష్టమౌనట్టిచందం
బు సంతృప్తిగావేడి వడ్డించె నౌరా భళీ బాగుమేలాయె నిట్లుండవ
ద్దానెతాంతానదాసక్రమంబంచు నీరీతిగా భోజనం బబ్బునం బిం
చుకంత్రైనముం దోఁచఁదాయంగదాయింట నేవంటకం విసర్జించియే
తెంతు నంచున్ మహీన్ దోషమై వేయువర్షంబులున్నంతకం టెన్

గజంబై ముహూర్తంబ వర్తింపమేలన్న చందంబునన్ హీనమాజైన
వంశంబునం బుట్టి యేభోగము న్లేక చింతింపుచున్ బెద్దకాలంబు
జీవించుకంటెన్ క్షణంబైన భక్తాఢ్యులై యుండుట ల్మేలటంచున్ మ
రిం గుత్తు కంటంగ భక్త్యావళుల్మెక్కి సంతృప్తిలేకయ్యయో! నెత్తిపై
నోరుగల్పించితే నింకనుంగొన్ని భక్షింపవచ్చున్ గదా యట్టుగా
నేటికిన్ జేయఁడాబ్రహ్మ పాపాత్ముడంచాతనిం దూరుచుం గూని
పాండ్యుండు నాసాంఖ్యతొండాహ్వయుండాదియౌవార లీజైనవం
శోద్భవుల్గారె? మారారి భక్తాఢ్యులయియంతవారైరి యారీతినీ బౌ
ద్ధవంశాభిమానంబుఁ బెన్నీటిలోముంచి యేడాదిగా వీరశైవంబుచే
కొందమంచున్ వివాహంబులున్ పండుగల్ బబ్బముల్ మున్న
మాయిండులన్ జేయుటల్లేవొ! యీవస్తుజాలంబులన్ దండిగా వండ
లేదో! భుజింపంగలేదో! యహా! యిట్టిసౌకర్య మేమెన్నడుం గంటిమే
వీరిచేనైనపాకంబు తీరిట్టిదో లేక శ్రీకంఠభక్తాళి గేహంబులందంత
టన్ సౌష్ఠవంబిట్టుగానుండునో యంచు నానట్టిసౌఖ్యంబునం దా
సగిల్కొంటచేకదా సర్వదేశాగతానేకభక్తావళుల్ లక్షయత్తొం
బదార్వేలు బండారి యిల్వెళ్లఁగా లేక యేచోటికిం బోదురు రండు
రండంచుచుం వడింగేరుచున్ ద్వారందెం డటంచున్ సురంబెత్తికొం
చున్ జరంబయ్యెనంచున్ శిరంబంటికొంచున్ గడుందియ్యమంచున్
నడిన్ బావుకొంచున్ గదన్ జూచుకొంచున్ న్నైడన్ ద్రిప్పుకొంచున్
గడుంజుఱ్ఱునం జుఱ్ఱుచున్ గుఱ్ఱునం దేన్పుచున్ నిఱ్ఱునంనీల్గుచుం
వేడ్కతో బిజ్జలాధీశు పూర్వంబుగా నందఱుంభోజనం బొప్పఁగాఁ
జేసి యప్పిష్టటన్. 297

క. నిజగుణసన్నుతిఁ జేయుచు, నిజగేహంబునకుఁ జనియె నృపతిలకుఁడు వా
నిజనము లహాహా యనఁ బూ, నిజగంబులు మెచ్చనిత్తఁడు నెగడెన్ భక్తిన్.

## మీమాంసుని కథ.

చ. అనియనువీరభద్రసుధాధిపుతో ననునాగమాంబికా
తనుభవుఁ డీమహాత్మునికతంబున నయ్యె మదీయమాతులా
వనివరదేశికేంద్రులకు వాద మదెట్లన బిజ్జలుండువా
యినిజగుణేంద్రు నింటభుజియించుటఁ దా నతికోపచిత్తుఁడై. 298

శా. మీమాంసుం డిదియేలకో తలఁప నీభూనాథుఁ డాత్మీయవం
శామందక్రమ మెల్లమిన్నకయె మాయంజేసి దుశ్చేష్టుఁ డై
కామించెం శివభక్తులిండ్ల గుడువంగా నిట్టి దుర్వర్తనం
బేమాన్పింపకయున్న పాపమగునా కిప్పట్టునం చెంతయున్. 300

చ. సరగునపైనమైబలసి ఛాత్రసహస్రము గొల్వఁ బుస్తకో
త్తరభరభృత్కరుల్ నడువఁ దమ్మటకాహళశంఖభేరికా
దిరవములుల్లసిల్లఁ బరవీరభయంకరమైతనర్చు మే
ల్చిరుదవితాన మొప్పవెడలెం గురు డందల మెక్కియుక్కునన్. 301

శా. ఈరీతిఁ జనుదెంచి భవ్యతరకల్యాణాంతికోద్యానవి
స్ఫారాక్షోణితలంబున న్విడియ నవ్వార్తల్ ధరానాథుతో
చారుల్ దెల్పినలేచి యప్పుడుసుహృత్సంఘంబుతో వేగస
చ్చారుండై చనివొచ్చె సూర్యకిరణాసాధ్యోపవన్యంతమున్. 302

వ. చొచ్చి చనిచని ముందట. 303

చ. కనుఁగొనె నేలతేఁడుమణికాంచనభూషణభూషితుఁ మృగా
జినయుతుఁ గోపిచందనవిశిష్టసమంచితఫాలుఁ గతుఁ దే
శనిరుపమేంద్రజాల మనుసంచయసంపుటు నంగలిప్తచం
దనుస్ఫటికాక్షమాలు గుణధాము ననామ్నుని నైజదేశికున్, 304

ఉ. కాంచి నమస్కరించి మణికాంచనముఖ్యము లైనవస్తువుల్
సంచితభక్తి మ్రోలనిడ సర్వముఁ జూచి యితండు చిత్తమం
దెంచమదీయ భక్తియెడ నేమరఁడంచుముదంబు నొంది ము
క్తాంచితహార మొక్కటి ప్రియంబుగ దీవెనతోడ నిచ్చినన్. 305

చ. అదియురుతం ధరించుకొని యాకురువర్యునిభద్రదంతిపై
ముదమున నెక్కఁగాఁ బనిచి ముంగలకాంచనవేత్రహస్తుఁడై
పద తొలగుం డనంచును యవాయజనంబుల దా నదల్చుచుఁ
సదనము జేరఁదెచ్చి మణిసౌధమున న్వసియించి భక్తితోన్. 306

తే. సింహపీఠంబునందుంచి చెంత సర్వ
మైన గద్దియ తానున్న యవసరమున
బసవఁ డేతెంచి నిజపీఠమునవసింపఁ
గాంచి మీమాంసుఁ డాత్మలో గనలుగదుర. 307

చ. నరవరుతోడ నిట్లనియె నన్గని మ్రొక్కఁగ మోలిగద్దెపై
సరగున గూరుచుండె మదిజంకొకయించుకలేక యోగి యో
గురువరుఁడో యితండు ప్రతికూలుఁ డిరాజసభాంతరంబులన్
దిరుగుచునుండ నీవగునె తెల్పుము వీఁ డెవడన్న నమ్రుఁడై. 308

ఉ. దేశికసార్వభౌమ! గణియింపఁగ నీతఁడు మర్త్యమాత్రుఁడే?
పాశుపతాగ్రగణ్యుఁ డరిభంజనుఁ డాశ్రితపోషణుండు భా
షాశరదిందు సన్నిభయశఃపరిపూరితదిక్తటుండు పం
చాశుగదుర్వికారహరుఁ డంచితసూనృతవాక్యుఁ డిమ్మహిన్. 309

సీ. తనయిల్లు దోఁచవచ్చిన తస్కరులు గాల్చు
వంగకాయలు నెఱ్ఱ లింగములుగ
జంగమం బడిగిన ముంగలిజొన్నల
రాశి ముత్యములగాఁ జేసి యొసఁగె
బండార మొకమిండ భక్తునకిచ్చి య
ప్పటికి గతినాకు గన్పడఁగఁ జేసె
వాదించి సభవెలి వాఁడభక్తుల కేలి
నేలజాలై పాఱపాలుపిలిచె

తే. చల్లలమ్ముచు పురవీధిఁ గోపపడతి
పంకమున జారి యొఱఁగుచో బసవయనుచుఁ
బల్కనిటనుండి పడకుండఁ బట్టె దాని
నితని మహిమ పథం బిట్టి దిదియుఁ గాక. 310

చ. శాత్రవలోకసంచయము సల్పి చతుస్సరిధీసమగ్రయా
త్రా త్రికి వేడ్కమీఱ నను దక్షునిఁ గా నొనరించి మారభి
న్నేత్రశశాంకహీరశరకుండలినాథ సదృక్షకీర్తికిం
బాత్రునిఁ జేసి మాన్పె బసవండితఁ డెన్నినమంత్రిమాత్రుఁడే. 311

క. ప్రతివాదిభయంకరుఁడూ, శ్రితశాంభవభక్తి ధనుఁడు జితషడ్వర్గుం
డితనిని సామాన్యజనుని, గతి చుల్కఁగ మీరు చూడఁగా వలదనినన్.

ఉ. వాలము దొక్కఁబడ్డ ఫణివై ఖరినాజ్యము వోయ భగ్గనన్
జ్వాలలు గ్రక్కు తీవ్రశిఖిచందమునన్ గనలొందె యోరి? భూ
పాలక యంటి వీవు పరవాదిభయంకరుఁ డా యితండు చాల్

చాలుమదీయ సన్నిధివశం బగు నేనుడువెత్తదీనికిన్. 313

తే. వేదవేదాంతశాస్త్రాగమాదులందు
మంత్రతంత్రౌషధక్రియామహిమలందు
చోద్యమాయింద్రజాలాదివిద్యలందు
నాకుసరివారుఁగలరె? భూలోకమునను. 314

క. ఏనిత్యవలనదానా, తోవాదించఁగలఁడనుచు దండేశునిది
కైకొ వెసఁదిరిగి మహాప్రభావం బేర్పడఁగవైచె వాకట్టెలిపిన్. 315

వ. ఇట్లు వైచిన. 316

క. మనమునరించుకఁగొంకక, కనుఁగొనలఙ నవ్వి తనదుకట్టెదుటవసిం
చిననందికోలశాంత, య్యనుఁగనిబసవయ్యసైఁగనటుఁజూపుటయున్.

సీ. ఆలిపిపత్రికయాతఁడున్గై కొని కొం కొకింతయులేక గోఱజీరె
మీమాంసుఁడదివోవతామసంబునచెడకకట్టివైచినదానిగాలమమరె
గడువడిక్రమ్మఱి కనుకట్టువైచిన బున్సునసెగనూది పోఁజేసె
యిట్టితోల్కట్టదండేశుని మర్దింపవైచినశాంతయ్యచూచి తనదు

తే. పాదరక్షలు వదిలినమీఁదికెగసి
యొకటియాకట్టు హరియించె నొకటివాని
మోముపైఁబడి పండ్లూడ మోదె సభికు
లెల్ల విస్మయ చిత్తులై దల్లడింప. 318

క. ఆదెబ్బకుమీమాంసుఁడు, మేదినిఁబడి మూర్ఛఁజెంది మెల్లనదనకే
లూనుకొనిలేచిబసవని, పాదంబులమీఁదవ్రాలిప్రణుతించెనిటన్.

ఉ. మారటరుద్రమూర్తియసమానజగద్భరితాచ్ఛకీర్తిదు
ర్వారకళాప్రపూర్తి నినువర్ణన సేయఁగ నెవ్వఁడోపు నీ
చారుమహత్త్వముల్ దెలియఁజాలక నెగ్గొనరించినాఁడ నా
నేరము లెల్లసైచి కరుణింపఁగదే శరణాగతావనా. 320

క. దోషాచలమదసంహర, శేషునిమహిమంబుదెలియనెఱుఁగకఖలుఁడై
దూషించిభద్రుఁజేగని, పూషునిగలినన్ను జెందెభూనుతనీచేన్. 321

వ. అనివినుతించునాతని దయంగని శ్రీబసవండు బిజ్జలేం
ద్రుని యెడపీడు కోల్పడసితోషము మీఱఁగ నందికోలశాం
తుని మదిమెచ్చుచుం గృహాగతుం డగుపిమ్మట రాజదేశికుం

డునచటవేడుకఁ జెమదిఁ గడున్మదిఁ బరవ్వఁగ వేగన త్తఁతెన్. 322

క. మితశిష్యయుతుఁడై యసమతశుభకరం బైనబసవేశ్వరమందిరంబు
నకేగిన నతనిరాక యంతర్గేహంబుననున్నఁ దనతోఁడ జారుం డొక్క
రుండు మ్రొక్కుచు సవినయంబున. [లాప

తే. తెలుపవచ్చి యిందుకొలువుకూటంబున, నతఁడు దాను ననునయాను
ములవసించునంత నలుదెసఁగోడల, వ్రాసినట్టిభక్త వరులఁజూచి.

క. మీమాంసుం డచ్చెరువడి, స్వామీ! బసవేశ! యిట్టిసలలిత భక్తో
ద్దామాకృతిగనుప్రతిమల, కేమహిఁజీవములుగలుగు నెటులుండునొకో!

క. అనవుడుదరహసితాననమొనరఁగ నీకోర్కె యటులనుండునటుల నేఁ
గనుపించెద నిటుగనుమీ,యనిశరణొనరించిపిలువ నతక్షణమాత్రన్.

క. కీలూడి పడినకైవడి, నేలకు డిగనురికి తోడనే జీవములుం
గీలుకొన సందడింపుచు, కాలాంతక భక్తవర నికాయములంతన్.

సీ. జడముడులీడిన సవరగాముడుచుచు
జిలుగువన్నియల బొంతలు దులుపుచు
తళుకుమనెడు శూలములు లీలఁద్రిప్పుచు
పీవనలను మేను విసరికొనుచు
వాలుగడ్డంబులు కేలజాడింపుచు
మొలకట్లకచ్చడంబులు జెలువుచు
జటిలమా రుద్రాక్ష సరములు విప్పుచు
కక్షపాలలు భుజాగ్రముల నిడుచు

తే. నిలచిన తదీయపదముల కెలమి మ్రొక్కి
మంత్రివర్యుండు నగుచు మీమాంసుఁ జూచి
తే యనిన నద్భుతంబంది యామమాత్యు
నభినుతింపుచు నటగురుఁ డరిగె నంత. 328

క. బసవేశ్వరుఁ డెప్పటిగతి, వసుధీశ్వర రాజ్యభార వహుఁడై గణప
ద్మసరుహ పూజలొనర్చుచు,నసమాన మహత్వయుక్తుఁడై విలసిల్లెన్.

వ. అని యిట్లుచెప్పి చెన్నబసవేశ్వరుండు వీరభద్రావనీశ్వరునకు మఱి
యు నిట్లనియె. 330

## కూలిచామయ్య కథ.

మ. గణవర్యుం డన వన్నెకెక్కె మహినీశై కూలిచామయ్య స
ద్గుణవర్ణ్యవ్రత సత్యవాక్యనిలస ద్గాంభీర్య శేషాహి భూ
షణపాదాంబుజ భక్తికాముముఖ హృచ్ఛక్త్యష్టసత్సారితో
ల్బణకీర్త్య న్యహదీనరక్షణకళా! ప్రావీణ్యసంపత్తిచేన్. 331

తే. అతుల ప్రఖ్యాతిఁగాంచి కల్యాణమందు
నిత్య మీతండు భక్తుల నిలయములను
చేతనగు కూలిపనిచేసి చేరుధనము
వలన జంగమపూజలు సల్పుచుండి. 332

క. ఒకనాఁడు రేపకడను, త్సుకలీలం బసవమంత్రిఁ జూచుటకై త
త్పరికటాలయబాహ్యద్వారకవాటసమీపచత్వరంబుననొకచోన్.

సీ. అచటనుండియయాత యాతజనంబుల సందడి కటునిటు జఱుగ నేర
కొక్కింతనిలచి తానాయ్యనస్థాన సదనముఁజేరంగ జని యగణ్య
భక్తసముచ్చయ పరివేష్టితుం డగు బసవనిఁ గనుఁగొనఁ బడయలేక
యెడగల్గనిలచి యయ్యెడనున్న వారలఁ గనిదండనాథునిఁ గనఁగనీయ

తే. పూర్ణమగు కోశమంతటఁ బోదివికొనిన
మత్తికంబుల కైవడి మాదృశులను
మిగుల నన్యాయ మిది యిట్లు దగునె? యనుచు
నందలువినంగ నాడ నయ్యవసరమున. 334

సీ. వినికొందఱయ్యలు కనలుచుఁజూచి వీఁ డెక్కడనుం డిట కేగుదెంచె
నెవరురానిచ్చి రీ మాహాత్ములనెల్లఁ జులకఁగాగణియించిపలుకఁజొచ్చె
నైకూలిమాటలు గాదనకున్న వీఁ డేగతిబల్కు నిం కెన్ని యేని
గాన యిచ్చటనుండఁగానీక వెడలింపు డని మెడపట్టితోయంగ వెడలి

తే. కన్నుఁగవనీరుజారగగనలిమిగుల,కలతమది దేర మోము వెల్వెలఁగబార
జేరివంచకతతిఁజేరిచమటలూర,చని యెవగగూర నిజనివాసంబుఁజేర.

వ. ఇట్లు చని పరిభవచింతాడోలాయమానసుం డై యేమియుందోఁచక నిజభవనాంగనప్రాంతస్థితశాండిల్య మహీరుహమూల వితర్దికనాసీనుం డై యాత్మగతంబున. 336

చ. బసవనిఁ జూచి వేడ్కమది బర్వఁగ నేనట కేలపోతి త
ద్వసతి వసించునట్టి గణవర్గము నేటికిఁ దూలనాడితిం
గసరున వారునన్ను దువఁగా బడి యుండఁగ మోసె నేడ యో
కుసుమశరారి నిత్యమగు కూలికిఁ బాసితి మోసపోయితిన్. 337

ఉ. పాపము లేమియు న్బొదువ జేసెగదా గణవర్గమెల్ల రు
ద్రాపరమూర్తియైన బసవాధిపుఁ జూడగనీక కొల్వులో
జూపర నసన్వినాతనువు స్రుక్కటజేయుట కల్మికల్గు దా
రీపగిదిం దిరస్కృతివహింతురె ధారుణి ధారుణీరథా. 338

ఉ. ఏమిటఁబూజచేసె బరమేశ్వర యీబసవండు తొల్లి నే
నేమి కొఱంత జేసితి నభీష్టనిరంతర భాగ్యయుక్తిఁగా
నామహితాత్మునుంచి లఘులైన దరిద్రము సంఘటించి బ
ల్బాముల నొంచఁ జేసి తిది భావ్యమె నన్ను గణాలిలోపలన్. 339

క. కూరిమి నెవ్వరుసిరిగల
వారలకే కూర్తురనెడు వార్తయె ధరపై
నారూఢమయ్యె నీ విటు,
గౌరీధవనన్ను మిగులగాసియిడుటచేన్. 340

వ. అని యిట్లు పరమేశ్వరుఁ దూలనాడుచు సాయకంబున కఱుఁగక జం
గమార్చనవిధిఁ దలంపక యుండె నక్కట. 341

శా. దండేశాలయమందు నెప్పటిగతిం దత్పూపకాకావళుల్
వండంబూనినతండులప్రముఖముల్ వస్తువ్రజంబంతయున్
భాండాకంబుల నించునంతనవి గానంగామి విభ్రాంతితో
నుండన్ నేఁజని తత్క్రియంబు దెలుప స్వీతాకుఁడై యత్తఱిన్. 342

ఉ. ఎన్నడు లేనివింత యిది యేమకొ యిప్పుడు గంటి లింగసం
పన్న గణేశ్వరప్రకర భక్ష్యకృపారతియందుఁ దక్కువౌ
నన్నది లేదు తొల్లియిది యద్భుతమై కనుపట్టె యేమి కా
కున్నదొ? యింకమీఁద శరణోచితకృత్యము లేమి తప్పునో!. 343

సీ. అయ్యలబోడగనునంతనె నెదురేగి యడుగులకొఱగెనో యర్ఘ్యపాద్య
ములొసంగనో పీఠములనిల్పనో నేమములు దెలియంగనో యడలఁగలుగు
తలపులీడేర్పనో పంపినపనిసేయనో రుచికరముగా సారభోజ

నమొనర్పఁ జేయనో సుమదామచందన తాంబూలములసమ్మదంబునొంద

తే. సలుపనో హంసతూలికా శయ్యల శయ
నింప జేయనో తత్పదనీరజంబు
లొత్తనో యేమికతమొ ద్రవ్యోత్కరంబు
మాయమయ్యె గణార్చనా సాయమొదువ. 344

చ. అనియిటు చింతనొందుసమయంబునఁ జారుఁ డొకండువచ్చి వం
దనమొనరించి యోబసవ! తావకసేవక విన్నపంబు హ్రా
ద్వనజమునం బరాకిడక తాలిమితో విను విన్నవింతు నీ
దినమున నిష్ఠురంబునను ధీరుఁడు భక్తవరేణ్యుఁ డొక్కచోన్. 345

క. మాచేడునీడశివకరు,నీరోరుహమందునిల్పి నిగళద్బాష్పా
ప్లావితముఖుఁడై తతపణి, హారునిదూరుచు వసించె నది యెట్లన్నన్.

చ. గురుతరమైనలేమి సమకూరిచి యెవ్వరికందరాని రా
సిరిగల దండనాథు గృహసీమకుఁబోవఁగఁ బంచి యచ్చటన్
శరణులచేతఁ దాడనమొనర్పఁగఁ జేసి వ్రతంబుఁ బాపి యి
ద్ధరననువల్కగాఁ గనుట ధర్మమె? నీకిది ధర్మపావనా. 347

చ. అనుచు వచించె నాబసవఁ డద్భుతమందుచు లింగదర్పణం
బునకయి కాలిచామయ విభుక్రమమంతయుఁ గాంచితప్పు వ
చ్చెనని తదీయయాభవనసీమకు సత్వరవృత్తి నేకతం
బునఁ జని తత్పదాబ్జముల పొంత ధరాస్థలి జాగిమ్రొక్కుచున్. 348

ఉ. కీనతఁదోఁప నిట్లనియె దేవ కృపారసదృష్టిమీరు నన్
గానఁగవచ్చునేనపుడు గానక మోసముఁజెందినాఁడ నె
చ్చో నను బోలి దుర్మదవశుండు ధరాస్థలిలోన గల్గునే
జ్ఞానములేదు భక్తియును సౌజ్ఞ యెఱుంగ వివేకహీనుఁడన్. 349

ఉ. కావున నింకనైన దయఁ గన్గొని నాయెడ తప్పులెల్ల యున్
నావలఁదోఁచియేలుమెడ నైనగణార్చనవేళ దప్పఁ ద
త్పావన జంగమావళిక్షుధావ్యథఁ జిక్కఁ దదీయసేవ నా
జీవనమౌట మీరు మును చిత్తమునందె యెఱుంగలేవొకో. 350

వ. అని యిట్లాత్మనిందయు భక్త్యోత్కర్షంబు దోఁపనాడుచున్నఁ బసవేశు
నింగనిచామయ్యభక్తియుక్తుఁగ్రమ్మఱనమస్కరింపుచునిట్లనియె. 351

శా. దేవా! నన్నిటు పెద్దసేయఁదగునే దీనుండ మీపాద స
త్సేవాసక్తుఁడ మీమహత్త్వములు నాచేఁ జెప్ప శక్యంబె యా
జీవాహీనులకై సమాధ్యశుల రక్షింపంగ సిద్ధాత్రిపై
భావప్రోద్భవసంహరాంశమున నుత్పన్నుండవై భక్తిచేన్. 350

క. సురమణి కన్నులఁ గేలం, బరుసము ధరియించి సకలభక్తాధ్యసమున్.
త్కరములకీప్సిత మొసఁగుచు, ధర వెలసితివిట్టులోరులతరమె యొనర్ప

క. శరనిధులు మేరఁదప్పిన, గిరులు చరించినను నింగి క్రింది కొఱఁగినన్
స్థిరధైర్యకొఱఁతయగునే, యురుతరభవదీయమహిమ యొకచోనైనన్.

వ. అనిన విని వినయసల్లాపంబుల ననునయించి బసవేశ్వరు నిజమందిరంబు నకుఁ బోవం బనిచిన నతండు సంతోషితస్వాంతుండై యెఱిఁగి యంతకమున్న యప్పటియట్ల యక్షయంబైనపదార్థంబులు గాంచి యచ్చెరువందుచు తత్క్రమంబు వారలతో నుగ్గడింపుచు నుండె నిట చామయ్యయుఁ దనసాధ్వీకిం దనవృత్తాంతం బెఱిఁగించి నిత్యకృత్యంబున కేమి యింతప్రొద్దుజరిగెనని విచారింపుచు వీథికేగునప్పుడు దైవయోగంబున నొకభక్తుండుతనయింటికిఁ గూలికింగొనిపోయి యప్పటి యాతనిపడి యొసంగినఁ గొని తెచ్చి జంగమార్చనవిధిసలిపెఁగావున నితని మహత్త్వం బిట్టి దని తెల్పి వీరభద్రనృపతింగాంచినం బసవేశ్వరుం డిట్టి మాపథవర్తులైన జంగమ మూర్తులలో నేనెంతవాఁడ నన్ను మీరిన్నిభంగులం గొనియాడం దగునే యనిన క్రమ్మఱ నతం డిట్లనియె. మహాత్మా! యిమ్మహాత్ములచర్యలు విని కృతార్థుండ నైతి. కల్యాణంబున భక్తతృప్తినలన నాత్మతృప్తిపహించు శరణుండు గలఁడని విందు నతం డెవ్వరనిన చెన్నయ్య మన్నించి యి ట్లనియె. 355

సీ. ప్రతికూలభార్యయాకతననింటగణార్చ పొసఁగకచేన్నావఁ బోవునప్పు
డప్పురి నెదురైనయయ్యనొక్క నిగనిచనిమునుతాఁ దెచ్చుపడ్రసాన్న
ములతద్ఘునిత్యతృప్తిఁబొందించియాతనిఁదృప్తియేనిజలింగతృప్తిగాఁగ
వరలుకొన్నాళ్లిటుజరగఁగనొకనాఁడుతా వెంటఁగొనిపోవుశై పవకుఁడు

తే. కనులనొప్పిజనించినఁదనువుపీడ, నందశ్రమనొందికినఁజాలకాత్మదేహ
మెడలదలచిప్రత్యక్షమౌమృడుఁడుదదీశ, భక్తులనుగూడెఁగంగళబవవిభుడు.

చ. అనియిటు శాంభవోత్తముమహత్త్వముఁ దెల్పుచువేడ్కమీఱినా

దినమటుపుచ్చి యట్టిపగిది న్నిరతంబును భక్తవర్యగో
ష్ఠి నలరుచుఁ శివార్చనము సేయుచు నచ్చట కొన్ని నాళ్లు ని
ల్చెను బసవేశ్వరుం డనిన చెన్నసుధీశుఁడు సంతసించుచున్. 357

ఆ. అటులనుండి తోడియయ్యలు వీరభ, ద్రోర్విపతియుదాను నొక్కనాఁడు
సముచితేష్టగోష్ఠి సలుపుచుఁ బద్ధరా, వరునిఁ జూచి చెన్నబసవఁ డనియె.

ఉ. ఈశ్వరమూర్తియైన బసవేశుదయ న్నిముబోఁటి వీరమా
హేశ్వరపాదసేవన లభీష్టముఁ దేరఁగఁ జేయఁగంటి నీ
విశ్వములోన జన్మములు వీడి కృతార్థుఁడనైతి నింక నే
శాశ్వతమైన మోక్షపదసౌఖ్యముఁ జెందఁగనూహ చేసితిన్. 359

చ. అనవుడు కేలు మోడ్చి వసుధాధిపుఁ డిట్లను దేవ! మిమ్ము గ
న్గొనినది యాది నన్యమగు కోరిక లెల్లఁ దృణీకరించి పా
వనభవదంఘ్రియుగ్మ మెడఁబాయక యుండఁ దలంచినాఁడఁ గా
వున సహచారిఁ జేసికొని పుణ్యునిగా ననుఁ గావవే దయన్. 360

క. శరణాగతజలవాంఛా, పరిపూర్తి యొనర్చు టుచితపద్ధతి గాదే?
వరగుణులకెందునే మీ, వరవుడ నాకోర్కిఁ దీర్ప వలదే! యనినన్.

చ. చిఱునగవాననాబ్జమునఁ జెన్నువహింపఁగ నాగమాత్మజుం
డటిముటిఁ బల్కె నీతలఁచినట్టుల యౌ నిఁక నేడు వేవిన
న్మఱిముఱి చీకటింగణసమూహముతో నిటు దెల్పఁ బోక నం
దఱ మఱఁగ న్వలెఁ సురవితానసుతామృత వెన్నఁ జేరఁగన్. 362

క. అప్పెన్న నదీతటమునఁ, బిప్పలభూజద్వయంబుఁ జేరొక్కన దగు వె
ల్తిప్పకరుగసాధనమై, యొప్పుననుచుఁ దెల్పనృపతియుత్సుకుఁడయ్యెన్.

వ. అంత. 364

రజతశైలంబు కరుగుట.

క. లేపిన పిమ్మట నాగాం, బాపరతనయుండు కల్యవర్తన లెల్లన్
వేవేగఁ దీర్చి సహచరు, లౌవీరగణాళితోడ నతఁ డిట్లనియెన్. 365

తే. సన్నుతంబైన వసుధలోనున్న నదుల
కన్నిటికి మిన్నయై తగియున్న యట్టి
చెన్న యున్నతి నలంచిన యన్నరాళి
కెన్నఁగా మోక్ష మఱచేతి వెన్న గాదె! 366

ఉ. కావున నన్నుదీవరము గన్ గొన నేడుకయయ్యె పోదమే ?
పావనులార! యంచు నొడబాటొనరించి సమస్తభక్తులన్
గోవిదుఁడైన వీరనృపకుంజరుఁడుం దనతోడఁగూడి రాఁ
బావకసంభవాంశజుఁడు ప్రాభవమొప్పఁగ నేగె నత్తఱిన్. 367

వ. ఇట్లు చని చని. 368

సీ. ఆత్మాంబుసంస్మరణానందమానవ సంఘమకరం హైభుజంగనకుల
స్నానసందర్శనాసక్తజనస్తోమ పాపకాంధధ్వాంతభానుదీప్త
వైరిజనస్నాత్యపరలోకసప్తజన్మార్జితవృజినానిలానిలాశి
నిజతోయపాయిమనుజసముదయకృత పాపభూమీజాతపరశుధార

తే. పూరి సుకృతవంశోద్భూత భోగిమీన
కమఠనక్రజలూకకర్కటకముఖ్య
జంతుసముదాయవిహరణ స్థానమగుచుఁ
గన్నులకువన్నెఁ జెన్నొందు పెన్నఁ గనిరి. 369

మ. కని డాయం జనునంతపేఁచెపయిఁ దత్కల్లోలినీతుంగభం
గనితాంతోజ్ఝితశ్రీకరప్రజలరంగత్తుంగభూమాలతీ
కనకామ్రాదివసుంధరారుహసమాక్రాంతప్రసూనప్రభూ
తనిరాఘాటసుగంధబంధురజగత్ప్రాణాంకురవ్రాతముల్. 370

ఆ. అమ్మరు ద్వ్రాతముల పథాయాస మపన
యించి యొకరమ్యతలమున నెల్ల భక్త
వరులు దానును శ్రీచెన్నబసవవర్యుఁ
డెలమితోడుతఁ గూర్చుండి యిట్టు లనియె. 371

ఉ. భక్తవరేణ్యులార! ననుభవ్యకృపారతి మీప్రసాదసం
యుక్తునిఁ జేసి యేకొఱఁతయున్ ఘటియింపఁగనీక యేలుటన్
వ్యక్తిగ సర్వవాంఛిత సుఖానుభవంబులఁ జెంది తింక నే
ముక్తిపదంబుఁ జెందెద నమోఘముగా సెలవిచ్చిఁ బంపరే?. 372

చ. అనవుడు తద్గణాధిపులు హా! యిటులాడఁగఁ గూడునయ్య? సం
గన బసవేశ్వరుండు కడఁ గాంచినఁ బిమ్మట నీవె మాకు ది
క్కని యెద నమ్మి మోదమెలయన్ నినుజుట్టుకయుంటి మట్లు గా
వున మము వీడి నీవొకడవుం జనుటొప్పునె? వెండికొండకున్. 373

క. నినుఁ బాసి యొక్కనిమిషం, బును భూమిఁ జరింప బుద్ధిపుట్టదు మా కో
యనఘాత్మ! మమ్ముఁ దోడ్కొని, చనునీతోఁ గూడ ననిన సమ్మతమతి యై.
తే. చెన్నబసవనిపలుకుమెచ్చి త్తమెట్టు, లటులయానింకజాగుసేయంగవలవ
దరుగవలెరండుశివపురికతిరయమున, ననినదద్భక్తపుంగవులతనితోడ.
ఉ. కోవిదవర్య! యిందఱము కుండలికుండలురాజధానికిం
బోవఁగ మార్గ మెప్పగిది? బొందులతోడనొ లేక కాయముల్
బోవఁగఁ ద్రోచియో కరుణఁ బూనివచింపుడు నామహాత్ములా
రా! వినుఁ డిందఱొక్క మొగి రాజధరుం గనురీతిఁ దెల్పెదన్. 376
ఉ. శారభమూర్తియై హరుఁడు చండరయంబున నేగుచున్నదీ
తీరజ పిప్పలాఖ్య జగతీరుహయుగ్మము మీఁద సిల్చి నా
భారము వైచె నీతరులు బాపురె! యంచు గణించి కామసం
చారము నిత్యజీవిత మొసంగె దయామతితోడ వానికిన్. [లు
సీ. ఆవృక్షములనున్న యాకులుతండముల్ సాచిమేయుదిగంతసామజము
వేడ్క నాకుజములవేరులువట్టియుయ్యెలలూగుదురుపాపతలిరుబోండ్లు
స్వర్భాల లాచెట్లశాఖలచాటున, సంతరింతురు గికురింతలాట
లామ్రానిగపనీడ నధివసించుజనాళి, దినమునఁగాంతుంచుదీపకాంతి
తే. పన్నగాపరినీడజాతప్రతాన, సంతతులలోరహస్యముజరుగకునికి[కైన
లోనగనెచింతలోకపాలోత్కరంబు, వానిగొనియాడదరమెవాగ్వరుని
తే. అమ్మహీజపమిచ్చోటి కనతిదూర, మున వసించిన నచటికి జనివిలాస.
గతివదారోహణమొనర్చిఖండపరశు, పదము జేరుదమసిప్రేమముదవజేసి.
తే. అచటుబాసిబసవనామాత్యభాగినే, యుండుసముపభక్తియుక్తుడగుచు
జనినదీసమీపమునకున్నకుంజరా, శనయుగంబుఁగ'ంచిసమ్మదమున,
వ. తద్భక్తవరులతో ని ట్లనియె, 381
క. అనఘాత్ములార! యల్లదె, కనుగొంటిరె పిప్పలాఖ్యగనుకుజవరముల్
దినవాథధారుణాతప, జనితశ్రమపథికజాత సమ్మదకరముల్. 382
క. అని డాయ నేగునంతక, మునుశర్వుఁడు భక్తసింహములతోభువిపి
డ్కొనిసిజతనయుఁడువచ్చెం, దనపురికనిమిగులసమ్మదం బిగురొత్తన్.
చ. నిరుపమరత్న కాంచనఘృణివ్రజకాంతము లైన యుయ్యెలల్
సిరిగలవెండికొండియముచేతుల వ్రేలుచు నుండునట్లి త

త్తరువరుశాఖలక్ష శరణతండముతోం హరుఁ దూఁగుచుండి భా
సురతన్నిజాగమ్మం బెదురుచూచుచునుండె నుమాసమేతుఁడై.

ఉ. ఆతఱి వేడ్కఁ జెన్నబసవాధిపుఁ డాతరుశాఖలందు సం
భూతములయ్యెనో యన నపూర్వముగాఁ జెలువొందు నట్టి సం
ఘాతముగాంచి యోశరణకాండములార! భవుండు మీకు వి
ఖ్యాతిగఁ బంపెఁగాంచనమయాసనముల్ గనుఁగొంటిరే యనన్. 385

చ. హరి గుహనాశ్రయించిన జనాళి కవారణమార్తికంబు వే
మరు భగవత్కటాక్ష విభవాతిశయంబునఁ జెందు మాకు శం
కరకృపఁగాంచుటే గణన గావునఁ బోదమె యంచుఁ బద్దణో
త్కరములు పల్క నత్తఱి మొగంబున లేనగ వంకురింపఁగన్. 386

వ. చెన్నబసవేశ్వరుం డున్న యంతకమున్న బసవేశ్వరుఁ గర్భంబుఁ జొచ్చిన పిమ్మట కొందఱు భక్తసర్యులతోఁ గప్పుడి సంగమేశ్వరంబున వసియించిన నాగమాంబిక తనయుఁడు కైలాసగమనోన్ముఖుండగుట లింగదర్పణంబునం గని సంతోషబాష్పధారాపూరితశరీరయై యెదురేగ నాయమ్మ యడుగులు తన ఫాలభాగంబు సోఁకం బ్రణమిల్లినకుమారునిం గ్రుచ్చియెత్తి పెద్దదడవు కౌఁగిటఁ జేర్చుకొని మూర్ధాఘ్రాణం బొనరించి బహుకాలవియోగదుఃఖంబుఁ బాసి సంతోషించుచున్న జననిఁ దోడ్కొని పిప్పలాపాతంబునకుం జని తద్భక్తవరుల నందఱ నాలోకించి. 387

ఉ. ఓగుణులార! యెక్కుఁడిదె యుయ్యెలతొట్టెల నింక నిత్తఱిం
జాగొనరింపనేల? యని సంతసమొప్పఁగఁ బల్లి నొక్కడి
వ్యాగమనూనదామమయమై చెలువొందెడు తొట్టెనుండి వే
వేగమ వీరభద్ర పృథివీవరుతో నొక తొట్టెలోపలన్. 388

క. వసియించియంతఁ బద్దణ,వినరారోహణముఁగాంచి విశ్వేశ్వర స[దెన్.
ద్విసరములు దలఁచునంతనె,యసదృశపూర్వపతారుఁడై చెలువొం

క. ద్వాదశమఁలు కేల్గన్నులు,మేదురముఖపట్కమును నమేయములౌశ
క్త్యాదివరసాధనంబులు,పాదుకొను వెలుఁగుగుహునిభక్తగణంబుల్.

క. కని తోడనె పూర్వప్రమ, భ నికాయశరీర సమితిఁ బాల్చరి శాపం
బునఁ బాసినాగమాంబిక,యనుపమనాగేంద్రగమనయై చెలువొందెన్.

ఉ. నరహరి వైరిమంత్రనుత నాగలతాదళభక్షణంబుచేఁ
కురుపదకృత్రిమంబయినఁ గొంచముచే దగు త్రొక్కుఁడైనచోఁ
బరఁగఁగఁ బుల్లనా గృహ విభాషితలక్షణమైన తియ్యనా
ధరణిని మంత్రవేత్త లిటు తప్పకబాధలుచేతు రీయిలన్. 392

ఉ. కుండలిహారసూనుఁ డిదిగోఁ జనుదెంచె నటంచు వేడ్క నా
ఖండలముఖ్యనిర్జరనికాయము సంతసమొందె భేరికా
డాండరవంబులన్ సురజనప్రభవాక్షివిలాసనృత్యముల్
మండితపుష్పవర్షములు మాగధసన్నుతు లొప్పెమిన్నునన్. 393

క. అత్తఱి నద్భుతమొదవఁగ,దత్తరయుగ్మంబుసురపదంబున కెగయన్
మొత్తముగనింద్రముఖసుర,సత్తములెదురేగుదెంచె సరగుననతులై

సీ. గజముపై ధ్వజమూని క్రతుభుగ్వరేణ్యుండు
ధూపపాత్రధరించె తోయజుండు
వేత్రహస్తుం డయ్యె చిత్రభానుసుతుండు
ఖడ్గంబు ధరియించె కర్బురుండు
జలకలశము దాల్చె సలిలాధినాథుండు
కేల వీవనగొనెఁ గీర్తసఖుఁడు
బంగారుపావలు వట్టెను జేరుండు
సూటిమార్గముచూపె శూలధరుఁడు

తే. పడఁగఁ గొడుగును పైవిప్పె పాఁపఱేఁడు
స్వస్తి చెప్పంగఁ దొరకొనె జలజభవుఁడు
తోరణాకృతిఁ జెలువొందె తారకాళి
యమరసేనాని కైలాస గమనవేళ. 395

ఉ. ఈగతి షణ్ముఖుండు గిరిజేశ్వరుసన్నిధికేగి సమున్నతుఁడై
జాగిలిమ్రొక్క వారలతిసంభ్రమమొప్పఁగ నాత్మనందనుం
వేగమ గ్రుచ్చియెత్తి కనువిందుగఁ జూచుచు కౌఁగిలించుచుం
రాగము మీఱఁ బల్మరు శిరంబులు మూర్కొనుచుండి రయ్యెడన్.

క. నాగేంద్రగమనతొల్లిటి,లాగునగిరిజాతఁగొలుచులలనలలోనంపన్.
దాఁగలసియుండెప్రమథులు,నాగతిహరుఁగొలిచియుండిరతిముదమొదవ

క. ఆపిప్పలతరుయుగ్మము, గోపతివాహనునిభక్తిఁ గొలుచుచుఁ దద్ద్వా

రోపాంతంబునఛాయా, వ్యాపకమై నిలచెఁ బ్రమథు లచ్చెరువందన్.

క. అంతటనిటభూతలమున నంతంతట చెన్నబసవయారాధ్యుఁడు మా
కాంతుపురి కఖిలజంగమ, సంతతితోఁ దనువులిడక చనె ననువార్తన్.

క. విని యొండొరులతో నపుడి, ట్లని రాహా! యిట్టిచిత్ర మవనింగలదే
తనువులతో శివపురికిం, జనుటొప్పునె యీతఁడెంతసద్భక్తుండో. 399

క. తానొకఁడె కాఁడు తనతో, మానక చరియించు భక్తమండలినెల్లన్
బూని కొనిపోయినాఁడఁట, గానఁగ లేమైతిమతనిగలసి చనంగన్. 400

తే. పసినిపండైనవృత్తంబుపట్టువీడు, గాక కసుగాయ కెంపైనఁగలదె విడుట
తపసుపండినవారితోఁ దగిలి చనఁగ, నేలసమకూరుమనబోఁటిహీనులకును.

ఉ. ఎన్ని భవంబులెత్తిన గిరీశునిసన్నిధి కిట్లు బోవఁగాఁ
జన్నె యితండు వీరనృపచంద్రునిమ్రోల వసించునాఁడె నీ
కన్నసమర్థు లెవ్వరిఁక గారు దురాత్ములఁ బ్రోవుమంచు నా
పన్నతఁ జేరికొల్చిన కృపాపరుఁడాతఁడు వీడ నాడునే. 402

చ. వలదని మాన్చిన న్విడక వానికి ముక్తజని యొక్క రొక్కరే
చలదళశాఖపైఁ గోమల సందులసందుల డాగి వారలా
గొలుసులతోట్ల నెక్కి తరి గొబ్బున చేరులుపట్టి వ్రేలినం
గలుగు గిరీశలోక మటుగాకయ వెఱ్ఱులమైతి మక్కటా! 403

చ. గురువుల నిందచేసితిమొ? కూడితిమో? యితరాంగనాగతిం
శరణులఁ గాంచి మ్రొక్కమొ? ప్రసాదములో రుచులెంచినారమో?
పరధనకాంక్షఁ జెందితిమొ? పాసితిమో? వ్రతనిష్ఠ పార్వతీ
శ్వరునిసపర్య కాలమున సల్పమొ? భక్తిని భక్తిమార్గముల్. 404

క. ఆడితిమో? యనృతంబులు, కూడితిమో! యేరుమాలికుజనులపొందున్
వీడితిమో లింగార్చన, నోడితిమో యాంతరాహితోత్కారమునకున్.

క. కొలచితిమో పెరవేల్పుల, నిలచితిమో శూలధరునినిందించు నెడన్
దలచితిమో? దుర్వృత్తులు, విలచితిమో? వేదమంత్రవిద్యావితతుల్.

క. కాకున్న చెన్నబసవం, డాకాంతున్ మనలఁ గొంచు నరుఁగఁడె! యనిచిం
తాకులమతి నుండిరి భూ,లోకంబున నఖిలశరణులుం గడుభక్తిన్.

చ. సదమలమానసంబున రసాస్థలి యిక్కథ యెవ్వరేనియున్
జదివినవిన్న వ్రాసిన నిశాకరమౌళికృపా సమృద్ధిచెం

పొదవఁగ భోగభాగ్యములు పొంది చిరాయురుపేతులై తుదిన్
ముదమునఁ గాంతు రబ్జభవముఖ్యులకందని మోక్షసంపదన్. 408

వ. అని యిట్లు రేణుక గణాధీశ్వరుండు బాహులేయువృత్తాంతంబు సవిస్తరంబుగాఁ జెప్పిన కుంభసంభవుండు నచ్చటి మహీశ్వరులును సంతోషితస్వాంతులై దేవా! భవదీయకృపావిశేషంబున సమస్తసాధనహేతుకంబైన చరిత్రంబు వినఁగలిగెఁ గృతార్థులమైతిమని పెక్కువిధంబుల గొనియాడుచున్న వారల నుచితసల్లాపంబుల వీడ్కొని యయ్యోగిపుంగవుండు నిజేచ్ఛం జనియె నబ్బసవాలుగమియు నేతత్కథాశ్రవణం బొనరింపుచు నెప్పటియట్ల సుఖంబుననుండిరి. 409

చ. వనరుహరాజతేజ! నరవాహన! కర్ణసమానదాన! పా
వన! శివలింగ సంగ సురవల్లభ! మంత్రవిశేషభాషణాం
చన! నగవర్య! ధైర్య రిపుసంచయఖండనశౌర్యధుర్య! శో
భన! సుగుణాలవాల! కవిబంధుబుధాశ్రితజాలపాలకా! 410

క. కందర్పసదృశవితరణ, కందలతాంతాస్త్రశీతకరనిభరూపా
కుందాభకీర్తిపూరము, కుందాగ్రజబాహుబల యకుంఠితవిభవా.

ఉత్సాహము. శర్వశర్వరీంద్రచంద్ర శారదాభ్రఫేనగో
పార్వమారుతాశనేశ హారహీరశారదా
పర్వతాధినాథగోప పారదాబ్జతారకా
గిర్వరాత్మజాతతుల్య కీర్తిపూరితోర్వరా. 412

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యపాపయామాత్య ప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.